శ్రీ పింగళి సూరనార్య

విరచితమగు

# ప్రభావతీప్రద్యుమ్నము



శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారి

ఉపోద్ఘాతము

శ్రీ పిఠాపురము మహారాజా, సాహిత్యచక్రవర్తి, డాక్టర్

శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహదరువారి

సహాయధనముచే ప్రకటితము

1951

[స్వామ్య సంకలితము] [వెల రూ. 5-0-0

# తొలి పలుకు

ఈ ప్రభావతీ ప్రద్యుమ్న మను ప్రబంధ మాంధ్రసాహితి కమూల్య మయిన రత్నము. దీనిని సాహిత్యకళాచతురతతో రచించి ప్రఖ్యాతిగాంచిన కవిశేఖరుఁడు పింగళి సూరనామాత్యుఁడు. ఇతఁడు నియోగి బ్రాహ్మణుఁడు, గౌతమ గోత్రుఁడు నాపస్తంబ సూత్రుఁడు; క్రీ. శ. 17-వ శతాబ్దాంతమునందు జీవించిన వాఁడు. ఇతని తండ్రి యమరామాత్యుఁడు, తల్లి యబ్బమాంబిక.

ఈ ప్రబంధమందలి కథ హరివంశములోని కథ నాశ్రయించి రచిత మైన దని కవియే చెప్పుకొనెను :—

అఘహరణ హరివంశ కథాశ్రయంబు
నాత్మపుత్త్రగుణస్తవ నాంకితంబు
నైన యీ కావ్యమునకు మహాప్రసిద్ధి
యిచ్చుఁ గావుతఁ గరుణ లక్ష్మీశ్వరుండు. (V. 219)

క్రీ. శ. 1265 నాఁటి రవివర్మ భూపాలుఁడు సంస్కృతభాషను రచించిన ప్రద్యుమ్నాభ్యుదయ మనునాటక మిటీవలఁ గ్రొత్తగా లభ్య మయినది. దానినిగూడ నాధారముగాఁ గైకొని సూరనార్యుఁ డీకథను

నడపించి యుండు నని కొంద ఱభిప్రాయపడిరి గాని, య ట్లభిప్రాయపడుట కాధారమేదియు నాకుఁ గనఁబడలేదు. దానినిగూడ నాశ్రయించిన మొదలఁ జైని హరివంశమందలి కథను చేకొని నట్లే యీ నాటకమును గూడ సూరనార్యుఁడు చేకొని యుండును. హరివంశమునందలి కథలోఁ గానరాక యీ నాటకమందే కలదని చెప్పఁదగిన కథాకల్పన సన్నివేశ వర్ణనాదు లీ ప్రబంధమునం దేవియు నాకుఁ గనఁబడలేదు. నాటకమునకును నీ ప్రబంధమునకును హరివంశమందలి కథయే యాధారము గనుక, నీ నాటకప్రబంధముల కెంటికిని సామాన్యమైన విషయములు హరివంశమందలి కథయందును గలవు. అంతేకాక, యా నాటకమందలి కథ నాటకరచన కనుకూలముగాను నీ ప్రబంధమందలి కథ ప్రబంధరచన కనుకూలముగాను మార్పు చెందినవి. నాటకమందు హంసలకును చిలుకలకును ప్రవేశము లేదు. కథా సన్నివేశములలో నైతము భేదమున్నది. ఆ నాటకములో కథాకల్పన, చమత్కృతి, భావసంపద, వర్ణనానైపుణ్యము మొదలయిన సద్గుణములు తక్కువ. అట్టి నాటకమును జూచి పింగళి సూరనార్యునివంటి కవితల్లజుఁడు గ్రహింపఁ దగిన విశేషము లేవియును లేవు.

ఈ ప్రబంధమునుగూర్చి వ్రాయఁ దగిన విషయము లెన్నియేనిఁ గలవు. బహుముఖసంస్కృతి, సాహిత్యకలారసజ్ఞత, సాహితీ వ్యాసంగము గల సాహిత్య చక్రవర్తి శ్రీ శ్రీ పిఠాపురము మహారాజు డాక్టర్ రావు వేంకట కుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు

మహాశ్రద్ధతోను, విమర్శన దృష్టితోను లెస్సగాఁ బరిశీలించి యాంధ్ర సాహిత్యమం దీప్రబంధమున కగ్రస్థానము గలదని యథోచితముగా గ్రహించి, దీనికిఁ గలిగిన యానందము కొలఁది నీ ప్రబంధమునందున్న సద్గుణము లన్నియును వివరించి తేట తెలుఁగు మాటలతో నొక ప్రశస్తమయిన ప్రబంధ ప్రశస్తి రచించిరి. పొల్లుమాటలు లేకయే యతిసంక్షిప్తముగా నట్టి విషయములను విశదపఱచుటలో వీరు నిపుణులు. వీరి ప్రబంధ ప్రశస్తిలోని విషయములను మించి వ్రాయుటకు నాకేమియుఁ గనఁబడ లేదు.

ఒక్క విషయము మాత్రము నా యనుభవములోనిది తెలియఁ జేయవలసి యున్నది. హంసలు, చిలుకలు మాటలాడుట కేవలము కల్పితమేకాని సహజము కాదుగదా? అట్టి తిర్యగ్జాతి జంతువుల సంభాషణలతో నీకథ నడపించుట సమంజసమా యను సంశయము నేఁటి హేతువాదశీలురకుఁ దోఁచవచ్చును. కాని, నేఁ డడవులలో జీవించు సవరలు మొదలయిన యాదిమవాసులు తమ నివాసములకుఁ జేరువను గల తిర్యగ్జాతి జంతువుల యఱపులు, కూఁతలు మొదలయిన శబ్దములను గ్రహించుటయుఁ దమ యభిప్రాయములను వానికి బోధపడునట్లు పలుకుటయుఁ జూడఁగా నా యా జంతువులభాష తెలిసికొనుట సాధ్యమగునేమో యనిపించును. తమ యుపోద్ఘాతమందు శ్రీవారు పేర్కొన్న యాస్ట్రియా తిర్యగ్జాతిజంతుశాస్త్రజ్ఞుని పరిశీలనఫలితవివేకము లి యూహ కనుగుణముగా నున్నవి. ప్రద్యుమ్నుఁడు భ్రమరరూపమును

పొందినను పొందకుండినను పొందినట్లు మాంత్రికుని యైంద్రజాలికతిరస్కారిణీసమ్మోహనమంత్రశక్తులవలన నచటివారికిఁ దోఁచి యుండవచ్చును. నేఁడుఁగూడ నిట్టి మంత్రశక్తి గలవారు కలరు. రాత్రి తొమ్మిది గంటలవేళ నందఱి చేతిగడియారములును 12 గంటలవేళ సూచించునట్లొక మహేంద్ర జాలికుఁడు తన సమ్మోహన మంత్రశక్తిఁ బ్రదర్శించెను. ఆ మంత్రశక్తి నతఁడు ఉపసంహరించిన వెంటనే యందఱి గడియారములును వాస్తవముగా నప్పు డుండవలసిన వేళ యనఁగా 9 గంటలు 5 నిమిషములను సూచించినవి. ఇట్టి మన యనుభవములను బట్టి చూచినయెడల నీ ప్రబంధమునందుఁ గల విచిత్రవిషయములు వాస్తవము లనిపించును.

ఆంధ్ర భాషాభిమానులును విద్యాపోషకులును సాహిత్య చక్రవర్తులు నగు నీ మహారాజుగారికి భగవంతుఁ డాయురారోగ్య సంపద లొసంగి వీరి కీర్తిచంద్రికలు దిగంత విస్తృతములై యా చంద్రార్కము నిలిచి భాసిల్లున ట్లనుగ్రహించును గాక !

ఈ చిన్న తొలిపలుకు వ్రాయు నవకాశము నాకుఁ గలిగించినందుకు నేను శ్రీవారి కెంతయును గృతజ్ఞుఁడను.

ఇట్లు
విన్నవించు విధేయుఁడు,
గిడుగు వేంకట సీతాపతి.

చెన్నపట్టణము,
24-2-1951.

# ప్రబంధ ప్రశస్తి

ఆంధ్ర భాషా ప్రాశస్త్యము :—

మన తెలుఁగు ప్రాగ్దేశ భాషలందెల్ల నెక్కుడు శ్రావ్యమైన దని ప్రాక్పశ్చిమ ఖండవాసులచేఁ బొగడఁ బడినది. ఐరోపాదేశీయుఁడైన బిషప్ కాల్డ్వెలు మన హిందూదేశమునకు వచ్చి, యిచటి దేశ భాషలనెల్ల మిగుల బాగుగ నేర్చికొని భాషాతత్త్వవేత్తలలో నగ్రగణ్యుఁడుగ నెంచఁబడిన వాఁ డాంధ్రము దేశభాషలలోనెల్ల విశేష శ్రావ్యమైన దని శ్లాఘించెను. తెలుఁగుబాస సంగీతమున కెంతయుఁ దగియున్నది. గాయకు లాంధ్రులుకాని, యనాంధ్రులుకాని యర్థము తెలిసినను, దెలియకున్నను దెలుఁగుపాట లనేకములు పాడుదురు. ఇట్టి యత్యధికమాధుర్యగరిమ గల మన యాంధ్రభాషయొక్క మహోన్నత్యము పురాతనాంధ్రకవి ప్రవరులచే స్తుతింపఁ బడినది. అఖండ పండితుఁడు, ననేక గ్రంథావలోకన కుశలుఁడును, వివిధ దేశభాషా కోవిదుఁడును, రసగ్రహణపారీణుఁడును, గవి శిఖామణియునైన కృష్ణదేవరాయ భూపాగ్రణి:

“ ఆ. తెలుఁగదేల యన్న దేశంబు తెలుఁగేను
దెలుఁగు వల్లభుండఁ దెలుఁ గొకండ
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స. ”

యని కీర్తి మెచ్చినాఁడు. కొందఱు పురాతన కవీంద్రులైన వినుకొండ వల్లభరాయఁడో లేక, శ్రీనాథుఁడో రచియించిన క్రీడాభిరామమునందు:

“ఆ. జనని సంస్కృతంబు సకల భాషలకును;
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స;
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చు టాడుబిడ్డ మేలుగాదె.”

యని దేశభాషలందుఁ దెలుఁగు లెస్స యనియే కాక సంస్కృతముకంటెఁ గూడ నుత్కృష్టమైన దనియు వచింపఁబడినది. ఈ భంగిని మన భాషా ప్రాశస్త్యము ప్రకటింపఁబడియె. ఇట్లు మహత్తరముగ భాసిల్లు మన భాషయం దనేక కావ్యములు వెలయుచున్నవి. వీనిలోనెల్ల నుత్తమోత్తమములైన సుప్రసిద్ధ ప్రబంధములు కొన్ని గలవు. వీనిని మించిన వెలువములగల రచనలు ప్రపంచమునం దెందును గోచరింపవు. ప్రభావతీ ప్రద్యుమ్న, కళాపూర్ణోదయ ప్రబంధరాజము లీ గ్రంథరాజిలోఁ జేరి రాజిల్లునవియు. ఇట్లు పేర్కొనఁబడిన గ్రంథ ద్వయమునకుఁ గర్త సూరనార్య కవివరేణ్యుఁడు. ఇతఁ డత్యుత్తమ కవివతంసులలోని వాఁ డని మఱి వేఱ వక్కాణింప నక్కఱ లేదు.

కవి ప్రశంస :—

ఈ పింగళి సూరనార్యుఁడు మహా కవివర్యుఁడు. కళంక రహితమై కవితాకళాకౌశలమై శైల్యముగలిగి విలసిల్లువాఁడు ; అత్యద్భుత ప్రతిభాశాలి ; విశ్వకవి ; మృతిరహితుఁ డైన రచయిత. ఆచంద్రార్క

మీరాతని కావ్యములు ప్రకాశింపఁ గాక! ఇతఁ డాంధ్ర కవీంద్రు లం దగ్రగణ్యులలో నొకఁడు. భారతీయుఁడౌను, హిందూదేశమునకలి యితర మండలములకుఁ గాదే కాక ప్రపంచమునందు సర్వదేశముల, సర్వ భాషల నెఱిఁగిన కవిశిరోమణుల శ్రేణిలోనివాఁడు. ఈతనిమించిన కవిని విస్మయమునఁ బొందుట గాదనుట. ఇతఁడు బహుగ్రంథరచనాధురంధరుఁడు. నిరుపమ కవితాపటిమ గల్గిన మహాలాక్షణికుఁడు; వింతవింత త్రోవలు త్రొక్కిన తేజశ్శాలి. తన ప్రభావతీప్రద్యుమ్నమునఁ దా నిట్లు చెప్పు కొనియె :—

“మ. జనను లెచ్చఁగ మున్ రచించితి సుధాంచద్వైఖరిన్ గారుడం
బును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబున్ మఱిన్
దెనుఁగుం గబ్బము లెన్నియేనియును మత్పుత్త్రాది వంశాభి వ
ర్ణనలేమిం బరికింపఁ నాకవి యొనర్పంజాల వత్యంతమున్.”

ఇందు వచింపఁబడినవానిలో రాఘవపాండవీయము, కళాపూర్ణోదయము, ప్రభావతీప్రద్యుమ్న మను మూఁడు ప్రబంధరత్నములు మాత్రము మనకు లభించు భాగ్యము గలిగినది. తక్కినగ్రంథములు మురదృష్టవశమున మనకు దొరకలేదు.

ఈ గ్రంథత్రయమునందు మొదటిదైన రాఘవపాండవీయము ద్వ్యర్థిప్రబంధము. ద్వ్యర్థియైనను నర్థము సులభముగ బోధపడును. రామాయణ, భారత గాథలలో దేనిని మనము మనమున నుంచి చదువు దుమో దానికిఁ దగిన యర్థము తేలికగాఁ దెలియును. ఇట్టి పుస్తకమును

గూడ రసవంతముగా రచించినాఁడు. ఇది మిక్కిలి కష్టమైనపని. దీనిని సరిపోలు ద్వ్యర్థికావ్యము వేఱొకటి లేదని వచియింపవచ్చును. రెండవది యగు కళాపూర్ణోదయము స్వకపోలకల్పితము; అనిర్వచనీయరచనా సముచితమైన కావ్యరత్నము. మూఁడవదియగు నీ ప్రభావతీ ప్రద్యుమ్నము పురాణకథయైనను నూతనరీతులు గలిగి, రమణీయములగు వర్ణనలతో విరాజిల్లుచున్నది; అతిలలితశైలీ విలసితము. ఇది మిగుల మనోహర మగు మహాకావ్యము.

ఈ విద్వత్కవితంసుఁడు తర్కవ్యాకరణవేదాంతాది శాస్త్రములును, నాట్యనాటకాలంకార సంగీతశాస్త్రములును, చిత్రపట రచనా విమర్శనమును బాగుగ నెఱిఁగినట్టివాఁ డని యీ గ్రంథమునందలి పద్యములవలనఁ దేటపడుచున్నది. నేయేల ? కవనమునకు వలసిన శాస్త్రములన్నియు నీతనికిఁ బ్రసన్నముగా నున్నట్లును, దీని కనుకూలమగు లోకానుభవము గల మహానుభావుఁ డనియును బ్రకటిత మగుచున్నది. ఈ కవిసత్తముని ప్రబంధములు సకల విద్వజ్జనాదరణీయములై శోభిల్లుచున్నవి. ఈ కవికులతిలకుని రచనలు చదువునపుడు గలుగు మహానంద మనుభవైకవేద్యమై, యనిర్వచనీయమై భాసిల్లుచున్నవి.

ప్రభావతీప్రద్యుమ్న కథావస్తు చమత్కృతి :—

ఈ ప్రబంధమునందలి కథ కాధారము సంస్కృత గ్రంథ మగు హరివంశములోని వృత్తాంతము. ఈ సత్కవిప్రవరుఁడు కావ్యరచనా చమత్కారమునకుఁ గావలసిన మార్పులు పెక్కువోట్లఁ గావించెను. ఇందలి యనల్పకల్పనా చమత్కృతి యెంతయు రసవత్తరమై రహి వహించుచున్నది. కథావిధానము సందర్భశుద్ధి గలిగి యొప్పిదమై

మెప్పొందుచున్నది. కృత్రిమ కథ లైనను నిజముగ జరిగినవానివలెనే రస ముట్టిపడునట్లు రచితములైనవి. ఇది సుకవినిధులకే కాని యితరులకు సాధ్యముకాని పని. "శ్రీమ దుమామహేశు లతి చిత్రవిలాసు" లను మొట్టమొదటి పద్యమును పరికింపఁదగు. ఇది రాఁబోవు కథయొక్క చమత్కృతి, రసపోషణము చక్కఁగ సూచించుచున్నది.

కావ్యోత్కృష్టత :—

ప్రభావతీప్రద్యుమ్న మను నీ ప్రశస్త సత్కృతియంజలి చమత్కృతి సంస్తుతిపాత్రమైనది. ఇది మహామహిమ గల మహాప్రబంధము; అనవద్య పద్యగద్య సమన్వితమైనది. గ్రంథము మిగుల మనోరంజకమై మెఱయు చున్నది. ఈ సరస సత్కావ్యకన్యకాతిలకము సర్వాంగ సుందరమై ప్రకాశించుచున్నది; సర్వోత్కృష్టమయినది; యత్యద్భుతమైన రీతి రచిత మయినది. దీనితోఁ దులఁదూఁగఁ గలిగినది తెలుఁగు సారస్వతములోఁ గానరాదు. ఇఁక నీ దివ్యకావ్యము కన్న మిన్నయైనది మన తెనుఁగు సారస్వతములో లేనే లేదని వేఱె వచింపవలయునా ?

రసపోషణము :—

కావ్యమునకు రసమే ప్రధాన మగు ప్రాణము కదా ? నవరసభరితమై భాసిల్లు నీ కావ్యములో నన్నిరసములును శేముషీవిశేష ముతోఁ బోషింపఁ బడినవి. సారస్యము నవనవోన్మేషమై విశేషమగు నింపు నాపాదించుచున్నది. రచనాచమత్కృతి మిగుల సోయగముగ నున్నది. వర్ణనావైశద్య మనవద్యమైనది. సారస్యమున నీ సత్కావ్య మును మించినది లేదు. దీనిని దిలకించునపుడు హృదయమున మహా

[illegible] పూరవహిల్లును. ఈ గ్రంథమందు రసపోషణము విశేష రమణీయమై ప్రకాశిల్లుచున్నది. రసము పొంగి పొరలుచున్నది. నవరసములందును ప్రధానమైన శృంగారరస మీ ప్రబంధరాజమునకు ముఖ్యమైనది. శృంగార రసపూరితములైన వర్ణన లగణ్యా గణ్యములై నవి; సహజములై, సరసములై, రమ్యములై, రసవత్తరములై, రహి నలరారుచున్నవి. హాస్యరసము సముచితమై హర్ష మొసఁగుచున్నది. ఇతరములైన రసములును, యథోచితముగఁ, బ్రవర్తితములై నవి. వర్ణనలు నిర్మాణములై, వన్నెగలిగి విలసిల్లును. మానవ స్వభావవర్ణనా సౌభాగ్యము విశేష విస్మయమును గలిగించి దేదీప్యమానముగఁ దేజరిల్లును. ఈ సత్కృతి రచనాసమత్కృతి యనిర్వచనీయము. సత్కావ్య మణిగణమునకు రసమే ప్రాణము. రసపోషణము రమణీయముగఁ జేయఁగలిగిన కవియే నిక్కముగఁ గవి. అట్టి కవితయే నిజముగ కవిత. ఆ కోవని రసములో నిండి సుపరిష్కృతమైన పద్యగద్యములు, రమ్యములై యింపు సొంపారుచుండును. ఈ విషయము రసగ్రహణపారీణులకు సువిదితమే కదా! కావుననే యీ కావ్యరత్నము విమర్శకాగ్రేసరుల సన్నుతికిఁ బాత్రమైనది.

అతులితమైన పదలాలిత్యము, శబ్దసమత్కృతి, భావవివరణమును ఈ గ్రంథమందు ఎక్కడ జూచినను రమ్యముగా నుండును. ఉదాహరణములు :—

సీ. తరుణీకెంగేలంచుఁ దమిఁ బట్టి కటకటా
చిగురాకె యిది యంచుఁ జిన్నవోయి,

చ. వినుకలిచేతనే విరహవేదన నాకు నింత వర్ధిలెన్
గనుఁగొనినట్లు చిత్రఫలకంబునఁ గాంచిన యంత నెమ్మనం
బునఁ గనుంగొంటిరే ... ... III 25

ఉ. అందమువారు చెప్పఁగల నాతికి ప్రాపుగ మాకు కృత్తి మాత్రమున్
గాంచిన భాగ్యదేవతవు ....... III 57

ద్విరదగతిరగడ. ఓ హంస నీచేత నన్నయని నాప్రాణ ....... V 152

శైలి :—

శైలి యసమానాలంకారశోభితమై విలసిల్లును. కోమలములై, కమనీయములై, తేట తెలుఁగు పలుకుబడులతోఁ బద్యములు ప్రకాశించుచున్నవి. (చూ. II 42. 108; III 25. 29. మొదలయినవి).

కవితా వాహిని నిరర్గళధారాశుద్ధి గలిగి సలక్షణముగ వెలయుచున్నది. భావనిర్దుష్టమయినది. వ్యర్థపదము లెంతను లేవు. పదములన్నియు సార్థకములై, రసోచితములై చెన్నారుచున్నవి. కొలఁది పదములతోనే విపులములగు వర్ణనాంశము లిమిడి యుండును. ఎచటఁ జూచినను జమత్కారము చెన్నుమీఱుచుండును. ఈ రచనయం దౌచిత్యము మిక్కిలిఁ జక్కఁగాఁ బాటింపఁ బడినది. ప్రసన్నత సుప్రశస్త కరణి రాణించుచుండును. చూడుఁడు—

"ఉ. ఎంతయు మేన వింతపన లేర్పడు చున్నవి యప్ప! కంటె య
త్యంతము నిద్రచాలమియు నక్షులు దెల్పెడు; రాత్రియెద్దియో
కొంత విశేషమబ్బినది కోమలికిన్; మముబోంట్లకుం గడుగ్
వింతసమేకదా తనదు జవ్వన మెవ్వలనన్ ఫలించినన్."

V 70

శబ్దార్థాలంకారములు ప్రతిభాశోభితములు. (చూ. II 34, 71, 108, V 187. మొ). కథాసంవిధానము శోభాయుతముగా భాసిల్లు చున్నది. శైలి సులలితము. శయ్యాపాయగ మెంతయు నతిశయించు చుండును. అచ్చ టచ్చట సంస్కృత జటిలములైన సమాసములును గలవు. అయినను నవి సుగమములు:—

నిఖిల దేశాయాత నృపతి భూషాకర్ష
ణేణుసంపోషిత క్షోణికంబు॥

........ ....... I 99

సముసలాలనయుత స్కంధాంతికాస్ఫాల
దమిత తేజో మహార్థత్వకంబు

........ ........ II 38

అన్ని యాఖ్యానములు నెంతయు రసవత్తరములై తనరారు చున్నవి. ఇంచుమించు ప్రతి పద్యము రసాస్వదమై యలరారు చుండును. చదువఁ జదువఁ జవులూరు చుండును. ఎంతఁ జదివినను దనివి తీఱదు.

అంచచెలువ వచనములు మెచ్చునెపమునఁ గవిత్వమునకు ముఖ్యముగఁ గావలసిన లక్షణము లక్ష్మణాకరణి నీ దిగువఁ గనఁబఱచిన పద్యమందు వివరింపఁబడియె :—

“సీ. శబ్దసంస్కార మెప్పటను జాఱఁగనీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁపెల్ల నక్లిష్టతను బ్రకటీకృతముగాఁ
బునరుక్తదోషంబు పొంతఁబోక
యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థ భావంబు పాయకో నదుకుచు
నుపపత్తి యొందు సత్యూర్జితముగ

నొకటఁ బూర్వోత్తర విరోధ మొందకుండఁ
దత్తదవయవ వాక్యతాత్పర్య భేద
ములు మహావాక్య తాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపఃఫలము గాదె ?”

II 3

ఈ పద్యమున వివరించిన రీతిని రచన సాగించవలె నని యీ కవి తల్లజుఁడు ప్రతినపూనెను. మొదటనుండి చివరవఱకును నీ పూనిక నిలుపుకొని, పూర్తిగను, నిరంతరాయముగను నెఱవేర్చుకొనెను. ఈ లక్షణము లన్నియు సూరనార్యకవివర్యుని కవితయందు వీక్షింపనగును. ఇంతియే కాదు. ఇంక నెన్నియో విశేషాంశములు గలిగి యితని కవిత శోభిల్లు

మున్నవి. శృంగార రసవర్ణనలు సరసములై శోభిల్లును. ఎంతమాత్రము మును జెలనములుగ లేవు.

ఈ గ్రంథశ్రేష్ఠమునఁ గవి శ్లేష విశేషముగ వాడలేదు. వాడిన చోట్ల నది యెంతయు యుక్తముగ నున్నది. సులభమై, సందర్భ సౌష్ఠవము గలిగి యత్యంత మవసరమై రసవంతముగ నున్నది. సాధారణముగ నీ కృతి రచించుట కష్టసాధ్యమైన పని. సూరనార్య కవివర్యునకు మాత్ర మిది సుకరమగు కార్యము. చూడుఁడు :—

"చ. సకల విశేష శోధనకుఁ జాలిన యో నెరజాణ వజ్రనా
భకుల వతంస రత్నమ ప్రభావతి రోహిత కంటకంబు తా
వకమగు చూపు నాపయిఁ బ్రవర్ధితరాగతఁ బర్వెఁగాన న
త్యకలుష వృత్తి నాసుకృతమంతయు నేఁడుసుమీ ఫలించుటల్."

IV 105

నీకు నామీఁదఁ గలయట్టి నెయ్యమును ...... 106

ననునేలి కొను మవశ్యంబును నీయూడిగము ...... 107

ఈ కవి తల్లజుఁడు క్రొత్త క్రొత్త త్రోవ లెన్నియో త్రొక్కెను. అవి యన్నియు వింతవింతలై విలసిల్లుచున్నవి. ఈ కావ్యవరమున వ్యంగ్యము మిగుల భావ్యమై భాసురముగ నున్నది. రీతులు, వృత్తులు నుచితరీతిని వర్తిల్లుచున్నవి. (చూ. III. 13; IV. 73, 75.) జాతీయము లుచితమైన చోట్ల సురుచిరముగ రచితములయినవి :—

"ఉ. పాడిఁ దొఱంగఁ జన్నె యొకపట్టునఁ గొల్చెదనంచు నెంత మా
టాడితి సర్వదా వతకులాధిప ! యోడలు బండ్లవచ్చు బం

జ్ఞోడలవచ్చు నొండొరుల కొక్కొకచో ననువైన తావులం
గూడుట యిష్టబంధులకుఁ గ్రొత్తయి యుత్తజీ నింత యేటికిన్."

.......

I 94

వర్ణనలు :—

సారస్యము గలిగి హృద్యముగ నున్న పద్యము లనేకము గలవు. వానినన్నిటి నిట వివరించుటకు వీలులేమి దిక్ప్రదర్శనముగాఁ గొన్ని మాత్రమే యుదాహరింపఁ బడెను :—

"ఉ. తేనెప్రులఁ బట్టి దోము సరోజంబును బోదుము వాని పేటికిన్
గడుమతి చాలమిం గడుపఁ గక్కుఱితి న్సురలోకనాథ మా
యెడఁగల యట్టి తప్పిది సహింపుము పక్షులమాట నొక్కఁ డెం
జడి నిది చెల్లెఁగాక చెప్ప ప్రాంతము చేరదు వారలాప్తులే."

......

I 118

"క. నీవచ్చు రీతి గని మగా
రా వాసవ కావ్యపరత యనుచుంటిఁ గటా
నే వీ తెఱఁగే యన మఱి
నీవో యన నీవా యనఁగ నిగిడె న్నగవుల్."

V 95

ప్రభావతీ ప్రద్యుమ్నుల సంయోగానంతరము శుచిముఖి, రాగవల్లరులు ప్రభావతియొద్ద కరుగుదెంచినప్పు డీ మానినీమణుల మాటలు రసవత్తరములై రవణించుచున్నవి. (చూ. V 66-82.) చమత్కారరచనాచతురత యతులితమైనది. హంసీవతంసము వచించిన మాటల పాటవము రమ్యాతిరమ్యమై రహి మీఱుచున్నది. ఈ గ్రంథరాజ మిటువంటి రసవత్తరములగు వర్ణనము లనేకములు గలిగి రాజిల్లుచున్నది.

అంచలు దివినుండి భూమికి దిగుట విచిత్రరీతిఁ జిత్రితమయ్యె. ఇదియెంత హృదయాహ్లాద కరమైనది! రసము పొంగి పొరలుచున్నది. నిశ్చయముగ నీ రచన యనిర్వచనీయము. దీనివలన జగత్తునందు జరుగు విషయములు బాగుగ గమనించి, సరిగ రచించుటయందు కవివరునకుఁ గల యసాధారణ సామర్థ్యము స్పష్టపడుచున్నది. (చూ. II 41, 42.)

ఇంద్రుఁడు, పత్ని సారథియు నాకాశమునుండి ద్వారకను దర్శించు నప్పుడుఁ వారికది యెట్లు కనుపించినదో యా విషయము మిక్కిలిఁ జక్కఁగఁ జెప్పఁబడినది. ఇది విమానములఁ బోవువారికి విదితమే. కాని, విమానములు లేని కాలమున నిట్లు వర్ణించుట యెట్లు సాధ్యమగునన భావనాశక్తి ప్రభావమే యని చెప్పక తప్పదు. (చూ. I 54, 56.)

ప్రద్యుమ్నుఁడు వినోదార్థము గుఱ్ఱము నెక్కి కందుకక్రీడ సలుపుటను జక్కఁగఁ గవి వివరించెను. ఇది కవికిఁ గల విజ్ఞాన శక్తిని, వర్ణనా వైశద్యమునుఁ దెలుపుచున్నది. (చూ. II 31, 33.)

హంసరాయబార సందర్భమున రచించిన పద్యము లెంతయుఁ జమత్కారముగ నున్నవి. (చూ. IV 74, 75, 81, 83, 84, 86, 87.)

“ఒక చిలుకచేతఁ బత్రిక” (IV 71.)

యను పద్యమునఁ గథాభాగము మిక్కిలి సంకుచితముచేసి యొక్క పద్యములోఁ గవి యిమిడ్చెను. ఈ సరణి వర్ణనలన్నియు విన్నాణములై వన్నె గాంచుచున్నవి. ఎట్టి వర్ణనలందైనను రస ముట్టిపడుచుండును.

ఉపేంద్రమహేంద్ర సంవాదము తద్దయు రహిమీఱుచున్నది. ఇది యెంతయు యుక్తియుక్తముగ నుండి రక్తికట్టుచుండును. (చూ. I 138.) వర్ణనలలో మాటలతోఁ జటను చిత్రించునప్పు డా చిత్రము మన కన్నుల యెదుట కట్టినట్లు కాన్పించుచు జీవకళ యుట్టిపడినట్టు లుండును. ఇది కవికిఁ గల యగణ్యప్రావీణ్యమువలనఁ గలుగును. ఇట్టి వర్ణన లనన్య సామాన్యశక్తి యుక్తములై శోభిల్లుచుండును.

ప్రభావతికిని, నామె చెలియలికిని, సంచచెలువకును జరిగిన సంవాదము సమయోచితమై, రసవంతమై, మనోరంజకమై, స్వభావ సిద్ధమై, చమత్కారయుతమై, చతురతరమై వింత నొదవించుచున్నది. ఇది మహత్తరమైన హృదయాహ్లాదము నాపాదించుచుండును. ప్రద్యుమ్ను విరహావేదన మెంతయుఁ జక్కఁగఁ జిత్రితమైనది. వర్ణనాచాతుర్యముచే వర్ణితాంశము హృదయమున బాగుగ హత్తుకొనును. ప్రద్యుమ్నుని పత్రిక ప్రభావతికి, నామె చెలియకు నందినపుడు వా రిరువురును జరిపిన చర్యలు విచిత్రలీలఁ జిత్రింపఁబడుటచే మహా మనోహరములై వెలుంగు చున్నవి. (చూ. III 133, 140). హంసీశుక సంభాషణ సౌభాగ్య మెంతయు ముదమొదవించు చుండును. అంచచెలువ ప్రభావతితోను, గుణవతితోను వచించిన ముచ్చటలు తద్దయు ముద్దు లొలుకుచున్నవి. హంసీవతంసముయొక్క ప్రౌఢతనము పోడిమి గలిగి కడుంగడుఁ జోద్య మొదవుచుఁ జెన్నారుచున్నది. హంసీప్రద్యుమ్నుల రెండవ సంవాదము వినోదకరముగ నున్నది.

ప్రద్యుమ్నుని ప్రథమ సమాగమమునకై ప్రభావతి యెదురు చూచునపు డామె సింగారించుకొను సరణి మిగుల రమ్యముగా రచింపఁ

బడినవి. ఆభరణములు, కబరీభరము, తిలకము, చీరలు మొదలగునవి మార్చిమార్చి, తాల్చి చూచుకొనెడి విషయములు సముచితముగ రచియింపఁబడినవి. ప్రియుల కేది ప్రియమగునో యని యోచించి నారీమణు లిట్లు చేయుట సర్వసాధారణమే. (చూ. IV. 130, 132, 134, 139, 140, 141, 142, 143). ఇవి యన్నియు నైన పిదప నలంకారము లన్నిటిని వర్జించినది. ఐనను సహజసౌందర్యము కృత్రిమాకృతికన్న నెంతెయో కాంతిమంతమై నిగనిగ లాడుచుండును గదా! కేళీగృహమున సమయానుసరణముగ నేర్పాటు లొనర్పఁబడుట బాగుగ వర్ణింపఁబడియె. మొదట ప్రద్యుమ్నుఁడు తన ప్రియురాలికడ కేగినప్పటి శృంగారక్రీడావిశేషములు రసవత్తరములుగా వర్ణింపఁబడి యత్యద్భుతభాతి భాసిల్లుచున్నవి. ఇవి సామాన్య విషయములే యైనను, రచనాచతురతవలన రమ్యాతిరమ్యములై మన మనముల బాగుగ నంటుకొని యుండును. (చూ. V. 8, 9, 10, 14.)

ఈ పద్యములు నిరవద్యలావణ్య విలసితములు. ఇట్టి వింక ననేకములు గలవు. వీనినిఁ దగినవడువునఁ గొనియాడ నలవియగునా? ఇట్టి పట్టుల శృంగారరసరచన యనిర్వచనీయమై శోభిల్లును. విప్రలంభశృంగార సందర్భమున జరిగిన సంభాషణలు, చర్యలు సముచితముగ రచింపఁబడి వెలయుచుండును.

యుద్ధవర్ణనము సమిద్ధమైనది. కొద్ది పద్దెములలో దీనిని కవి పొందుపఱచెను. ఈ సమరమునఁ బోరువా రిరువురును ప్రభావతికిఁ బరమాప్తులు. ఒకవైపున భర్త; యింకొకవైపునఁ దండ్రి. కాన, నిది యామెకు విశేష విషమసమయము. ఈ కాంత యెంతయుఁ జింతా

క్రాంతయై కడుంగడు యోచించి తుదకు విహితధర్మమునుఁ జక్కఁగా నెఱవేర్చుకొనియెను. ప్రభావతి పతివ్రతా తిలకమగుటచే నీ ప్రశస్త సరణిఁ బ్రవర్తిల్లినది. ఇది యెంతయు సంస్తుతి పాత్రమైనది.

ఈ కవికిఁగల లోకోక్తి రచనాశక్తి కూడఁ బ్రశస్తమైనది. ప్రభావతీ ప్రద్యుమ్నము మొత్తముమీఁద ద్రాక్షాపాకమున నున్నది. అప్పు డప్పుడు నితరపాకములుగూడఁ గానవగును.

కవి విశ్వమునకు వ్యాఖ్యాత; స్వల్పాంశము నైనను స్వభా వానుసరణముగను, సమయోచితముగను వర్ణించి, నీతిబోధకమైన సంకల్పమును సృష్టీకరించును. సమయాను గుణములగు పలుకులతోను, వాక్యములతోను గావలసిన భావమంతయుఁ గొలఁది పదములలోనే పొందు పఱుపఁబడి, వర్ణితాంశము మన మనముల బాగుగి నంటు కొని యుండునటుల రచనాచతురతతో నుడువఁబడెను. భావవైభ వము, వర్ణన విన్నాణము, కల్పనా నైపుణ్యము, ప్రపంచజ్ఞానము, రసానుసరణమగు శయ్యయుఁ గలిగి, యీ కావ్యరాజము రాజిల్లు చున్నది.

పాత్రౌచిత్యము :—

ఇది పరిపూర్ణముగఁ బాటింపఁబడినది. ఈ రీతి రచన చారు తరమై చెన్నారుచుండును. ఔచితికి నెచ్చటను భంగమురాని భంగిని నీ పాత్రము రచితమయినది. ఇది మిక్కిలి ముఖ్యమైన యంశము. పాత్రగుణపోషణము లేనిచో స్వభావసిద్ధ వర్ణన లసాధ్యమగును. రసో ల్బణ ప్రాబల్యమునకుఁ దావుండదు. రసపుష్టి గల కావ్యమే యుత్కృష్ట

మైన దనుట స్పష్టము; లేనిచో నది నిస్సారమనుమాట నిస్సంశయము. సారవంతముగాని కావ్యము పఠింపఁదగినది కాదని కంఠోక్తిగఁ జెప్ప నొప్పును. ఈ దివ్యకావ్యమునందు నీ పాత్రౌచిత్య రచన ప్రశంసనీయమై ప్రకాశించు చున్నది.

ప్రద్యుమ్నునకును ప్రభావతికిని, ఆమె చెలియండ్రకును వారి వరులకును రాయబారులు హంసమును, శుకమును గదా! ప్రథమ మున ప్రద్యుమ్నుఁడు ప్రభావతి వసతికి భ్రమర రూపమున నరిగెనట. హంసలు, చిలుకలు మాటలాడుటయును, రాయబారములు జరు పుటయును గొందఱి కసంభవముగాఁ దోఁచవచ్చును. కాని, సంస్కృ తాంధ్ర సాహిత్యములం దిట్టివి సుప్రసిద్ధ సంప్రదాయములు. మనుజులు తుమ్మెదలు మొదలైన వాని యాకృతులను దాల్చుటయు నట్టిదియే. మనకాలమందును జరుగుచున్న ముచ్చటలు పరిశీలించినచో మన కవి సాధ్యములనియే తోఁచక మానదు. మనుజులు తిర్యగ్జంతువులతో బ్రసంగింపఁగల రని యొక జంతుశాస్త్రజ్ఞుఁడు పలికినటుల వార్తా పత్రికల మూలమున మనకుఁ దెలియవచ్చినది. ఈ విద్వాంసుఁడు సామాన్యుఁడు కాఁడు. వైద్యశాస్త్రములోఁ బ్రపంచము నం దంతటను బ్రసిద్ధి కెక్కిన యాస్ట్రియా దేశములోని వాఁడు. అక్కడి శాస్త్రవేత్తలలో నొక ప్రముఖుఁడు. కాన, మనము సంశయింప నవసరములేదు. పెద్ద బాతులు, చిన్న బాతులు, పందులు, ఆవులు, పిల్లులు, కుక్కలు మొదలయిన జంతువులతో నతఁడు మాటలాడ గలిగి నట్లున్నది. ఇఁక మన మంచల తోను, జిలుకలతోను మాటలాడగల మనుటలో నచ్చెరు వేమి? అంతే కాదు, మనుష్యులకు లేని శక్తు లనేకములు పశువులకును, బక్షులకును గలవని యీ శాస్త్రవేత్తల మతము. మన యనుభవములను బట్టికూడ

నిది సంభావ్యమే యని విశదము కాఁగలదు. కొంత కాలము క్రిందటి పఱకుము నసంభవము నసాధ్యము లని కొన్ని యెన్నియో మన మిప్పుడు కనులారఁ గనుచున్నాము; చెవులార వినుచున్నాము. మన పూరాతన గ్రంథములలో వర్ణింపఁ బడిన యీ యంశములే కాక యింకను నిట్టి విమాన యానము, మత్తుగొల్పు మందులు, (mesmerism; hypnotism etc). దూర శ్రవణము, దూరదర్శనము మొదలయినవి యిప్పుడు సాక్ష్యములై కనుపించుచున్నవి కదా! సుకవినిధులగు మన పూర్వుల ప్రపంచజ్ఞానసంపద ప్రజ్ఞానమంచితమయి, యనిర్వచనీయ మయినందులకు సందియము లేదు. నేఁడుకూడ నింద్రజాల మహేంద్రజాల తిరస్క-రిణీ సమ్మోహ మంత్రాది శక్తులు కొందఱు ప్రదర్శించుట మనము కాంచుచున్నాము; వార్తాపత్రికల మూలమునఁ దెలిసికొనుచున్నాము. అచట నిజముగ జరగునది యొక రీతి నుండును. చూపఱుల కండ్లకు వేఱొక చందమునఁ గాన్పించును. ఇందు సమ్మోహ మంత్ర ప్రభావముచేత సభ్యులందఱునుఁ బ్రదర్శకుని ప్రయోగమునకు లోఁబడుట తాము స్వయముగా చూచితిమని నా సచివసత్తము లొకరు నాకుఁ జెప్పిరి. ఇఁకఁ బ్రద్యుమ్నుఁడు భ్రమరరూపమునఁ బ్రభావతి యంతఃపురమును జేరుటయు నిట్టిదె కాఁబోలును. అంతేకాక భ్రమరకీటక న్యాయమును మనము మఱువరాదు. దేవదేవుని చెయిదములు పరిపూర్తిగ నెఱుంగ నెవరితరము? జగన్నాథుని మాయ యగాధము గదా!

ఈ సరస సత్కావ్యకన్యకాతిలక మత్యద్భుతగతి సర్వాంగ సుందరమై ప్రకాశించు చున్నది. తన పాండితీపటిమను బాగుగా నెఱిఁగిన వాఁడయ్యును "నిలుపుదు నతనికీర్తిఁ బరమేశు కృపన్. .........."

(I 9.) అనుటచే దేవుని దయయున్ననే తన కోరిక నెఱవేఱునని నమ్మిన వాఁడని విదితమగుచున్నది.

గ్రంథాదిని దైవప్రార్థన మొనర్చి గ్రంథాంతమునఁ గూడ నాశంసమునను “యీ కావ్యమునకు మహాప్రసిద్ధి యిచ్చుఁ గావుతఁ గరుణ లక్ష్మీశ్వరుం” డని వచించెను. దీనినిబట్టి యీ కవివర్యుఁ డెట్టి భగవద్భక్తిసంపన్నుఁడో విదితమగుచున్నది. ఇది ప్రశంసనీయమైన యంశమే కదా!

పై పద్యము (I 9.) గురుజన పూజనమును బ్రతిపాదించుచున్నది. ఇది యెంతయు సముచితమైనది. ఈ కవికిఁగల వర్ణనా నైపుణ్య మగ్రగణ్యము; ప్రపంచ జ్ఞానము ప్రజ్ఞానంతము; భావప్రకటనా ప్రాశస్త్యము సంభావ్యము. జాతీయముల రచన యతిరమణీయము. వేయేల? ఈ మనోహర మహాకావ్యలలామమునందలి లావణ్యము వాస్తవముగ వర్ణనాతీతమై సొంపొందుచున్నది.

ఈ దివ్య కావ్యము నిక్కముగ నిఖిలసూరి లోకాంగీకార కవిత్వ వైభవము గలిగి, సౌజన్యగేయమై విరాజిల్లు మహాప్రబంధము. తన కవిత్వ ప్రతిభ యీ తీరున నున్నదని యాశ్వాసాంత గద్యములలోఁ బొందుపఱచెను. ఆ కాలములో కవిసత్తములు తమ గొప్పతనమునుఁ దెలుపకొనుట సముచితముగ నెంచఁబడెను. ఈ గద్యములలో నతిశయోక్తి యిసుమంతయును లేదు. సరిగ పరిశీలించినచో నాత్మస్తుతి నుంతయుఁ గనుపించదు. ఈ గ్రంథరాజ మీ గద్యములలో నుడువఁ బడిన సుగుణగణములు గలిగి వెలుంగు చున్నది. లేని పోని యాన్న

త్వము తన కాపాడించు కొనినప్పుడే యది యాత్మస్తుతి యనఁబడును. ఇట్టి నటులఁ గాక తనకు వాస్తవముగాఁగల శక్తినే విశదపఱచు కొనుటవలన నీ దోస మతనినిఁ జెందఁబోదు. ఈ యైదాశ్వాసములును బరిపూర్ణభావ భాసురములు. ఇట్టి పుస్తకమే సకల సజ్జనసమ్మత మని యీ కవి ప్రకాండుఁడు బాగుగ నెఱుంగును. ఈ యసాధారణ ధోరణిఁ బ్రబంధము చెప్పఁగల సామర్థ్యము తనకుఁ గలదని ధైర్యము గలిగిన ధీనిధి. ఇట్టి మహామహుఁ డయ్యుఁ దన కృతి ప్రసిద్ధిఁబొంది చిరకాలము వెలయుటకుఁ బరమేశ్వరుని బ్రార్థించెను. దీనివలన నీ కవి నరునికిఁ గల వినయమును, భగవద్భక్తియు విదితములగు చున్నవిగదా ?

స్థూలదృష్టికి గోచరముగాని విషయములు సూక్ష్మబుద్ధికి బాగుగ నగపడును గదా ? కావున, సృష్టి రహస్యములు స్పష్టముగ నవగాహనము చేసికొని కవిశేఖరులు విప్పి చెప్పఁ గలరు. దైవసంకల్పముల ననల్పరీతిఁ దెలుపఁగలరు. దాని మూలమున మన భగవద్భక్తిని బ్రేరేపించి, సత్కార్యా చరణమునకుఁ బురికొల్పుటకు నెంతయు వలంతురు. ఇవి యిహపరముల కుపకరించుననుటకు సందియము లేదు. ఇవి మనకు మిగుల మేలొనర్చు కార్యము లగుట నిస్సంశయము. కృతికర్తలు కృతార్థులగుదురు; చదువరులు చరితార్థు లగుదురు.

పింగళి సూరనార్య కవిపుంగవ శిరోవరేణ్యా ! నా మనఃపూర్వక సాష్టాంగ నమస్కారములు స్వీకరింపుము.

**రావు వేంకటకుమార మహిపతి సూర్యారావు**

శ్రీ

# ప్రభావతీప్రద్యుమ్నము

## ప్రథమాశ్వాసము

ఉ. శ్రీమదనూనమోహను లతిచిత్రవిలాసులు దారు ముక్తి వియో
గామితచింత నొందొరులకై నగిమాటలు నిచ్చఁ దెల్పు కాం
తామహిమంబుచేఁ జెలుసగంబుగ నొక్కయెడ ధరించు స
త్ప్రేమమహాదరంబు లవ్యాత్మిసతిం బసరింతురు గాతఁ గీర్తులన్. 1

ఉ. అంగజహేతుకంబు లరయ న్మిథునంబుల ప్రేమ లిట్టిచో
నంగజుతల్లిదండ్రు లగునట్టి యనన్యసమానహార్దసం
సంగు లనాదిదంపతులు సత్కృప నిత్తురుగాక సౌఖ్యము
ల్పింగళిసూరధీరవరుబిడ్డకు మాయమరేశమంత్రికిన్. 2

చ. అమలనవీనహైమనిజయానగరుద్ద్యుతిఁ బ్రోచు సద్వపు
ర్విమలరుచిన్ స్వభక్తులకు వెండియుఁ బైఁడియుఁ గీర్తియు న్సతే
జమునెపుడప్పుడే యొసఁగు సర్గనిధానముఁ దాల్చియున్న య
ట్లమరెడు వాగ్విధాత లమరార్యున కిత్తురు నిత్యసౌఖ్యముల్. 3

వ. అని సకల భువనప్రవర్తనహేతువు లైన పురాతన మిథునంబులం
గొనియాడి. 4

గీ. ఆదికవులఁ బ్రాచేతసవ్యాసమునులఁ
దలఁపులోన భజించి యత్యంతసరస
మగు ప్రభావతీప్రద్యుమ్న మను ప్రబంధ
మాచరించుచు నొక్కనాఁ డాత్మలోన. 5

మ. జనము ల్మెచ్చఁగ మున్రచించితి నుదంచద్వైఖరిం గారుడం
బును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబు న్మఱిన్
బెనుఁగుం గబ్బము లెన్ని యేనియును మత్పిత్రాదివంశాభివ
ర్ణన లేమిం బరితుష్టి నా కవి యొనర్పం జాల వత్యంతమున్. 6

క. తండ్రియు సుతులకు దైవం
బండ్రుగదా వేదవాదు లది వినియును నే
వీండ్రను వాండ్రను బలె మా
తండ్రిఁ బరమపూజ్యుఁ గాఁగఁ దలఁపమి తగునే. 7

మ. గయలోఁ గాశిఁ బ్రయాగఁ శ్రీగిరిని గంగాద్వారనీలాచలో
జ్జయినీద్వారకలం దయోధ్య మథురన్ సంస్తుత్యపుణ్యస్థలా
గ్రియత న్వొండియు మించునైమిశకురుక్షేత్రాదులం దర్పణ
క్రియచే నాపినతమ్ముఁ డెల్లన యొనర్చెం దండ్రి కాహ్లాదమున్. 8

క. ఏనుం బితృపూజన నా
చే నైన కొల్దియైనఁ జేయఁగవలయున్

గానఁ గృతి యిచ్చి మేదిని
పై నిలుపుము నతనికీర్తిఁ బరమేశుకృపన్. 9

వ. అని నిశ్చయించి ప్రభావతీప్రద్యుమ్నంబు మద్గురుం డైన యమరామాత్యునిపేర సంకేతంబుగ రచియింపం గడంగి తత్కావ్యలక్ష్మీముఖంబునకుం దిలకాయమానంబుగ నా వంశావతారం బభివర్ణించెద. 10

గీ. గంగఁ దనదు పేర గౌతమీనామవి
ఖ్యాతిఁ బరఁగఁ దెచ్చె భూతలమున
కే మహానుభావుఁ డా మునిసింహుఁడు
గౌతముఁడు తపోధికతఁ దలిర్చు. 11

ఉ. వాదున గెల్వలేక పురవైరి లలాటముకన్నుఁ జూపఁ దాఁ
బాదమునందుఁ గన్ను ప్రతిపక్షతఁ జూపెను శాస్త్రమున్ బ్రమా
ణాది పదార్థతత్త్వకథనాత్మకమున్ రచియించె నాత్మసం
వేదముకై మును ల్కులపవిత్రుని గౌతముఁ బోల నేర్తురే. 12

క. ఆగౌతమ గోత్రంబున
నాగమనిధి పుట్టె గోంకనామాత్యుఁడు స
ద్భోగక్షేత్రస్వామ్యస
మాగతిఁ బింగలిపురాంకుఁ డై యతఁ డొప్పెన్. 13

ఉ. పేర్వెలయంగ నా ఘనుఁడు పింగలిగోంకబుధోత్తముండు గం
ధర్వి నొకర్తుఁ జేకి యనుదానిని దాసిఁగ నేలె యోగితా

గుర్వనుభావుఁడై నెరపె గోపకుమారుని ఖడ్గవర్ణనం
బర్వపు నిండువెన్నెలలపై నెఱిఁ జూపెడు కీర్తిసంపదన్. 14

ఉ. సంతతి లేక మున్నతని జాయ సభక్తిని సూర్యసేవ య
శ్రాంతముఁ జేయఁగా నతఁడు సద్ద్విజుఁడై కల వచ్చి దొండచె
ట్టింతికి నిచ్చి చాల ఫలియించును నీ కిది ప్రోది చేసికొ
మ్మెంతయు నంచుఁ బల్కె నఁట యింతియు నాకల గాంచి ధన్యయై.

గీ. సకలదిశలకు శాఖోపశాఖ లిడుచుఁ
బొదలి ఫలియించు దొండయుఁ బోలి ప్రబలి
యాత్మసంతతి పుత్రపౌత్రాదిబహుప
రంపరల నొప్ప వెలసె భర్తయును దాను. 16

మ. తరము ల్నాల్గయి దెంద నెందుఁ గనుఁద త్తద్గ్రామనామంబులన్
బరఁగున్ వంశము లెల్లఁ బూర్వపునిజప్రఖ్యాతి మాయంగ నే
మరుదో పింగళి నామమందుఁ జిరకాలావాసులై యున్న సు
స్థిరతన్ గోంకనమంత్రివంశజులకున్ జెన్నొందు మిన్నందుచున్.

ఉ. రంగుగ గౌతమీపరిసరంబులఁ గృష్ణకెలంకులన్ ఘనుల్
పింగళిరామయాదులు లలిం బలనాటను బాకనాటనుం
బింగళి గాదయాదు లిటఁ బెంపువహించిన యస్మదాదు లా
పింగళిగోంక మంత్రియిలుపేరనె చాలఁ బ్రసిద్ధు లెల్లచోన్. 18

వ. అది య ట్లుండె నమ్మహావంశంబునందు నస్మజ్జనకజననీజీవంతి
కాత్యంతకమనీయం బైన శాఖావిశేషం బెట్టిదనిన. 19

క. గంగియ నా వెలయుచు శుచి
తం గడు శోభిల్లె నొకఁడు తద్వంశములో
గంగయ నా వెలయుచు శుచి
తం గడు శోభిలెఁ దదూర్జితయశశ్శ్రీయున్. 20

క. మాంగల్యశోభి యగు నా
గంగయకును ముగురు వంశకరు లై రి సుతుల్
రంగత్కీర్తులు మహి నె
న్నంగ న్సూరనయుఁ గుప్పనయు రామనయున్. 21

క. కనియెన్ గుప్పన సూరన
యనుపుత్రుని నతనిపుత్రు లగు చానయ భ
ద్రన కుప్పార్యుల కాత్మజు
లనేకు లెఱ్ఱయ్య పాపయాదులు ప్రాజ్ఞుల్. 22

క. జనియించెను రామనకుం
దనయుఁడు గంగన్న గంగనకు గాదన గా
దనకుం బెద్దయ మొదలుగ
ననేకు లీ గతిఁ దదన్వయము శోభిల్లున్. 23

గీ. ఇట్లు పుత్రపౌత్రాదుల నెసఁగునట్టి
సోదరులు దన్ను మిక్కిలి నాదరింప
నలఘుసాద్గుణ్యసౌభాగ్యకలితుఁ డగుచు
గంగనామాత్యసూరయ కరము వెలసె. 24

ఉ. పింగలిగంగమంత్రివరుబిడ్డకు సూరనకుం బద్మాబ్జరే
ఖం గలకాంతికే వలచి కైవస మయ్యెను రాజ్యలక్ష్మి దా
బంగరుకామకుంచెలును బల్లకియు న్మొదలైన యాత్మస
ర్వాంగసమృద్ధితోడ సిరి కంబుజరేఖలప్రేమ వింతయే. 25

గీ. సూరనిభుఁ డైన పింగలిసూరవిభుని
దొరయఁ బోఁ డొరుఁ డల వేల్పుదొరయకాని
యతని దానము సిరికి నియతనిదాన
మర్థు లప్పుడు దానసమర్థు లైరి. 26

క. సూరయమంత్రికిఁ గలిగెను
సూరయమంత్రియ యనంగ సుతరత్నము కం
ఠీరవమున కెందును గం
ఠీరవము జనించునట్టి నియమము దోఁపన్. 27

ఉ. సూరయసూరమంత్రి కతిశుద్ధిఁ దలిర్చిన యక్కమాంబయం
దారసు లుద్భవించిరి మహాత్ములు నల్వురు సజ్జనస్తుతో
దారగుణాభిరాము లయి యన్నయభవ్యుఁడు సూరసూరియుక్
ధీరుఁడు వల్లశౌరియును నీతయశస్కుఁడు లింగనార్యుఁడుక్. 28

వ. వారిలోన 29

క. వల్లయమంత్రికిఁ బుత్రుఁడు
పుల్లయమంత్రి యనఁ బుట్టె భువి లింగన కు

త్ఫుల్లయశుఁడు సూరయయును
సల్లాలితసితి యక్కసచివుఁడుఁ దనయుల్. 30

క. వారలకు నగ్రజుండగు
సూరయసూరిప్రభుండు సుకవిత్వసదా
చారశ్శివభక్తివినయో
దారత్వాదులఁ బ్రసిద్ధతముఁ డై మించెన్. 31

క. వేదుక నాయన పెండిలి
యాడె వెలగలేటియమరనామాత్యసుతన్
ప్రజ్ఞావతులందును గొని
యాడం దగినయమలాంబ నఖిలగుణాఢ్యన్. 32

క. అమలమహాగుణనిధి యా
యమలమ హారిప్రకారయశమునఁ దనరెన్
గమలాలయాసరస్వ
త్యమలాలలితాంగిఁ బోల్ప నొనరెడు గరితల్. 33

ఉ. ఆ యమలమ్మయందును గృహస్థశిరోమణి సూరశౌరి య
త్యాయతశీలురం గనియె నాత్మజులన్ముగురన్ సుధీజన
ధ్యేయగుణప్రశంసు నమరేశ్వరమంత్రిని ధర్మనిర్మలో
పాయుని మల్లనార్యు నతిభవ్యతమించిన యక్కధీరునిన్. 34

వ. అందు 35

క. ఇమ్ముగ నుదయించిరి జన
సమ్మతుఁ డగు మల్లనకును జగ్గనయుసఁగాఁ
దమ్మయ సూరయ చిన్నయ
తిమ్మయ లనఁ బరఁగు సుతులు ధృతిబలసహితుల్. 36

క. ఆ మల్లనకును జన్నమ
చే మంత్రుల కెల్ల గుణవిశేషంబులచే
భూమిన్ జ్యేష్ఠుఁ డనంగ మ
హామహిమాదార్యుఁ డమరనార్యుఁడు వెలసెన్. 37

సీ. చిఱువనదేచిరాజెఱుక మించిన బుధో
త్తముఁడే వధూమణి తాతతండ్రి
యనవరతమునికి నా యూరిపేరఁ దా
వెలయు కేసయ్యయే వెలఁదితాత
యన్నయ బాపయ్య లగ్రజానుజులుగాఁ
బరఁగు భావయ్యయే గరితతండ్రి
జయనయోన్నతులు కొండయరాఘవార్యు లే
సతి కన్నదమ్ములై నుతులు గనిరి

పృథివి నే పురంధ్రి పెదతండ్రికొడుకు స
త్కీర్తిశోభితుండు కేసవిభుఁడు
తనరు నే గుణాఢ్య పినతండ్రిసుతుఁడు గం
గయ్య బహుసహోదరాంచితుండు. 38

గీ. రమ్యగుణనిధి యన్నమ్మ రాచపూడి
గణపతిసుపుత్త్రి యే సాధ్వికన్నతల్లి
యట్టియంబమ్మఁ బింగళియమరమంత్రి
పెంపు నింపును మెఱయంగఁ బెండ్లియాడె. 39

గీ. అనఘ సౌభాగ్యవర్తనార్ధాంగలక్ష్మి
పింగళియమరామాత్యు నర్ధాంగలక్ష్మి
యంబమాంబిక భోగభాగ్యముల మరుని
యంబకును నంబికకు సాటి యనఁగ వెలసె. 40

క. ఆ జంపతులకుఁ బుత్త్రుల
మై జనియించితిమి సూరనాఖ్యుఁడ నేనున్
భ్రాజితమతి యమలార్యుఁడు
రాజితబోధార్థనాభిరతుఁ డొజ్జనయున్. 41

క. స్తోత్రముల కయ్యె సమ్య
క్పాత్రము శ్రీ రాచపూడి గంగనయును దౌ
హిత్రుఁడు గలుగఁగ వంశప
విత్రంబామిథున ముభయవిధసంతతులన్. 42

షష్ఠ్యంతములు

క. అక్షయగుణవిభవైతా
దృక్షకులోత్తంసున కసదృక్షవిదూర

ప్రేషాసిలలితధర్మసు
రిషాంసునకు సురరుచిధురాహాంసునకున్. 43

క. గౌతమగోత్రునకును బ్ర
ఖ్యాతాపస్తంబసూత్రయాజుషశాఖా
ఢీతిపవిత్రునకును లో
కాతిగవశితాజితాంతరామిత్రునకున్. 44

క. పృథు లా కాశీసేతు
ప్రథ నిడుమానూరి కృష్ణరాయసముద్ర
ప్రథితాగ్రహారభోగా
తిథేయనిజసంతతిప్రతీతాత్మునకున్. 45

క. గంగాశుచివృత్తికి నభి
షంగానాఘ్రాత నీతిసంపత్తికి స
న్మంగళగుణపాత్రునకును
బింగళిసూరప్రధాన ప్రియపుత్త్రునకున్. 46

క. శ్రీమద్రాజేంద్రగురు
స్వామి స్థిరవంశకలశజలనిధిసోమ
త్త్సోమారాధ్యకృపాల
బ్ధామలశివభక్తి శోభితాచారునకున్. 47

క. అమలాంబానందనునకుఁ
గమలాంబాగురుసమాన ఘనధైర్యునకున్

గమనీయమనేమిృప
గమనీయున కంబమాంబకారమణునకున్. 48

క. మజ్జనకున కర్చితక్ష్మీ
మజ్జనకునకు హరినుతిసమార్జితమాయో
న్మజ్జనమున కమలచిదవ
మజ్జనకున కమృతరసనిమజ్జనకునకున్. 49

క. అమరామాత్యున కురుమ
త్యమరామాత్యున కజోపయమసక్తార్థో
ద్యమరామాత్యుపమేయా
యమరామాత్యురుగుణోదయయశశ్శ్రీకిన్. 50

వ. అక్షయకీర్తివైభవాభివృద్ధి యగునట్లుగా నేను సమర్పింపం బూనిన ప్రభావతీప్రద్యుమ్నంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 51

కథా ప్రా రం భ ము

క. శ్రీరమణీరమణీయ మ
హోరస్థ్సలుఁ డచ్యుతుండు సముజ్జ్వలమహిమన్
ద్వారక నుండఁగ నొకనాఁ
డారూఢాదరత నింద్రుఁ డవ్విభుకడకున్. 52

వ. లోకహితకార్యపర్యాలోచనంబునకై చనుదెంచువాఁడు నాకంబు వెడలి యాకసంబున నడతెంచుచున్న సమయంబున. 53

## పు ర వ ర్ణ న ము

సీ. ధాత్రీమహాదేవి తాల్చిన మున్నీటి
మొలనూలిరత్నంపు మొగపనంగ
జలధి పేరిటి పాఁపతలచుట్టుగలధరి
త్రీమూర్తి శివుచిత్రతిలక మనఁగ
సపరదిక్సతి కట్టినట్టి సాగరమను
పుట్టంబుతుదిత్రాఁత మొగడ యనఁగ
వరుణగోపురబద్ధవార్ధితోరణమధ్య
గుంఫితనవపుష్ప గుచ్ఛ మనఁగ

వివిధమణిమయగృహదీప్తివిసర విసర
ణోపశోభితమగు ద్వారకాపురంబు
దవులఁ గాన్పించెఁ దనుఁజూడ దైవవిభుఁడు
వేయికన్నులుఁ జాలక వెఱఁగుపడఁగ. 54

వ. ఇట్లు కనుపట్టు నాపట్టణంపు సొంపునకు శిరఃకంపంబు సేయు నిలింప వల్లభు నింపుపెంపు పరికించి కించి దుల్లసితవిలోచనంబుల నా సహస్రవిలోచను విలోకించి తదీయరథసూతుం డగు మాతలి యిట్లనియె. 55

క. ఏమీ యిది దేవరకను
దామరలకు నింతవెఱఁగు దలకొలిపెడునే
యేమనఁగ నహహా నాక
స్వామికి నబ్బ మగుఁబోలు వసుమతిఁ గలిగెఁ. 56

క. జడనిధి యను తెరమఱుఁ గటుఁ
వెడలి నిలిచినట్టియాట వెలఁదియపోలెం
గడు నింపులు గులుకుచుఁ దన
కెడ నీ పురలక్ష్మి యవధరించితె యధిపా. 57

క. పడమట నంభోరాశియుఁ
గడమదిశల వనచయంబుఁ గప్పారఁగఁ దా
నడుమఁ బురలక్ష్మి గనుప
ట్టెడు హరియురమున సుఖించు శ్రీవి దలిర్పన్. 58

ఉ. దోహదధూపధూమములతోఁ గనుపట్టెడు తత్పురీవన
వ్యూహము నో సమస్తవిబుధోత్తమ చూచితె యంబుపానకౌ
తూహలలంబమాననవతోయదరాజివిరాజితాబ్ధిసం
దేహనితాంతకంపళసదీపితనైపుణి నేపుఁ జూపెడున్. 59

ఉ. భోగపుఁజుట్లు కోటలుగ భూరికిరీటసముజ్జ్వలత్ఫణా
పూగము సౌధబృందముగ భోగికులేంద్రుఁ డుపేంద్రుఁ బాయ లే
కీగతిఁ దాను వచ్చి భజియించెనొకో యవతార మంచుఁ జే
తోగతి నాకు నెంతయును దోఁచుచు నున్నది నిర్జరేశ్వరా! 60

మ. అవచూడోపలదీప్తిచిత్రితములై హర్మ్యాగ్రవిన్యస్తకే
తువులం దేర్పడ కొప్పె నప్పురముపై త్రోవన్ మొగుళ్ళేగి యిం
ద్ర! విలోకించితె యెంతనేల చనియేర్పాటయ్యె హా! నమ్మరా
దవి కాలాగరుధూపధూమతతులో యభ్రంబులో యిప్పుడున్.

చ. హరిహయ! చూడుమా తెలియుటబ్రము డగ్గఱిచూచి కానియాం
గిరసుని కైన నల్లయగి కెంపులమేడలతోడివిస్ఫుర
న్మరకతకుట్టిమస్థలియొ మవ్వపులేఁజిగురాకు కెంపుము
మ్మరసముఁ దేజరిల్లు నెఱమామిడిమ్రాఁకులతోడి తోఁటయో.

సీ. కలధౌతకేళీనగంబు గాఁబోలును
దనరుచున్నది శంభుతనువులీల
ఘనపుష్పచాంపేయవనరాజి గాఁబోలు
నేలుచున్నది పులితోలుసిరుల
హరిశిలాసోపానసరణి గాఁబోలును
బగటుచున్నది నల్లపాఁపపేరు
బనసంపుటలవసౌభాగ్యంబు గాఁబోలుఁ
జాటుచున్నది జటాజూటరుచిని

సరసి గాఁబోలుఁ గ్రాలెడు సురనదిగతి
నోడ గాఁబోలుఁ బోలెడి నుడుపతికళ
ననిమిషాధిప చూచితే యల్ల పసిఁడి
కోటనడిమి శృంగారపుఁదోఁటలోన. 63

సీ. ఆలోలశైవాలజాలలాలిత్యంబు
జంగమోద్యానవేషము వహింప
రంగదుత్తుంగతరంగ సంఘాతంబు
నడగోటల తెఱంగు నడపుచుండ

డిండీరమండలాఖండసౌభాగ్యంబు
చరసౌధచయవిలాసము భజింప
శ్రీకరశీకరాస్తోకప్రవర్షంబు
కానుకముత్యాలకరణిఁ బరఁగ

నగశిఖలు తత్తదాశోపయాతవాత
వ్రాతచేత నేతత్పురవర్యపర్యు
పాసనాశాసనాసీతపరప్రకీప
రంపరాళిల నెఱపెడు నింపుమీఱి. 64

క. పడమటియది సాగర మని
యెడు తద్జ్ఞులమాటఁ దక్క నేతత్పురి న
ల్గడలందుఁ బరిఖలెవ్వియొ
జడనిధి యెయ్యదియొ తెలియ శక్యమె ప్రజకున్. 65

చ. తనుఁ దరుణీతటిద్విహృతిఘన్యవనావళి యింత మీఱుటల్
కనియును మేఘ మిచ్చటి కలజ్జతఁ జేరెడుఁగాక చేర కే
గినను గొఱంత యేమి పురికిం బువుఁదేనియసోనకాలువల్
జనములపైరుపంటలకుఁ జాలవె యెన్నఁటికైన నెన్నఁగన్. 66

## ఇంద్రుని ద్వారకా ప్రవేశము

వ. అని యివ్విధంబున రథికసారథులు తత్తద్వస్తుసందర్శనసమయసముచితవచోరచనల వినోదించుచుం గొంతదవ్వున నయ్యుర్వికి డిగ్గి యన్నగరంబు చేరం జనునంత నతనిరాక విని వనజోదరుండు

ప్రియ సహోదరుండగు సాత్యకిం బిలిపించి యద్ద్విజవల్లభు నెదు
ర్కొని తోడితెచ్చుటకు నియోగించిన నతండు సముచితపరివార
సమన్వితుండై యెదుర్కొని తోడ్కొని చన వేడ్క లిగురొత్తు
చిత్తంబున నద్దేవోత్తముండు నూత్నగారుత్మత స్తంభ సంభృతా
ఖేదావలంబిరంభాతరువిభూషిత గోపురపార్శ్వభాగంబగు తత్పు
రంబు ప్రవేశించి యుభయపార్శ్వసౌధవీథికాధిరూఢప్రౌఢవిలా
సినీకటాక్ష నివహాబహుగుణీకృతమార్గతోరణుం డగుచు వారి
జనాభుమందిరద్వారంబుచేరనరిగె నతండును నుగ్రసేనవసుదేవ
సంకర్షణగదాక్రూరప్రముఖులతోఁ గక్ష్యాంతరంబులు గడచి
యెదురువచ్చి తత్ప్రవేశవిధానంబు యథోచితంబుగా నడపి పర
స్పరార్హసంభావనంబు లస్తంభసంభ్రమసంభృతంబులై జరుగు
నంతఁ గుశలప్రశ్నంబుఁ గావించిన నద్ద్విజనాయకుండు జనార్ద
నున కిట్లనియె. 67

గీ. ఇపుడు నీదర్శనం బనియెడు కుశలము
కలిమి ప్రత్యక్షమే చెప్ప వలదు కృష్ణ
యటమటముగాక యటమునుపటికుశలము
నఖిలవిదుఁడ వీ వెఱుఁగని యదియుఁ గలదె. 68

ఇంద్రుఁడు కృష్ణునితో వజ్రనాభుని దుర్నయమును జెప్పుట

క. ఐనను నాచేతను వినఁ
గా నభిమత మయ్యెనేని కమలోదర నీ
కే నెఱిఁగించెద విను మవ
ధానముతో మన్మనోవ్యథాభర మెల్లన్. 69

చ. తపమున వజ్రనాభుఁ డను దైత్యుఁడు బ్రహ్మఁ బ్రసన్నుఁ జేసి వ
జ్రపురి యనంగ నొక్కనగరంబును మేరువుపొంత మారుతా
తపములకు న్నిజానుమతిఁ దక్కఁ బ్రవేశ మొనర్పరాని య
ట్టిపసఁ దనర్చుదానిని ఘటించి యతం డొసఁగెన్ బ్రదీప్తుఁడై. 70

వ. యథేష్టవైభవోపభోగంబులం బ్రవర్తించుచు 71

ఉ. ఆతఁడు మొన్న నున్నతమదాంధత దాడిగ నేగుదెంచి యా
పోతర మేమి చెప్ప ననుఁ బూరికిఁ గైకొన కప్సరోవధూ
వ్రాతనిశాతపాణిరుహవారిసలాలసనవ్యపల్లవం
బై తనరారు నందనమహావనిలో విడియించె సేనలన్. 72

సీ. దనుజాధిరోహతాడనభంజనాదుల
కోర్చునే కల్పవృక్షోత్తములు
శోష్యపర్యుషితమనుష్యమాంసంబులు
పూనునట్టివియె సంతానకములు
దానవద్విపఘటాలానతాదురవస్థ
సైరించునే హరిచందనములు
మనుజఖాదిస్వేదమలినవస్త్రాదులు
దాల్పఁ బాలివియె మందారతరులు

నందనమ్మునకును వజ్రనాభదైత్యుఁ
డపుడు చేసినకష్టపా టబ్జనాభ
యిపుడుఁ దలఁపునఁ బాఱిన హృదయమునకు
నధికతరమైన పరితాప మావహిల్లు. 73

గీ. వాని కెదిరించి పోర దేవతలలోన
నెవ్వరును జాల రిది బ్రహ్మ యిచ్చినట్టి
వరములోపలియదియ పంకరుహనాభ !
మదికలంకఁ జేసి మును చెప్ప మఱచినాఁడ. 74

వ. కావున వానిచేత లన్నియు నప్రతిహతంబు లయి సాగుచుండె నంత నేనును బృహస్పతియును విచారించుకొని యద్దురాత్మునకు

గీ. అక్కసెలియండ్రసంతాన మైనయట్టి
మనకు మనలోన నింతదుర్మత్సరంబు
వలదు మా పల్కు నీవు నీ పలుకు మేముఁ
జేసి బ్రదుకుట మేలంచుఁ జెప్పఁ బనిచి. 76

వ. కొంత శాంతసంరంభంబుగా మఱియు నప్పటికిటీఱమికొలంది యొందుకొని చుట్టరికంబు నెరపుచుం బట్టణంబులోనికి రప్పించి వానికి వాని సేనలకు ననూనంబుగా విడుదులు పాలుపెట్టించితి మట్టి సమయంబున 77

సీ. తన కులుపా చాల దని మిట్టిపడఁగ న
నామధేయపు దైత్యునకు నడంగి
తనవిడిదికి రంభ ననుపవై తని తిట్టు
కిన్గాడియసురకుఁ గేలు మొగిచి
తనకుఁ బెద్దఱికంబు మును సేయ వని దూఱు
నధమరాక్షసునకు నర్చ లొసఁగి

తన కమృతముఁ బోసి యనుప వంచు నదల్పఁ
బినుఁగురక్కసునకుఁ బ్రియము చెప్పి

పంకరుహనాభ నీకుఁ బక్షపాతు లరయ
నెందు నెవ్వరుఁ బరులు నీ కేమి చెప్ప
నెంత పాపంబు చేసిన జంతువొక్క
యింద్రుఁ డగు నని యను శాస్త్ర మెన్నుకొంటి. 78

ఉ. వారిజనేత్ర యే విప్రుఁడు వచ్చుచు నుండి యలౌకికాద్భుత
శ్రీరుచిరత్వదీయనగరీగరిమాతిశయావలోకలీ
లారసపూరధూతసకలవ్యథచిత్తుఁడ నై యథాపురా
కారత నీకుఁ దోఁచెదనొ కాని తనుద్యుతిఁ బాసితిం జుమీ. 79

వ. అది యట్లుండె నివ్విధంబున నేనును వివిధోపచారంబుల సంఘ
టింపఁ బెంపునం బ్రవర్తిల్లుచుండి యాచండదానవుం డొకా
నొకనాఁడు సకలసైనిక సన్నాహసంపదం బొదలుచుం గదలి
యేతెంచి మదీయమందిరద్వారంబునఁ దన బలంబుల నించి
నిలిచిమాటలాడఁ బని గలిగి వచ్చితి నని లోనికిం జెప్పి యనుపు
టయు నేనును దత్ప్రవేశంబు నడపం దగువారి నియమించితి
నప్పుడు 80

చ. మెఱియలవంటి రక్కసులు మిక్కిలి లెక్కకు మీఱి క్రొవ్వు నే
ర్పెఱియుఁ దలిర్పఁగా వడివడిం దనవెంటనె ద్వారపాలురన్
నెఱి చెడ మట్టికొంచుఁ జొర నిర్భరగర్వము నుబ్బు బింకమున్
మెఱయఁగ వచ్చి యా యసుర మించె మదగ్రమహాసనస్థితిన్. 81

చ. బలిమిఁ దదీయు లప్పుడు సభామునిముఖ్యుల రెట్టఁ బట్టి యా
తలఁ బడవైచుచుం దమకుఁ దామె యవారణఁ దత్తదాసనం
బులు గొని కూరుచుండిరి తపోధనులున్ సురలు న్వడంగుపా
టొలయఁగ గ్రుక్కుమిక్కుమనకుండి రొదుంగుచు నక్కడక్కడన్.

ఉ. యాదవసింహ నా తలఁపు నప్పుడు వారలపా టొకింత యాఁ
గా దనుదాఁక లేదు గలఁకం బడఁ జొచ్చె ఖలుండు వీఁడు పెం
పేదఁగఁ జట్టుముట్టి మము నిద్దఱఁ బట్టిన నేది దిక్కు ప్రా
మాదిక మైనమోస మిది మన్మతి కంచు జనించుశంకతోన్. 83

వ. ఏ నప్పు డుప్పతిల్లెడు మదికలంక యెఱుకపడకుండ గాంభీర్యంబుఁ దెచ్చుకొని తనకు వస్త్రాభరణాది సంభావన లొనర్చుటకు వారి వీరిం బిలిచి నియోగించుచు సంభ్రమించుటఁ గనుంగొని యన్నియు వచ్చుం జాలు నిలు మని వారించుచు నిలింపద్వేషి యిట్లనియె 84

గీ. వలసినట్లు దివ్యవస్తువు లెల్ల నా
యిచ్చ ననుభవించి వెచ్చపెట్టి
ప్రభుత నెఱప కకట పరుఁ డిచ్చునందాఁక
నెదురుచూచు దైన్య మేల నాకు. 85

క. నీ మంచితనపు నటనల
నే మొగమోడుచు నెఱుంగ కిట్లుండితిఁ గా
కేమిటికి నాకు నీదు వృ
థామాధురి యొందు వినుము తగవరి వైనన్. 86

మత్తకోకిల. ఎంతకాలము నీవు నాకము నేలి తొంతట నుండి నా
కంతకాలము నేలఁ బాడి బిడౌజ కశ్యపమాని రా
ట్సంతతిత్వము మీకు దానవజాతికి న్సరి గాదె నీ
వింతయుంగని రాజ్యహీనత నేగు మెచ్చుటి కేనియుః. 87

గీ. ఇట్లు సేయవేని యింద్ర మీరెల్ల నా
చేతిలోనివార చెప్పనేల
యిపుడ పట్టి నిగ్రహించెద నావుడు
నేను నగుచు యాతుధానుతోడ. 88

గీ. నిగ్రహముల కేమి నీవును నేము న
న్యోన్యమైత్రిఁ బొదలునట్టి తెఱఁగు
నడపవలయుఁగాక యొడసి పోనాడుకోఁ
దడవె వేగిరింపఁ దగునె యనఘ. 89

వ. దానవేంద్రా! నీపలికినట్ల మన మిరువురగలవారముం గశ్యపు
సంతానం బగుటంజేసి మన యెల్ల వివాదంబులు నతండ తీర్ప
నర్హుండు గావున నమ్మహా మునీంద్రుకడకు నరిగి యతనియొఱుక
మీఁద నీకు నా కాధిపత్యంబు నొసంగవలసిన నొసంగెదఁ
దొలుత మదీయవచనంబులు విని యిట్టిసైరణ వహించి తది
తుదముట్ట నడపక విడిచి పెట్టుట నీయట్టి గట్టిదొరకు నుచితంబె
తియ్యనినోరం జేఁదు మేయుట నాయంబుగాదని మఱియు ననేక
ప్రకారంబుల నొడంబఱిచి యతని యతివ్యగ్రతకుం బ్రతివిధా
నంబు గానక యే నపుడ యప్పటికి దొరకిన బృహస్పతి ప్రము

ఖులు సహాయులుగా నమ్మహాదైత్యు వెంటం గశ్యపుపాలి కేఁగితి నప్పు డప్పరమ తపోధనుండు యజ్ఞదీక్షితుండై యున్న వాఁడు గావున మా వివాదంబులు నిజయజనావసానంబునందు విని తీర్చుటకు నియమంబు చేసి యా సురవిరోధిని యథార్హ సాంత్వనాలాపంబుల శాంతుంజేసి యిప్పుడు నీవు నీ వజ్రపురం బునకుఁ జను మని యాజ్ఞాపించిన 90

ఉ. ఇం బడరంగ నియ్యకొనియెన్ రజనీచరుఁ డేమి భాగ్యమో
యంబుజనాభ యప్పటికి నమ్మని సత్కృప నేను నేమి చె
ప్పం బులినోరికండ విడి పడ్డగతిం దలపట్టి చూచుకొం
చుం బెనుచేటు దప్పె ననుచుం దివి కేఁగితి నొయ్య నొయ్యనన్.

చ. అడరి మదోద్ధతత్వమున సద్దనుజుం డెపు డేమఱించి పైఁ
బడునొ యెఱుంగరాదు సురపట్టణరాజ్యసుఖాశ యేర్పడ
న్విడిచితి నింక నీవు తల నిండఁగ నర్థము వోసితేని నే
నడు గటు పెట్టఁగా వెఱతు నచ్యుత నిన్ను నె కొల్చియుండెదన్. 92

వ. అనుటయుఁ గర్ణంబులు మూసికొని వాసుదేవుండు 93

ఉ. పాడిఁ దొఱంగఁ జన్నె యొకపట్టునఁ గొల్చెద నంచు నెంత మా
టాడితి సర్వదైవతకులాధిప యోడలు బంట్ల వచ్చు బం
ట్లోడల వచ్చు నొండొరుల కొక్కొకచో ననునైనతావులం
గూడుట యిష్టబంధులకుఁ గ్రొత్తయె యిత్తఱి నింత యేటికిన్. 94

ఉ. ఎన్నఁగఁ బోల్చి యీ కొలఁది యే బలుపెక్కను లెంప లెంద ఇ
త్త్యున్నతిఁ గ్రొవ్వి క్రొవ్వెదరు విప్రజనుదిం జేసి పోరె వాంఛ్రమ వేఁ
ప సన్నిజనాకాలము కపెం సన్నికటం బగుటను స్నలంగఁ జే
సె నన్ను నింతి సత్సురుమిత్రము నొచ్చెను కీర్తి నొప్పునే. 95

మ. వసుదేవుం డిపు డిష్టిదం బొనటి నిర్వర్తింప నుద్యుక్తుఁడౌ
సనుఁ డైనాఁ డదియున్ వ్యపర్థము కదా నాకేక యాకార్య మె
ప్డు సమాప్తం బగు నంతనుండియు వరప్రోల్లాసి నా దుష్టరా
ఘను సాధించుటకుం బ్రయత్నముఁ దగం గావింత మేకాగ్రతన్.

క. నీవు నుపాయాన్వేషముఁ
గావించుచు నుండు మల్పకార్యం బది గా
దే వెరవునఁ దత్పురి చొరఁ
గా వలయునొ యెవ్వ రోర్వఁగలరో వానిన్. 97

వ. అని యింద్రుఁడు వీడ్కొలిపి వేడ్క భాసిల్ల వాసుదేవుండు వసు
దేవయజ్ఞనిర్వహణధూర్వహుం డయ్యె నంత 98

సీ. నిఖిలదేశాయాతనృపతిభూషాకర్ష
రేణుసంపోషితక్షోణికంబు
మహితావభృథలాభ మహిమధన్యత్వభా
గ్జలదర్శితాపూర్వసౌష్టవంబు
వరమంత్రతంత్రహవ్యద్రవ్యసాద్గుణ్య
సంభృతానలసవాజ్వల్యకంబు

సన్నుతసాన్నాయ్య సౌరభ సంపదా
ఢ్యం భవిష్ణు ప్రపూతానిలంబు

హోమధూమానురంజితద్యోతలంబు
నగుచు వసుదేవునధ్వర మతిశయిల్లె
భవ్యలీల మహాభూతపంచకమున
కొక్కొక్కవిశేష మొసఁగుచు నొప్పుమీఱి. 99

శా. అక్షయ్యం బగుపెంపుఁ దాల్చును దపోయజ్ఞక్రియాదుల్ తదీ
యక్షేమంకరనామసంస్మరణ పుణ్యావాప్తి నాఁ బుండరీ
కాక్షుం డచ్యుతుఁ డాదిపూరుషుఁడు ప్రత్యక్షాకృతిం దానె సం
రక్షింపం బెనుపొందు యజ్ఞమునకుం బ్రాశస్త్య మింకే మనన్.

### భద్రుఁడను నటుని వృత్తాంతము

వ. అది యట్లుండె నతండు యాగసమాప్తిసమయంబున సమస్త
దేశాయాతు లైన బంధుమిత్రాదులం దత్తదర్హసంభావనలచేతం
బ్రీతులం జేయుచున్న యత్తఱి భద్రుం డను నటుం డచ్చటికి
వచ్చి యత్యద్భుతం బగునర్తనంబునం బరితోషంబు నొందించి
సభాసదులయిన మునులచేత వివిధంబు లైన వరంబులు నితరుల
చేతం బారితోషికంబు లైన యంబరాభరణ ముఖ్యంబులుఁ
గైకొనుచు వారిని వేఱువేఱ యనేక ప్రకారంబులం బొగడుచుం
బ్రవర్తిల్లుచున్నంత 101

చ. కలికిపిసాళినవ్వు లెసఁగ స్వేటుధూర్తులు గొంద ఱొండొరుం
దలకొన నెచ్చరించి తమదంపుఁగోలల నున్నమాఱుఁగోఁ
చులు వెసఁ బుచ్చి వైచి కమసాంపులుగాఁ బొగడించుకోఁ జమీ
తలఁపఁగ నిప్పుడింత తెగుదారుల మైత్రిమి భద్రనా[illegible]. 102

క. ఎలన వ్వోలయఁగ నాతఁడు
కలయఁగ నవి చుట్టి పట్టి గంభీర[illegible]
రెలుఁ గొప్ప నొహాహో యని
పలుమఱు నెగరంగ వైచి పట్టుచు [illegible] 103

సీ. వేదసారభములు వెదచల్లఁ గలశుచి
బ్రాహ్మణజాతికోరకములార
పరిశుద్ధి పెంపొందు బ్రహ్మవర్చసపావ
కస్ఫూర్జితస్ఫులింగంబులార
యరయ నట్టికసికలంత లయ్యును బింక
మున బ్రహ్మశిఖ ముట్టు ప్రోడలార
దంటమాటలకు ధౌర్త్యమునకు నానతి
పడిపట్టినట్టి సత్ప్రాజ్ఞులార

చిన్నవడుగులార వెన్నునివామన
త్వంబు నభినయించు తంత్రములార
మీప్రసాద మిది సమృద్ధికారణము మా
కఖిల కార్యముల మహాత్ములార. 104

వ. అని పొగడిన నవ్వి యవ్వటువులు దుండగంబున 105

గీ. ఓరి యాటకాఁడ యీ రీతి యఱపులా
పొగడు టనఁగ మెచ్చు పుట్ట దించు
మగుడఁ బుచ్చుకొనఁగఁ దగదు నీవంటిన
గోఁచు లిపుడు పుచ్చుకొనక చనము. 106

వ. అనుచుఁ దలంగి పోక యిట్టు నట్టుం జుట్టు మెట్టాడుచిట్టివడుగుల
నానట్టువ నగవునుం గోపంబుఁ గదుర నదలించుచుం దనమేళ
గాండ్ర నాలోకించి యిబ్బాలకులు మనవాలకపుసొమ్ములందు
నేమేనియు నపహరించుటకు నట్టాడుచున్నవారు మీరు లీ
మ్రుచ్చుల నెచ్చరికం గనుపెట్టుకొని యుండుఁ డనుటయు నుదరి
పడుచు నప్పడుచులు గడుసుఁదనంబున నతని నధిక్షేపించి 107

సీ. ఏము మ్రుచ్చులమె యూహింప మ్రుచ్చుఁదనాల
పుట్టినయిండ్లు మీబోంట్లెకాక
యాటవాండ్రని నమ్మి యనుమతింపఁగ నెట్టి
పుర మైన నశ్రమంబునను జొచ్చి
పగలెల్ల నాటల్ల భ్రమయించుచును సందు
గొందు లెల్ల నెఱింగికొనుచు రేలు
కన్నగాండ్రగుచు నగళ్ళు ప్రవేశించి
యందు నెంతటివార లడ్డమైనఁ
జక్కడఁచుచుఁ జేనుగ్రుక్కనపాటిగా
నిష్టమైనయర్థ మెల్లఁ బహసి

బ్రతుకుచునికి మీస్వభావ మింతయును ద
ప్పనా యథార్థ మనుచుఁ బలుకఁబడియును. 108

మ. మనటాకింక తన శీఘ్రకార్యము దెస న్వర్తిల్లు చిత్తంబుతో
నునిక వజ్రపురంబుఁ జొచ్చుట కుపాయాన్వేషి యై యున్కిఁ జే
సి నిజాపేక్షకు నుత్తరంబుగ గ్రహించె న్విప్రవాక్యం జనా
ర్దన యన్మాట యథార్థ మై పరఁగఁ దద్వాక్యక్రమం బంతయున్.

వ. తద్విధంబున విశ్వంభరుండు వటువచనంబు లుపశ్రుతిగం జేకొని తదనుసారంబున వజ్రపురప్రవేశంబును వజ్రనాభవినాశంబును నతి సుకరంబులుగా మనంబున నిశ్చయించుకొని తత్ప్రయోజనంబునకు సరుగ నర్హుం డెవ్వఁడొకో యను విచారంబునం బ్రవర్తిల్లె నటమున్న యమరనాయకుండు దనుజాపాయంబునకు నుపాయంబు భావించి దేవశైవలినీవిహారమహారసతరంగితాంతరంగంబు లగు చక్రాంగంబుల రావించి సగౌరవంబుగా నిట్లనియె.

ఇంద్రుఁడు హంసలతో సంభాషించుట

గీ. హంసవరులార మాకొక్క యవసరంబు
గలిగి పిలిపించితిమి మీరు గలుగుటకును
ఫలము మీచేత నైన యీ పనికొదవుట
గావున వినుండు వివరింతుఁ గార్యసరణి. 111

క. మము వజ్రనాభుఁడనియెడు
సమరరిపుఁడు పఱచినట్టి యా పాట్లు సమ

స్తము మీ రెఱుఁగుదు రేక ద
క్రమమున నవి చెప్పనేల ఖగవరులారా. 112

గీ. మాకు నిపుడువాని మర్దించు యత్నంబు
గలిగియున్న యది ప్రకాశ మైన
నెగ్గుపుట్టుఁ గాన నీరహస్యంబు మీ
మనసునందె పెట్టుకొనఁగ వలయు. 113

క. మాకంటె వాఁడు మునుపుగ
నే కార్యము సేయఁగలఁడొ యెఱుఁగము మీరల్
జోకగఁ దత్పురి మెలఁగుచు
నా కేవొక పనికి వేగు నడపఁగ వలయున్. 114

చ. ప్రతిదివసంబు వాని నగరంబునఁ బుట్టు విశేషము ల్భవ
న్మతిపస నన్నియుం దెలిసి మా కెఱిఁగించుట మీప్రయోజనం
బితరులచేతఁ గా దిది తదిష్టముగాక చొరంగరాదు మా
రుతమున కైనఁ దత్పుర మొరు ల్చొరఁజాలమి చెప్ప నేటికిన్. 115

క. మీరాక పోక లింపు సు
రారాతికిఁ గేళిదీర్ఘికాదులకు నలం
కారములు మీ విహారము
లారయ నేరికి నతిప్రియంబులు కావే. 116

వ. అనుటయు నాపులోమజావల్లభునకు శుచిముఖివల్లభుం డను మ
రాళతల్లజుం డుల్లసితవదనుం డగుచు నెదుట నిలిచి దేవా యీ

వేళ కావజ్రనాభుండు ప్రాభవాభిమానంబునఁ గన్ను గానమిఁ దన్నుఁ దా నెఱుంగ కున్నవాఁడు నాకుఁ జూడనిప్పటికి కాదెప్పటికి నప్పరమతామసుం డింక నీవంకకుం గదలిరా నెఱుంగఁడని తోఁచుచున్న యది యయినను మానసంబున దేవర దేవకార్యం బేమియు నేమఱకుండునది యిది యంతయు నింతకుమున్ను వజ్రపురినుండి యేము గొందఱము వచ్చితిమి గానఁ గానంబడిన యర్థంబు విన్నవించితి నెంచి చూడం గించిదూనంబుగా వాని రాజ్యసంపదయుఁ దుదకు వచ్చినది యిది మదీయజాయవలన వినఁబడియెఁ దద్విశేషంబును దానిచేత విన్నపంబు చేయించెద నని తన చెలువం బిలిపించిన వజ్రనాభురాజ్యావసానసామీప్యంబు స్వామికి నేమియుం గొఱంత పెట్టక విన్నవింపు మనుటయు నాశుచిముఖి శతమఖున కభిముఖియై యిట్లనియె.

శుచిముఖియను హంసి యింద్రునితో మాట్లాడుటయుఁ
ప్రభావతీ స్వప్నముం జెప్పుటయు

చ. తడవులఁబట్టియేము సతతంబును బోదుము నానివీటికిఁ
గడుమతిచాలమిం గడుపుఁగక్కుఱితి న్సురలోకనాథ మా
యెడఁ గల యట్టి తప్పిది సహింపుము పక్షుల మాట నొక్కవెం
బడి నిది చెల్లెఁ గాక రిపుప్రాంతము చేరెడువార లాప్తులే. 118

వ. ఏమునుం బోక మానెద మని తలంతుమేని 119

సీ. గగనస్రవంతిలోఁ గలసువర్ణాబ్జంబు
లందు మేలేర్చి తా నపహరించి

మానసంబు శతాత్మమానసంబును బోలె
నిస్సారసత్వంబు నెరయఁజేసి
బిందుసరంబులోఁ గుందనపుందమ్మి
పేరు లేకుండంగఁ బెల్లగించి
సౌగంధికాఖ్య కాసారంబు జలమాత్ర
శేష మై దీనతఁ జెందఁ జేసి

మఱియుఁ గల దివ్యసరసులు నెఱయఁ జెఱిచి
తనదు కేళిదీర్ఘికలందుఁ గనకనలిన
జాతు లెల్ల నాటించినాఁ డాతఁ డింద్ర
యటు చనక మోఁత నడుచు నే హంసములకు. 120

వ. యది యట్లుండె నట్లు వజ్రపురంబునం గలకొలంకులం దటాకంబులం గేళాకూళుల బొడ్డనబావుల నడ్డపెట్టు లేక విహరించుటకు వజ్రనాభు ముదల యడిగి తజ్జలాశయంబు లన్నింటికి నస్మదీయ సంక్రీడనంబు కలిమి యలంకారం బగుట యెంచి యతం డంగీకరింప యథేష్టవిహారణంబుల నహరహంబునుం బ్రవర్తిల్లుచున్న యేము నిన్నఁ గన్య కాంతఃపురంబున నొక్కసరోవరంబునం బరఁగుతఱి మదనసామ్రాజ్యలక్ష్మీసాక్షాత్కారానుకారిణియైన యొక్క కన్యకామణి తన చెలికత్తియతోడం దత్తటంబునం గ్రొత్తవిరిగుత్తి మొత్తంబుల నత్యంతంబు చెలువొందు గురివెంద పొదరింట నొంటి నుండి యవ్వాలు గంటితోడ.

చ. కమలదళాక్షిరో వినవుగా కల యొక్కటి గంటి వేకువన్
సమధిక మైనయద్భుత మొనర్చుచు నున్నది యెన్నుకొన్న లో

కమునను గన్నవిన్నయది గా దని కొంత నిజంబు కొంత స్వ
ప్నము సని పల్కి సిగ్గుకతన౯ మఱి చెప్పక దాఁచె దాఁచిన౯.

క. ఒ క్రిమకొంటివి గద నే
కట్టి రహస్యంబు దాఁచ నే నని మనలో
నిట్టివి గలవా యని చెలి
యట్టే తప్ప దన విరచితాంగీకృత యై. 123

వ. ఆ కలకంఠి తన కల సకలంబు నకలంక సౌహార్దంబున నిట్లని విని
పించె. 124

చ. హిమగిరిరాజకన్య పరమేశ్వరి నాకల సుప్రసన్నయై
విమలదరస్మితామృతము వెల్లువ చెక్కులఁ జిక్కటిల్ల న౯
మమతను జేరఁగా బిలిచి మక్కువచే నను నొక్కకేల నే
నిమురుచు నీకు నొక్కమగని౯ ఘటియించితి నంచుఁ బల్కుచు౯.

సీ. సంకల్పమాత్రతత్క్షణసన్నిధాపితం
బగుచిత్రఫలకంబునందు నొక్క
పురుషు నత్యాశ్చర్యతరరూపలావణ్య
గాంభీర్యశౌర్యాదిశుంభదఖిల
గుణములఁ గొమరొందుకొమరుఁ బ్రాయపువాని
వ్రాసి యితండ నీవల్లభుండు
ప్రద్యుమ్నుఁ డనియెడు ప్రభుకుమారుఁడు
మీకు నిద్దరకును జనియించినట్టి

పుత్రుఁ డీపురి యేలు నోపాలఁతి యనుచుఁ
బలికెనఁట నేను నచటిపెద్దలు గఱపఁగ
మ్రొక్కి యనిపితినఁట యిందు నిక్కమగుచుఁ
బడఁతి యున్నది తచ్చిత్రఫలక మిపుడు. 126

మ. అనుచు న్నెచ్చెలితోడ నచ్చెలువ యట్లత్యద్భుతస్వప్నముల్
వినిపింప న్నిగటంబున న్మెలఁగుచుల్ వింటి న్సురాధీశ దా
నన యే నెన్నిక నిర్ణయించితి మదిం దథ్యంబుగా వజ్రనా
భునకుం గాలము చేరువాట యిది నీ బుద్ధి న్వివేకింపుమా. 127

సీ. ఆయింతిఁ బ్రద్యుమ్నుజాయగాఁ బలికిన
గౌరిమాటకు బొంకు గలుగ దనుము
దనుజవిరోధిపుత్త్రినకు నా దుష్టదై
త్యుఁడు తనంతఁ దనూజ నొసఁగఁ డనుము
ప్రద్యుమ్నుఁ డట్లు ప్రభావతీపతి యైన
దానవునకుఁ బోరు తప్ప దనుము
వజ్రపురము ప్రభావతికొడుకు కేలుట
యసురకు జయ మైనఁ బొసఁగ దనుము

చిత్రఫలకంబు ప్రత్యక్షసిద్ధ మగుటఁ
జేసి యాకల యధికవిశ్వాసయోగ్య
మదియు వేకువఁ గావున నచిరభావి
ఫలము దేవేంద్ర నీ వెంచి తెలిసికొనుము. 128

వ. ఆకన్నియపేరు ప్రభావతి యగుటయు నది వజ్రనాభుని కూఁతు రగు
టయుఁ దదీయస్వప్నశిక్షణానంతరప్రవృత్తంబు లయిన యమ్మత్తకా
శినుల యుత్తరప్రత్యుత్తరంబులవెంబడి నెఱుంగంబడియె నవియుం
గొన్ని నిజనిరూప భవదీయ కార్యోపకారిణియైన యంశంబు గలిగిన
ప్రహాయించునదియని యూచుంచెరిత యకొంచిదించితసహజమా
ధుర్యధుర్యవాగ్వాములయకంబు కార్యకామునియకంబున నిజము
చెంది బిజాజు సిబిజాఁజేయుచుండ నిట్లనియె 129

క. విను మట్లు తనదుకల చె
ప్పిన యాయమఁ జూచి దానిప్రియసఖి యనయం
బును వెఱఁగందుచు మెచ్చుచు
వనితా నీ వెంతభాగ్యవతివే యనుచుఁ. 130

వ. శిరఃకంపం బొనర్చి 131

గీ. మునుపు గౌరివరంబుచేత నె జనించి
తబల నీవు ని న్నన్న విూ యమ్మ నేమ
మట్టి దిట్టిది నాఁ జన్నె యగజ నీవు
నింత మెప్పించుకొంటి నీ కెవ్వ రీడు. 132

చ. వలిమలయాఁడుబిడ్డ కల వచ్చియనుగ్రహ మెంత యేనియుం
గలుగకె యిట్లు చిత్రఫలకంబున నీకు లిఖించి యిచ్చునే
చెలువుని నింతదృష్టముగఁ జెప్పెద నొండొక పోతుటేఁగఁ
బాలయఁగ రానిచోట నిది పుట్టుట నె గ్గగు నీదు తండ్రిచేఁ. 133

గీ. చిచ్చు లేక చిముడుమచ్చరీఁ డీ సుద్ది
వజ్రనాభుఁ డోర్చువాఁడె యకట
యగజ పేరుపెట్టి యతివ యెవ్వతో యింత
చేసె ననుచు మమ్ముఁ జెండుఁ దొలుత. 134

క. ఆ చిత్రఫలక మెవ్వరు
చూచిన వెలివిసరి యపుడు సుబ్బెడు నది నీ
వే చూచు టేను జూచుట
యో చంచలనయన యింతయు నెఱుంగుదువే. 135

చ. ఇతరులు రాకమున్న యది యెక్కడఁ బెట్టినదానవో సుశీ
ఘ్రతఁ గొని తెమ్ము తల్లి ఖితుఁ గన్నులఁ జూచినదాఁక నా మనం
బతిముదితంబు గా దగజ యారసి యెవ్వని వ్రాసెనో సురా
పతపస సీకు జో డయిన భవ్యుఁడు దుర్లభుఁ డెల్లసృష్టిలోన్. 136

వ. అనవుడు నక్కాంత యిక్కడ నొక్క చిగురుంబొదరుటీఱమి నిడిన
దాన నని యాక్షణంబ తెచ్చి నెచ్చెలియుం దాను నప్పలకకప్పుఁ
బావడ యెడలించి. 137

చ. కలకల నవ్వినట్లు తెలికన్నుల నిక్కము చూచినట్లు తోఁ
బలుకఁ గడంగినట్లు కడుభావగభీరత లబ్బినట్లు పెం
పొలయఁ దనర్చి జీవకళ యుట్టిపడన్ శివ వ్రాసినట్టి యా
చెలువున కాభిముఖ్యము భజింపఁ దలంకెను దాను బోఁటియున్.

ఉ. చిత్తరు వన్న నిశ్చయముచే నెదు రుండి మొగంబు చూడ మో
మెత్తును సత్యపుంభ్రమసమృద్ధిని గ్రమ్మఱుఁ దత్క్షణంబ లో
నొత్తుచుఁ దత్తఱంబుఁ ద్రపయు౯ మగుడంగ నిరీక్షణేచ్ఛఁ బో
మొత్తును భర్త౯ జూపు నను మోచుట దోఁచిన నోసరిల్లుచు౯.

గీ. వెఱయుఁ ద్రపయు లోనుగఁ గల విఘ్నసమితిఁ
గడుఁ గలఁగి పోక యుండఁ దా నడుమ నడఁచి
యేచి చిత్రతానిశ్చయ మెచ్చరింప
నింతి క్రమమునఁ బ్రియునిరూపెల్లఁ జూచు. 140

వ. అత్తలోదరి చెలికత్తెయు నత్యంతవిస్మయాయత్తచిత్తయై
యొక్కింత తడవు చూచి యిట్లనియె. 141

ఉ. ఇంత బెడంగు లోకమున నెవ్వరి కున్నది యంబ తా నిజా
త్యంతిక నైపుణీమహిమ మంచన వ్రాసెను యేమొ కాక యా
చింతయుఁ గూడ దీతని సృజించియె జోడుగఁ గోరి చుమ్ము దా
నెంతయుఁ నేర్పుమీఱ నజుఁ డిట్లు సృజించె నినుం బ్రభావతీ. 142

వ. అనుటయు నక్కాంతాతిలకంబు 143

ఉ. ఇచ్చక మాడుమాట లివి యెల్ల నటుండఁగ నిచ్చి నీకు నీ
నెచ్చెలితోడు సుమ్ము సఖి నిక్కము చెప్పుము వ్రాఁతనేర్పు గా

కిచ్చెలువంబు గల్గు ఘనుఁ డెక్కడ నే నొకఁ డుండెనేని నేఁ
నచ్చరణద్వయంబునకు దాస్య మొనర్పఁగ నైన నర్హ నే. 144

వ. అని మఱియుఁ బెక్కుచందంబులం గందర్పరాగంబు తేటపఱుచు మాటలం దనబోటితోడం దడవు సంభాషించుచుండె ననియుఁ బదిలంబుగఁ దెలిసిన నమ్ముగ్ధియు ప్రద్యుమ్న శీఘ్రానయనంబునకు నుద్యోగంబు తద్దయుం జేయుట సంభావితంబు గావున దేవకార్యంబునకు నుపకారంబు వోలెఁ దోఁచుచున్నది యని చెప్పుటయు నవహితమానసుం డై యాకర్ణించి 145

శా. ధారుణ్యాభరణాయమానబుధతాధారుండు భూమోల్ల స
త్కారుణ్యామృతశైత్యనిత్యదృగలంకారుండు నేత్రాంతగా
హారుణ్యాంకురకల్పితారిమదసంహారుండు కీర్త్యంగనా
తారుణ్యాంగళనౌషధాభిజనవిస్తారుండు శూరుం డనిన్. 146

క. సారతరవైదికసమా
చారుఁడు బహునృపకృతోపచారుఁడు నిరహం
కారుఁడు సాంగానంగా
కారుఁడు సన్నుతవచఃప్రకారుఁడు సభలన్. 147

కవి. జలధిగభీరుఁడు శాంతవికారుఁడు శాస్త్రవిహారుఁడు సామనసా
చలవరధీరుఁడు శశ్వదుదారుఁడు సంహృతవైరుఁడు శంభుపదా
చలితవిచారుఁడు సాదిమసారుఁడు సత్పరివారుఁడు సర్వనుతో
జ్జ్వలగుణవారుఁడు సంవిదగారుఁడు సంశయదూరుఁడు సద్విధులన్

గ ద్య ము.

ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగిత కవిత్వవైభవ పింగళి
యమరనార్యతనూభవ సౌజన్యగేయ సూరయనామ
ధేయ ప్రణీతంబైన ప్రభావతీ ప్రద్యుమ్నం
బను మహాప్రబంధంబునందుఁ

ప్ర థ మా శ్వా స ము.

శ్రీ

# ప్రభావతీప్రద్యుమ్నము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీచణగౌతమగోత్ర
ప్రాచీనామాత్యకీర్తి భామావిష్వ
ద్రీచీనగమనశిక్షై
కాచార్యుఁడు సూరమంత్రియమరార్యుఁ డిలన్. 1

వ. ఆసహస్రాక్షుం డపేక్షితప్రయోజనానుకూల్యంబుకంటె నా పెంటి రాయంచయంచితవచనరచనావిచక్షణత్వంబు చిత్తంబునకుం గ్రొత్తయింపు సొంపు సంపాదించుచుం బెంపు మీఱ నింపులగు మెచ్చు నచ్చెరువు నిచ్చలంబులై తనర నిట్లనియె 2

సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱఁగనీక
పదమైత్రి యర్థసంపదలఁ బొదలఁ
దలఁ పెల్ల నక్లిష్టతను బ్రదీపితముగాఁ
బునరుక్తిదోషంబుపొంతఁ బోక

యాకాంక్షితస్ఫూర్తి యాచరించుచును శా
ఖాచంక్రమక్రియఁ గడవఁ జనక
ప్రకృతార్థభావంబు పాదుకొ నదుకుచు
నుపపత్తి యెందు నత్యూర్జితముగ

నొకటఁ బూర్వోత్తరవిరోధ మొంద కుండఁ
దత్తదవయనవాక్యతాత్పర్యభేద
ములు మహావాక్యతాత్పర్యమునకు నొనరఁ
బలుక నేర్చుట బహుతపః ఫలముగాదె. 3

క. నీ వెవ్వరికోలఁదియుఁ గా
వో వరటామణి విహంగయోషనె భాషా
ప్రావీణ్యము చూడఁగ వా
గ్దేవతవో కాక యాకె దిద్దినకవివో. 4

క. అనుటయు రెండవపక్షం
బనిమిషవర తప్ప దెట్టియర్థమును దగు
లోకానఁ దివియక వెలివో ని
చ్చునె బుధుఁ డూహించి చేయు సుకవిత్వంబుల్. 5

గీ. విను సురేంద్ర పద్మజుని తేరు దివుచు సా
రంధరాఖ్యుఁ డగు మరాళవిభుని
బిడ్డ నేను వాణి పెనుపంగఁ బెరిఁగి త
ద్విమలశిక్షఁ గంటి విద్య లెల్ల. 6

వ. అని రాజహంసి తన పూర్వం బెఱింగించిన దేవేంద్రుండు దానం
జేసి కాదే సీవింత సామర్థ్యంబునం బొలుపు మీఱుచున్న దానవు
మీఁదికార్యంబునకుం బర్యాకులితభావంబునం జేసి త్రోవఁ
గానక దీనత నున్న మాకు మాపాలిభాగ్యదేవత యీ విధంబున
నిన్ను నన్నిటికి నాధారంబుగా ననుగ్రహించెం గావున దేవ
కార్యంబు కడముట్ట నిర్వహించుటకు నీవ తక్క నొరులు నేర
రిది యంతయు నెఱింగి యెంతయుం బ్రార్థించెద నంచబల
గంబుతో నెప్పటి యట్ల వజ్రపురంబున కరిగి కేలిదీర్ఘికల విహ
రించుచుఁ బ్రభావతితోడి చెలిమికలిమికి నుపాయం బొనర్చి
యమ్ముద్దియకుం బ్రద్యుమ్నునం దనురాగంబు బలియునట్లుగా
వలయు తెఱంగున నతని గుణంబు లభివర్ణించి యా యుద్ధజ
కును శీఘ్రసంగమం బెవ్విధంబున నగు నిది నీవ యెఱింగి సంఘ
టింపుము.

క. ఏ ననిపితి నని ద్వారవ
తీనగరికిఁ బోయి వాసుదేవునితో నీ
పూనిక సకలము చెప్పి న
వీనాద్భుతి నతనిబుద్ధి విని చనవలయున్. 8

క. అని హంసంబుల నన్నిటిఁ
గనుఁగొని మీరెల్ల దీనికార్యవిధికి న
త్యనుకూలతమై నేత
ద్వనియోగము నడపవలయు దేవహితముగన్. 9

గీ. అని యనుప మరాళి యమరాళికార్యంబొ
సర్వఁ జనియె సురలు సమ్మి పొగడఁ
బరిగణింప విశదపక్షపాతులప్రవ
ర్తనము లెట్లు నమ్మఁ దగకె యున్నె. 10

వ. అది యట్లుండె నట్లు గదలి చని 11

హంస యింద్రునాజ్ఞచేఁ గృష్ణుం గని సంభాషించుట

గీ. అష్టమహిషీసమేతుఁ డై యాలయాప
వనసరస్తీరమంటపవర్తియైన
కృష్ణు దవ్వుదవ్వులను విలోకించి తెలిసి
యితని నెఱిఁగించుకొనవేళ యిదియ యనుచు. 12

క. తనయంచబలంగముఁ దా
నును శుచిముఖి నభము డిగ్గి నూత్నవిలాసం
బొనరించె సరోలక్ష్మికిఁ
గనకాంచితపక్షచకచకద్యుతిచేతన్. 13

వ. తదనంతరంబ తా నొక్కతియ రక్కసులగొంగచెంగటికి నల్ల
నల్లన నడచి 14

సీ. తొడలు తలాడగా నిడి రుక్మిణి భజింపఁ
బదము లొత్తుచు సత్యభామ కొలువ

సురటి చేకొని భద్ర శుశ్రూష గావింప
విరిచామరము మిత్రవింద యిడఁగఁ
గాళింది వేడ్కతోఁ గాళంజిఁ దాల్ప జాం
బవతి తములపాకు మడిచి యొసఁగ
గొడుగు పావలు కేలఁ గొని నాగ్నజితియుండ
జలములగిండి లక్షణ వహింపఁ

గ్రొమ్మెఱుంగులతోడి కార్మొగులు వోలె
నొప్పు కృష్ణునిచేరువ నొప్పె హంసి
నిండు నెలరీతిఁ దారకాన్వితనభంబు
పొలుపుఁ దెలిపెడి నెత్తమ్మికొలనికెలన. 15

గీ. బెదరు లే కిట్లు మిక్కిలి గిడియ వచ్చి
యున్న తన దిట్టతనమున కువిద లెల్ల
నరుదుపడఁ గృష్ణుఁ జూచి నన్నమరవిభుఁడు
పనిచె నీ కొక్కమాట చెప్పంగ ననియె. 16

వ. అని తదనంతరంబ 17

క. తన తనయుఁడు రాక్షసుపైఁ
జనియెడు నని రుక్మిణికి నసమ్మత మగునో
యను శంకఁ జేసి హంసాం
గన యేకాంతంపుమాట గల దని పల్కెన్. 18

క. పలికినఁ గమలావిభుఁ డా
పులుఁగుపడఁతి మాటనేర్పు బుద్ధికళాకౌ
శలమును మెచ్చుచు నెంతయు
మొలకనగవు చెక్కుటద్దములఁ దళుకొత్తన్. 19

చ. చెలువుగ భోజకన్యతోడఁ జేర్చినమూర్ధము సత్యభామయూ
రులపయి నున్నపాదములుఁ బ్రోడ్జతలీలఁ దరల్చి లేచి యు
జ్జ్వలనిజపాణిపద్మమున జాంబవతీకరనాగవల్లికా
దళములు పుచ్చుకొన్నఁ బ్రమదల్చని రందఱుఁ గొంత దవ్వుగన్.

గీ. ఇట్లు గోవిందుఁ డేకాంత మిచ్చి వినఁగ
హంసి తము వజ్రి పిలిపించు టాదిగాఁగ
నచటి కనుచుట తుదగాఁగ నతని తమ వ
చఃప్రసంగంబు నిరవశేషముగఁ జెప్పె. 21

వ. ఇట్లు చెప్పిన 22

చ. వడుగుల పల్కుపశ్రుతిగ వారక మున్ను సునిశ్చితత్వమున్
బడసినకార్యపద్ధతికిఁ బక్షివధూవచనక్రంబుచేఁ
గడమ సమర్పితం బగుడుఁ గంజదళాక్షుఁడు సంతసిల్లనే
ర్పడియెను వజ్రనాభవధభారవహుం డిపు డంచు నాత్మలోన్. 23

వ. ఇట్లు సంతసిల్లి శుచిముఖి కి ట్లనియె. 24

చ. బలవిభవాభిశోభితుఁ డభంగురశౌర్యధురంధరుండు కా
వలసినమాయలు న్దివిజవైరులకంటెఁ గరంబు నేర్చు నీ

పలుకులచంద మారయఁ బ్రభావతికిం బతిగాఁ గలాఁడు ని
చ్చలముగ రుక్మిణీసుతుఁడు చంపు నవశ్యము వజ్రనాభునిన్. 25

క. ఆ రాక్షసపట్టణ మె
వ్వారికిఁ దదనుజ్ఞ లేక వైరమునఁ జొరం
గా రాదఁట ప్రద్యుమ్నుఁడ
వారణఁ దత్పురముఁ జొచ్చువైపు విను మిఁకన్. 26

సీ. భద్రాఖ్యుఁ డగునటప్రముఖుఁ డొక్కరుఁడు ము
న్నరుదెంచి మజ్జనకాధ్వరమున
ననయంబుఁ గూడినమునిసభం దన నాట్య
గరిమచే మెప్పించి వరము గాఁగఁ
దన కవధ్యతయు సప్తద్వీపగమనంబు
నాకాశగతియు నాట్యములయందు
నెవ్వరిరూపు వహించె వారలయట్లు
తాను భేదము లేక తనరుటయును

బడసి యేడుదీవుల నాటపన నెరపుచుఁ
దిరుగుచున్నాఁడు వానిపైఁ దితిసుతునకు
వేడ్కఁ బుట్టంగఁ జెప్పి యవ్వీడు చొరఁగ
ముదల గొను మాతఁడై వచ్చుమదనుఁ డంత. 27

వ. ఇది నీకుం బరమప్రయోజనంబు దీన నుపయోగింపఁ దగినయవాం
తరకృత్యంబులుఁ దత్తదుపాయంబులు నీవ యెఱుంగుదు పొమ్ము
సురకార్యంబు నిర్వహింపు మని వీడుకొలిపినం దనమరాళజాలం

బుత్రో జాలపాదవనిత గగనంబున నెగసి వజ్రపురంబున కభిముఖంబుగాఁ బ్రయాణంబు సలుపుచున్నప్పుడు ద్వారకానగర బాహ్య ప్రదేశంబున వాహ్యాళివిహారసారస్యంబునం దగిలియున్న ప్రద్యుమ్నుఁడు. 28

## ప్రద్యుమ్నుని వాహ్యాళి

చ. తనహృదయంబు వెంబడిన తప్పక ఘోటక మంతనంత నే
పనుపడ నిల్చి ముందఱికిఁ బాఱి కెలంకులకుం దొలంగి తా
వెనుకకు నేగుదెంచి కడువేడ్క యొనర్పఁగ బంతి యాడ నె
మ్మిని గనకంపుఁగోల నడిమింటనె త్రిమ్మరఁ దారి కొట్టుచున్.

వ. మఱియును 30

చ. ఎగురఁగ వైచి కొట్టు టది యెంతభరం బని బంతి యగ్రగా
మిగ వడిఁ బాఱవైచి పుడమిం బడనీక యె దాని మీఁటి చి
త్రగతి హయంబుఁ దోలుచును గ్రమ్మఱ మీఁదికిఁ గొట్టియాడె విం
తగఁ దనచేతిరత్నమయదండము కాంతులు గాఁడి పాఱఁగన్. 31

వ. వెండియు నతండు మండలగతుల నతులంబుగాఁ దురంగంబుఁ దోలియాడె నప్పుడు 32

సీ. తొలుదొల్త నయ్యేకతురగంబు మండల
గతిచారి యగుచు నిక్కంబు తోఁచె
నా వెనుకను సరూపాశ్వాలి చెదరక
చక్రాకృతిని బర్వుసరణి తోఁచె

నంతట ననతిస్ఫుటావయవంబుగా
నెనసి యేకాంగవేష్టనత దోఁచెఁ
దుదఁదద్విభూషణ ద్యుతిరాజిమాత్రంబు
కొఱవిత్రిప్పినరీతి మెఱసి తోఁచె

నంతకంతకు గతివేగ మగ్గలింప
రాఁగ వాగె యెచ్చరిక పరాకు జియ్య
యనుజనులు ఱిచ్చవడి తమపని మఱవఁగఁ
బరఁగు నమ్మేటి నెఱరాతు ప్రౌఢికతన. 33

చ. ఉరుజవశాలి యత్తురగ ముల్ముకచక్రనయావలంబి యై
తిరుగు రయంబుచేత నెడ త్రెవ్వక కుమ్మరిసారెచాడ్పునన్
బరఁగెఁ గడున్ ధృతాభినవభాండతకుం దగ నున్కిపట్టు దాఁ
దరలక పైని దద్భ్రమణదండగతిన్ హరిపుత్త్రుఁ డొప్పఁగన్. 34

వ. అతఁ డంత 35

క. వల్గితముఖగతిపంచక
వల్గువిహారముల సైంధవము నలయించెన్
వల్గావిభాగకుశలత
వల్గత్కుండలమరీచివల్లరు లెసఁగన్. 36

శా. నానావీథిగతిప్రభేదవిహృతిన్ సంతృప్తుఁడై కంతుఁ డిం
పూనన్ వాగె గుదించినన్ బురుషకప్రోన్నమ్రపూర్వాంగ మై

కానంగాఁ బడియెన్ మరుజ్జవన మాగంధర్వ మర్త్యాశ్వసం
తానస్పర్థను మిన్ను వ్రాఁకెడుక్రియన్ దా నెంతయుం జూడ్కికిన్.

సీ. సముపలాలనయుతస్కంధాంతికాస్థాల
దమిత తేజోమహార్ధత్వకంబు
దంతాళికానియంత్రణసమున్నామితా
కుంచితగ్రీవాసమంచితంబు
దందమ్యమానశబ్దాయమానఖలీన
ఖషణఝర్ఝరితసృక్వద్వయంబు
ఘనఘర్మడిండీరఖండపాండురితప
ల్యయనవర్ధ్మోభయప్రాంతకంబు

నగుహయము డిగ్గఁ బ్రద్యుమ్నుఁ డంకవన్నె
యొకటి సాహిణియన్వాల నూఁదిపట్టఁ
దనయనుఁగుచెలికాఁడు కై దండ నొసఁగఁ
బ్రజ సురాళించి మణులు వస్త్రములు వైన. 38

గీ. అపుడు గగనసరణి నరిగెడుశుచిముఖి
యతనిఁ జూచి యల్లయతఁ డితండ
కావలయు నవశ్య మీవరపురుషుతో
మాట లాడి చనుట మనకు మేలు. 39

క. అని యాప్రద్యుమ్నునకున్
వినఁబడునట్లుగ మరాళవితతులతోఁ బ

ల్కి నిజోక్తి కతఁడు వెఱఁగం
ద నయంబున నవియుఁ దాను ధరణికి డిగ్గె. 40

సీ. మరు దశ్వగతి మెచ్చి సురలు వైచినపైఁడి
ప్రాఁతక్రొమ్మడుఁగుమవ్వాలువ లనఁగ
దర్పకు నెఱరౌతుతనువేర్మికిఁ గ్రమ్ము
కొను సతేజఃకీర్తిఘనము లనఁగ
హయఫేనధావళ్యయాచ్ఞార్థ మై ప్రాలు
తటిదనుగతసితాబ్దంబు లనఁగ
వాజివిభ్రమజితావర్తతఁ గొలఁకు ది
వ్యలయేటిసాబ్జరేణూర్ము లనఁగఁ

గనకరేఖలతోడి ఱెక్కలబెడంగు
చూపఱకుఁ గనుపండువై సొంపు మీఱ
జలదపథముననుండి భూస్థలికి డిగ్గు
హంసములు వర్ణనాసీమ నతకరించె. 41

సీ. ఇట్లు గన్పట్టుచు నేతెంచి యంచలు
వసుధచేరువ నేటవాలుగాఁగ
నళినిశ్చలప్రసారితపత్త్రంబు లై
డిగుచుఁ గామునిముందటికిని గొంత
సరి గడవఁగఁ బాఱి మరలి బోరలు దెట్ట
గిల నొక్కకడ వంచి మలపు దిరిగి

యెఱక లంతట రెండు నెఱయఁ జక్కఁగఁ జాఁచి
యవనిఁ గాల్మోపి ఱెక్కార్చి ముడిచి
మొగము లోఁక వింత సొయ్యారముగ మలంచి
యీఁకను విదిల్చికొనుచు నొక్కింత తడవు
హైమరేఖావిచిత్ర సితాంగరుహ వి
నిర్మలతఁ జూడ్కులకు నింపు నింపుచుండె. 42

వ. అంతఁ బ్రద్యుమ్నుఁ డుద్యోతమానకౌతుకంబున వాని నుప
లక్షించి, 'పక్షివరులారా! తొలుత నితనితో మాటలాడ వలయు
ననుకొంటి రిప్పుట నెవ్వనితో నేమి మాటలాడవలయు నతనిం
బిలిచి సంభాషింపుఁ డెట్టిప్రయోజనంబున నెందుఁ బోవుచున్న
వారలో మీర లన్యోన్యపరోషంబు గార్యవిరోధంబు నైరించి
యుండరు గదా యను శంకచేత సంకోచంబు లేక వేగిరించి
యీగతిఁ బలుకవలసెఁగాని భవదీయసన్నిధాన సౌభాగ్యం
బునం దనిసి కాదు. మీ రూపచేష్టావచోవిశేషంబు లరయ
దివ్యజాతిపక్షులరు గాని ప్రకృతిహంసంబులు గా' రనుటయును
నంత శుచిముఖి యఖిల జనమనోహరం బైన మధురస్వరంబున
ని ట్లనియె. 43

హంసి ప్రద్యుమ్నునితో సంభాషించుట

ఉ. ఇచ్చట మేము వేఱ మఱి యెవ్వరితోడను మాటలాడఁగా
వచ్చెద మచ్యుతాత్మజ దివస్పతి పంపునఁ గృష్ణుపాలికి

న్వచ్చి యతండు వీడ్కొలుప వారల యిద్దఱ యాజ్ఞలన్ గడున్
హెచ్చరికన్ ధరించి యిపు డేగెదులా గిది యొక్కచోటికిన్. 44

ఉ. ఇప్పుడు నిన్నుఁ జూచి కొలు వించుక చేయ కతిక్రమించి పో
నొప్పదటంచు వచ్చితిమి యోగ్యసమర్హణ మాను టెంతయున్
దప్పు గదయ్య యాదవవతంస! వినుంగని నీయనుగ్రహం
బొప్పుగఁ గాంచి పోవుటప్రయోజనసిద్ధికి మూల మారయన్. 45

క. నీ పలికినట్ల యేము సు
రాపగఁ గ్రీడించు దివ్యహంసములము నీ
చూపునకుఁ దప్పు గలదే
యే పట్టున నైనఁ బంకజేక్షణ తనయా! 46

వ. ఏము కాశ్యపులము మమ్ము నింద్రుండును మీతండ్రి యుపేం
ద్రుండును నిజపరివారంబులోనివారిఁగా విచారించి యీ రీతిఁ
బనిపంచి నడుపుకొనుచున్నవారు. వారిజాక్షునకు దక్షిణభుజా
దండంబునుంబోలె నఖిలకార్యంబులందు నత్యంతధురంధరత్వంబు
వహించి యున్నవాఁడవు గావున మా విధంబు నీకు విన్నవించు
కొంటి మెల్లపట్టునం దృష్టిఁబెట్టుకొని యుండునది. యేము పోయి
వచ్చెద మనినఁ బ్రద్యుమ్నుం డిట్లనియె: 47

గీ. మీరు పోయెడికార్య మెవ్వారలకును
జెప్ప రాదేమొ పోనిమ్ము చెప్పు మొకటి
యల్లయతఁ డితం డనుకొంటి రాది నెచట
నా ప్రసంగంబు రాఁ గారణంబు గలిగె. 48

క. అదియును జెప్పఁగ వచ్చిన
యది యైన నొకింతవడి ప్రయాణ త్వరయున్
గుదియింప వచ్చునేనిన్
బదరిక నిమిషంబు నిలిచి భాషింపఁ దగున్. 49

చ. అనుచు రహస్య మైనదియ యౌను భవత్పరిపృష్ట మెంతయున్
జనక నిమేషమ్ముం దడయ సంగతి గాదును మాకు నైన ని
వనఁగ జనార్దనుం డనఁగ నారయ భేదము లేదు కావునన్
విను వివరింతు మాపనియు నీదు ప్రసంగము మున్న కల్మియున్.

వ. అని శుచిముఖి యిట్టట్టు పలుకఁ గొంకి నలువంకలుఁ బాఱఁ
జూచుటయు నా చూపు వెంటనె శంబరాంతకు చూపు దీపిత్రై
కాంతకాంతుంబగుచుం బరఁగినఁ బరిజనసమానంబుగా మాన
నీయులు నాయనయున్న చోటికిఁ గడు నెడ గలుగఁ దొలంగి చని
రంతఁ గంతు నభివీక్షించి యంచచెలువ చెలువంపుం జెలువు
గులుకు కలికిపలుకులన్ గలకలత్వంబు వీనుల కపూర్వపర్వం
బగుచుఁ బర్వుచుండ నిట్లనియె: 51

క. వినవయ్య వజ్రనాభుం
డనియెడు నొకదైత్యుఁ జంప యత్నము సతతం
బును నడచుచున్నయది బహు
దినములనుండియును హరికి దేవేంద్రునకున్. 52

క. తమకంటె మున్నవాఁడే
తమమీఁదట నేమి కీడు దలఁచునో యనుచున్

మము వారు వేగు పంపఁగ
నమరాహితువీటి కెప్పు డరిగెద మనఘా ! 53

వ. అనిన విని యతండు 54

క. కటకట మనవా రిది దు
ర్ఘటముగఁ గొని యెంతచింత గావించెద రె
ప్పటి కింక నేము తా మెం
తటిపగయును దీర్ప లేమె తమయాజ్ఞ పసన్. 55

క. అకట తమ మహిమ తా రెఱుఁ
గక యో మఱి యేలొ తెగరు గాక మరుత్కం
టకుఁ బీఁచమడంపనె న
న్నొకనిన పంపినను దమ నియోగము బలిమిన్. 56

వ. అనుడు శుచిముఖి మెచ్చు నచ్చెరువు నిరవుకొన నతనిం జూచి
యిట్లనియె: 57

చ. భిదురధరుండుఁ జక్రియును బెట్టుగ దీర్ఘవిచార మింత చే
యుదురఁట దైత్యుఁ డెంతబలియుండొకదా యని కోఁచవాఱి కి
ట్లుదుటున వానిఁ ద్రుంతు నను నొక్కనిఁ బంపిన నంటి. చాలదే!
యిది నెరవైన బంటుతన మిట్టిది నీక తగుం గుమారకా! 58

ఉ. కయ్యపువేడ్క రేఁచుకొని క్రమ్మెదు తమ్మెదిరించి యేమియున్
దయ్యక కొంతసేపు పెనుదాకను జేతుల కాఁటి నిల్చువాఁ

డయ్యెడఁ బోటుబంటునకు నెంతయుఁ గౌతుకకారి గాఁదె నే
వయ్యను కేంద్రమతోడియని కాన యొనర్చుట యుక్త మెన్నఁగన్.

ఆ. తమకుఁ దామె ప్రల్లదంబునఁ బసలేని
కయ్యములకుఁ జనరు గాని తగిన
దరము లైనఁ దిప్పరుదురు తమయంతన
పిఱికికంత లేని పెరుదుమగలు. 60

వ. అది యట్లుండె నింక నీ ప్రసంగంబు మున్ను వచ్చినతెఱంగును
విన్నవించెద వినుము : 61

హంసి ప్రభావతి చక్కందనమును బ్రద్యుమ్నునకుఁ దెల్పుట

ఉ. ఇంతకమున్ను వజ్రపురి కేగుచు నుండుదు మేము గావునన్
గాంతతరాంగి సద్దనుజకన్యక నే నొకనాఁడు గంటి శు
ద్ధాంతసరఃప్రకాండసముదంచితకేలిఁ జరించుచుండి త
త్ప్రాంతలతాగృహంబున వయస్యయుఁ దానును ముచ్చటాడఁగన్

క. తిర్యగ్వనితను నన్ను న
మర్యాదానందమగ్నమతిఁ జేసె మహా
శ్చర్యముగఁ దద్వధూసౌం
దర్యం బపు డేమి చెప్ప నలినాక్షసుతా ! 63

సీ. నెత్తమ్ము లనుచుఁ గ్రొన్నెల లంచు వటఫల
శ్రీ లంచుఁ దాఁబేటిచిప్ప లనుచు

సమ్ములపోదు లంచు ననఁటికంబము లంచుఁ
బులిన మంచును సుడిచెలువ మనుచు
హరిమధ్యమం బంచు హైమకుంభము లంచు
నవమృణాళము లంచుఁ జివురు లంచు
మదనుశంఖ మటంచు మణిదర్పణము లంచుఁ
బగడ మంచును దిలప్రసవ మనుచు

శఫరు లనుచు సింగిణు లంచుఁ జంద్రఖండ
మనుచు శ్రీకారము లటంచు నఖు లటంచు
నిట్టివి గదయ్య చెప్పఁబోయిన నుపమలు
వీనిఁ దడవ సిగ్గొదవు నవ్వొలఁది నెంచి. 64

గీ. చామరంబులు వెనుకకుఁ జనుట నీల
రత్నములు పూరిఁ గఱచుట భ్రమరక మని
తేఁటి బిడ్డ పేరిడుట యా తెఱవకురుల
కధిక నీలిమ నోడిచూ హరితనూజ ! 65

క. అకలుషనీలిమ నాక
న్యక కచమున కోడి పాఱినవియై తేఁటుల్
మకరందార్థము తఱచుగ
వికచము లగుపుష్పములకె వెదకుచు నేగుఁ. 66

గీ. చంద్రభీత ఘనధ్వాంత సంచయమున
కభయ మొసఁగి వేణీభరం బను నెపమునఁ

దనవెనుక వేసికొన్నది తరుణిమొగము
చంద్రుఁ గైకొనమి కిదియ సాక్షి గాదె ! 67

క. కాంతతరఫాలసంజ్ఞిత
కంతువిజయలేఖపట్టికావిన్యస్తా
ద్యంతశ్రీకారము లన
నెంతయు నా యింతిపీను లింపెసలారున్. 68

చ. తిలకము సంహితోర్ధ్వముఖతీక్ష్ణశరాగ్రము గాఁగ నాసికాం
చలవిలసత్ప్రకోష్ఠసుమసాయకముష్టిగృహీతమధ్యశా
ర్ఙ్గలత యనన్ బొమల్ దనరఁగా నిరుగొమ్ముల వ్రేలు వెల్లజ
ల్లులగతి నవ్వుడాలు పొదలున్ మదిరాక్షి మెఱుంగుఁజెక్కులన్. 69

ఉ. అంబురుహాక్షినాసిక నిజాన్వయశత్రువుఁ జంపక ప్రసూ
నంబుఁ గరంబు గెల్చుట మనంబునఁ బెట్టి తదీయపార్శ్వయు
గ్మంబున నిత్యసేవకతఁ గ్రాలెడు నీక్షణతారకాఖ్యరో
లంబకదంపతుల్ పెనువళావళి నెంతయు సంభ్రమించుచున్. 70

ఉ. బింబఫలోష్ఠి కన్నులను బేడిసమీ లిరుదిక్కులన్ సమా
నంబుగఁ బర్వుచున్న శ్రుతినామసరోయుగశోభ లిట్టు న
ట్టుంబిరుపీఁకు సేయఁగఁ గడున్ దమి నెందుకుఁ గాక రెంటిమ
ధ్యంబునఁ బాఱెడిం బరువులారయఁ జాపల మట్టిదే కదా ! 71

గీ. కలయ నాపాదమస్తకాంగములయందు
మించి పటలీలఁ దరళతోదంచిత మగు

యువతిలావణ్యమును గన్నుఁగవయు నతను
దంటమీల చెక్కియ మనఁ దనరుఁ జూడ. 72

ఉ. ఎప్పుడు భక్తిభావమున నింపలరన్ ద్విజరాజుపాదముల్
దప్పక సేవ చేయుసుకృతంబునఁ గాంచెఁ జకోరయుగ్మ మీ
యొప్పన నొప్పుఁ గన్నులవి యోలిని గ్రోలినతేటవెన్నెలల్
చిప్పిలినట్లు మించు సతి లేనగవున్ దెలినిగ్గుఁ జూపులున్. 73

ఉ. సౌవరమాధురీస్పృహపసం బికమో శుకమో తదీయ జి
హ్వావిలసత్సరస్వతి నుపాసన చేయుచు నగ్రభూమి నిం
పావహిలంగ నేర్చి యుపహారముగా నిడినట్టి పల్లవం
బో విమలంపుబింబఫలమో యన వాతెఱ యొప్పు నింతికిన్. 74

క. ముగువ యధరంబు పగడముఁ
జిగురును బింబమును బంధుజీవకమును గ
ట్టిగ గెల్చి కన్న సత్కీ
ర్తిగతి న్నాసాగ్రమణిమరీచి వెలుంగున్. 75

గీ. మృదులపవనాహతి నొకింత గదలియాడు
పల్లవముమాటునను దోఁచు మొల్లమొగ్గ
చాలుగతిఁ బల్కుబడి మోవిచాటునఁ గనఁ
బడుచు నింతిపల్వరుస కన్భ్రాంతి పఱచు. 76

క. చెలువ పలు కమృతరసములు
గులుకుట వీనులకె కాదు కోమలదంతా

వళిరుచియను శీకరపుం
దెలినిగ్గునఁ గన్నులకును దెల్లమ చూపెన్. 77

గీ. కనకకర్ణికాధారాగ్రకాంతు లచక
బాహులతికలు బిరుదుసంపంగిదండ
లిరుగడల వ్రేలవైచినకరణిఁ బరఁగఁ
గంబువిజయము పచరించుఁ గాంతగళము. 78

క. ఖరకర కర భిన్నములై
కర మెలమి వహించు నరుణకమలంబులతోఁ
బురుడింపఁ దగునె గొజ్జఁగ
విరిఱేకుల బంతిగములు వెలఁదికరంబుల్. 79

ఆ. జిలుఁగుఁబయ్యెద యను వలలోన నా చెల్వ
గుబ్బచనుఁగవ యను కోకయుగళి
యొగయఁ జెనఁగురీతి నెసఁగుఁ గ్రేవలఁ జల
తృషలీల మెఱుఁగుఁదరఁగ లడర. 80

గీ. చారుతరనాభి యనెడు గంభీరసరసిఁ
గడఁగి క్రీడించు మరుని శృంగారరసపుఁ
జిమ్మనపుఁగ్రోవిధారనాఁ జెన్నుమీఱుఁ
బడఁతినూగారు కన్నులపండు వగుచు. 81

చ. తనుతరరోమవల్లరికిఁ దా నిరువంకలఁ గల్గు లేదు నా
ననయము సూక్ష్మసూక్ష్మముగ నజ్జలజాననకౌను మించి లో

చనముల కింపొనర్చుఁ గడుసన్నపుఁగారు మెఱుంగుఁదీగె చ
క్కని నిడుబీఁటవాఱె కనఁగాఁబడున ట్లతియత్నదృశ్యమై. 82

క. చనుఁగవప్రేఁగున గిటగిట
మనునెన్నడు మేమి యగునో యనియెడిశంకన్
గనకపుఁగ ట్టిడినాఁడో
వనజాసనుఁ డనఁగ వనితవళు లిం పెసఁగున్. 83

గీ. నెన్నడిమిపేరి మింట నన్నెలఁతబొడ్డు
పొన్నవిరి నిక్కముగఁ జూచి చిన్నఁబోదు
రభ్రకుసుమసౌరభసాధనార్థహేతు
వాశ్రయాసిద్ధ మనియెడి యయ్యలెల్ల. 84

చ. సుకవులు క్రిందుమీఁ దరసి చూడక యీ డని యాడుకొన్న హా
టకకదళీవిలాస మకటా విపరీతము గాక సాటియే
యకలుషరామణీయక సమంచితకోమల తద్వధూరుల
క్ష్మకి సరిగావ యెంత తలక్రిం దయినన్ గరిరాజహస్తముల్. 85

గీ. రమణి జంఘలు శాలిగర్భములు హీర
దీప్తిజలపూర్తి నొప్పు నందియలు మళ్ళు
వానిలోపలఁ జలువకై వచ్చియున్న
కచ్ఛపంబులఁ బోలి మీఁగాళ్ళు దనరు. 86

క. కెందామరలుఁ జిగుళ్లును
సౌందర్యశ్రీలఁ దమకు సరి గా వని యా

యిందుముఖీపాదములు నగుఁ
గందళ దుజ్జ్వలనఖాంశు కైతవయుక్తిన్. 87

శా. శృంగగ్రాహికఁ జెప్ప వేఱ తెరువుల్ సిద్ధింపమింజేసి చి
త్రాంగశ్రీనిధి నవ్యధూమణిని స్థూలారుంధతీన్యాయ మా
ర్గాంగీకారమునన్ వచించితిని జంద్రాద్యుపమల్ సూచనా
భంగుల్గాని యదస్సహస్రగుణసౌభాగ్యంబు లాయంగముల్. 88

ఉ. వెన్నెలతేటనిగ్గు నరవిందపు రేకు మృదుత్వముం బదా
ర్వన్నియ జాళువా పసిఁడిరంగు మెఱుంగులధాళధళ్యమున్
గన్నియరూపుగాఁ గరువు గట్టి మనోజుఁడు పోఁతఁ బోయఁ బో
లు న్నెఱనేర్పుతో ననుట లోకులపల్కెడి చాల దేమియున్. 89

ఉ. ఎమ్మెయిఁ బ్రజ్ఞ మీఱ వచియించెద నన్న వచింప లేన య
క్కొమ్మబెడంగులోన నొకకోటితమాంశము నైన నంతమా
త్రమ్మ మదుక్తిశక్తి యనరా దతివాఙ్మహిమాఢ్య నేను మా
యమ్మ సరస్వతీసతి తనంతటిదానిఁగ నన్ను దిద్దుటన్. 90

వ. అని తాను బ్రహ్మదేవుని రథవాహనంబైన సారంధరుం డను
హంసవంశావతంసు కూఁతురగుటయుఁ దదీయసంబంధవశంబున
నంబుజాసనురాణివాసంబునందు వాణి పెంపఁ బెరుఁగుటయుఁ
దదనుగ్రహంబునం దనకు నఖిలవిద్యలుం గరతలామలకం బగు
టయుం జెప్పి మన్ముఖంబు శబ్దసంస్కారపూతం బను బుద్ధి నద్దే
వియ నాకు శుచిముఖి యనుపే రిడియె నని యిట్లనియె: 91

చ. నలినజురాణివాస మొకనాఁడు ననుం దనచేతి ప్రోది రా
చిలుకను వాదుకుం గవిత చెప్పఁగఁ దా నియమించి యందు నా
పలుకులఁ గొంతవాసి గని భావమునం గడు మెచ్చుచు న్నఖాం
చలమున నాదుఱెక్క నులి చక్కఁగ దువ్వుచు గారవించుచున్.

చ. ప్రబలము లైన కౌతుక కృపారస వత్సలతాదరంబులన్
జబలితచిత్త యై యపుడు నా కుపమాతిశయోక్తి కామధే
ను బిరుద మిచ్చి తల్లిఖితనూపురము న్భువనైకమాత య
య్యబల మదంఘ్రిఁ దాఁ దొడిగె నాబిరుదం బిది చూడు మేర్పడన్.

క. అని నిజనూపురగత వ
ర్ణనికాయముఁ ద్రిప్పి చూపి నారాయణ నం
దన యిట్టి నాదు పలుకుల
కు నగమ్యము దనుజకన్యకోమ యూహింపన్. 94

వ. ఆ జగన్మోహనాంగిం జిత్రఫలకంబున వ్రాసి యైనం జూపెద
నం టేని. 95

క. ఏ యంగకమును భావన
చేయక వ్రాయంగ రాదు చేసిన నాసం
దాయత్తత మది చొక్కుఁ బ
రాయత్తపుబుద్ధిఁ జెలువ నలవియె వ్రాయన్ ! 96

వ. అదియునుం గాక, 97

క. అత్తరుణీమణిరూపముఁ
చిత్తరువున వ్రాయు నేర్పు చేకుఱునే నిన్
దత్తుల్యవనిత నెందే
నత్తొలువేల్పు సృజింపఁడా తనసృష్టిన్. 98

ఆ. అజుఁడె యొక ప్రసంగమై చెప్ప వింటి న
క్కాంతి యతనిసృష్టి గా దనియును
నాదిశక్తి శివమహాదేవి తనదైన
చిత్రమహిమచే సృజించుటయును. 99

క. విను విప్ర యిది సంస్కృతిపద
విని పెంచెను మాటమాటవెంబడి నెందే
ననుభవభవసంస్కారం
బున తద్బోధము ప్రసంగమున నగును గదా! 100

మ. దనుజేంద్రాంగన కంబికావరమహత్త్వస్ఫూర్తి నా లోకమో
హన జన్మించుట వింటి వెండియుఁ దదంగాలోకశ్రీప్రవ
ర్తన మూహించిన నట్లు రెంటికిఁ గడున్ దార్కాణమయ్యెన్ మనం
బున కిట్లీస్వప్నము సంస్కృతం బయిన యంభోజాతజాతోక్తియున్.

క. వినుము ప్రభావతి యనన
వ్వనితామణినామ మర్థవంత మ్మగుచున్
దనరారుచుండు ననయం
బును యదుకుల కలశజలధి పూర్ణశశాంకా! 102

గీ. ఆ ప్రభావతి తనకల నగజ వచ్చి
వ్రాసి దయ నిచ్చె నని యొక్కరమ్యపురుషుఁ
జిత్రఫలకాభిలిఖితు నెచ్చెలియుఁ దాను
గరము వేడుకఁ జూడ నేఁ గంటి ననఘ! 103

క. ఆ కన్న ప్రతిమనుద్దులు
మాఁకు మునుపు కలిమిఁజేసి మహనీయ తదీ
యాకృతి పోలుపంతయు భవ
దాకృతిఁ గని యతఁ డితండ యనుకొంటి మొగిన్. 104

వ. అని పలికి మాఁకు నిక్కడ మిక్కిలిం దడయుట యుచితంబు గాదు పోయి వచ్చెద మనుప నవధరించితే యనుచుఁ దోడి యంచలుం దాను నప్పలుఁగు చెలువ యుప్పరవీథి కెగసె నప్పు డమ్మరాళంబు లరాళంబులు గాక యాకాశభాగంబున గమన వేగంబునం దీగ సాఁగినబాగు మెఱయు నిజగరుత్కనకరేఖా మయూఖంబు లాఖండలారిదిక్కునను నక్కజంపుఁబెలమిం గొనలు వాఱి యుద్దీపించు ప్రద్యుమ్నప్రతాపవైభవంబునుం బోలెఁ జాల నాలోకనీయంబు లగుచుండఁ దత్పురస్సర తదీయకీర్తి మూర్తివిశేషంబులో యన సోయగంబున మీఱి గగన మంతయుం గబళించుటకు నొక్కకడకు నొత్తుకొని పోవ బారలు చాఁచిన చందంబున నిష్పందప్రసారితంబులైన తనూరుహాంబులతోడం జూడ నొప్పారుచు నప్పటప్పటికి నవిరళధవళిమస్పర్ధ నుభయ పార్శ్వభాగపాండురబలాహకంబుల నహంకృతి పెక్కువ నొక్క

పెట్ట కలహించుటకుం బిలుచుభంగి సంఘటిల్ల నుల్లసిల్లుపక్ష యుగళవిక్షేపవ్యాపారంబులచేత నుద్యోగించుచు నొక్కొక్క యెడఁ బ్రకీర్ణోడ్డీనసండీనయానభేద వినోదంబులాచరించి రోదోం తరంబంతయు నెంతయుం గలయ మలయు తమ యమలంపుఁ దెలి దళుకుఁ జలికి యది మలయజంపుఁగలయంపిచెలువు నలవరింప నందుఁ గుందనంపురంగవల్లికామతల్లికల యుల్లాసంబు వెల్లి గొలుపు గరుదంతకాంతివల్లరులచేత నతిశయిల్లుచు నొక్కొక్క చోట నొంటొంటిసందున సందర్శనీయంబు లగు నభోవిభాగం బులవలన నస్థానభాను సంభవాసంభేదసంభృతశబలతావిలాస భాసురసురాపగా ప్రవాహసందేహకందళనంబులకు ననుగుణం బయినపరపున నిడుపోఁజులు గట్టి యిట్టట్టుచెదరక చదల నడ చుచు వజ్రపురంబు చేరి తొంటియట్ల సకల జలాశయంబుల విహరించు చుండె నందు శుచిముఖి కన్యాంతఃపురసరోవిహార సమయంబుల 105

సీ. జలఖేలదంగనాకలకలంబులకు మి
క్కిలి దవ్వ వాఁలక నిలిచి నిలిచి
పడఁతు లొక్క రొకళ్ళపైఁ జల్లు జలబిందు
లొడలు సోఁకినఁ బోక యోర్చి యోర్చి
యోలలాటలతమి నొండొరుఁ దఱుము చె
ల్వాలఘాక కులుకక మెలఁగి మెలఁగి
లీలావతీహస్త లీలాబ్జ కేసరం
బులకును బసి గొంచు మలసి మలసి

క్రమముతోడ దనుజకన్య కాంతఃపుర
కాంతలకును వెవర కింతనంతఁ
జేటికలఁ జరించు టారూఢిఁగా నల
వాటు చేసికొనియెఁ బాటవమున. 106

ప్రద్యుమ్నుఁడు ప్రభావతి చక్కఁదనముఁ దలఁచి సంతాపించుట

శా. ప్రద్యుమ్నుండు ప్రభావతీరుచిరరూపబ్రహ్మముఞ్ హంసయో
షిద్వాక్యార్థధురీణ వాగుపనిష త్సిద్ధాంతమార్గానుసా
రోద్యత్ప్రజ్ఞను బల్మఱుఞ్ మననసంయుక్తంబు గావించుచుఞ్
ధ్యాస్యం బై యది యంతకంత కలరఞ్ నిల్పెం గడుం జిత్తముఞ్.

సీ. కనెఁ బొద్ద నున్నవారిని వీరు వా రని
కనినఁ దదర్హ వర్తనలు మఱచు
వినఁడు చెప్పినపల్కు లేమియుఁ జెప్పక
వినిన నే మే మంటి రనుచు నడుగుఁ
జనఁ జెత్తు లిడక మజ్జనముఖ్యవిధులకుఁ
జనినఁ దబ్బిబ్బుగాఁ జలుపుఁ గ్రియలు
కొనఁడు నానాసేవకులసేవ లెవ్వియుఁ
గొనినవిన్నాటుగాఁ బనులు పనుచు

శుచిముఖీవాక్యదర్పణస్ఫురిత నిరుప
మాన దనుజేంద్రకన్యకామణి మనోజ్ఞ
రూపరేఖావిలాససంరూఢ మైన
యాత్మ మరలింప నేరక హరిసుతుండు. 108

శా. ధీమంతుండు పటుప్రతాపనయమైత్రీ నిత్యసన్మిాభవ
త్సామంతుండు సుకీర్తిమౌక్తికమణిస్రగ్భూషితాశావధూ
సీమంతుండు విపక్షమంత్రిముఖరాజీవప్రభోచ్చాటనా
హేమంతుండు నిజస్తవానుకలనాప్రీమంతుఁ డత్యంతమున్. 112

క. అబ్జాంబావరుఁ డఖిల క
కుబ్జాంధవరమ్యకీర్తికుఁడు నలినీ ప
త్రాబ్జిందుసమప్రకృతి
క్షుబ్ధోధమయాత్మతత్త్వకోవిదుఁడు మహిన్. 113

తరల. కుముదబంధునిభుండు పింగళిగోంకమంత్రి యశఃకథా
సముదనల్పసభుండు వైదికశాస్త్రసింధునిరంతర
ప్రమథనాత్తశుభుండు సంతతభక్తియుక్తి సమర్చిత
ప్రమథలోకవిభుండు విత్తనిరంకుశప్రతిభుం డిలన్. 114

గద్యము.

ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగిత కవిత్వవైభవ పింగళి
యమరనార్యతనూభవ సౌజన్యగేయ సూరయనామ
ధేయ ప్రణీతంబైన ప్రభావతీ ప్రద్యుమ్నం
బను మహాప్రబంధంబునందు

ద్వితీయాశ్వాసము.

---

శ్రీ

# ప్రభావతీప్రద్యుమ్నము

## తృతీయాశ్వాసము

క. శ్రీమద్భక్తివిశేష
స్థేమా విశ్రాంతవిహితశివతత్త్వకథా
మీమాంసుఁడు పింగళియమ
రామాత్యవతంసుఁ డపరహంసుఁడు దీప్తిన్. 1

వ. హరికుమారుం డొక్కనాఁ డేకాంతవర్తియు హస్తవిన్యస్తగండస్థలుండు నగుచు నిట్లని తలపోయం దొడంగె. 2

చ. కలుగు నొకో కనుంగవకుఁ గాంతఁ గనుంగొను భాగ్య మొక్కెడన్
గలిగెడుఁ దత్పురంబు చొరఁ గల్గియు దొడ్డఁట చొచ్చి చూడఁగాఁ
గలిగిన నవ్విలాసవతిఁ గౌఁగిటఁ జేర్పక యోర్చు టెట్లు నా
తలఁపుబడిం బదాత్మయును దాకొన నెట్లది సంఘటిల్లెడున్. 3

చ. శుచిముఖిమాట యొం డరసి చూడఁగ నెంతయు నాసపాటొన
ర్చుచు మదిఁ ద్రిప్పుచున్నయది చూడ్కికి నన్నునె పోలువాని నా

రుచిరతరాంగి చిత్రరువురూపొకటిన్ రహిఁ జూడఁ జెప్పెఁ ద
ద్వచనముచొప్పు నేమి నియతంబు సమాకృతు లెందుఁ గల్గవే. 4

చ. ఇది పదిలంబుగా నడుగ కే నవు డక్కట! కోర్కె దాఁచి వ
ట్టి దొరతనంపునీటు ప్రకటించితిఁ బాపపులజ్జ నన్ను నో
రదిమె ననాదరంబు తెఱఁగై యది హంసికిఁ దోఁచెనేమొ ని
ల్వద మఱి యించుకైన గఱున ల్చవిగానికథ ల్వచింతురే. 5

ఉ. ఏ నొకయించుకంత మన సిచ్చిన మాటలు పల్కకుండఁగాఁ
గాని మరాళి యద్దనుజకన్యకకై నను నొత్తిచూచి యే
మైన ననంగఁ బూను నని యాత్మకుఁ దోఁచుచు నున్న దిప్డు కా
దేని ప్రసంగముం దిగిచి యేల నుతింతుఁ దదీయరూపమున్. 6

మ. అటుగా కద్భుతరామణీయకగుణాఢ్యం బైన సద్వస్తువున్
బటువాచారసికు ల్ప్రసంగ మయినన్ బారంబు ముట్టన్ రసో
త్కటతం జెప్పక మానఁ జాల రనుపక్షం బొందు భావించినన్
ఘటియిల్లు న్వనితాంగవర్ణనకు నిక్కం బన్యథాసిద్ధియున్. 7

చ. హరియును వాసవుండుఁ దము నంపిన కార్యము హంసి తాన యై
ధరణికి డిగ్గి చెప్పి మదుదగ్రమనస్స్థితిఁ గాంచు నెన్న నా
సురరిపుఁ జంప నన్నునుపుసుద్దులు పుట్టఁగఁ బోలు నెల్లెడన్
సరసిజనేత్రుదక్షిణభుజంబవు నీ వని పల్కినందునన్. 8

ఉ. అన్నియు నేకవాక్యముగ నారయ నాసలు పెంచు పక్షమే
యున్నది కొంతమించి యిది యోజన సేయఁగ నాదురూపె యా

కన్నియచేతిచిత్రఫలకంబున నున్నది యెవ్వ రట్టిచో
నన్ను నెఱింగి వ్రాయ ననిన౯ శివ వ్రాయుట వింటిఁ జొప్పడ౯.

సీ. శివ నన్ను వ్రాసి యిచ్చినపక్షమునను లే
ఖననిమిత్తము వేఱ కలుగునొక్కొ
కలుగ దంతఃపుర కన్య కిట్టిది భర్తృ
పరతఁ జక్క ఘటిల్లు టరుదు గాన
నది యట్ల యైనను దదభీష్ట యువ పరీ
క్షామాత్రఫలకమై జాఱు నొక్కొ
జాఱ దీశ్వరి యిచ్చె సత్కృప నని బాల
వేడ్కఁ జూచుటఁ జెప్ప వింటిఁ గాన

నిట్టిగతిఁ జెల్వ నుమ వెడ్డుపెట్టునొక్కొ
పెట్ట దది దా సృజించినబిడ్డ గాన
బొం కగుచు నంత కిదియ త్రోపువడు నొక్కొ
పడ దజుఁడు చెప్పె నని వినఁబడియెఁ గాన. 10

చ. మును తనసృష్టికామి నలుమోములవేలుపు చెప్ప వింటి నే
ననుచు మరాళి పల్క నపు డక్కట! యే నడుగంగ లేన యే
మని ననుఁ దిట్టుకొందు నజుఁ డట్టిప్రసంగపువేళ నవ్వరా
ననను విభుం డితం డనెఁ డన౯ వినఁబడ్డది యేమి గల్గెనో. 11

ఉ. వావిరి నవ్విలాసవతి వార్తలపట్టున నెన్ని యెన్ని ప్ర
శ్నావసరంబు లైన నొక యర్థము నే నడుగంగ లేమి ని

ష్ఫావిముఖుం డితండని ప్రసంగమువచ్చిన నూర కుండు నే
మో వరటాలలామ యిఁక ముద్దియసన్నిధి నేమి సేయుదున్. 12

ఉ. పోవునొకో సరోజముఖిపొంతకు నిం కొకమాటు హంసి దా
నావలనం దదిష్టవచనం బొకఁ డేర్చఁ గొనిపోవఁ గానమిన్
బోవుట నిష్ఫలంబనుచుఁ బోక యె మానునొ కాక పోవునో
దైవతకార్యభారమును దద్వశమైనది కొంత గల్గినన్. 13

క. తరుణికడ కంచ యేగతి
నరిగిన నాస గల దది మహామతి నా యాం
తరగతిఁ గనదే వినదే
ధర 'నప్రతిషిద్ధ మనుమతం భవతి' యనన్. 14

క. ఏ పనియు లేక యుండిన
నా పడఁతుకఁ జూడఁ జనక హంసి నిలువ నె
ట్లో పెడును దానిఁ జూచినఁ
జూపఱకును వశమె తిరుగఁ జూడక యుండన్. 15

క. అని భావనాబలంబున
మనమున ఘటిత మగు మగువ మధురాకృతి య
క్కునఁ జేర్పఁ గడఁగి తత్తఱ
మునఁ గానక వెగడు పడుచు బొదలు విరాళిన్ 16

వ. ప్రొద్దుగడపుట తద్దయు భరం బగుడు నుద్యానంబునకుం జనియె
నప్పుడు. 17

సీ. నిబిడంపుజిగిఁదోడ నిండుపూఁగుత్తులు
బిగువుపాలిండ్ల యొప్పిదము నెరప
నునుఁగెంపు గ్రక్కు నూతనపల్లవంబులు
కరతలంబుల సోయగంబుఁ దెలుప
నెలమిఁ బర్వెడునట్టి యెలదీఁగియల సొంపు
సుకుమారబాహువిస్ఫురణ జరపఁ
గడుఁ జేరెములువాఱు గండుఁదుమ్మెదచాలు
కడకంటిచూపుల బెడఁగు నడప

విరులతెలిడాలు చిఱునవ్వుసిరులఁ జిలుక
మధురసపు నిగ్గు లావణ్యమహిమ గులుక
నతని చూడ్కికిఁ జూడ నుద్యానభాగ
మంతయుఁ బ్రభావతీమయం బగుచుఁ దోఁచె. 18

ఆ. యువతిపై విరాళి యొక్కింత మఱతునో
యనుచు నాస నేగి యచట నతఁడు
మఱచెఁ దదితరంబు నెఱయంగ నిది సుమీ
యొకటి కోర వేఱొకటి యగుట. 19

వ. అతం డివ్విధంబునం బ్రభావతీవిభ్రమభ్రమవశంబున లతలతఁ
దప్పకుండఁ గదియం జనుచు 20

సీ. తరుణికెంగే లంచుఁ దమిఁ బట్టి కటకటా
చిగురాకె యిది యంచుఁ జిన్నవోయి

వెలఁదిపాలిం డ్లంచు వెస సంకి చెల్లఁబో
పూగుత్తులే యంచుఁ బొలుపు దఱిఁగి
చెలువపయ్యెద యంచుఁ జేసాఁచి యయ్యో ప
రాగోదయమె యంచు రహి దొఱంగి
రమణి వేనలి యంచు రతికాంక్ష నొడిసి హా!
తేఁటిమొత్తమె యంచుఁ దెల్లఁబాఱి

యకట! యనిమిత్తకృపఁ దాన యరుగుదెంచి
హితవు నెరపెడిహంసితో హృదయ మిచ్చి
పలుకని కృతఘ్నునకుఁ బ్రాప్త మగునె
యట్టి యువతి పొందనుచుఁ దానాత్మఁ గుందు. 21

వ. అంత నంతర్గతంబున 22

గీ. ఉవిద నాకుఁ బ్రాపించు టటుండ నిమ్ము
హంసి నీక నొకమఱి చూడ నబ్బునేని
నాదు కన్నులు కన్న లెన్నంగ నేన
యగ్రగణ్యుండ ధన్యాత్ములందు నెల్ల. 23

ఆ. వచ్చునొక్కొ సురారివార్త చెప్పఁగఁ దాను
వచ్చి కడలఁ బోక యిచ్చటికిని
దెచ్చునొక్కొ ప్రభావతీక్షేమవృత్తాంత
మాత్ర మయిన నంచమగువ నాకు. 42

చ. వినుకలిచేతనే విరహవేదన నా మది నింత వర్ధిలెన్
గనుకలె నట్లు చిత్రఫలకంబునఁ గాంచినయింతి నెమ్మనం
బునఁ గనుఁ గొంత నెంత పరిప్రాప్తిని వహించెనొ యెంత నొచ్చెనో
ఘన మని వింటిఁ జిత్తరువుఁ గన్గొను ప్రేమయు నేమి సేయుదున్.

ఆ. అందువిూఁద హంసి యరిగి నాతోడఁ దా
మాట లాడుటయును మద్విధంబుఁ
దెలుప నాస లేమిఁ దలపోసి యెట్లౌనొ
చెలువ యకట యేమి సేయువాఁడ. 26

మత్తకోకిల. అంచ తొయ్యలి దేవతాపతియానచొప్పానరించి యే
తెంచు టెప్పుడొ దానిచేత మదీయహృద్గతిఁ జెప్పి యేఁ
బంచు టెప్పుడొ గావున న్వెసఁ బత్రికన్ లిఖియించి యా
యంచ కిప్పుడు పంచెద న్సతి కంత దెల్పెడు నట్లుగాన్.

వ. అని తలంచి యాక్షణంబ శుచిముఖిపేర లేఖ వ్రాసి యిది గొంపోవు
వా రెవ్వ రని నివ్వటిల్లెడుచింత నంతరంగంబు గలంగ నుద్యాన
మధ్యంబునకుం గ్రమ్మఱ నరుగుదెంచి యత్తఱి నుత్తరంబు చనువా
ని నెల్ల నుద్దేశించి తద్దయు దుర్గమం బైన విరహార్తి కతనవార్తా
హారణయోగ్యాయోగ్యవివేకంబు లేక యిట్లనియె: 28

సీ. కృప నెఱిఁగింపరే కీరోత్తమములార
వజ్రపురికిఁ బోవువారె మీరు

సదనుగ్రహమునఁ దుమ్మెదలార చెప్పరే
వజ్రపురికిఁ బోవువారె మీరు
కరుణతో వినిపింపఁ గదరె కోయిలలార
వజ్రపురికిఁ బోవువారె మీరు
తెలుపరే దయఁ జూచి మలయవాయువులార
వజ్రపురికిఁ బోవువారె మీరు

చలువ లొసఁగెడు మేఘరాజంబులార
యమలపక్షతి నొప్పు రాయంచలార
నిలిచి నా మాటలకు మాఱు పలుకరయ్య
వజ్రపురికని బోయెడువారె మీరు. 29

క. అని పలుకుచున్న సమయం
బున నొక శుక మభ్రమార్గమున నేగుచు నా
తని దీనాలాపంబులు
విని కారుణ్యమున నిలిచి విస్ఫుటఫణితిన్. 30

ఆ. ఏను వజ్రపురికి నేగెడుదాన నా
వలనఁ గార్య మేమి కలదు నీకుఁ
దెలుపు మొకటి రెండుపలుకుల ముగియఁగా
ననుచుఁ బలుకఁ టయును యాదవుండు. 31

సీ. ఓ పక్షివర ! విను మాపురి శుచిముఖి
యను పేరి యొకరాజహంసి యుండు

నది యున్నచోటు నీ వరసి యీ పత్రిక
యందింపవలయు మత్ప్రార్థనమున
నన విని యాచిల్క యట్ల చేసెద నహో
యంబు పోయెద మాట లాడ నాకు
తే. దవకాశంబు లేశమాత్రంబును
నాకు పక్షంబులనడుము లేఖ

మొరుల కెఱుకపడక యుండునట్లుగఁ గట్టు
మతిరయంబుతోడ ననుచు నతని
దంప కరిగి నిలిచెఁ దడయు కాతఁడు నట్లు
చేసె నదియుఁ జనియె శీఘ్రగతిని.

వ. అంతకు మున్ను శుచిముఖియును నుచితప్రకారంబున నట్లు తన బలఁగంబునుం దానును దానవాంతఃపురకామినీ సమీపసంచార పరిచయంబు సంపాదించుకొనుచుం గ్రమంబునం బ్రభావతితోడి చెలిమి గలిగించుకొనుటకుం దఱి వేచి యుండుఁ గావున నది గని పెట్టుకొని యుండ నొక్కనాఁ డక్కలకంఠి తోంటి సరసి పరిసరంబునం దమందకందర్పతాపశమనార్థంబుగ రాగవల్లరి యను నెచ్చెలియుం దానును వచ్చి వనవిహారంబు సలిపె నప్పుడు

ప్రభావతి చెలికత్తెతోఁ బూలతోఁటలో విహరించుట

సీ. అతివ మందస్మితద్యుతి ప్రసాదంబున
విరులపొండిమ యభివృద్ధిఁ గాంచె

సతికటాక్షశ్రీలసాహాయ్యకమునఁ దు
మ్మెదపిండుచెలువ మభ్యుదయ మొందె
జలజాక్షికరతలచ్ఛవి యనుగ్రహమునఁ
జివురుఁగెంజాయ పుష్టిని వహించెఁ
దరుణినిశ్వాసగంధముప్రోది మలయవా
యువుల నెత్తావినైభవము చెందె

నవి లతాంగికిఁ దోడ్తోన యార్తిఁ బెనిచెఁ
బాటిలదె రజోమాలిన్యపల్లవత్వ
చాపలంబుల కాధార మైన పరఁగెడు
వారికిని మే లొనర్చినవారి కెగ్గు. 34

సీ. విరహిరక్తముతోడి పరునిబల్లెము లన
నెల్లెడ వెలసిల్లుపల్లవములుఁ
బాంథమేదస్స్నేహభరితకామాస్త్రాళి
నా నొప్పు సరసప్రసూనములును
భావజు మిడివింటఁ బాఱునీలపుగుండ్ల
భంగిఁ జరించుపుష్పంధయములుఁ
జేతోజబలసముద్ధూతఘూర్ణి యనంగ
రాజిల్లుసుమనఃపరాగములును

ననమసాయక జయబిరుదావళీ ని
పాఠ వరవందిజనఘనార్భటి యనంగఁ

గడు విజృంభించుశుకపికకలకలములు
నెలఁతకును గుండెదిగులు జనింపఁజేసె. 35

వ. ఇవ్విధంబున నయ్యింతి చింత్యమానకంతుసంతాప యగుచు రాగవల్లరిం జూచి యిట్లనియె : 36

మ. అకటా! యిట్టిక ప్రొద్దు పుచ్చుటకు నేనాయంత విలోకింప నా
క కడుం జాలు వనాంతకేళిక మిఁకం గోన్నారి మాత్సాపినా
యకటా రూపంబును జూచు చుండుటయె మేలౌ మీఁద ద్భావ్యథా మం
బిక యొక్కర్తె యెఱుంగుఁ బద్మలకియున్ బింబోష్ఠి చేవే నగన్.

వ. అని చెప్పించి యప్పలకయందు నాత్మ సంకల్ప వాసనావిశేష వశంబున ననేకవిధశృంగారభావచేష్టావిశిష్టంబుగ గనుపట్టునట్టి లిఖిత రూపు యదుకులప్రదీపు నెదుటనుండియుఁ బ్రేక్షించియు నిర్నిమేషయయ్యు నిమీలితాక్షియయ్యుం గొంతదడ వనేకభావంబు లావహిల్లం జూచి చూచి 38

చ. అనయము దృష్టి గావలయు నంచు నజస్రము నెంత చూచినన్
గనుఁగవ కంతకంతకును గాటముగా నొకవింతవింత యిం
పు నెరపు చున్ననుం దరలి పోవఁగ నీదిక నోర్వఁ జాల నే
ననుచు రసోద్ధతిం గదియ నక్కునఁ జేర్చె నిజేశురూపమున్. 39

గీ. చేర్చి యొక్కింతతడవు నిశ్చేష్ట యగుచుఁ
జొక్కి కనుఁగవ యఱమోడ్చి శోభనాంగి

యంతఁ జిత్రరూపము మదియందుఁ దోఁపఁ
గ్రమ్మఱఁగఁ బుచ్చి కనుఁగొంచుఁ గాంక్ష లడర. 40

ఉ. ఇట్టిమనోహరాంగుఁ డొకఁ డెందయినం గలఁడేని కల్గియున్
గట్టిగ నా కతంబు బిగికౌఁగిటఁ జేర్పఁగ నబ్బునేని నే
నిట్టటు కొంచిన న్విడక యిష్టవిహారము లెల్ల బల్మిఁ జే
పట్టి యొనర్చునేని రసభావము లెట్టివి యొక్కొ యత్తఱిన్. 41

క. అని యువ్విళ్ళూరుచు మది
ననయముఁ దలపోయు నుస్సు రనుఁ గాంతాళం
బునఁ దొరలు నిట్టు విరహం
బునకోర్వక యవ్వధూటి బోటిం బలికెన్. 42

క. ఉమసేవ యేను సలిపెడు
సమయంబునఁ గర్తృకర్మసాధన వైగు
ణ్యము లేమి గలిగెనో యి
ట్లమితవ్యథఁ దెచ్చి పెట్టె నాయమ నాకున్. 43

క. ఇటు గాక లోకముల నిం
తటిచెలువుఁడు గలఁడె కలిగినను నుబ్బదె యి
చ్చట నచ్చటఁ గలఁ డని య
క్కట నన్నిట్లేఁచు టంబకరుణ తెఱంగే. 44

సీ. అని పల్కు పలుకు లాయవసరంబునఁ దత్స
మీపంబునం దనురూపగతిని

శుచిముఖి సంచరించుచు విని యిత్తన్వి
చిత్తంబు వడసి యేఁ జెలిమికలిమి
హత్తించుకొనుటకు ననుగుణంబగువేళ
యిదియ యటంచు నూహించి మదిని
దగు నుపాయంబు వితర్కించి యప్పుడు య
దృచ్ఛనపోలె నాతెఱవ యెదుట

నడ్డముగ నల్లనల్లన యరుగుచు సవి
మర్శదృష్టిని బలుమఱు మరలి మరలి
చిత్రఫలకంబువంక వీక్షించెఁ గొంత
సరి గడచుదాఁక నొకవింతసరణి మీఱ. 45

క. అప్పు డమ్మరాళిచందం
బుపలక్షించుచుఁ గపోలయుగ్మము వరహా
సపుఁగాంతిఁ దనరఁగా నా
చపలేక్షణ తనదుప్రాణసఖి కిట్లనియెన్. 46

క. కలుదులఫులుఁ గిదితా నే
మెఱుఁగునొకో తిరిగి తిరిగి యీ ఫలకముపైఁ
బఱపెడుఁ జూడ్కుల నా నా
మెఱుఁగుంబోఁడికి మరాళి మృదుమధురోక్తిన్. 47

వ. ఇట్లనియె 'నో పడంతీ నీపలికినట్లు మాయట్టి తిర్యగ్జంతువు లేమియు
నెఱుంగమి యథార్థంబ యైనను నేను నీచేతిచిత్రఫలకం బ్రబపడి

చూచుటకుం గారణంబు వినుము మున్నొక్కచోట నొక్క పురుషుఁ జూచి తత్సమానరూపుని మఱియెందునుం గానక యిప్పు డిందు నతనికై వడి దోఁచిన నిది తదీయరూపం బెఱింగి వ్రాసిన తెఱంగో యటు గాక యట్టివాఁడె వేఱొక్కఁ డెక్కడ నైనం గలిగెనో యని యించుక విమర్శించి వీక్షించితి' నన విని ప్రభావతి యద్భుతప్రమోద సందేహంబులు డెందంబునం గ్రందుకొనుచుఁ గదలింప సఖులకుం దప్పక చూచి యిట్లనియె: 48

శా. ఏ మేమీ యిఁక నొక్కమాటు చెపుమా యీవున్నరూపిట్టిదో
యేమైనం గలదో విశేష మిటు లవిన్మ్రక్షింపు మింకన్ వచ
స్సామర్థ్యం బరయన్ మహాత్మ యని యస్మద్బుద్ధికిం దోఁచె దా
హా! మా భావము గాన లేనె మదిలో హంసీ! భయం బేటికిన్.

వ. అనిన నది మదిరాక్షిఁ వీక్షించి యిట్లనియె : 50

క. నీ వనినయట్ల యేను భ
యావహములు గానివారి నాకృతిన కనం
గా వలఁతి నైన నఁ బిలువక
యేవెట్టిన చేర నిరువు రేకతమాడన్. 51

వ. అనిన వెఱఁగంది యా యిందుముఖి సఖియునుం దానును నొండొరుల మొగంబులు చూచి నగుచుఁ జెవులకుం జవులు మిగుల నలవరించు కులుకుమెలుంగు గల కలికి పలుకులకై వలచి మొలచు కుతుకంబున నతివశంవదహృదయలై తమ కిద్దఱకుం దాని పెద్ద

బుద్ధులు సుద్దులు మున్గు రప్పించుచుం దద్దయు నుద్దీపితరాగంబు
లగుచుండ రాగవల్లరి యాగఱువతనంబులాగు లే గరితలందును
మున్ను కన్న విన్న యవియె దీని కఱుదు లెంత యరుదులు
చూచితే యంచు నాయంచపై నాదరాహ్లాద మెదుర నిరీక్షణం
బుల నీక్షించి యో పక్షికులభూషణంబ నీ భాషణంబు నిక్కంబ
మిక్కిలి నక్కఱ పడి వేఁడక ప్రోడ లగు గఱువ లిరువు రేకాంత
మాడుచోటికి కేటికిం బోయెద రిది యట్లు గాదు గదా యే మొక్క
సందియంబు నివర్తించుకొనం గోరి యిత్తెఱి నత్యంతప్రార్థనంబు
గావించు చున్నవారము గావున నీ కన్న యప్పురుషుని యొప్పు
నిప్పలుకపై వ్రాసినరూపంబు చొప్పున నొక్కటి యగునో కాదో
యీ దండకు వచ్చి నిచ్చలంబుగాఁ జూచి నిశ్చయించి చెప్పు
మిప్పుడుచు నేను నిట్టివాఁ డెందును లేఁడు కలండను వివాదం
బునం బన్నిదంబు చఱచినారము. • 52

క. అనుటయుఁ బండెను కొఱకై
నను వేఱొకపనికై నైన నాకడ తెలియం
బని గలదె మీకు నాచే
వినవలసినయర్థ మరసి వినిపింతుఁ దగన్. 53

గీ. అనుచు శుచిముఖి తనమాట కాపడంతు
లీక్షితాన్యోన్యవదన లై యెంతదూర
మరుగుచున్నది దీనివాక్యాశయ మని
మివ్వుల వెఱఁగందఁ గొంత చేరువకుఁ బోయి. 54

క. సవిమర్శదృష్టి నాటిత
క విధాన మొకింత నడపి కడుఁ బదిలముగా
వివరింప నతని రూపము
యవ్వనో నది యిందు సందియము లేదనియెన్. 55

చ. అనుటయు రాగవల్లరి మహత్తరమోద విశేషసంభ్రమం
బునఁ బఱతెంచి యప్పలుఁగుముద్దియఁ దద్దయు ముద్దు గారవం
బును జిగురొత్త నెత్తుకొనిపోయి ప్రభావతిదండఁ బెట్టి యొ
య్యనఁ గొనగోళ్ళఁదత్తనురుహంబులు దువ్వుచుఁ గూర్మినిట్లనున్

ఉ. అంచవు గావు నీవు నను నారసిప్రోవఁగ మూర్తి మత్త్వముం
గాంచిన భాగ్యదేవతవు గాని మదుక్తి తెఱంగు నేఁడు గె
లిపించితి వే జగంబునను లేఁ డిటువంటి మనోహరాంగకుం
డంచుఁ గలంచు నిజ్జలరుహానన మానక నాదు చిత్తమున్. 57

వ. అనిన విని ప్రభావతి నిజవయస్యం జూచి 58

గీ. రాగవల్లరి! నీ వేల వేగిరించె
దింతమాత్రంబ చాలునే యీప్సితార్థ
సిద్ధి కతని లక్షణము లీ చిత్రమూర్తి
యందు నేమైనఁ గల వేమొ యడుగవలయు. 59

వ. అనిన విని యా హంసి యా చిత్ర రూపంబు నిరూపించి ప్రభావతి
నుద్దేశించి యిట్లనియె :

ఉ. ఆరయ నింక నే మఱిగె దల్లవె యాతఁడు శంబరుం ద్రిలో
కారిని ద్రుంచునప్పటి ప్రహారకిణంబు లురంబునందు నా
హా! రతికంకణాంకములు నల్లవిగో మెడయందు వీరశృం
గారకళాఘన్య సి ల్లితని గట్టిగ నెవ్వ రెఱింగి వ్రాసిరో ! 61

వ. ఈ లక్షణకథనంబుచేత నతని నామజాత్యాదు లత్యంత ప్రసిద్ధం
బులు మీరు మీయంతనె యెఱింగెదరు గావలయు నంతఃపుర
వాసినులు గావున నెఱుంగరో యని యెఱింగించెద నంటినేని 62

చ. ఎనయఁగ నెవ్వ రెంత మన సిచ్చి వచించిరి తాను వారితోఁ
బనువడ నంతమాత్రఁ బ్రతిభాషణ మాడుట యుక్త మంద్రు మీ
కొనరఁగఁ బన్నిదంపుగెలుపోటలు దీర్పఁగ నిప్పు డేను జె
ప్పినదియ చాలు నింకఁ దలపెట్టుట చెల్లద యెక్కు డేమియున్.

గీ. నీవ కద ప్రభావతి యన నిన్ను మున్ను
తరుణి నేవింటి రాగవల్లరియె బోటి
పేరు నీ విప్పు డన వింటి మీ రిరువురు
నీ యెఱుక మఱచెదరు సూ పోయి వత్తు. 64

ఉత్సాహ. అనుచు గగనభాగమునకు నంచ యెగయఁజూచినన్
దనుజకన్యకా లలామ తనదు రెండుచేతులన్
వినయ మొప్పఁ బొదుగఁ బట్టి వేనవేలభంగులన్
దనరఁ బ్రియము చెప్పుచును ముదంబెలర్ప నిట్లనున్. 65

సీ. నిద్దంపుఁ బండువెన్నెల గాయు చెక్కుల
యొప్పు చూడఁగ నొక్క యుత్సవంబు
మెఱుఁగుదీఁగెల బాగు మించు పళికాంత హా
టకరేఖ లరయ నొండొక ప్రియంబుఁ
గమనీయమగు మహా గమనగాంభీర్యాది
విలసనం బీక్షింప వేఱె యింపు
మాధుర్యధుర్య కోమల వచనామృతం
బనుభవింపఁగఁ గౌతుకాంతరంబుఁ

గలుగఁజేయుచు నువ్విళ్లు గొలుపు నీదు
సంగతి యొకింత గని యెట్లు జాఱవిడుతు
నింక రాగవల్లరిపేరు నీవు నిజము
ననఁగ నీతో నొనర్తు నెయ్యంపుఁ జెలిమి. 66

ఆ. ప్రణయమొప్ప మిగులఁ బ్రార్థించుచున్నట్టి
నన్ననుగ్రహించి నాదుచెలిమి
కొడఁబడంగవలయు నో హంసభామినీ !
యనుచు వేఁడుకొనఁగ నంచ పలికె. 67

ఉ. ఇప్పుడు నీవు చెల్మికిని హేతువుగాఁగ గణించినట్టి నా
యొప్పును గిప్పుఁ డా నెచట నుండు రహస్యవిచారవిఘ్న మా
యెప్పుడు నీకుఁ దోఁచె నపు డింతయు రోసెదు దీనిచేత మీ
యిప్పటి మంతనంపుఁబని యేమఱ కంపుఁడు పోయివచ్చెదన్. 68

వ. అనిన విని రాగవల్లరి హంసీమతల్లికం జూచి యిట్లనియె : 69

క. పోయెదఁ బోయెదనం చి
ట్లో యంచలతల్లి ! యేల యుద్ఘాడింపన్
మా యేకాంతపుఁ బనికిని
నీయునికి విరోధిగాదు నిర్వాహకమున్. 70

వ. ఇదే నిమిత్తంబుగా సఖ్యంబు గావలయు నని ప్రార్థించెదము గాని కేవలంబైన తావక రామణీయకంబునన కాదు నీదుపలుకుం దెరువులు పరికింప నిది నీవును దెలియుట విస్పష్టంబ యైనను శుద్ధాంతస్థితిదోషంబునంజేసి యే మయి యీ మాట మాటుపెట్టక గొబ్బునం జెప్పనేర కున్నవారము చెప్పి వేఁడికొనక యే పనికిని నీవు చొరవమి మొదలన పదిలంబుగాఁ దెలిపినదానవు గావున 71

ఉ. వట్టిమఱుంగు పెట్టి నుడువం బని లే దది యెల్ల భేరి జో
కొట్టుట కాక నిన్నెలువఁగూడునె మాటల నీవు గంటి న
న్నట్టి శుభాంగుఁ డీ రమణియాసల కాస్పద మిప్పు డాతని
న్నట్టిగ నన్వయాది కథనంబుగఁ దెల్పి యనుగ్రహింపవే! 72

గీ. ఇప్పు డిది చెప్ప కెడ సేయు టేల తాంగిఁ
బ్రాణ సంకటపఱుచు టో పక్షిరమణి!
కావునను గావవలయు శీఘ్రింబ చెప్పి
వెనుక నెఱిఁగింతు నీకు మా వృత్తమెల్ల. 73

వ. అనిన శుచిముఖి వచన వక్రిత చాలించి యిట్లనియె : 74

ఉ. అంతిపురంబు కన్యలఁట యాత్మ తెఱం గభిధాప్రయుక్తి నో
క్కింతయు నేర్పరింపరఁట యిట్లన నిట్లని నాకు నాకె య
ర్థాంతరము ల్గడించుకొని యంజక యెట్లు యువస్తుతుల్ ప్రపం
చింతు నటంచు నుంటి నీకఁ జెప్పెద మీరలు గుట్టు దెల్పుటన్. 75

వ. అని పలికి ప్రభావతిం జూచి నీకు మనోహారి యైన యాపురుష
రత్నంబు తెఱంగు విను మని యిట్లనియె: 76

క. భారతవర్షము నందున్
ద్వారక యను పురము గలదు తద్వర్ణన వా
ణీరమణున కైనను దు
ష్పార మపారము సమస్త సౌభాగ్యములన్. 77

ఆ. ఏను దానిమహిమ నానేర్చినంత వ
ర్ణింతుఁ గొంత యని తలంతునేని
నీవు ప్రకృతయువకథావిలంబమునకు
నోర్వవేమొ యది యటుండనిమ్ము. 78

క. నా విని నీ కిది చెప్పం
గావలయునె యెందు మిగులఁ గత రాజవు నీ
వో వరటారత్నమ! యని
యా వనితలు నవ్వ న వ్విహగి యిట్లనియెన్: 79

ఉ. ఆ నగరంబునన్ యదుకులాభరణం బగుమర్త్యజన్మమున్
బూనిన సర్వభద్రపరిపూర్ణుఁడు కేశవుఁ డుండు నాథుఁడై

యా నలినాక్షు షోడశసహస్రవధూప్రియు మిక్కిలిన్ గుణ
శ్రీ నలరించి యష్టమహిషీజను లెంతయు మింతు రున్నతిన్. 80

ఆ. అందు నగ్రగణ్య యై యొప్పు రుక్మిణీ
నామధేయ యొకతె యా మగువకుఁ
బట్టి యొకఁడు గలఁడు ప్రద్యుమ్న నాముఁడా
యనఘు రూప మిదిసుధాంశు వదన! 81

ఉ. శౌర్యమయుం డతండు భుజసత్త్వనిధానము కాంతిరాశి గాం
భీర్యపుఁబ్రోక సత్కళల పెన్గని రూపము దాల్చినట్టి యౌ
దార్యము పెక్కు లేటికి నుదాత్తగుణోదయ మా యపూర్వసౌం
దర్యత కెంత యెంత యుచితం బగు నంతయుఁ గల్గి శోభిలున్. 82

వ. అని చెప్పిన 83

శా. సంతోషం బపు డాత్మఁ బిక్కటిలుచున్ సర్వాంకషంబై శరీ
రాంతర్భాగము పట్టు చాలమి నిలింపారాతిరాట్కన్య క
త్యంతంబు న్వికసిల్లఁ జేసె ముఖపద్మంబున్ద్విపాశిక్షుఁ ద
త్కాంతారత్న మొనర్చునట్టి యవహిత్థాయత్నము న్మీఱుచున్.

మ. ప్రమదం బొప్పఁగ రాగవల్లరియు నా పద్మాననం జూచి చి
త్రము నీ కిచ్చిన దేవివాక్యమునకున్ దార్కాణగా నామ జ
న్మములు న్నింటి గదమ్మ తద్వసతియున్ సంసిద్ధ మయ్యెంగదా
కమనీయం బగు నీమరాళికృప నింకన్మాను మాందోళమున్. 85

వ. ఇమ్మరాళబాలిక యాలాపచాతుర్యంబు చూడఁ గడుమకార్యం
బును సాధించి పెట్టునట్టి దిట్టతనంబు గానిపించుచున్నది మొదల
నుండియు సకలకళల సడిసన్న చదురులఁ బ్రోదిఁ బెఱిఁగినది గాఁ
బోలు కాలిపెండెరంబు నొక్కటిఁ గలిగియున్నది యని తదక్ష
రంబు లీక్షించి చదువుకొని యా బిరుదంబునకు నరుదుపడి యా
హంసివలనం దజ్జన్మనామవిద్యాభ్యాసాదులు విని మనంబునం
గడు ముదం బందుచుం బ్రభావతిం జూచి యో చెలువ! మన
కొదవ లన్నియుం దీర్చుటకు శరణం బింక నిదియ కాని వే
ఱొండు గాన మని పలికె యా పులుఁగుఁ జెలువకుం దనచెలికత్తె
కల తెఱంగు సకలంబునుం జెప్పి తదాదిగా నప్పటితుదకు ముదిత
కొదవిన మదనావస్థ లెల్ల సవిస్తరంబుగా వినిపించి యింతకుం
దెల్లంబుగ నీ పల్లవాధర యాకారంబు పరికించి చూడు మని
యిట్లనియె: 86

సీ. నెలఁతముక్కుఱయందు నీలంబు గాదు సూ
తెలిదళుకొత్తు ముత్తియము గాని
యువిదసందిళ్ల బాహాపురులు గావు సూ
మితి చూడ నిడిన యూర్మికలు గాని
సుదతిపాలిండ్లఁ గస్తురినల్పు గాదు సూ
కనుదోయి కాటుకకప్పు గాని
రమణికర్ణికల వజ్రపుదీప్తి గాదు సూ
ప్రాఁగెంపుఁదునుకల రంగు గాని

యూర్పు వేఁడిమిఁ గృశత బాష్పోదయమున
గండపాండిమఁ దత్తత్ప్రకారములను
గానఁబడియెడు నో విహంగమపురంధ్రి!
యింక నీచేత నున్న దీ యింతిబ్రదుకు. 87

చ. అరయఁగఁ దల్లి కెక్కు సెలియండ్రకుఁ దక్కును గల్గినట్టి చు
ట్టఱికమువారికి న్నెరయ దాఁచు రహస్యము లీ నిజాంతర
స్మరవికృతి ప్రవర్తనల మాటలు నీని వినంగ నాప్తలై
పరఁగెడు నెచ్చెలుల్ చెలికిఁ బ్రాణము లిచ్చిన నప్పు దీఱునే. 88

సీ. కావున నో హంసి! నీ వెఱుంగని సఖీ
ధర్మంబు లేదు విద్వజ్జనంబు
సఖ్యంబు నెంచును సాప్తపదీనంబు
గాఁగ న ట్లాట వేగంబ యరిగి
యదుకుమారకునకు హృదయంగమముగ నీ
యతివ సౌందర్యాదు లభినుతించి
యేత న్మనోరథం బీడేర్పవలయు నీ
వని పల్కుటయును నా హంసరమణి

యతనియొద్ద నీ యంగన యంగకముల
చక్కఁదన మెల్ల నొక్క ప్రసంగవశత
నేను మున్న వర్ణించినదానఁ దప్పి
సంగ మెయ్యది యంచేని సకియ! వినుము. 89

ఉ. ఏ నిట మున్ను నివ్వసరుహేక్షణఁ గన్గొని చన్నదాన నై
యా నరవర్యుఁ గాంచి యరుదైన తదాకృతిశోభ కెన్న జో
డై నది యీ విలాసవతి యాకృతిచెల్వము కావునం దలం
పైన వచింపఁగా వలసె నాతనియొద్దఁ బ్రసక్తి వెంబడిన్. 90

క. వచియించిన నోఁ గా దను
వచనం బప్పు డేమియు నుడువక యుండె నతం
డచలస్థితి నాకును నది
య చాలు నప్పటికి నేతదర్థ మెఱుఁగమిన్. 91

క. అని విని మనసు చివుక్కురు
మనఁగఁ బ్రభావతి వివర్ణ మగు వదనముతోఁ
గనుపట్టుడు నింతనె ముగి
సెనె కార్యం బేల యింత చింతిల ననుచున్. 92

వ. అద్దనుజ రాజకన్యక నూరార్చి హంసి యి ట్లనియె : 93

మ. అతివా ! నిన్వినిసించువేళఁ బ్రతివాక్యం బేమియు న్లేమిఁ ద
ద్రతికాంతున్ వెసఁ దెత్తుఁ బంపు మని పంతం బాడుకో రాదు గా
ని తగం దెచ్చెద నిశ్చలం బయినపూన్కి న్సిద్ధ గంధర్వ దై
వత దైత్యాది కులంబులం దొకని నెవ్వాని న్మదిం గోరినన్. 94

గీ. తాను జెప్పినవానిని మాని యితర
పురుషు నేఁ గోర నుమ చిత్తమునకు రాదొ.

యనవలదు భక్తపరతంత్రి కా భవాని
కరయ భవదిష్ట మెయ్యది యదియ ప్రియము. 95

వ. కావున సందిగ్ధఫలం బయిన ప్రద్యుమ్నవాంఛ విడిచి దేవదైత్య
సిద్ధ విద్యాధర గంధర్వాదులందు నెవ్వాఁడు గావలయునన్న నతని
నతను పావకప్రజ్వలనధాయ్యా మంత్రాయమానం బయిన తావ
కీన సౌందర్య సంపత్సహస్రతమభాగ కథన మాత్రంబున నపాస్త
ధైర్యుం జేసి తెచ్చి నీకుఁ గింకరుం గావించెద నీ వించుకయు
నీ రామణీయకమహిమ యెఱుంగవు గాక యిది వినిన మదన
వశంవద హృదయుండు గానివాఁడునుం గలండె యదుకుమారుం
డొక్కరుండ యనుపమేయ రూపలావణ్య గర్వంబునం గన్ను
గానకున్నవాఁడు గావలయు నతం డట్ల యుండనిమ్ము తత్సమాను
లనరాదు గాని నానాభువనసంచారిణి నైన నాకు నక్కడక్కడ
మిక్కిలిం జక్కని కొమరుఁబ్రాయంపుఁ గొమరు లెంద ఱెంద
ఱైనం గనంబడుదురు వారలనందఱ లిఖించి తేవలసి వచ్చినం
దెచ్చెద నిచ్చకు మెచ్చువచ్చినవాని వరియింపు మనిన నమ్మా
టలు పెడచెవులం బెట్టి యొక్కింత తడవు చింతించి కటకటం
బడుచుఁ బ్రభావతి యిట్లనియె : 96

మ. చిరకాలంబునఁ బట్టి యేను మదిఁ గాంక్షింపం బ్రమోదంత మి
ట్లరుదార న్వినిపించి ప్రాణసఖి వై హంసీ! తుదన్ యుక్తమే
విరసం బైన వచఃప్రపంచనముచే వేపంగ నిందాఁక నిన్
సరసత్వంబునఁ బ్రౌఢవంచు మదిలోఁ జాలంగ నే నమ్మితిన్. 97

గీ. వజ్రనాభుండు మును స్వయంవరపు విధి
నను నియోగించి దేవగంధర్వసిద్ధ
యక్షవిద్యాధరాదుల నసురవరుల
విశదముగ వ్రాసి చూపించె వేఱువేఱ. 98

క. వారలలో నెవ్వానిం
గోరెడునందాఁక లేదు కొలుపద యుల్లం
బారసి చూడఁగ నైనను
బ్రారబ్ధం బెట్టు లున్నయదియొ యెఱుంగన్. 99

చ. జనకుఁడు నప్పు డీ సకలసద్గుణపూర్ణుని వ్రాసి చూప నా
కనుపఁడు వ్రాయునంతటి సమర్థులు లేమినొ తా నెఱుంగఁడో
మనుజుఁడటంచుఁ గై కొనఁడొ మర్త్యులవై రితనూజుఁ డంచు మా
నెనొ యెఱుఁగన్ సురారికుల నిర్మథనుం డని విందుఁ గేశవున్.

చ. అది తలపోసి కుందఁ దగునా యదునందనునందు నున్న నా
మది తెలఁగున్ జగజ్జననిమాటలుఁ జెప్పఁగ వించు శంక చే
సెదు పురుషాంతరానుమతి చేకుఱునో యని నీకు నింక నా
హృదయములోఁతు గానఁబడదే నెఱిఁగింతుఁ బ్రతిజ్ఞ యొండిఁకన్.

క. విను ప్రద్యుమ్నుని దక్కన్
మనమున నే నొరు వరించుమాట విడువు మా
ఘనుఁ డొల్ల కున్నఁ జెందుదు
మనసిజశిఖిఁ దనువు వ్రేల్చి మఱుసటిమేనన్. 102

ఉ. ఈ తుదపక్షమే మదికి నిప్పుడు నిశ్చిత మె ట్లటన్న ము
న్నాతఁడు వించు నా కథలు కట్టిటు పల్కమి గాక తద్గళ
ద్యోతిత కంకణాంక యగు తొయ్యలి నొక్కతెఁ గల్గఁ జెప్పి త
ద్వే తప మాచరించె నొకొ యిందుల కారతి ప్రాగ్భవంబునన్.

వ. అని తదీయం బయిన సతీవాల్లభ్యంబునకు ముచ్చట పడుచు నొ
క్కింత తలపోసి, 104

సీ. ఆ రతికిఁ గరంబు లై తిరే నన్విభు
కౌఁగిలింపఁగ నబ్బుఁ గరములార!
యా యింతికిఁ గుచంబు లై తిరే నతని వ
క్షో నిపీడన మబ్బుఁ గుచములార!
యా లతాంగికిఁ జెక్కు లై తిరే నా రమ్య
శీలు చుంబన మబ్బుఁ జెక్కులార!
యా నెలంతకు వీను లై తిరే నా కళా
విదు మంతనము లబ్బు వీనులార!

యట్లుగా నోఁచ కేల నా కై తి రకట
యని నిజావయవంబుల కాత్మ వగచు
బాల్యమునఁ దన్ను రమణ సౌభాగ్య కలిత
యనిన సాముద్రికులమాట లరసి తిట్టు. 105

వ. ఇవ్విధంబున విరహావేదనం బెద్దయుం బ్రొద్దు దోదూయమాన
మానస యగుచు నుండి యంతట శుచిముఖిం జూచి యిట్లనియె:

సీ. ఓ హంసి! నిన్ను నే నొక్కటి తుదమాట
యడిగెద నీ హృదయంబునందుఁ
గలయట్టు చెప్పుమీ కల్ల లాడిన నీకు
నాతోడు సుమ్ము ప్రాణసఖి వీవు
తడయక ప్రద్యుమ్నుకడ కింక నొకమాఱు
పోయి దుస్తర మైన నా యవస్థ
చెప్పి చేరికఁ గొంత చేయవచ్చునొ రాదొ
యీ దురాశాపాశ మెందుఁ దెగని

బంధ మై ప్రాణముల వెలువడఁగ నీక
యాఁగి పెంచెడు మదనాగ్ని నహరహంబు
నీవు చని యవ్విధము లిత్తెఱఁగు నిశ్చయించి
యాశఁ దెగఁగోయు మదియ మత్ప్రాణరక్ష. 107

వ. అనుటయు నా తరుణికిం గల హరితనయవర ణానురాగం బెవ్వారికి నవారణీయంబనియును నింక నియ్యాస చెడకుండ నిర్వహింపక తడసినం గడు నెడరు వాటిల్లఁ గార్యంబులు దప్పు ననియు నిశ్చయించి యంచ యి ట్లనియె: 108

చ. మది తమిఁ జూడఁ గొన్ని వెడమాటలు పల్కితి నీవు నన్ను మే నిదె భవదీశుఁ దెత్తు నవు డేమి పరాకున మాఱు పల్కఁ జో సుదతి! యెఱుంగఁ గాని యిఁకఁ జూడుము తావక రూపవై భవ భ్యుదయము విన్కలిఁ ప్రబోధముపూని యతండు విరాళిఁ గుందెడుఁ

వ. దీనికి నిమిత్తంబును దైవనియమంబు గల దది విను మెఱింగించెద.

గీ. బ్రహ్మకును సరస్వతికిని బ్రణయకలహ
మయ్యె మును పొక్కనాఁ డప్పు డబ్జభవుఁడు
తద్విరహపీడ సైరింపఁ దరము గాక
వాణిఁ దేర్పఁ దదాప్తు లెవ్వారొ యనుచు. 111

క. ఆరసి ననుఁ బిలిపించెను
శారదకడ నప్పు డేను సరస క్రీడా
చారసచివత్వమున సం
చారముఁ గావించు చునికిఁ జంద్రనిభాస్యా ! 112

వ. అట్లు పిలిపించి నన్నుం దన పొలంతి పొలయలుకం దీర్చుటకుఁ
బనుపుచుండి యద్దేవి నుద్దేశించి, 113

సీ. నీ సుప్రసాదసన్నిధిమహత్త్వమ చుమీ
నిగమరాశీ ముఖస్థ మగుట నాకు
నీ విలాసమచర్చికావిశేషమ చుమీ
సంగీతసాహిత్యసౌరభంబు
నీ కటాక్షశ్రీ విపాకభేదమ చుమీ
వేణువీణాదుల రాణ లెల్ల
నీ వనుగ్రహలీలఁ గావించుటన చుమీ
యఖిలలోకవ్యవహారసిద్ధి

కావున నొకింత యో వాణి! నీ వలిగిన
నొక వినోదంబు నొదవ దే నోర్చు టెట్లు
విరహ మేకాంతధ్యాస్యకింకరునియందుఁ
గరుణ లే కింత తడ వలుగంగఁ దగునె. 114

క. అని యేఁ దనుఁ గడుఁ దూఱితి
నని మత్ప్రియకడకు నేగి హంసి! పలుకుమీ
యనుచు నపు డంత కంతకుఁ
దనరు మనోజార్తిఁ గరముఁ దప్తం డగుచున్. 115

గీ. ఏలరా మన్మథుఁడ! నన్ను నింత యేఁచు
టేమి మేలు రానున్నవి యిట్టిపాట్లు
నీకు నీకఁ బ్రభావతి యను నెలఁతపై వి
రాళి కారణముగ వేగిరంబు వలచు. 116

క. నా విని యేను రతిప్రియు
భావము న ట్లపహరించుపాటిది యైనన్
నీ వనిన వనిత యెక్కుడె
లావణ్యాదులను రతివిలాసిని కనుడున్. 117

క. రతిరూప మెక్కుడ ప్రభా
వతిరూ పెక్కుడ విమర్శవంతులు దెలియన్
రతిసొబగు కంటెను బ్రభా
వతి పస ముమ్మడి నలుమడి వాసి మరాళీ! 118

వ. ఆ ప్రభావతిరూపంబును మదీయసృష్టియం దతిదుర్లభం బది పార్వతీ
వరప్రసాద జనిత యై పొలుపొందు నని పలికి నిజాంగనారోపంబుఁ
దీర్చుటకు సత్వరంబుగాఁ బనిచిన నే నతనికాలవిలంబ నాసహిష్ణు
త్వంబు దెలిసినదాన నై యప్పు డేమియు నడుగ వెఱచి యరిగితి
మఱియుఁ గ్రమక్రమంబున నట్టి ప్రభావతివి నీవ యని నిశ్చయించితిం
గావున నీ వల్లభుండు భవదాయల్లకభరంబునం బరితప్తుం డగుచు
నిన్ను వరియించుటకు నీకంటెను వేగిరించు నని తోఁచుచున్న
యది, రతీవిలాసంబును దదంతరాయంబు సేయంజాలదు, నీవు
సకలసంశయంబుల నుడిగి సుఖం బుండు మనిన విని యద్దనుజేంద్ర
నందన తన డెందంబున సందియంబు నొందుచు రాగవల్లరి మొగంబు
చూచుటయు, నది తదభిప్రాయం బెఱింగి హంసి కిట్లనియె : 119

గీ. ఏమిటికి హితవుగఁ జెప్పి యెందు నదికి
తచ్చెరువు నీదుమాట లో యంచగరిత !
కాముఁడు ప్రభావతీ కాంతుఁ గలఁగనేని
మన చెలియ కిష్టుఁడు విరాళిఁ గొనుట యెట్లు ! 120

మ. అనిన న్నవ్వి మరాళి యిట్లనియెఁ జెల్వా ! కాముఁ డన్వాని మీ
రును విన్నారు గదమ్మ యాసకల సద్రూపోపమానత్వ శో
భనకీర్తి ప్రథితుండు తొల్లిటి సురూపశ్రీఁ గడు న్మించు చె
న్నొనరం బుట్టినవాఁడు రుక్మిణికిఁ బ్రద్యుమ్నుం డనం బుత్రుఁడై .

క. అని నిజ శంకల కన్నిటి
కీనిఁ బరిహారములు చెప్పి గెంటక యుండన్

దనయాన నిలుప దితిసుత
తనయ రమణుఁ గలయ మిగులఁ దమకించు మదిన్. 122

వ. హంసిం జూచి 123

సీ. నీ చెప్పి నట్ల యున్నియు నైన మొదలఁ ద
త్పుర మెంత దవ్వొ నీ వోవు టెపుడు
పోయి వేళ యెఱింగి పొసఁగ నవ్విభున కీ
దృశ మైన నా కోర్కెఁ దెలుపు టెపుడు
తెలిపిన నే విఘ్నములకు లోఁబడక నా
పై నతఁ డనుకంపఁ బూను టెపుడు
పూని తా నిచటికి రానొక్క నెపమున
గురు నాజ్ఞ నొరకించుకొనుట యెపుడు

వట్టి పెనుమచ్చరపు రాజ్ఞి వజ్రనాభుఁ
డస్మదిచ్ఛకు ననుకూలుఁ డగుట యెపుడు
విరహవారిధి నేఁ గడవెళ్ళు టెపుడు
వలవని దురాశలను గుమారెలుటె కాక ! 124

క. అని తాల్మి వదల విడుచుచు
ఘనముగఁ బ్రజ్వరిలు దర్పకజ్వాలనముచే
ననయము శోషిలి చెలి లో
చనముల వెడలించె మోవి సరసత యెల్లన్. 125

క. అట్టియెడఁ గట్టెదుర నొక
చెట్టున నురిఁదగులువడిన చిలుక వెఱపుతో
నిట్టటు ఱెక్కలు తటతటఁ
గొట్టుకొనుచు నెగయఁ బెనఁగఁ గోమలి కనియెన్. 126

క. కని ఘన సంభ్రమమునను ది
గ్గున లేచి దయాకులం బగు మనోవృత్తిన్
దనతోఁ జెలియున్ హంసియుఁ
జనుదేరఁగ దానిఁ జేరఁ జనియె రయమునన్. 127

క. చని చిలుకఁ గదల కుండఁగ
ననువునఁ దాఁ బొదుగిఁ బట్టి యంఘ్రియురి వద
ల్చిన నది రయమున నబ్భా
మిని కే ల్విడిపించు కొనుచు మింటికి నెగసెన్. 128

వ. అప్పుడు 129

మ. శుకపక్షంబులలోననుండి తపతిక్షోభంబునం జారె ప
త్రిక పద్దన్ వెఱఁ గంది యిట్టులను దైత్యేయాధిపాంతఃపురం
బకటా! చోద్యముచూచితే యిదికదన్ హంసీ! విచార్యంబు కొం
కక యిం దెవ్వరి కెవ్వ రంపిరొకొ చిల్కం బట్టి తే నొప్పుదే? 130

గీ. అని ప్రభావతి పల్కిన హంసి యప్పుడు
కూడఁ జని పట్టి తెత్తుఁ జిక్కుపడ కెంత

దవ్వ పాఱెడు ననుచుఁ బంతమునఁ బఱచె
శీఘ్రగతి నింత నంత నా చిలుకఁ దగిలి. 131

ఉ. అంతఁ బ్రభావతీసతి వయస్యఁ గనుంగొని యింతి! చూచితే
యెంతటి చోద్యముల్ మొదల నిక్కడ నిట్లురు లెవ్వ రొడ్డిరో
వింత యటన్న నీ చెవికి వేఁడిగఁ బల్కు పికాళిఁ బట్టి శి
క్షింతు నటంచు నేఁ గడఁగి చేసిన తప్పిది యొప్పు నోర్వఁగన్. 132

క. చిత్రము మిక్కిలి యిపు డీ
పత్రికచందంబ యో ప్రభాతాబ్జ లస
న్నేత్ర! యది చూత మనుచున్
బత్రిక పుచ్చుకొని విచ్చి భాసురఫణితిన్. 133

సీ. "శ్రీమత్సరస్వతీ రామా కృపా సంప్ర
యు 'క్తోపమాతిశయోక్తి కామ
ధేను' సద్బిరుదాంక దివ్యమంజీరసం
శోభిత పాదకు శుచిముఖికిని
బ్రద్యుమ్నుఁ డూర్జిత ప్రణయ పూర్వకముగా
ననిపినయట్టి రహస్యలేఖ
ప్రప్రభాభావతిఁ బలు దెఱంగుల నీవు
వచియింప" నని చదువుచు నె యుబ్బి

సంతసము నాఁపఁ జాలక చంక వైచు
కొనుచు నొక దాఁటుగొని నిన్నుఁ గూర్చి కాంతుఁ

డనిపి నట్టి పత్రికయె కదమ్మ భాగ్య
వతివి నీవని చెలి ప్రభావతిని బల్కె. 134

చ. పలికిన నట్ల యున్నదియె పత్రికలో నడకించెదో ననున్
జెలి! యిటు చూపుమాయనుచుఁ జేరఁగఁ బోవుచుఁజేయి సాఁచెనా
యలినిభవేణి ; తత్సఖియు నట్టిటు పాఱుచు దేవునాన యేఁ
గల యది యంతయుం జదువఁగా విను చూచెదు కాని నావుడున్.

ఉ. ఆ విధిఁ దప్ప కున్నఁ దెలియా! ననుఁ జేకొను టెట్లు ప్రప్రభా
భావతి నాఁగ నెవ్వతియొ పత్రిక యింకను లెస్సచూడు నా
కీ వలదన్న నెట్లెఱుఁగవే భవదాఖ్యయె కాదె యిట్లుగా
నో వనజాక్షి! వర్ణ పునరుక్తిగ వ్రాసినవాఁడు భ్రాంతిచేన్. 136

వ. అనుటయు 137

క. ఎట్టటు కాని మ్మది యిఁక
నట్టిటు పాఱక మృగాక్షి! యవలఁ జదువు మే
నిట్టే యుండెద నావుడు
గట్టిగ నట్లని వినుము కడమ చదివెదన్. 138

వ. అని ప్రథమ శ్రుతాంతంబు నందుకొని యిట్లని చదువం దొడంగె:

సీ. "ప్రప్రభాభావతిఁ బలు తెఱంగుల నీవు
వచియింప నపుడు నిర్వచన వృత్తి

నే నున్కి కల్లగు ట్టింతియెకాని యా
యింతి యంగము లెవ్వి యెట్లు చెప్పి
తవి యెల్ల నట్ల నా యాత్మఁ దద్దయుఁ బడి
యచ్చున నద్దిన ట్లమర నంటి
మలిచిన గతిని మిక్కిలి దృఢత్వముఁ జెంది
స్వగుణ సంపద్గౌరవమున నేమొ

యూఁది బడలించుచున్నవి యోమరాళి!
యధరసుధఁ దేర్పుచుని వేఁడు మా మృగాక్షి ”
నని చదువునంత గొబ్బునఁ జని సురారి
పుత్రి సఖిచేతి పత్రికఁ బుచ్చుకొనియె. 140

ఉత్సాహ. పుచ్చుకొనుడుఁ బెనఁగఁబోక బోటి చేయి వదలి పో
నిచ్చి నాకుఁ జదువఁదగద యింతనుండి మిక్కిలిన్
బచ్చి గాఁగ వలపు తేట పఱిచి వ్రాసినాఁడొ నీ
యిచ్చఁ జదువుకొనుము వెనుక నిపుడు దాఁచి నావుడున్.

వ. ప్రభావతి భావంబునం గోపలజ్జాలోల యగుచు లేఖ నలిపివేయం బోయిన రాగవల్లరి పెక్కాన లిడుచుం బడుచుఁ దనంబును మనంబున నింత ఘనంబుగాఁ బూనియున్న దానవే దానవేశ్వర తనూజా! నీ యోజ మేలు మేలు చాలుం బదివేలు వచ్చె నా చేతికిఁ దెమ్ము తేవేనిం బదిలంబుగాఁ బొదివి దాఁచుము

మొదల నీ యాకనకు నీకుం బని యేమి యా మహామహుండు శుచిముఖి పేరం బుత్తెంచినాఁ డింతియ యా శకుంత కాంత చూచుకొనకుండ మనలో మనము యడంచిన నది యెట్లుండు మనము దాని తోడం జేసిన ప్రాణసఖ్యం బెట్టిది యగు గట్టిగ నింతపట్టు నీవ భావించికొను మదియునుం గాక నీ పోకడ మాలినతనం బేమి చెప్ప వల్లభుండు వాల్లభ్యంబు నెఱపి యని పిన పత్రిక భాగ్యవతులు కులదేవతంబలెఁ బూజించి దాఁచు కొనుట యొప్పుఁగాక యిట్టట్టు సేయుట కంటె నమంగళంబు గలదే యని యదరవైచియు బుజ్జగించియు బోధించియు వారించె నంచయు నించుక దవ్వైనన చిలుకంగూడ మట్టి పదంబులం బొదిగి పట్టిన నది యిట్టునట్టుం బెనంగుచుం గీచుకీచు మని యఱచుచుం జరణంబులు గఱచుచు రాకచీకాకు పఱిచిన చేసి, యోసి గడు సుం బులుంగ! యెలింగించి చావక వేవేగ నావెంట రమ్ము ఱెక్క లలో దాఁచుకొని యెక్కడెక్కడి లేఖ లెక్కడికి నడుపుచున్న దానవు రక్కసులఁజేని యాఁడుబిడ్డ నిన్నుం బట్టి తెచ్చు నందాఁక నడె కదలకున్నది యనిన నది యిట్లనియె: 142

క. చంపినఁ జంపుము న న్నటు
గొంపోకుండినను జాలు కొసర కదయతఁ
జంపిన న న్నొకటిన మఱి
కొంపోయిన నెంద ఱె ట్లగుదురో యెఱుఁగఁ. 143

వ. అనుటయు 144

క. నిను విడిచినఁ గొంపోయినఁ
బని కొదవలు లేమి సరియె పత్రిక చేఁజి
క్కిన యది నీ వీఁక నీడిగి
లిన నొచ్చుట మీఁది మిక్కలి వివేకింపన్. 145

గీ. వచ్చితేనియు విను ప్రభావతి మనమున
కెట్టి గతినైన దయపుట్ట నేను జెప్పి
నిన్ను విడిపింతు ననుచుఁ దన్వీడక బలిమిఁ
గొని చనంగ మరాళి కి ట్లనియెఁ జిలుక. 146

ఉ. ఏల చలంబు నీ వడిగెదేని వచించెద నాదు గోప్యముం
బేలవె యార్చి తేల్లఁ దలఁబెట్ట రహస్యము దప్పు నన్నఁచోఁ
దాలిమిఁ గప్పిపుచ్చినను దద్గుణ మొక్కొక వో ఫలించు నా
వేళఁ బ్రపంచు సేయ నొక వీసముఁ గల్గదు హింస తప్పదున్. 147

సీ. కావున నొక వివిక్త స్థలంబున నిల్చి
విసుము నా తప్పెల్ల ; వినిన వెనుక
నీకుఁ దోఁచినయట్లు గైకొని చేయుదు
గాని నావుడు హంసకాంత దనకు
నప్పటి కదియ కార్యముగ వివేకించి
చుట్టుపట్టుల నెందుఁ జెట్టుచేమ
లేక యొప్పెడు నొక్క లీలామహీధర
శిఖరంబుపై నిల్చి చిలుకఁ దనదు

పక్షముల బల్మిఁబట్టి యీ పత్రికా ప్ర
కార మేమియు నీ వింకఁ గడమపెట్ట
కంతయును నాకు నెఱిఁగింపు మనుచుఁ బలికె
నంచ తొయ్యలి కదియు ని ట్లనుచుఁ జెప్పె. 148

చిలుక హంసితోఁ దన కా పత్రిక లభించిన తెఱంగు చెప్పుట

క. ద్వారక యను పురమున కొక
కారణమున నేగి నేను గ్రమ్మఱి రాఁగాఁ
జారుతరమూర్తి యొకఁ డొక
యారామములో నతివ్యథాకులుఁ డగుచున్. 149

సీ. కృప నెఱింగింపరే కీరోత్తమములార !
వజ్రపురికిఁ బోవువారె మీరు
సదనుగ్రహమునఁ దుమ్మెదలార ! చెప్పరే
వజ్రపురికిఁ బోవువారె మీరు
కరుణతో వినిపింపఁ గదరె కోయిలలార !
వజ్రపురికిఁ బోవువారె మీరు
తెలుపరే దయఁ జూచి మలయవాయువులార !
వజ్రపురికిఁ బోవువారె మీరు

చలువ లొసఁగెడు మేఘరాజంబులార !
యమలపక్షత నొప్పు రాయంచలార !

నిలిచి నా మాటలకు మాఱు పలుకరయ్య
వజ్రపురికిని బోయెడువారె మీరు. 150

వ. అని కన్నకన్నవారి నెల్లఁ బ్రార్థించుచుండ విని దయ పుట్టి యేల పలవరించెదు వజ్రపురంబునకు నేఁ బోయెడుదాన నావలన నయ్యెడు కార్యంబుఁ జెప్పు మనిన, నత్యాదరుండై 151

శా. శ్రౌతస్మార్తపథానువర్తన పరిష్కారాత్మవర్ణాశ్రమ
స్థితాచారపవిత్రమూర్తి శమగాంభీర్యక్షమాసత్యని
ష్ఠాతుష్ట్యాదిగుణోరుకీర్తి సముదంచన్నీతివిద్యా మహో
చాతుర్యాపరకావ్యుఁ డార్యజనతాసంభావ్యుఁ డత్యంతమున్.

క. చారిమకారి మహత్తర
గౌరిమహారి మహనీయ గాథయశుఁడు గం
భీర మదారినిషూదనుఁడు
భూరిమదారిమహిమ వ్యపోహకుఁ డెపుడున్. 153

స్రగ్విణి. ఇందుపూతక్రితాయాతనూజార్థరా
ణ్ణందనస్వాంతభూనైషధేళాసుతా
మందసౌందర్యసంస్మారకాకారసం
స్పందితశ్రీధృతిప్రాభవుం డెంతయున్. 154

గద్యము

ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగిత కవిత్వవైభవ పింగళి
యమరనార్యతనూభవ సౌజన్యగేయ సూరయనామ
ధేయ ప్రణీతంబైన ప్రభావతీ ప్రద్యుమ్నం
బను మహాప్రబంధంబునందుఁ

తృతీయాశ్వాసము

---

శ్రీ

# ప్రభావతీప్రద్యుమ్నము

## చతుర్థాశ్వాసము

క. శ్రీరుచిరతరుఁడు విమలా
చార ధురంధరుఁడు సుకవిసముదయ గోష్ఠీ
సారస్యపరుఁడు పింగళి
సూరన యమరార్యవరుఁడు సురగురుఁ డుక్తిన్. 1

వ. ఆరామవర్తి యైన కుమారోత్తముండు నన్నుం జూచి 'యో చిలుకల కులభూషణంబ! నాకు నీవలన నయ్యెడు ప్రయోజనంబు విను, మా వజ్రపురంబున శుచిముఖి యను రాజహంసి గలదు. దాని నరసియొక్క లేఖ యందింప వలయు' ననియె. నేను నతని దైన్యాతి భారంబు భావించి, కారుణ్యపరవశత్వంబు నొందిన దాన నై, తక్కిన యాగాములు లెక్క సేయక, యీ కమ్మ హంసి కిచ్చు టెంతియకదా యనికొంచుఁ బోయిన నెంత తప్పు వాటిల్లెడు నను తలంపున నియ్యకొని యయ్యాకు పత్త్రంబు లోన లీనంబుగాఁ గట్టించుకొని, వచ్చి యిప్పు డప్పువ్వుఁబోఁట

లోని కొలంకులు కలహంసకుల కలకలాకులంబు లగుటయుఁ
దత్కన్యకాపరిచయంబున నున్న నిన్నుఁ బరికించి, 2

గీ. ఇచట శుచిముఖి యను హంసి యీగడ యొక
కొంత దొరకునో యంచు నక్కజమునందు
నొయ్య నిలిచితి నంతనె యురిని దగులు
కొంటి లోనైతి నీ పాట్లకు న్మరాళి! 3

వ. అని చెప్పుటయు, 4

క. తనకార్యమ యది యగుటకు
ననయము ముద మొదవ మదిన యడఁచి యిది యెట్లిం
గినయది యింతియ కావల
యును బత్రికచంద మింత యొనరునె యనుచున్. 5

వ. కావున నింక నీ పత్రికాప్రసంగంబు నిస్సారంబుగాఁ బోనాడి
ప్రసంగాంతరంబున మఱపించి విడిచెద నని హంసి చిలుక
కి ట్లనియె: 6

ఆ. పక్షిపేర వ్రాసి పత్రిక యనిపెడు
నట్టివాఁడు భ్రాంతుఁ డగుట ధ్రువము
నా కతం డనిపిన యాకమ్మ యెట్లుండె
నేమి మిగుల నొరసి యేల యడుగ. 7

క. నీ వా పురికిని మొదలం
బోవం బని యేమి చెప్పుము యథార్థముగా
నావుడును నీళ్ళు నములుచు
నా విహగము చెప్పఁ గొంక నంచయు దానిన్. 8

ఆ. బిగియఁబట్టి యెందు బెణఁక నీ కడిగె నే
యర్థ మిందుఁ గలదొ యను తలఁపున
జడియ కదియుఁ జత్తు సరిపోదు మాట ప
ట్టీక చెప్ప ననుచు వీఁక నుండె. 9

ఆ. నవ నిధానములును దవిలి యిచ్చిన నైన
మెడలమీఁదఁ గత్తి యిడిన నైనఁ
జాల రనఘచరితు లేలినవారి ర
హస్యభంగమునకు ననుమతింప. 10

వ. హంసియు దాని కడిగినమాట పట్టిచ్చె నదియు నిట్లని చెప్పె: 11

చిలుక తాను ద్వారకకుం బోయిన కారణమును హంసికిం జెల్పుట

క. విను వజ్రనాభు తమ్ముఁడు
సునాభుఁ డను ఘోరరాక్షసుండు గలఁడు త
త్తనయలు గల రిద్దఱు సొబ
గున నధికలు చంద్రవతియు గుణవతియు ననన్. 12

చ. అతఁ డొకనాఁడు నారదు విహారవశంబున నాత్మ సత్సభా
గతుఁ డగువాని సద్వినయగౌరవపూజలఁ దన్పి, సొంపెస
ప్రతతులఁ గూర్చి లోపలికిఁ బంచెను ; దేవులు నక్కుమారికా
ద్వితయము మ్రొక్కి రాతనికి సేవ లొందుటకై వినీతితోన్. 13

సీ. ఇవ్విధమ్మున నమ్మునీశ్వరుఁ బూజించి
యతని యాశీర్వాద మందుటకును
దన యంతిపురమువారిని సునాభుఁడు నియ
మించి పంచినఁ బరమేష్ఠిసుతుని
వారును వివిధోపచార పూజలచేత
సంతుష్టుఁ జేయుచోఁ జంద్రవతియు
గుణవతియును భక్తిఁ బ్రణమిల్లఁ బతిమనో
వల్లభలై పుత్రవతుల రగుచు

నొప్పుఁ డని మౌని దీవించె నప్పు డచటి
దాదు లో మునివర్య ! యీతలిరుబోంట్ల
కథిపు లెవ్వారు వారల నానతిండు
నావుడును గొంత చింతించి నారదుండు. 14

మత్తకోకిల. వీరి కద్దుకుం బ్రియంబున విస్ఫురద్గుణశోభితు
ల్ద్వారకానగరాశ్రయు ల్యదువంశజు ల్గద సాంబు ల
న్వారు నాథులు గాఁ గలా రని వారి కానతి యిచ్చె న
న్నారదోక్తికి వారు చిత్తమున న్విచారము సంధిలన్. 15

గీ. కుడిచి కూర్చుండి వెతఁ దెచ్చుకొంటి మొకటి
నెన్న నెక్కడి ద్వారక యెక్కడి గద
సాంబు లివి విన్నఁ బెనుఁజేటు స్వామిచేత
నసురులకుఁ బగవీడఁట యా పురంబు. 16

చ. అని తమలోనఁ దా రడఁచి రాపలు కెందును సుబ్బకుండ న
ద్దనుజవరేణ్య కన్యకలు తాపసవాక్యము విన్నయాదిగా
మనమునఁ గూర్మి హెచ్చి నియమంబులు నోములు దానధర్మ వ
ర్తనలుఁ గరంబు సల్పుదురు తద్గదసాంబశుభంబ కోరుచున్. 17

చ. క్రమమున భోగయోగ్యమగు ప్రాయము నిండుచు రాఁగ భర్తృసం
గమన మనోరథంబు నతిగాఢముగాఁగఁ బతిప్రవృత్తి లా
భము గడు దవ్వుగా నలసి బాలిక లిద్దఱు తద్దయున్ గత
క్షమఁ గుసుమాస్త్రబాణములఁగాంతియె చిక్కఁగఁ జిక్కి రేమనన్

ఉ. అచ్చపలాక్షు లిద్దఱును నర్మిలిఁ బెంచియుఁ బల్కు నేర్పియున్
ముచ్చటకాపుగాఁ దమ వినోదపునెచ్చెలిగా నను న్గదున్
మచ్చికఁ జూతు రా సతులమన్ననకుం దగఁ బ్రత్యుపక్రియా
సచ్చరితంబుఁ జూపఁగ నజస్రము నేనును గోరుచుందుదున్. 19

క. కావున వారల యప్పటి
భావజశరపీడఁ జూచి భామినులారా!
మీ వల్లభుల శుభస్థితి
నా వెరవునఁ దెలిసివత్తు నమ్ముఁడు మదిలోన్. 20

గీ. మఱియు నప్పటికొలఁదిని మంతనముగఁ
జేరి మీకోర్కెఁ జెప్పవచ్చినది చెప్పి
మాఱుమాటయేఁ దెచ్చెద, మానసముల
నన్యచింతలు మాని నన్ననుపుఁ డనుచు, 21

వ. ఏనుమద్విరహాసహాత్వంబునం జేసి వార లనుపం జాలక యనుమా
నించినను మానక, యప్పుడ కదలి ద్వారకాపురంబున కరిగి, నాచేత
నై నపాటి గమనకార్యంబు సాధించుకొని తిరిగి వచ్చునప్పుడా లేఖ
యట్లు ప్రాప్తంబయ్యెఁ దత్ప్రకారంబును వినిపించితి నన్నుఁ బ్రభా
వతి చూచి గుఱు తెఱింగెనేని చంద్రవతీగుణవతులకు నేమికొఱ
గామి సంఘటిల్లునో యని తలంకెద నవ్వనితలకు మత్పునర్దర్శనం
బునకై మితిపెట్టినదినంబు నేఁడ కావున నెంత వంతం బొరలు
చున్నవారో వారికిం బొడసూపవలయు నన్ననిపి యను
గ్రహింపుము. 22

గీ. ఘన పయోవృష్టికిని జాతకములు పోలెఁ
గొమరు వెన్నెలకును జకోరములు పోలె
భాస్కరోదయమునకు నబ్జములు పోలె
నెదురు చూతురు నారాక కిందుముఖులు. 23

వ. అనుటయు, 24

ఆ. ఏను నిన్ను విడువ కిట్ల వచ్చెద నీవు
చెప్పినంతవట్టు నప్పడఁతులఁ

బిలిచి నా యెదుటను గల దనిపించిన
విడుతు మదుపకారవృత్తి దెలిపి. 25

క. అనవుడు నట్టుల కాని
మ్మనుచుఁ దదాక్రాంతమూర్తియగుచు నె వెసఁదాఁ
జని చిలుక కెళవు లరయుచు
సునాభకన్యలు వసించు శుద్ధాంతమునన్, 26

క. ఒకసౌధ విటంక మత
ల్లికమాటుగ వ్రాలి లాఁతిలేమ లచటఁ జే
రికఁ బొలయకుండ నారసి
యకలంకస్వరతఁ బిలిచె నా కన్నియలన్. 27

క. పిలుచుటయు వార లిది మన
చిలుకయెలుం గనుచు నుల్లసిల్లి రపుడు నీ
నుల నూఁదు కప్పురపుఁ జలు
వలఁబోలి విరాళి యలఁత వడి నది తీర్పన్. 28

ఆ. అట్లు సంతసిల్లి యతి సంభ్రమంబున
నరుగుదెంచి హంసికావృత మగు
చిలుక తెఱఁగుఁ జూచి వెలవెలఁబాఱఁ ద
ద్భయ నివృత్తిగాఁగఁ బలికెఁ జిలుక. 29

క. 'నిను నంపిన వారికి నీ
కును హితమె యొనర్తుఁ బ్రాతికూల్యం బొక ప

ట్టునఁ జేయ ననుచు నిది నా
థు నిజముచేసినది మీరు కొంకకుఁడు మదిన్. 30

వ. అని తనకును దానికిఁ బ్రాపించినసంబంధంబు తెఱంగునుం దాను మాటపట్టు పుచ్చుకొని తన కార్య రహస్యంబుఁ దెలుపుటయుం దెలిపి యేను మీ దాసనగుట మీచేత వెళ్ళనాడించుకొని మీ కుపకారం బెక్కించి విడుచుటకు వచ్చినదని చెప్పి తత్ప్రార్థనా వశీకృత హృదయ యగు హంసిచేత విడువంబడి యేను బోయిన కార్యంబు వివరించెదనని వారల వేరువేరం జేరఁగ్రుచ్చి యిట్లనియె : 31

## చిలుక చంద్రవతీగుణవతులతో వారి ప్రియుల సేమముఁ జెప్పుట

గీ. చంద్రవతి ! నీదు ప్రాణేశుఁ డింద్రనిభుఁడు
గదుఁడు ద్వారక నున్నాఁడు ముదముతోడ
గుణవతీ ! నీదు ప్రియుఁడు సాద్గుణ్యరాశి
తనరుచున్నాఁడు సాంబుఁ డెంతయు శుభమున. 32

క. ప్రకటిత చాతురి నా రా
జ కుమారులతోడ నుచితసమయముల న్మ
చ్చికఁ జేసితి నేఁ గ్రమమున
నొకఁ డెఱుఁగక యుండ నొకని యొద్దకుఁ జనుచున్. 33

క. విదితము చేసితి మీ మీ
హృదయేశులకంత మీ యభీష్టము తెఱఁగుల్.

తుదనంతయుఁ దెలిపితి మీ
బ్రదుకుల తదుపేక్షణైక పర్యంతతయున్. 34

గీ. వారు నే యుపాయములను వదలక వరి
యించు వారైరి మిమ్ము మీ రింతలోన
ధృతి సడల నిత్తురే నాత్మహతియ కాక
పతిహనన పాతకము గల్గఁ బల్కి రవుడు. 35

సీ. అని చెప్పుటయు విని యా కన్యకలు గరం
బులఁ గర్ణయుగళంబు మూసికొనుచుఁ
దమకంత యేలగుఁ దాము దీర్ఘాయుర
న్వితు లగుదురుగాక యతి వియోగ
వనరాశి నేమును మునుఁగక తమ మాట
యాస పెన్దెప్పగా నచలమైన
తాల్మి నీఁదుచు నుండెదము తమ కస్మదీ
యప్రాణ సంరక్షయందుఁ దగిన

త్రోవ మా భాగ్యవశమునఁ దోఁచుదాఁక
నోర్చుటయకాక తమకింప యుక్తమగునె
యని పలికి యూరకుండిన నంచచెలువ
వారి కిట్లను సముచిత వాక్య సరణి. 36

క. మీ పతు లిట వచ్చుట శుచి
తోపాయము మిగులఁ దడయ కొక్కటి తగ నే

నాపాదించెద విూరలు
నాపై దయ మఱవకుఁడు మనంబులయందున్. 37

వ. ఏను బ్రభావతికిఁ బ్రాణసఖినై యుండుదుఁ గావున నా చెలువ పనుపున నీ చిలుక నిట్లు వగులుకొని వచ్చితి నిది నిమిత్తంబుగా నైన విూతోడి మైత్రి దొరకె నింక నిక్కడ నిక్కాలిం పడయఁ దగదు, పోయివచ్చెద వచ్చట నిచ్చటి రహస్యంబు వెలివోవనీక తగిన యుత్తరం బిచ్చి కప్పిపుచ్చెద నిచ్చలంపు మనంబుల నుండుం డని పలికి యా మాటల కత్యంత సంతుష్టాంతరంగలగు నా యంగ నల వీడ్కొని వజ్రనాభతనయకడకు నరుగుదెంచి యిట్లనియె: 38

క. చెలువా! నీ సౌభాగ్యపు
విలసనము కదమ్మ యెచట వీక్షించిన న
ర్మిలి నీ పతి నీకై చిం
తిలి యనిపినలేఖ యఁట కదే తెలియంగన్. 39

వ. అనిన నక్కన్యకారత్నంబు నవ్వుచు నిట్లనియె: 40

క. అడుగఁగ వలసినయది యే
నడుగుదు విశదముగ మొదల నా చిలుక య దె
క్కడిది? యిటఁ దేక యేటికి
విడిచితి? నీ కడుపు కందవిత్తుఁగ హంసీ! 41

వ. అనుటయు శుచిముఖి యిట్లనియె: 42

క. నీ పతి నీకై కుందుచు
నాపేరను లేఖ యనిపి నాఁడని యిది యే
నా పుటుఁగువలనఁ దెలిసి ము
దాపూర్ణత నుబ్బి విడిచి యనిపితి దానిన్. 43

క. మనకిమ్మనుచు నతం డని
చిన పత్రిక దొరకె నొరులచేఁ బడ కిదియో
మనకుం బదివే లెట్లట
చన నిమ్మా చిలుక తద్విచారం బేలా ? 44

సీ. అని రాగవల్లరిఁ గనుఁగొని యా పత్రి
కార్థ మే విన్నట్ల యగుఁ గదమ్మ
చదువుకొంటిరె యన్న నది తాను జదివిన
యంతయుఁ జెప్పి 'న న్నవలఁ జదువ
నీక తా నొడిసి యా యాకుబలిమిఁ బుచ్చు
కొనియె నీ పడు' చన విని మరాళి
యటమీఁదఁ దెలియ నాయము కాదు మనకు స
నన్య ప్రకాశ నీయంబులైన

ప్రేమ భంగులఁ దా నేమి యేమి వ్రాసి
యనిపినాఁడో కదుర్ రహస్యంబుగాఁగ
నట్టి యా కాముకుని కూర్మి లతని సతియె
చదువుకొని మోదసంపదఁ బొదలనిమ్ము ! 45

క. ఓ వనిత! లేఖలోనఁ బ్ర
భావతి యనఁబోయి ప్రప్రభాభావతి యం
చీ విధమున వ్రాసిన భ్రాం
త్యావిష్టుండేమి వ్రాయఁ దలఁచెనొఁ గూర్మిన్! 46

క. వెఱఁగయ్యెడు నే నప్పు డీ
తరుణి గుణంబులు నుతింపఁ దాను విరక్త
స్థిరుఁడట్లు యుండి తోడనె
విరహార్తుఁడ నైతి ననుట వివరింపఁ జెలీ! 47

క. ప్రాయపువాఁడఁట సద్వృత
శ్రీయుక్తిఁ దలిర్చు బిత్తరి న్వినెనఁట యా
హా! యాతనియాత్మ యినుమొ
ఱాయో కులిశంబో నెఱిఁ దొఱంగక యుండన్! 48

వ. అదియునుం గాక 49

గీ. సకలసౌభాగ్య భాగ్య లక్షణ సమైక
ఖని ప్రభావతి సిద్ధసంకల్పగాక
యుండునేని శాస్త్రము లిన్నియును బుధులకుఁ
బ్రత్యయానర్హతను వృథాభరమె కావె? 50

వ. అనినఁ బ్రభావతి దాని కిట్లనియె: 51

సీ. ఇపుడేమిగంటి నా కెక్కుడి సిద్ధసం
కల్పత గుమ్మడుకాయలోన

నావగింజయుఁ బోదు హంసి! నా చింతాభ
రంబులో లేశమాత్రము నుడుగుట
గలదె యీవేళకుఁ దలపోసి చూచినఁ
దాదృ శాశ్చర్య సౌందర్య కోమ
లాంగుఁ డవ్విభుఁడు నాకై యెంత యలసెనో
యెంత కుందెనో యను నిట్టి వెతయు

నొకటి తొంటికంటె విశేష మొదవె నేఁడు
దీనిఁ దరియింప నీక నెద్ది తెరువు చెపుమ!
యసురపతి యొల్లఁ డాతని యల్లుఁదనము
పుర మితని యాజ్ఞ లేకెట్లుఁ జొరఁగరాదు. 52

వ. అనుటయు శుచిముఖి ప్రభావతి కిట్లనియె: నో పువ్వుబోఁడి! నీ పలికిన యంతయుం దప్పదు నీ విభునిరాకకు నాకవిరోధి యనుమతి సాధించుటకు నుపాయం బొక్కటి గలదు దాని నేన యెఱుంగుదు; నీకు ననువైన సమయంబున నన్ను సరసకథా కథనప్రవీణ యనియును సకల విద్యాధురీణ యనియును బ్రభువుల నుబుసుపుచ్చి మెచ్చింప నేర్చు ననియును నిచ్చకు వచ్చునట్లుగా భవజ్జనకునకుం జెప్పి సమ్ముఖంబునకు రప్పించుకొనునట్లుగాఁ జేయు మట మీఁదటి కార్యంబునకు దైవంబు గలదు పోయివచ్చెద నిచ్చటి కొలంకులన యుండెదఁ జుమీ! మాటబడిన పిలిపింతుగాని యనుచు వా రిద్దఱు వీడ్కొని నిజేచ్ఛం జనియెఁ బ్రభావతియు సఖీసహితయై గృహంబున కరిగె నంత నక్కాంత యొక్క సమయంబున, 53

చ. వెలుపలి కొల్వు వీడ్కొలిపి విశ్రుతతేజుఁడు వజ్రనాభుఁ డిం
పలరఁగ రాణివాసమున నాడెడి పాడెడి పువ్వుఁబోండ్ల సే
వలు గొనుచుండఁ జేరి తగు వర్తన నొప్పుచుఁ దన్నతండు వ
త్సలతయు గారవంబు నెదఁజల్లెడు మాటల నాదరింపఁగన్. 54

వ. శక్తియు రత్నసింహాసన సమీపంబునఁ బ్రవర్తిల్లుచు నల్లన ప్రసం
గంబు దిగిచి సవినయ మధురభాషణంబుల నిట్లనియె : 55

ప్రభావతి హంసివృత్తాంతము తండ్రితోఁ జెప్పుట

క. మన బొడ్డన బావులలో
ననుదినముఁ జరించు నంచలం దొక హంసాం
గన యేమి చెప్పఁ దండ్రీ!
కని విని నేనెందు నెఱుఁగ గని విద్యలనున్. 56

చ. శుచిముఖి యంద్రు దానిని వచోనిపుణత్వమునందు సత్కథా
రచనలయందు నీతివిదురత్వమునందు బహుశ్రవానలో
కచణతయందు నెందు సరిగానము దానికి వేయు నేల దా
ని చతురతా విశేషములు నీవ కనన్వలయు న్మహాత్మకా! 57

గీ. అనుచు నాదైత్యపతి తన యనుఁగుఁ గూఁతు
మాటలొక ముద్దుసేయుచు బోటిఁ బనిచి
యమ్మ! రప్పింపవే చూత మమ్మరాళి
ననియె నింతియు రప్పించె హంసి నపుడు. 58

వ. రప్పించి ముందట నిడుకొని శుచిముఖి! నీదువిద్యా విలాసంబు విన్న
వించిన నయ్యె విననలయు నని వేడుక పడుచున్నవాఁడు శాస్త్ర
ప్రసంగంబు సేయు మనిన నదియును, 59

హంసి వజ్రనాభునెదుట శాస్త్రప్రసంగము చేయుట

క. వీనులకు సుధా రసముల
సోనలు వర్షించు మృదుల సుస్వర ఫణితిం
దా నిట్టట్టు గ్రుక్కక పని
లేని పునఃపదము లిడక లీల దలిర్పన్. 60

శా. కాణాదంబును గౌతమీయమును సాంఖ్యంబున్ భుజంగాగ్రణీ
వాణీమార్గము జైమినీయమతమున్ వ్యాసోక్తశాస్త్రంబు వ
క్కాణించెం గడుఁ బూర్వపక్షములు జోకం బెంచుచు న్వెంచి య
క్షీణప్రౌఢిఁ దిరస్కరించుచుఁ దుదన్ సిద్ధాంతము ల్నిల్పుచున్.

మ. స్వమతిప్రౌఢి దృఢానుమానముల సంస్థాపించు నే వేళ నె
ద్ది మతం బప్పుడు వాని వానికి నుపాధిగ్రస్తతా వ్యాప్తి భం
గముఖానేక సుదూషణంబులు వెసం గల్పించుఁ దా నన్య శా
స్త్ర మతస్థాపనవేళ నవ్విహగి దైత్యశ్రేష్ఠుఁ డోహో యనన్. 62

వ. మఱియును 63

గీ. కావ్యనాటకాలంకారగానమదన
శాస్త్ర పరిచయ మహిమంబు జాలపాద

భామినీమణి నెఱపె నుద్దామపటిమ
నా యసురభర్త మెచ్చి ప్రనే! యనంగ. 64

వ. అంత నద్దనుజనాయకుండు శుచిముఖీ ముఖం బవలోకించి నీవును
నానా దిగంతచారిణివి కే కనిన యద్భుతంబు లేమేనియుం గలిగిన
నెఱింగింపు మనవుడు నా యంచ యించుక విచారించుట యభిన
యించి యిట్లనియె: 65

గీ. కనిన వోద్యంబు లెన్నియో కలవు వాని
నేమి చెప్పుదు నందులో నెల్ల నాకు
నతివిచిత్ర మై తోఁచినయది నిశాచ
రాధిప! వచింతు నొక్కటి యవధరింపు. 66

ఆ. నటుఁ డొకండు భద్రనాముండు ము న్నొక్క
చోటఁ దాపససభ నాటనేర్పు
వలన మెచ్చఁ జేసి వరముగా నత్యద్భు
తంపు నాట్యపటిమ పెంపు వడసి. 67

సీ. ఏడు దీవులఁ జరియించుచు నున్నవాఁ
డని చెప్పి యతని నాట్యములవేళఁ
గలయట్టి యద్భుతంబులు సర్వమును సవి
స్తరముగ వినిపింప దానవేంద్రుఁ
డాశ్చర్యకౌతుకాయత్తాత్ముఁ డగుచు నే
నును గొంత కొంత యాతని తెఱంగు

ఐని చూడవలయు నన్వేడుక నుండుదు
నీవు ప్రవీణ వన్నిటను హంసి!

యా నటుని నిచ్చటికిఁ దెచ్చితేని మెచ్చు
గలదు నీ కని ప్రేమతోఁ బలికె నదియు
నట్ల చేసెద నని దనుజాధినాథు
నీడ్కొని ప్రభావతిని జూచి వినయ మొప్ప, 68

హంసి భద్రునిఁ దెత్తునని చెప్పి ద్వారకకుంబోయి
కృష్ణాదులతో మాటాడుట

ఉత్సాహ. అనిపెదే ముదంబుతోడ నమ్మ! పోయి వత్తునా
యనుడు నదియుఁ గొన్ని యడుగు లనుప నేగుదేర నో
వనరుహాక్షి! యింతయు న్భవత్ప్రియార్థమే చుమీ
మనమునందు నిది యెఱింగి మైత్రి మఱవ కుండుమీ. 69

వ. అనుచు గూఢవృత్తిఁ దదిష్టసాధనపరత సూచించి యలరించి యనిపించుకొని ద్వారకానగరంబునకుం బోయి తాను వజ్రనాభు చేత భద్రనామధేయ నటునిం దోడ్కొని తెచ్చుటకు నియుక్త యగుట కృష్ణుని కెఱింగించి వజ్రనాభానుజుం డగు సునాభుని కూఁతులు గదసాంబులకు భార్యలుగాఁ గల రని నారద వచనంబులకలిమి చెప్పి ప్రద్యుమ్నున కసురజయ సాహాయ్యకంబు నడుప గదసాంబు లరుగువా రని నిశ్చయించిన యా చక్రధరుని నిశ్చయంబు విని యది తదీయశాసనంబున వాసవునకు విన్నవింప దివంబునకుం జనుచుం బ్రద్యుమ్ను నింటి కరిగి యప్పు డతండు

ప్రభావతీవియోగతాపాతిభారంబున నసురుసు రగుచు మిగుల
నొగిలి తదనంతచింతం జేసి నిజాగమనంబ కోరుచున్నవాఁడు
గావున నతనిచేత నతిమాత్రాదర గౌరవంబు వడసి యేకతంబున
నతనితోఁ: 70

సీ. ఒక చిల్కచేతఁ బత్రిక యంచితే నాకుఁ ?
ననిచితి ; నది నీకు నందె నొక్కొ ?
యనుచు నెవ్వరెఁగూర్చి యది వాకినిజేరె ;
నా యింతికె శుభంబె హంసరమణి ?
నా లేఖ యందుట నా మాట యన వచ్చు
ము న్నట్టి కొదవ రా మూల మెద్ది ?
పత్రిక కడు దైన్య పడి నీవు పంచు టె
ట్లా కాంతపై నెంతహాళికలిమి

నా సతియు భవద్విరహాగ్ని నంత గుందె
నన్ను నెఱుఁగుట యెట్లు ము న్వాంఛ సేయ ?
శివ లిఖించి యిచ్చినది నీ చెలువు దాని ;
కేమిటికి నిచ్చె ? వరుఁడు నీ కితఁ డనుచు. 71

మ. అనుచు న్మాటకు మాటగా వరుసతో హంసీకులోత్తంస మా
తనికిం దైత్యతనూజ కోర్కె తెఱఁగుం దన్మూలముం జెప్పి యి
ట్లను నే నీ కిది నాఁడె తెల్పుటకుఁ గాదా చేసితి న్జాలఁ ద
ద్ఘనశోభాస్తుతి నీ వొకించుకయుఁ జిత్తం బీమిఁ జాలించితే. 72

వ. ఆ ప్రభావతి నన్ను నత్యంతప్రియసఖింగా నమ్మకొన్నది గావున
దాని గుట్టించుకయు నే నెఱుంగనియది లేదు కనియు వినియు
సమస్తంబు నాకళించినదాన నని యతనికి భవానీకృపానుగ్రహ
పతిప్రకారంబు సకలంబునుం దెలిపి యి ట్లనియె : 73

హంసి ప్రద్యుమ్నునితోఁ బ్రభావతి కతనియందుఁగల
యనురాగాదులఁ దెల్పుట

చ. భవదమలాకృతిప్రతిమఁ బర్విన యప్పుడు చూపు క్రమ్మఱన్
దివఁ గదలింప రాక సుదతి స్గతచేష్టితఁ జేసె నోయదు
ప్రవరుఁడ ! యేమి చెప్పుదును రాగకుతూహల విస్మయాతి గౌ
రవమున నెంత వ్రేఁగగుచు రాపడి యుండునొ కాని యత్తఱిన్.

చ. కొసరక చూపుచేతఁ గడుఁ గ్రోలిన నీచెలువంబు చెల్వ మా
నసమున నెంత మిక్కిలి ఘనంబుగ హత్తెనొ కాని యప్పు డో
రసికశిఖావతంస ! యదురత్నమ ! కాకరకాయ రీతిఁగాఁ
గిసలయపాణి చన్నుఁగవ క్రేవ గగుర్పొడిచెం బొరిం బొరిన్. 75

ఉ. వావిరి నెల్లప్రొద్దును భవత్పరిరంభణ చుంబనాది నా
నావిధ భోగలీలకు మనంబున నువ్విళులూరు చున్కి ప్ర
భావతి దెల్పెఁ గొన్ని నిశలం గను మూసినయంతమాత్రఁ బై
పై విలసిల్లు కుట్టమితభావ విశేష విజృంభణంబులన్. 76

మ. కలలం గూడినవేళ నెట్టిపొలయల్క ల్పుట్టెనో యేమి నీ
వలనం దప్పు ఘటిల్లెనో యెఱుఁగఁ దత్స్వాప్నాగమామర్ష వి

హ్వలితస్వాంతయ పోలె నిద్ర నెఱయ న్వర్జించెఁ బద్మాక్షి య
క్షు లహోరాత్రములందుఁ బద్మకుముదస్ఫూర్తి న్విడంబింపఁగన్.

క. చిత్తజమహాగ్ని కాఁకల
నెత్తుపజిఁగ వన్నె యెక్కె నంతయు నెమ్మే
న త్తరుణికి జను లందఱుఁ
బుత్తడిబొమ్మ యనుమాట బొంకేల యగున్! 78

సీ. రోలంబనికురుంబ కేలిమశ్రీఁ బోలె
వేణి ముట్టుట కెపు విరస మయ్యె
సమదకోకిల శుక స్వర సామ్యమునఁ బోలె
సఖుల సల్లాప మసహ్య మయ్యెఁ
బరిపూర్ణ చంద్రబింబ సమత్వమునఁ బోలె
నిలువుటద్ద మదర్శనీయ మయ్యెఁ
బ్రసవాస్త్ర వివిధమార్గణ వర్ణధృతిఁ బోలె
రత్నభూషాళి యగ్రాహ్య మయ్యె

వేయుఁ జెప్పఁగ నేల నే విలసనంబు
లుల్లమునఁ దలపోయుట యొకటి దక్క-
బహు దినంబులనుండి యా పడఁతి కితర
వస్తు రుచు లన్నియును గాని వావి యయ్యె. 79

క. వెదకికొని తానె యిటు రా
మది సాహస మొంది కదలు మాటికి నే దూ

పెదుటఁ దన కంతఁ దోఁచిన
మదిరేక్షణ తత్తఱిలుచు మగుడుఁ లజ్జన్. 80

క. ఆ పడఁతి యడలఁ జేసెను
జూపఱి నపు డేమి చెప్ప శోషిలుచుఁ గడున్
నీ పత్రిక యా నిమిషము
లోపల రా దేనిఁ బాటిలు దశాంతరమున్. 81

వ. ఆ పత్రిక యుపకారంబునుం దాత్కాలికస్థితికారణం బగుట యొక్కటియ కాని యక్కన్యకు మిక్కిలిం దాపంబు గావించు చున్న యది యె ట్లంటేని : 82

క. క్రిందటిదినములు విరహా ద
శం దా నలఁగుటయ కాని సరిగ నిపుడు నీ
వ్రుం దన కై కుందుట విని
యెం దరుణికి నింక నిమిష మేఁడై తోఁచున్. 83

ఉ. భావన చేసి చూడ క్షణభంగుర మింతులతాల్మికల్మి వా
తావిల పల్లవాంచల హిమాంబుకణంబును నంతకంటె నే
ల్గావున నింక నెంత యవిలంబమునం గృప నేగి ప్రోచెదో
దేవరచిత్త మాసతియదృష్టము వేయును జెప్ప నేటికిన్ ! 84

వ. అనిన విని యతండు 85

క. గ్రక్కునఁ జని ప్రాలుదునో
తెక్కలు గట్టుకొని దివిజరిపు మేడలపై

నక్రోష్ణమ్మఁ జూచు కెంపుఁగెంపు
వాక్రోలు యనుచునంత తమకి మున్నది మదిలోన. 86

గీ. ఏమి సేయుదు నా దైత్య నియ్యకోలు
లేక యేఁ కెవ్వరికిఁ జొర రాక యుంటి
యరసి వేఁగుచు నున్నాఁడ సమరపతియు
హరియుఁ దలఁపోయు కార్య మే మయ్యెఁ జెప్పుమ! 87

వ. అనిన శుచిముఖి యతనిఁ జూచి 'ఓ కుమార! నీకుఁ బత్పుర
ప్రవేశచింత వలవదు తదుపాయంబు హరి నిశ్చయించుకొని
యున్నవాఁడు వజ్రనాభవధ కార్యంబునకు నేను భవదిష్టసాధ
నానుకూల్యంబు చింతించి నిన్నే యనుపునట్లుగాఁ జేసితి వాసుదేవుం
డిప్పుడ యీ వర్తంబు నిన్నుఁ బిలిపించి యనుపుచున్నవాఁడు
వజ్రికి సిద్ధి యొనరించి వజ్రపురంబునఁ గలిగి యేనును దగిన తెఱం
గునం దావకీనకార్యానుగుణ్యంబు నడపుచుండెద' నని పలికి
యతని వీడ్కొని చనియె నప్పుడు, 88

సీ. అమరారి కరుల కుంభములు వ్రయ్యఁగ మొత్త
రమణిచన్నులు నఖాగ్రముల నొత్త
సమదరాక్షస రథచక్రంబు లిలఁ గూల్పఁ
గాంత శ్రోణికి నూడిగంబు సల్ప
నసురేంద్ర జయశంఖ మవనిపైఁ ద్రేయింపఁ
గామిని కంఠంబు కౌఁగిలింప

వజ్రనాభుని ధనుర్వార్తలు గడతేర్పఁ
బడఁతి కన్యామసంజ్ఞఁ బను లొనర్ప
దైత్యు మెఱుఁగుఁదూపులు దళితములు సేయఁ
దత్తనూజ చూపులు ఫలితములు సేయ
నుదుటుఁదనమును వలపు నొం టొంటితోడ
దంటగొని క్రమ్మ నెమ్మదిఁ దాల్చె నతఁడు. 89

**కృష్ణుఁడు ప్రద్యుమ్నుఁడు మొదలగు వారిని వజ్రపురమునకు నంపుట**

సీ. అంతట గోవిందుఁ డతనుని గదసాంబు
లను బిలిపించి యలంఘ్యదర్పు
వజ్రనాభుని బ్రహ్మవర బలోద్ధతుని దే
వ హితార్థమై త్రుంప వలయుటను
దన్మహత్త్వంబును దత్పట్టణ ప్రవే
శం బన్యులకు నసాధ్యం బగుటయుఁ
దాను మరాళిచేఁ దగ ఘటింపించిన
తదుపాయమును విశదముగఁ జెప్పి

యందు రుక్మిణిసుతుఁడు భద్రాఖ్యురూపు
గదుఁడు పారిపార్శ్వకుని యాకారము మఱి
సాంబుఁడు విదూషకుని ప్రకారంబుఁ దాల్చి
చనఁగ నియమించి పంచెను దనుజపురికి. 90

ఆ. ఆ ముగురు పరస్పరావిదిత స్వప్రి
యాంగనా సమాగ మానుగుణతఁ

ప్రమద మొంది రేపుడు ప్రత్యేక మీయాత్ర
నాదు భాగ్య విలసనంబ యనుచు. 91

ప్రద్యుమ్నాదులు వజ్రపురికిఁ బోయి యాటనేర్పు చూపుట

సీ. మనముల నిట్లుబ్బుచును నట వేషంబు
ధరియించి తమకును దగిన యట్టి
వారసీమంతిని వ్రాతంబు గొలువ నై
ణిక వైణవిక మారజిక జనాది
నాట్యసామగ్రి యుఁ భద్రమున కెట్టిది
యట్టిద యై కనుపట్టుచుండఁ
గదలి యథోచితగతిఁ బయనంబులు
వర్తిల్లఁగా నేగి వజ్రపురము

ప్రాంతమునను శాఖానగరములయందు
విరివి చూపట్ట మేళంబు విడిసి విడిసి
యతి విచిత్రంబు లగు తమ యాటనేర్పు
లెల్ల నెఱపిరి కడువార్త కెక్కుచుండ. 92

క. దనుజేంద్రుఁడు తద్వార్తలు
వినుచుఁ హృదయమునఁ బొదలు వేడుకతో వా
రిని బిలిపించెను వారును
జని యా దనుజునకు నుచిత సమయమునందుఁ. 93

క. తమ నాట్యవిద్యఁ జూపఁగ
సమకట్టి తదర్హమైన సన్నాహవిశే
షముతోడ నేగుదెంచిరి
రమణ దలిర్పంగ నృత్యరంగస్థలికిన్. 94

వ. శుచిముఖి యటమున్న తన పలికిన క్రమంబున వచ్చి వజ్రనాభుని యాదరంబు వడసి ప్రవర్తిల్లుచుం బ్రభావతికిం జంద్రవతీ గుణవతులకుం దత్పతుల రాక తెఱం గెఱింగించి వియోగ తాపంబున మిగుల నొగులకుండఁ దదాశా శీతలోపచారంబున సేద దేర్చుచు నుండి యప్పు డక్లేశంబున నేతెంచిన ప్రద్యుమ్నునకు క్షణక్షణ ప్రవర్ధమాన ప్రభావతీ రాగ వృత్తాంతంబున నౌత్సుక్యంబు బెనుచుచు నతి గూఢంబుగా రాకపోకలు గావించుచునికిం జేసి యతనితోడ నేఁడు నీ హృదయవల్లభ నీ నాట్యంబు చూడ వచ్చునని చెప్పి తదాగమనీయ హర్మ్యస్థలంబునుం జూపి పోయె నంత 95

సీ. వజ్రనాభుఁడు రాజ్యవైభవం బెంతయు
మెఱసి నానా బంధు మిత్ర సచివ
సంఘంబుతోడ నాస్థాన మహామండ
పమునందు నొడ్డోలగమున నుండి
పరులదృష్టికి నగోచర మగు సంవృత
స్థలి నిల్చి రాణివాసపు జనంబు
చూచునట్టుగఁ జేసి సొంపారు వేడ్కతో
సావధాన స్వాంతుఁ డగుచుఁ జూడ

సంవిహిత రంగ మంగళా చారుఁ డగుచు
సురహితముగ మాయానాట్య సూత్రధార
వృత్తి గైకొని శంబరద్వేషి యొనరెఁ
బూర్వరంగ ప్రవర్తన పొందు పఱుప. 96

వ. అప్పుడు 97

శా. గాంధార ప్రముఖ స్వరశ్రుతి కళాగంభీర వారాంగనా
గాంధర్వంబు ఘనస్వనంబు తతనిక్వాణంబు వంశాది సం
బంధిస్వాన పరంపరామహిమయున్ మద్దెళ్ల దిందింధిమిం
ధింధోంధిక్కు ధిమిక్కుశబ్ద భరమున్ దీపింప నాపూర్ణతన్. 98

సీ. సరవిఁ జంచత్పుట చాచపు టోద్ఘట్ట
షట్పితాపుత్రక సంజ్ఞ లమర
వెలయు చుంచెడు సమవిషమతాళ ప్రవృ
త్తులు నాల్గు ప్రస్తారకలన వలన
గలుగు నానా తాళములు యథోక్త స్ఫూర్తిఁ
బరఁగు నేలాది ప్రబంధచయముఁ
దత్తదర్థస్థాన దత్త పటాక్షర
బిరుదాదికాంగ విస్ఫురణ దనర

క్షితిఁ జతుర్దశమద్రకి గీత భేద
ములు దురాపము లంద్రు వర్తిలె నవియును
నిఖిల కళలును గల రౌక్మిణేయు శిక్ష
వలనఁ దన్నాట్య కర్మప్రవర్తనమున. 99

ఉ. ఆ వనజాక్షు నందనుఁడు నంతట నాంది దగం బఠించి యిం
పావహీలం బ్రరోచనయు నాముఖముం దనరారనొప్పు ప్ర
స్తావనతో ముఖాదులగు సంధులు సాంగతఁ బెంపుమీఱ గం
గావతరాది నాటకము లాడె ననేకము లద్భుతంబుగన్. 100

సీ. ఆ నాటక ప్రయోగావసరముల భ
గీరథాద్యాకార ధారణమును
గంగాది నిమ్నగా గతియుఁ గైలాసాది
నగకల్పనమును నానా వన ప్ర
పంచనంబును బశుపక్షిమృగాది జం
తువిశేష రూపవృత్తులును మఱియు
నెచటి కెయ్యది యోగ్య మచటఁ దత్తద్వస్తు
సృష్టి సన్నిదము వేసియును గృతక

మగుట నిశ్చయింపఁగ లేక యబ్రపడుచుఁ
జూచి సామాజికులు తమ సొమ్ము లెల్ల
నొసఁగులుగ వైవ నవ్వుచు నొప్పుమీఱె
రుక్మిణిసుతుండు మాయా నిరూఢి మెఱసి. 101

వ. ఇవ్విధంబున నాత్మీయదివ్య మాయాప్రపంచ సముదంచిత నాట్య
వంచితులం గావించి నక్తంచరుల ధనసంచయంబు నూఁచ
ముట్టుగా దోఁచుకొనుచుం జూచుఖేచరులకు వేడ్కఁబుట్టించుచు,

మ. ప్రియకాంతామణి చూడ్కికిన్ నిజవపుఃశ్రీతోన తోఁచెన్ మహా
నయమాయానిధి రుక్మిణీసుతుఁడు నానాభూమికా ధారణం

షయి భద్రుండయి పొల్చు వేళ 'నహి మాయాయామసంభావ్య మ
స్తి' యటంచు న్నుభు లాడుమాటమదిఁ జింతింపంగ బొం కేలగున్.

శా. ఆ భవ్యుండట మున్నొకానొకెడ — నెన్ మొప్పార స్మరాళి ప్రది
ష్టాభిజ్ఞాన గవాక్షలక్ష్మి దనుజారాత్యక్షాత్మజావక్త్రవి
ద్యాభద్రంబును సాకేతం దనకుఁ బెల్లం జేసికొంచువ్వన
ట్లా భామామణికిం బ్రభుస్తుతి విశిష్టార్థంబుగా నిట్లనున్ : 104

చ. సకలవిశేషశోధనకుఁ జాలిన యో నెరజాణ ! వజ్రనా
భకులవతంసరత్నమ ! ప్రభావతి కోహిత కంటకంబు తా
నకమగు చూపు నాకయిఁ బ్రవర్ధితరాగతఁ బర్వెఁ గాన న
త్యకలుషవృత్తి నా సుకృతమంతయు నేఁడుసుమీ ఫలించుటల్.

గీ. నీకు నామీఁదఁ గలయట్టి నెయ్యమును మ
హాదరము నీవు పనిచిన హంసి చెప్ప
నాత్మలో ననవరత నాట్యప్రసంగ
మున నిను భజించు వేడుక ఘనము నాకు. 106

క. నను నేలికొను మవశ్యం
బును నీ యూడిగము చిత్తమున కెక్కఁగ నే
నొనరింతు నేటి తమి నీ
మనమున నెంతయు నిడుకొని మన్నింపఁదగున్. 107

క. అన విని కపోలయుగళము
ఘనపులకితముగ మరల్చి గ్రక్కున నాత్మ

వనము ప్రభావతి యాలో
కన జాలకమునకు నెడగఁ గడు లజ్జమెయిన్. 108

చ. అపుడు తదీయపార్శ్వగతయైన మరాళవధూటి దానవా
ధిపతనయం గనుంగొని మదిం గనుఁగొంటివె యాత్మనాథు వా
క్యపదవిఁ దోఁచునట్టి యితరార్థము సర్వము నాననాబ్జముం
ద్రపనిటుత్రిప్పి తింతి! గరుదాల్చెఁ గపోలము చాల నావుడున్. 109

క. విచ్చలవిడి ననుఁ జేకొని
యిచ్చను గలదెల్లఁ బలికె యిదె నేఁటినిశ
న్వచ్చెద ననుచున్నాఁ డిఁక
నిచ్చో మఱి యర్థ మెద్ది యితరము దీనన్. 110

క. ఎవ్వరు వినుటకుఁ గైకొనఁ
డివ్విభుఁ డిది యేమిభ్రాంతి యెత్తెనొకో నా
కెవ్విధి ప్రాప్తమొకో యని
నివ్వెఱపడి యింతతడవు నిలిచితి వినుచున్. 111

వ. అనుడు శుచిముఖి యా శశిముఖి నీక్షించి, 112

మ. అతివా! యన్నిట జాణ నీ మగఁడు నీ కా చింత యుక్తంబు గా
దతఁ డర్థద్వితయోక్తి సేసె నుచితంబైనట్టు నీకు న్సభా
పతి కర్హంబగు రీతి నాతనికిఁ దోఁపం బల్కినాఁ డేది నీ
మతిఁదోఁచెం బ్రకృతంబుగామిఁ బరులాత్మం గాన రాయర్థమున్.

క. సకియా! నానార్థోక్తుల
నొక నియమము తెలియ నర్థ మంచితం జెప్పన్
టికి నెట్టి యదియ యయ్యెఁ
బ్రకటము కాదె శ్రీవిభుఁడను పలుకుఁ బోలెన్. 114

వ. నావుడు న వ్వల్లభుండు నిన్నుఁ బలికిన పలుకు లన్యార్థేఁగినో
యను నొక విచిత్ర మైన శిఖరులకు నాట్యావసాన సమయ సము
చిత స్తోత్రప్రకరణ బలంబునఁ దోఁచుచున్న యర్థాంతరంబుచేతఁ
బ్రభువు నుపచరించి యిట్టి చాతురిచేతఁ దన విడిదికి ననిపించుకొని
చనుచున్నవాఁ డని పలికె శుచిముఖి యంతం బలికినట్లు చేయు
రాక్షసేయుం జూపి తన తలంపు యథార్థం బగుట తార్కాణించె
నట్లు విహాగమహిళా రహస్యసంభాషణ రసానుభవంబున విభా
సిల్లు ప్రభావతియు రాగవల్లికీ సహితంబుగా గృహంబున కరిగి
ప్రియసమాగమ త్వరమాణమానస యగుచు నుండె నంత, 115

ఉ. ఎప్పుడు వచ్చుఁ గాంతుఁ డినుఁ డెప్పుడు గ్రుంకు నటంచు నాత్మలో
ముప్పిరిగొన్న రాగము సముత్కటమై కనుదోయి కుబ్బఁ గాఁ
దొప్పఁగఁ దోఁగుచూడ్కిని వధూమణి సారెకుఁ జూడఁగాఁ జవిరా
యిప్పొలుపొందె నీతఁ డన హేళి క్రమంబునఁ దాల్చె రక్తిమన్. 116

## సూర్యాస్తమయాది వర్ణనము

ఉ. అంబుధిలోని కంతటను హంసుఁడు డిగ్గ దినాంత మజ్జనా
ర్థంబును బోలె నట్టియెడఁ దత్తటి నాఱఁగఁ గట్టి నట్టి ర

క్తాంబరమో యనంగఁ దనరారెఁ గడుం గడసంజ కావి యం
తం బొడసూపెఁ దారకలు తత్పతనోద్గతబిందులో యనన్. 117

క. తోరపుఁ జీఁకటు లంతన్
మారోత్సవకలనమునకు మదిఁ బొంగుచు ది
ఙ్నారీ జను లాడెడి క
స్తూరి వసంతముల యొప్పు చొప్పడ నెరసెన్. 118

వ. అంత 119

క. ఐరావణకరి కర ఫూ
త్కార వమథు కేణుపటలి కైవడిఁ గుత్కీ
లారి దిశఁ దెలుపు తోఁచెను
దారలు ప్రథమోత్థబిందుతతి గతిఁ బరఁగెన్. 120

వ. తదనంతరంబ 121

చ. తివిరి త్రియామకు న్సొగసు దిద్దికొనంగఁ బురోదిశాళి దా
గవిసెన వెల్వరించు మణికల్పితదర్పణమో యనంగఁ గై
రవకులబంధు మండలము రాజిలె నోలిని లీయమాన మై
మివ్వులఁ గళంకలక్ష్మ్యతఁ దమిస్రాప్రతిబింబము నంత నేర్పడన్. 122

గీ. తామరసలక్ష్మ్మి లా చందమామ రాకఁ
గలఁగుచును గుముదాళికై తొలఁగె నపుడు
తొలఁగుబావయె కాఁడె తమ్ముల వరించు
నట్టి సతులకు నతఁడు ము న్నెట్టిఁ డైన. 123

చ. పనుపడ వేఁటనాళములుఁ బగ్గములుం బలెఁ గ్రిందఁ బర్వ శో
భన కిరణప్రకాండములు భాసిలఁ జామరుఁ డొప్పె నంతయున్
మనసిజుఁ డెల్ల ప్రాణుల మనంబులు చేలుగ రాగబీజము
ల్వెను జతనంబుతోడ వెదఁ జల్లెడు భాగ్యపుజడ్డిగం బనన్.124

చ. నెల యను వెండికుండఁ గడుఁ నించి నిశాఖ్యచకోరనేత్ర యిం
పలరఁగ నంబరాహ్వయ మహాకటమూర్తి మహాభిషేకముల్
జలుపఁగ నెల్లదిక్కులఁ వెసం బ్రవహిల్లెడు పాలవెల్లి నాఁ
బొలిచె సమస్తముం జలువఁ బొంద నమందత నాఁడు చంద్రికల్.

చ. తొలఁకెడు హాసకాంతుల విధుద్యుతిఁ బ్రోచి చకోరమైత్రి జో
కలు మెఱయించు కన్గవల కల్కితనంబునఁ బుష్పలావికల్
తలఁపులు గొల్లలాడి మిగులం బ్రమయించి యువవ్రజంబుచే
వెల లధికంబుగాఁ గొనుచు వేడుక నమ్మిరి పువ్వు లంగడిన్.

ప్రద్యుమ్నుఁడు ప్రభావతియంతిపురంబునకుఁ దుమ్మెదయై పోవుట

గీ. అప్పుడు ప్రభావతికి నొక్కయతివ విరులు
గొనుచుఁ బోవఁగ నందు నింపునఁ జరించు
తేఁటి గమిలోనఁ దా నొక్కతేఁటి యగుచు
నేగె మాయాఘనుండు రతీశ్వరుండు. 127

వ. అటమున్న పతిసమాగమోత్సవ సముత్సాహంబునంజేసి యప
రాహ్ణంబుననుండియుం గ్రీడాభవనపర్యంకాది సముచిత నూతన
సత్క్రియావిశేష సంపాదనంబునకుం దగిన పరిచారికల నియో

గించుచున్న ప్రభావతిమనోరథం బెఱింగి రాగవల్లరి యతిప్రయ
త్నంబున 128

క. చెలువకు సంపెఁగనూనెం
దల యంటి సుగంధవాసితము లగు చూర్ణం
బుల నలుగుఁ బెట్టి గంధా
మలకం బిడి చమురు దిగిచె మజ్జన మార్చెన్. 129

చ. చెలికె మెఱుంగుఁ బావడలచేఁ దడి యార్చెను ధూపవాసనల్
వలుకొలిపె న్ప్రసూనసదలంకృతి మీఱఁగ వేరువేర మె
ప్పు లరసి కేలుగంటు జడ హొల్లెను ప్రేలుపుఁగొప్పు మూఁడుమూ
లల బిగికొప్పు పెక్కుగతుల న్నిలిపెం బలుమాఱు విప్పుచున్.

వ. అప్పుడా రాగవల్లరి ప్రభావతి నుద్దేశించి : 131

చ. విరిసిన నొక్క యొప్పు నరవీడిన వేరొక యొప్పుఁ జిక్కువా
ఓరసిన నొక్క యొప్పు నది యూడ్చిన వేరొక యొప్పు వేణిభా
వరచన నొక్క యొప్పు ముడివైచిన వేరొక యొప్పు కొప్పుగాఁ
బరఁగిన నొక్క యొప్పుఁ గనుపట్టక మానదు నీ కచంబులన్. 132

క. తెఱవా! సందిట సందెపు
నెఱవెండ్రుక లాయతములు నీలము లివి యే
పెఱుఁగున ముడిచిన నీకున్
గొఱఁత గలదె యువిద జట్టిగొను నీ విభునిన్. 133

క. అనుపమ విరహవ్యాపబంధం
బునఁ జెలి నెమ్మది సడలి మరలి పొలఁతుక నై చెం
దన చేతి పుష్పబంతిని
గినుకయుఁ జూపొప్పఁ గన్నుఁగ్రేవలఁ దోలెన్. 134

వ. అంత 135

గీ. ఆ చెలువ యక్షకర్దమం బాదిగాఁగఁ
గలపముల భేదములు తన వలసినట్లు
సంఘటించి కుంకుమ చందనాదు
లలఁది నలిపించుకొనియె మే లరసి యరసి. 136

గీ. మృగమదాదులఁ జిత్రకబొట్టుగ నెయాకు
బొట్టు పూర్ణచంద్రతిలకంబు నెలవంక
విధము నామము గుమ్మడివిత్తునామ
మొకటి గా దని యొకటి యాయావిధ దాల్చె. 137

గీ. వెలఁది మట్టెలు పిల్లాండ్లు వీరమద్దె
యలును నందెలు మొలనూళ్ళు నంగుళీయ
కంకణాంగదహార తాటంకముఖ స
మస్త భూషణములు దాల్చె మార్చి మార్చి. 138

క. ఒక్కొక తోయము సొమ్ములె
పెక్కుఁ దెఱంగులవి యునికిఁ బెంపున నవి యొం

డొక్కటి మీఱుచుఁ దనప్రభ
నొక్కఁడగుటఁ ద్రిప్పిత్రిప్పి యింతి ధరించెన్. 139

ఉ. అంచలపట్టొకింతతడ వ్రబపుమంజిడి కొంతసేపు క్రొ
మ్మించుఁజెఱంగుదళ్ళుఁ గడుమేలిమి మాదళేము ల్బవంతు లొ
క్కించుక యించు కంతవడి యింపున నొక్కటి మెచ్చు కొక్కటిం
జంచలనేత్ర దాల్చెఁ బ్రియు సమ్మత మెట్లగు నొక్కొయన్మదిన్.

చ. తరుణి యొకింతసేపు చిఱుఁదమ్మిలపుంబసతోడి మోవి మే
గరగరిక న్విరాజిలుచుఁ గమ్మలుఁ దీగెయుఁ బూని వేణికా
సురభితఁబొల్చి యొక్కపరిశుద్ధపు సైకపుటొల్లె గట్టి భా
సురతఁ గడు న్వెలార్చెఁ బెరసొమ్ముల కోపమి యన్నిమంబునన్.

వ. వల్లభ మనస్సమాకర్షణ కౌశలాకౌశల సందేహంబునం జేసి యెం
దును మనస్స్థైర్యంబు చాలక మఱియును, 142

ఉ. శ్రీలలితాంగరాగములుఁ జీరలు సొమ్ములు నేర్చి యేర్చి తా
మేలుతరంబుఁ దాల్చియును మెచ్చక మార్చుచు నెన్ని మాఱులుం
జాలక దిద్దినట్టిదియె సారెకు దిద్దుచు మించుటద్దమున్
గేల ధరించి చూచుఁబరికించుఁ బొరింబొరి సద్మసంస్క్రియల్.

సీ. కేళీగృహంబుముంగిట గరగరిక లా
లోకించు గంధాంబుసేక మరయు

నలుకుప్రాంతల పరిమళముఁ బరికించు
రంగవల్లికల తెఱంగుఁ జూచు
సకినలమంచంబు జాడ విమర్శించుఁ
గుంకుమపరపుభరిణలు గణించు
హారంబుట్టు తలగడ పెంపు విచారించు
నగరుధూపముల జోయగము లెంచు

నలరుటోవర్లు మేల్కట్లు నంగరాగ
పూర్ణపాత్రికలును గంధవొడిబరణులు
జాలవల్లిక లాదిగా సముపభోగ
సాధనశ్రీలు పరికించు సారె కబల. 144

వ. ఇట్లు వర్తించుచున్న యన్నీలవేణి యా పువ్వు లాదరంబునం బుచ్చుకొనియె నట్టియెడ నిట్టు నట్టుఁ జెదరి పఱచుతుమ్మెదపదువు పొది వదలి మొదిఁగి యదుకుమారుం డక్కుమారికి నవరించు శ్రవణోత్పలంబులోనం గాన రాకుండ నడంగియుండె నప్పు డప్పడంతి ముప్పిరిగొను రాగవేగంబునం బ్రియాగమనవిలంబంబు సహింపలేక బహిఃప్రాణంబు లన నొప్పు శుచిముఖి రాగవల్లరుల నేకతంబునకుం బిలిపించి శుచిముఖి కిట్లనియె: 145

ప్రభావతి ప్రద్యుమ్నుఁడు రాలేదని తలఁచి విచారించుట

శా. రాఁడయ్యెన్ హృదయేశుఁ డీహృదయభారం బెట్లు సైఁతున్ క్షణం
బేఁడై యున్నది యేటికిం దడసెనో యే విఘ్నము ల్పుట్టెనో

నేఁ డేతెంచుప్రయత్న మున్న నకటా! నీతోడఁ జెప్పండె యె
వ్వాఁ డీకీర్తి యెఱింగెనో యపుడు నన్వాక్రుచ్చి యట్లాడఁగన్.

శా. ఆహా! యప్పటి కట్లు నన్దలఁచెఁ గా కంతఃపురంబుల్ సుదు
ర్గ్రాహంబుల్ పెఱవారి కెట్లు చొరఁ శక్యం బైనఁ గానీ కడున్
మాహాత్మ్యంబున మేటి యంటి వతనిన్ దౌవారికాత్యుగ్ర స
న్నాహం బెక్కడ నుండు రావలసిన న్వ్రాలేఁడె యెట్లేనియున్.

క. వత్తు నవశ్యము నేఁ డని
చిత్తము తమిఁ గేఁచి యంతఁ జింత యొకతెపై
హత్తిన నది వృథపుచ్చినఁ
బుత్తురు మగవారిమాట పొసఁగదు నమ్మన్. 148

క. అనఘాత్ముకుఁ డతఁ డాతని
నన నే మున్నది మదీయ మైనయదృష్టం
బును దూఱుట గా కెట్లది
యొనర్ప నున్నదియొ చంద్రికోగ్ర దవాగ్నిన్. 149

వ. అని చంద్రు నుద్దేశించి, 150

చంద్రాద్యుపాలంభనము

క. నీశైత్యము నమ్మితి న
త్యాశన్ హిమధాముఁడును సుధాంశుఁ డనంగా
నోశశధర! యేలా ఘృత
కోశాతకి వయ్యె దేమి గూడెడు దీనన్. 151

క. చలువ యొనరించినంతయు
ఫల ముష్ణత విడువ్వ మిదియ పదివే లింకన్
జలిపందిరి పెట్టుట కిడ
వలెఁ బో మొత్తైనియె మాకు వనజారాతీ! 152

సీ. శ్యామకంఠ లలాట సామీప్య పరితప్య
మానంబులుగఁ గళల్ మార్చి మార్చి
సింధూపకాంత స్నపింపిన బడబాన
లోగ్రకీలల సెగ నూని యూని
ప్రత్యమావాస్య సంభవ దర్శ-సంయోగ
కలితాధికోష్ణిమఁ గ్రాఁగి క్రాఁగి
విప్రయోగోష్ణ పాంథప్రాణ పరిపాన
భూమజం బగు కాఁక పొంది పొంది

కాలకూటాహ్వయభ్రాత పాలు పట్టి
పుచ్చుకొనుదాహకత్వంబు ప్రోచి ప్రోచి
యింత వేఁడిమి సాధించితేమొ చంద్ర!
నన్ను నేఁపుటకే ప్రయత్నంబుతోడ. 153

చ. ప్రథమకళ ల్నెలన్నెల నుపాయన మిచ్చుచు వహ్నిసూర్యులన్
బృథుతరమైన మైత్రిఁ గదుఁ బ్రీతులఁ జేయుట యీదృశోష్ణిమ
ప్రథమఫలీభవ ద్విరహిబాధకె కావలయు న్నశాంక! యీ
పృథివి నధర్మ కెన్నఁ బరవీడయె యుత్తమలాభ మెప్పుడున్. 154

చ. చలువయె భ్రాంతిమూలము నిశాకర! యింకొక టన్నచూడఁ గే
వలమును వేంద్రపుం బ్రకృతివాఁడవ యె ట్లనినం జకోరముల్
వెలయుఁ గడంక నీ యమృతవెన్నెల జుఱ్ఱుచు దాసిఁ జేసి కాఁ
కల వడ శైత్యము ల్మరగినట్టివి నిప్పులమేఁత కోర్చునే! 155

మ. ఇటు గా కొక్కొక కాలదోషమున నౌ నేమో విపర్యాస మ
న్నిటియందు న్మలయానిలుండవు నిదిగో నెమ్మేనికిం జాల ను
త్కటతాపం బొనరింపఁ జొచ్చె నివియుం దచ్చంద్రికాజాల సం
ఘటనాదౌష్ట్యము రాజధర్మమనుచుం గ్రౌర్యంబుఁదాఁబూనెనో.

వ. అని దక్షిణానిలు నుద్దేశించి, 157

క. తలఁప జగత్ప్రాణుఁడ వై
వెలసిన నీ విట్లు నన్ను వేఁచుట తగునే
యిల వెలుగు చేను మేసిన
మలయానిల! యెద్ది కాఁపు మదిఁ జింతింపన్. 158

వ. అని యతని వేఁడిమి మాన్చుటకై యనేక ప్రకారంబులం దూఱియుం బ్రార్థించియు గుణంబు గానక విసివి యిట్లనియె:

సీ. అంతకాశా సమాయాతత్వ మరసినఁ
జలువకు నీకును జాలదవ్వు
రౌద్రమూర్తిత్వ వార్తలు విచారించినఁ
జలువకు నీకును జాలదవ్వు

దహనసారక్ష్య మెప్పురిత ప్రభాసించినఁ
జలువకు నీకును జాలదవ్వ
శ్రీఖండ విషధరోచ్ఛిష్టత యెంచినఁ
జలువకు నీకును జాలదవ్వ

పలుకు లేటికి నీయందు మలయపవన!
చలువ గల దనుదృష్టి సంశయము దగదు
వసుధ నెంతైనఁ జండాల వాటిలోన
బ్రాహ్మణగృహంబు వెదకుట భ్రాంతి గాదె! 160

ఉ. దక్షిణగంధవాహ! నినుఁ వన్మలయద్రుమ పూర్ణ ఘూర్ణద
ద్భుజగ నింత కెంతయు నపాయము పొందదె పొందకుండఁగా
నిక్షుశరాసనుండు విరహిశ్వసితోపచయక్రియ న్నిను
త్రక్షయుఁ జేసెఁ గావలయుఁ గాక తమష్ణత నుష్ణ మెక్కుఁగన్. 161

వ. అని మలయసమీరు నుపాలంభించి, 162

శా. పాథోరాశిగభీరు నద్వితరణప్రాగల్భ్యమందారు భూ
నాథాస్థాన విధేయవర్తను నపైనఃపద్ధతివర్తనుల్
యాథాతథ్యవిధప్రయోగ వివిధోపాయార్జిత ద్విణ్మదో
న్మాథఖ్యాత సునీతికౌశలు నసన్మార్గచ్ఛిదాపేశలుల్. 163

క. వ్యాచక్షాణ సుధీజన
వైచక్షణ్యోదయాభివర్ధన వైద

గ్ధించుంచు రవిజకృత మై
తీర్చించుంచు విశృంఖ లాష్టదిక్చరకీర్తిఁ. 164

మాలిని. అమలమ ప్రియసూనుఁ డామినీ శోపమానుఁ
గమలభవ మనీషుఁ గణ్యవాక్ప్రౌఢి శేషుఁ
శమదమగుణనిష్ఠుఁ శాస్త్రచింతా గరిష్ఠుఁ
బ్రమథపతి సుభక్తుఁ బ్రహ్మవిద్యానురక్తుఁ. 165

గ ద్య ము

ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగిత కవిత్వవైభవ పింగళి
యమరనార్యతనూభవ సౌజన్యగేయ సూరయనామ
ధేయ ప్రణీతంబైన ప్రభావతీ ప్రద్యుమ్నం
బను మహాప్రబంధంబునందుఁ

చ తు ర్థా శ్వా స ము.

శ్రీ

# ప్రభావతీప్రద్యుమ్నము

## పంచమాశ్వాసము

క. శ్రీఫల తులసీ సస్త్రిఫ
లా ఫుల్లజ్జాతి విచికిలప్రముఖ ప్ర
వ్యాఫల్గు స్మృతేశ్వరప్రా
జా ఫల చిద్గుణ్య సమర సచివ వరేణ్యా. 1

వ. మన్మథు నుద్దేశించి యా కన్యకాతిలకంబు 2

ఉ. భూనుతలీల రుక్మిణికిఁ బుట్టి మనోభవ ! మత్ప్రియత్వమున్
బూనినవాఁడ వీవయఁట పూర్వపు నీ యతనుత్వధర్మమున్
మానక యేఁచుచున్న సది మామకభాగ్యము నిన్నెటాడఁ బోఁ
గా నెటు వచ్చునో తెడవఁగా నెఱతున్ గరము ల్మొగిడ్చెదన్. 3

వ. అని పలుకుచున్నప్పు డంత కంతకుం బెల్లయిన యాయుల్లకభరం
బునం బెల్లగిల్లు నుల్లంబు తాల్మి నిల్వరింపం జాలక, యబ్బాలా
లలామంబు 4

సీ. నాఁడె చనకుండఁ దేఖఁ బ్రాణములు నిలిపి
యంత భరపడి వచ్చి నేఁ డాత్మవిభుఁడు
నోర్వరాని నా తమికి సఖ్యానరఁ బలికి
ప్రియుఁడు తుద నిట్లు విడిచె నన్నియును వృథగ. 5

మ. అనుచుం జెప్పలు తేల వైచుచు విశుష్యత్కంఠయై 'రుక్మిణీ
తనయా! మీఁదట నైన నీవ పతివై తద్ధర్మ మీడేర్పుమీ'
యను పల్కంచుక నాలుకం దడుపుచుం బ్రాణార్తి దీపింపఁ జ
య్యనఁ బూఁబాన్పున వ్రాలఁబోవుటయు మీనాంకుండు
చిత్రంబుగన్, 6

ప్రద్యుమ్నుఁడు ప్రభావతికి సాక్షాత్కరించుట

వ. సంభ్రమంబునఁ గర్ణోత్పలంబు వెలువడి నిజరూపంబుతోడ, 7

క. 'హా! తాలిమి వదలెదు సు
మ్మ తెంచియు యున్నవాఁడ నిదె నీపతి ప
న్నో తరుణి! చూడు' మని తా
నా తల్పమునందు నిలిచి యక్కునఁ జేర్చెన్. 8

మ. అతిశీఘ్రంబున నా లతాంగియుఁ దదీయాలింగన స్పర్శనా
మృత సేకంబున మూర్ఛఁ దేఱుచునె యున్మీలన్మహానంద మూ
ర్ఛిత యయ్యెన్; మగుడన్ బదంపడి మనశ్చేష్టల్జనింపంగఁ దాఁ
బతిఁ గన్ఱెప్పలు విచ్చి చూచి భయకంపస్వేదలజ్జాత్మయై, 9

ఉ. తాఁ గడు వేగిరించెఁ గద తద్గతి నీవు నెఱుంగ సిగ్గునన్
లోఁగుచు నింతనుండి యిఁక లోనుగ నొల్లక పట్టఁబట్టఁగా
నేఁగుచుఁ గోరు నీ బలిమి నీప్సితసిద్ధిగ ; పేఁపుగాన రా
ఘాఁగుట దీనిపేరు నిబిడంబిది బాలిక కెల్ల నాత్మలోన్. 17

వ. కావున నప్పడుచు తప్పేమి గలిగిన నదియు నొక్క యనురాగ
విలసన విశేషంబకా నెఱుంగుకొని యనుగ్రహంబు వదలక పరి
గ్రహింతుగాని వే ఱొండుగఁ దలంచెదు సుమీ యేము పోయి
యా ముద్దియకు బుద్ధి చెప్పి యెత్తుకొని వచ్చెద మని రాగ
వల్లరియుం దానునుం దత్సమీపంబునం దెర మఱుంగున నుండి
తమపలుకు లాలకించి వినుచున్న యన్నెలఁత పాలికిం బోయి
యల్పస్వరంబున నిట్లనియె : 18

ఆ. తలిరుఁబోఁడి ! మంచిదానవు గలిగి తి
ట్లరుగుదెంతురమ్మ యధిపు మనసు
విరస మయ్యెనేని, వెర వెద్ది మఱి చక్కఁ
జేయ ? నీవ చింత చేసి చూడు. 19

వ. అనిన రాగవల్లరి శుచిముఖి కిట్లనియె: 20

క. అప్పటి క ట్లరుదెంచుట
త ప్పన రా దంత మనము దండ నునికిఁ దా
నప్పడుచుఁదనము మానక
యిప్పడఁతుక యంత వెఱ్ఱియే యిఁకఁ జేయన్. 21

వ. అని ప్రభావతి ననలోకించి 22

క. వరుఁడు సమాగమ కాంక్షన్
త్వరితపడుచు నుండ నిచటఁ దడయుట తగ దో
వరవర్ణిని! రా ర మ్మొక
సరవిని దమి యుండ దెల్ల సమయములందున్. 23

వ. అని కేలుపట్టి తివియఁబోయి, యా లజ్జావతిచేత విదుల్పులం
బడి నగుచు నిట్లనియె: 24

క. ఏరీతిం బెనఁగిన నె
వ్వా రెఱుఁగరు నీదుగుట్టు వనితామణి! రో
ళ్ళా రోఁకండ్లం బాడిన
కూరుము లిపు డింత దాఁచుకొన్న నడఁగునే. 25

వ. అని వెండియు నతిప్రయత్నంబున 26

సీ. 'విభుఁడు దండన యిది వినుచున్నవాఁ డెంత
గబ్బివే! యిది లజ్జక్రమమె' యనియు
'నతఁడిది సరకు సేయమిగ భావించిన
నపు డేమి యగుదు నీ వబల!' యనియు
'రసిక శేఖరుఁడు సర్వజ్ఞుఁడు ప్రియుఁడు నీ
కొలఁదిన నడుచు, భీతిలకు' మనియు
'నతిగోప్య మీ శుభావాప్తి, దీనికి నింత
తడయు టొప్పమి యెట్లు దలఁప' వనియు

మఱియు నెన్నియొ బిబ్బిసిమాట లమరఁ
బ్రేమయు చెప్పియు సవరక్కై చియు హితాను
వృత్తిఁ దెలిపియు నొకకొంత మెత్తఁబడఁగఁ
జేసి కేల్వట్టి తిగిచె నా చెలువఁ గదల. 27

సీ. చని చని రాకె యీయాశీలం బమంచుచు ల
జ్జాలసత్త్వమున మల్లాడి యాడి
‘సిలుసిలు మొకనటాట గల’ దని నిలిపి, స
లుపుట కేమియును లేక గ్రుక్కి గ్రుక్కి
మాటిమాటికిని సహ్యాంత నిర్బంధంబు
నలిమెము నంటాంత నిలిచి నిలిచి
తెరువున సిద్ధాదిక మునె చేతి కం
దీసఁ బట్టు నిలువక పెనఁగి పెనఁగి

యిందుబింబాస్య కడు సలయించఁ జెలిని
వినిచి పోనుగదా యనుమవెఱపు నొదవ
విభుని సాతస సంగమవేళఁ గరము
వ్రేసములు నో పడంపుల వర్తనములు. 28

కం. ప్రకృతిష్ణయు హిత నిర్వా
హియు నాటు నల్ల నల్ల నేనుఁగుఁ గంబా
నకుఁ దిగిచినట్లు యాత్మా
ధికరింం జెలి తెచ్చె నానతిం బలికడకుఁ. 29

వ. ఇట్లు తెచ్చి 30

క. అనయమునఁ జేరికయగుపోఁటి
ననివార్యవ్రీడ భయభరాకులగతి నై
తనవెనుక కొదుఁగ నొదుఁగఁగ
వనితామణిఁ దేర్చి తేర్చి వల్లభుఁ డచ్చోన్. 31

వ. ఇట్లు డగ్గఱఁ దెచ్చి యబ్జదళాక్షి యత్యూర్జిత సముజ్జహాస
మర్జిత లజ్జాసంరుద్ధగమనవేగయు నుద్దామరోమహర్షణస్వేదోద్భేద
సాదిత ప్రకంపితమకరికాపత్త్రాంగరాగయుఁ బరిశ్లిష్ట పరిత్యాగ
యత్నసంక్షోభ సంచలితసముత్తరీయ పార్శ్వప్రసరః ప్రసరాలక్ష్య
మాణ వక్షోజకుంభతట విజృంభణాభోగయు నగ్రదృష్టిప్రసార
పరిహార నియమనియత కటాక్షసంచార చారుకర్ణగోళకూలం
కషలోలలోచనద్రాఘిమశ్లాఘనీయ ముఖచంద్రవృత్తి పౌనఃపున్య
ధన్యాయితశోభమానాంతర్భాగయు నైన యెలనాఁగం జూపుచు
నా పురుషరత్నంబుం గటాక్షించి, 32

చ. పడఁతులచర్య లిట్టివి నృపాలకుమారక ! నేఁటిదాఁక గు
ట్టెడలఁగ నేమకూటమిడు నేఁడుఁ బడం గలపాటు లెల్లఁ దాఁ
బడి యిప్పుడిట్టి మబ్బుతఱిఁ బాఱుచుఁ దాఱుచు నే క్రియం బెనం
గెడుఁ గనుఁగొంటె యంచుఁ జెలి కేల్గదియించె రతీశుచేతితోన్.

ప్రద్యుమ్నుఁడు ప్రభావతిని గాంధర్వమునఁ బెండ్లియాడుట

క. ప్రమదంబున నా కొమరుఁడు
కమలాక్షిఁ బరిగ్రహించె గాంధర్వ వివా

హాముచే 'నయం ముహూర్త
స్సుముహూర్తో౽స్తం'చుఁ గెలన శుచిముఖి నవ్వన్. 34

క. అప్పు డించుక తడ వన్యో
న్య పాణిసంస్పర్శ సంభృతానంద స్తం
భపరీతాత్మత నుండిరి
ప్రపంచ మంతయును మఱచి పతియు సతియున్. 35

వ. తదనంతరంబ 36

క. తనరెడు లజ్జాభయవా
సన లుదో్బధమునఁ దనర సతి కనుఁగొని మె
ల్లన నిలుఁ డని యాన లిడన్
జని రొక్కొక నెపముఁ జెప్పి సకియ లిరువురున్. 37

వ. అప్పుడు ప్రద్యుమ్నుండు 38

క. నిలువక యటు పోచున్నా
రలికుంతల! చెలుల నేల యానపెడిచె దేఁ
జెలికాఁడఁ గానె యని పై
దలిచెవిలోఁ జెక్కు చెక్కుఁ దార్కొనఁ బలికెన్. 39

వ. అప్పుడు, 40

చ. ఉవిద తదుక్తి కంత చెవి యొగ్గక పోఁ బెనఁగ న్విభుండు కే
ల్గవిలిచి చుట్టు నించుకయెడన్ భుజము ల్వలగొల్పి పొ మ్మనన్

సువదన వెల్వడం దిరుగ శ్రోణి భుజ స్తన వేణికాభర
శ్రవణ కపోలము ల్వతిని సారెకు సోఁకుచుఁ దేల్చె నింపులన్. 41

వ. అంత 42

చ. 'నళినదళాక్షి ! సిగ్గరితనంబు గదా యని యింత చెల్లునే
యలయఁ బెనంగి' తంచు విభుఁ డంగన హస్తము వట్టి నిల్పి చె
క్కిలి మిగులం జెమర్పఁ బులకింపఁగ ఘర్మకణావళు ల్నఖం
బులఁగొని పాఱ మీటుచును బొల్పుగ మే నిమిరెం గరంబునన్.

సీ. మఱియుఁ గపోలచుంబనసమాగతి యాస
రి త్త మంతనము సారెకు వచించి
యభివీక్షణేచ్ఛ నమ్రాననం బెగనెత్తి
కొనగోళ్ళఁ బలుమఱుఁ గురులు దువ్వి
చనుగుబ్బ లంట ముచ్చట పడి మాటికిఁ
బయిఁటపై నెఱసులు పాఱ మీటి
గనయంబు ముట్టుటకును జేరికలుగ వే
మాఱును మొలనూలి మణులు దుడిచి

బెద రుడిపి వ్రీడజాడ్యంబు వదలఁ జేసి
కాంత నొగి మెత్త మెత్తనఁ గౌఁగిలించె
నీవి తనయంతటనె జాఱ నెయ్య మెఱఁగి
పాణిఁ జెక్కిలి నొక్కి చుంబనముచేసె. 44

వ. తదనంతరంబ 45

ఉ. శౌరిసుతుండు బాలికను శయ్యకుఁ దార్చి యదీర్ఘయత్నత
ద్వారణసంప్రబుద్ధరసతం బరితీపుగ మించు బాహ్యనా
నారతభోగలీలల మనంబునఁ జొక్కుచుఁ జొక్కఁజేసెఁ బో
త్తా రత మల్ప మల్పముగఁ దన్మతియోర్పుకొలందిఁ జేయుచున్

గీ. సారభమె చిక్క లోనికి జాఱు నొక్క
రాయిడికిఁ గాక బహిరంగరాగ మెల్ల
నసఁగ నినుమడించుచు నంతరంగరాగ
మలరఁ బెనఁగిరి దంపతు లతుల రతుల. 47

వ. ఇవ్విధంబున 48

చ. స్వకుతుకపూర్తిగాఁగ రతిసల్పి సుషుప్తి వహించిరంత నా
యికయును నాయకుండుఁ దమ యిద్దఱియంగములు న్విమిశ్రభా
వ కలనఁ జిక్కుఁజెరుపడ వైచిన చంపక నీలకంజ మా
లికల తెఱంగునం బరఁగె లేఁజెమటల్మునుగాలి నాఱఁగన్. 49

వ. అంత 50

క. అరుణాంశుపటలి యను వా
సరరాజ పురోధృత ధ్వజంబుకొనన్ వి
స్ఫురిత మగు రత్నమో యన
సురపతిదిశయందు వేగుఁజుక్క వెలింగెన్. 51

చ. యదుకులచూళికాభరణ మంతట మేల్కొని నిద్రచొక్కునన్
వదలినకౌఁగలి న్మెలపునన్ బిగియించుచుఁ జెక్కు చెక్కుటన్

గదియఁగ నొత్తియొత్తి తనకాంతను మెల్లొలిపెన్ మృగాక్షియున్
నిదురఁ దొఱంగి చూచుచు నెనేత్రము లెప్పటి మూసె సిగ్గునన్.

సీ. అంతఁ గామిని కన్నులరవిచ్చి సురత సం
క్షుభితవేషము పతి చూడకుండఁ
దనదు చెక్కిలి మొగంబున కడ్డముగఁ జేర్చి
పొరిఁ బొరి నది దానఁ బులకితముగఁ
గెంగేల సతని కౌఁగిలి యూఁగి యెడఁగొంచుఁ
జేలాంచలము పెఱచేతఁ దడవి
తెచ్చి పాలిండ్లమీఁదికిఁ బొనుపుచు నితం
బావృతి యరసి రెండవ చెఱంగు

కటితటం బొత్తి యొత్తి కిందటికిఁ బరపి
లోనుగా దాని పై యుంచుతో నమరఁగఁ
బొక్కిలిఁ గదించి పట్టి మూఁపున నర విరి
వదలుతుఱు మానుకొనుచు లేవంగఁ గడఁగె. 53

క. ఈ చాడ్పునఁ బానుపుపై
లేచుచుఁ గడు నింపు గులుకు లేమ విలాస
శ్రీచేఁ జిత్తము గరఁగఁగ
నా చెలువుఁడు మగుడఁ దిగిచి యక్కునఁ జేర్చెన్. 54

వ. తదనంతరంబ కార్యాంతరచింత చిత్తంబునఁ బొడమఁ దన వద
నంబు ముదిత చెవిం గదియించి 'యో యువిద! యుదితొనుగలుగ

మాపురెల్ల నిచ్చటికి వచ్చెదఁ గాని జేపులు దప్పకుండ మా విడిదిన యుండకున్న రహస్యభంగంబు పుట్టిన మాన మనోరథంబు విఘ్నా కులం బగుం గావున నిక్కడనుండి మదీయ నివాసంబుదాఁక భూవివరంబు గల్పించుకొని పోయెదఁ దద్ద్వారం బన్యుల కెఱుక పడకుండునట్లుగ సంవరణంబు గావింపు' మని చెప్పి యప్పలుకు లకు నా లజ్జావతి యంగీకార సూచనంబుగాఁ దల యొగుర నైవ నుక్తప్రకారంబున నిజనికేతనంబున కరిగెఁ బ్రభావతియుఁ దద్బిలంబు తగు తెఱంగున సంవృతంబు గావించె నంత, 55

మ. సమయాభిజ్ఞతఁ గుక్కుటంబు 'వివిధచ్ఛందస్క్రియామంతు రం
తిమయామో భగవా నృషిః కుసుమధన్వీ దేవతా మానినీ
రమణాయాం వినియోగ'యంచునిది యారంభించెఁ గాఁబోలు నా
నమరెం దద్ధ్వని మానినుల్ రతికేఁదామై నాథులం బైకొనన్. 56

వ. మఱియు నాసమయంబున వాసరప్రత్యాసత్తినిమిత్త విరహాశంకా సముంకురిత సంతాపంబున లోపలిపట్టువదలి వెలికి నిర్గమించు నిఖిలకాముకద్వంద్వ సముదయ హృదయంబుల చలువలం ద్రోవ యడ్డగించి గడ్డుఱికి యాక్రమించెనో యనఁగఁ దనరారుచు హారవమాక్తికంబు లత్యంతశైత్యంబునం బ్రవర్తిల్లె; నచిరభావి యైన భావజవశంవద స్త్రీపురుష పరస్పరపరిరంభ విశ్లేషభేద వేదనాప్రాచుర్యంబు సూచించుభంగి నొండొంటి యంటు విడచి బిరు సెడలిన దళంబులతో నతివిరళంబగుచు మేల్కట్టుపుప్వ దండలుం దమయంతర్గుణంబులకోలఁది విశదంబుగాఁ దెలిపె; నన్యోన్యసన్నిధిం జెన్నుమీఱు దంపతు లింపుసొంపున నాదరింపం

బెంపొందు సౌభాగ్యవైభవంబు నేఁటికిదియకదా యను హృదయౌత్సుక్యవిలసనవిశేషంబునం బోలెఁ దాంబూలంబు లచలితంబుగా రుచుల ప్రచురతం బచరించెఁ; బ్రచుర సురతంబులఁ జరించు నుద్దామయౌవనమదమదనమత్త మత్తకాశినీమణుల మణితరణితంబుల జోక లేక సంతన గ్రహించి యంచిత ప్రేషోదకుతం బరీక్షయిచ్చు భావ మావహిల్ల గృహశారికా కీరపారావత కులంబులును గలకలిత లయలలిత కలకాకుభావంబునఁ దులకించు కులుకుబెలుంగుఁ గల కలికి పలుకు లవికలంబులుగాఁ గులుకరింప దొరఁకొనియెఁ; బ్రతికల నవనవాయితప్రౌఢి యువమిథున రతి పరిమళంబులఁ గలపడంబయి పొలుపెసఁగు వికసనారంభ శుంభదంభోజముకుళ సుకుమార సౌరభంబు సొరెకు వెదచల్లుచు నల్లనల్లన సంచరించు చల్లకరువలి బలంగములు తెరువరుల తనువుల నవిరళముగఁ దలకొనం బులకాంకురంబులు మొలపించె; గతదివసావసానసమయంబున జిగీషితదేశాంతరుండైన భాస్వంతుచేత నాత్మతేజస్సమర్పణానల్పలాలనా పురస్సరంబుగా నియోగింపఁబడియుం దమతెమ యున్న భవనంబుల నివసించు కొంచెపుఁ జీఁకటులనే కాని నానాతమోనీకంబులం బోకార్పలేని తప్పు గలిగి యున్నయవి గావున నా వేళ కాసన్నం బయిన యా వాసరాధీశు రాక యాకర్ణించి కార్యవైకల్యంబున నాకులత్వంబు నొందెనో యన నేపు దఱిగి దీపకళికలు వెలవెలంబాఱె; విక్రమవిహారంబు ముగియించి గవ్వసెనఁ బొడివిన కుసుమకోదండు వెండి జలపోఁత తళుకు టరిగ తెఱంగున మెఱుం గడంగి యుడురాజమండలంబు మాఁగుడువాఱె కానిపించెఁ; దొల్లి నిజసంతతి హితార్థిని యై

సురభి ప్రార్థింప నిలింప విభుం డమృతం బిడుట ప్రత్యక్షం
బయ్యెనో యనునట్లుగా దట్టం బగుచు శాద్వల ప్రదేశంబులం
బ్రకాశించు ముక్తాఫలస్థూల ప్రాలేయబిందు బృందంబు పశ్చిమ
రాత్రి గోచర ప్రచార్యమాణ పశు విసరంబులచేతఁ గసవుతోఁ
గూడ గ్రసింపంబడుచు నుండ గగనముకుర పరిదృశ్యమాన
తదీయ ప్రతిబింబవిభ్రమ దృఢీకారపారీణంబులై తారకంబులు
క్రమంబునం బలుచ గాఁ దొడంగెఁ; బ్రాబోధికంబులైన భూపాల
దేవగాంధారి ప్రముఖరాగాభోగ సౌగంధ్య బంధుర గాంధర్వ
నాదమేదుర మృదువాద్యవిశేష పోషిత సూత మాగధాది క్రియ
మాణ స్తుతిపాఠరవంబులు ప్రభుద్వారంబులఁ దోరంబులై
సొంపుమీఱె; నపరరాత్ర స్వాధ్యాయాధ్యయనశబ్ద స్థానంబుల
నైన యాదేశంబులుంబోలె నిర్భరక్షీరభార భిద్యమాన పీనా
పీన స్మార్యమాణ తర్ణకోపసరణ రణరణక సంభ్రమ సముదిత
సముత్థాన ధైనుక గంభీర హంభారవంబులు విజృంభించెఁ;
జంద్రాస్తమయ సంభవక్లేశ పరిఘూర్ణార్ణవ ధ్వానంబు పెక్కువను
వెక్కిరించినట్లు మిక్కిలి నక్కజపు బాహుళ్యంబు నెరపు మహా
సందోహ దోహ నిస్వానసాహచర్య సమధిక దధిమథన విధి
విహిత ఘుమఘుమఘోషంబులు ఘోషంబు లందు గండూ
షిత దిక్కంబు లగుచుఁ బిక్కటిల్లె నప్పుడు, 57

సీ. మును విలూనం బైన దినపాదపము మొదల్
మగుడఁ జిగిర్చిన చిగు రనంగ
గతనిద్ర శక్రేభ కర్ణతాళానిలే
రిత కుంభసిందూర రేణు వనఁగ

ధ్వాంతజాలముమీఁద దండెత్తు భానుమం
తుని వెలిగొల్లెన తోఁ పనంగ
మార్తండపథరోధి మందేహబల పదో
ద్ధత పూర్వసగ ధాతుధూళి యనఁగ

వనజ రంగస్థలిని నాట్యమునకు వచ్చు
సిరికిఁ బట్టిన కెంబట్టు తెర యనంగఁ
బ్రాగ్దిశాలిప్త ఘుసృణాంగరాగ మనఁగ
మెఱసె నరుణోదయపు దీప్తి మింటికెలన. 58

చ. అనుదితసూర్యహోము లగు యజ్వల ప్రజ్వలదగ్నిదీప్తు లొ
ద్ద నమరు సోమిదమ్మల మిథఃకషణోల్లసిత స్తనంబులన్
దనరుచు గేలి చేసెఁ గడుఁ దత్సమయాత్త పరస్పరోపగూ
హన రసరంగ దంగక రథాంగ పతంగ తతారుణద్యుతిన్. 59

ఉ. ఏఁ గలలోన నొం డెఱుఁగ నీవె విభుండవు సందియంబు నా
పైఁ గలదేని చూడు మని ప్రాగ్దిశ గౌతమదారజారునిన్
దాఁ గడు నమ్మఁ జేయుటకుఁ ద్రాగఁగ నెత్తెడు నట్టి యొట్టుగాఁ
గాఁగిన మడ్డుచంద మొనఁగం గనుపట్టె నినుండు నుష్ణతన్. 60

వ. అప్పుడు 61

సీ. బిగువుఁగౌఁగిళ్ళచేఁ బ్రియు బాహుపురు లొత్తి
కమ్మోలు వోయిన కుచతటములు

వరుమేన నొఱసి పోవఁగఁ జిట్లినట్టి గం
ధపు బేంట్లతో నొప్పు నఖపదములు
రమణు కుండలపీడనముల రేఖలు మాయ
కలరుచున్న కపోలఫలకములును
ప్రాణేశ దశనకోరకశిఖా సంసర్గ
మునఁ గందినట్టి కెమ్మోవి సిరులు

నిలువు టద్దాల చేరువ నిలిచి నిలిచి
పలుమఱును జూచుకొనుచు నా బాగు సడలఁ
జేయఁ జాలక తడసె దైతేయకన్య
ప్రాతరుచితాంగసంస్క్రియా పరత లేక. 62

వ. అంత నచ్చటికి శుచిముఖిరాగవల్లరు లరుగుదెంచి యా చంచ
లాక్షి యున్నచెల్వు దవ్వుదవ్వుల నవలోకించి నవ్వుచు 63

ఉ. పుక్కిటితమ్ములం బుమియు ప్రొద్దును గాదొ కదమ్మ నేఁడు మా
యక్కకు నిప్పు డిట్లిటఁ బ్రియంబునఁ జూడఁగఁ గల్గెఁ జాలు మా
కిక్కడి కేగుదెంచుట నభీష్టరతి న్వసివాళ్ళు వాడు నీ
చక్కని రూపము న్నిదుర చాల నికన్నులుఁ జిట్లు గందముల్. 64

వ. అనుచు డగ్గఱ నేతెంచి 65

సీ. పలుగఱ సేయక పసుపును నలిపించు
కొనక మొగంబు మజ్జనము లేక

పరిశుద్ధవస్త్రంబు ధరియింపక కచంబు
లొాగిఁ జిక్కు పుచ్చి క్రొత్తగ ముడువక
ప్రత్యగ్ర తిలకధారణ మొనర్పక నపే
నముగఁ గాటుక లోచనముల నిడక
తగునట్టి సొమ్ములు దాల్పక దినముఖ
నియమ పుణ్యంబు లెవ్వియుఁ జలుపక

నీవు తడయుట చోద్య మో నీరజాక్షి!
ఘనము గాఁబోలు శ్రమ మట్లు గాక రతుల
చిన్నె లింపునఁ జూచుకొంచున్న దాన
వేమొ విఘ్నమై వచ్చితి మెఱుఁగ కేము. 66

వ. అని పరిహాసగర్భంబుగాఁ బలుకుచు లజ్జారోషభూషితంబు లయిన యా యోషారత్నంబు చేతియదరుప్రేఁతలు తమకు నూతనోత్సవంబు లగుచుఁ గౌతుకం బొనరించుచుండఁ బ్రవర్తిల్లుచున్నంతఁ జంద్రవతీ గుణవతు లటమున్న నిజవల్లభసమాగమంబునకు నుపాయంబు గానక శుచిముఖితోడి విచారంబు గోరుచు నుండుటం జేసి యమ్మరాళిఁ దమనిలయంబున కెలయించుకొని పోవుటకు నుద్యోగించి ప్రభావతీదర్శన మిషంబున 67

క. లలిత ప్రియసంభోగా
కులవేషము చక్క దిద్దుకొన నెడ లేమిం
గళవళ పడుచుఁ బ్రభావతి
యలుక నతర్క్యగతి వచ్చి రచటి కిరువురున్. 68

సీ. ఈ తెఱంగున వచ్చి యా తరుణీమణి
చందంబునకుఁ గొంత సందియంబు
మదిలోనఁ గందళింపఁగఁ గ్రమంబున విమ
ర్శించి తదాకార చేష్టితముల
కతమునఁ బురుషసంగతికల్మిఁ బదిలంబు
గా నిశ్చయించి యక్కాంతమీఁద
భావసంసూచన పాండిత్యగంధి వి
లోల కటాక్షావలోకనములు

వోలయ మొలకనగవు తళుకుతోఁ బలుమఱు
నగుచు నొకరొకళ్ళ మొగము చూచి
యంతఁ గనిన యర్థ మాఁప లేకి ట్లని
పలికి రాసఖి విన జలజముఖులు. 69

ఉ. ఎంతయు మేన వింతపస లేర్పడు చున్నవి యప్ప! గంటె య
త్యంతము నిద్ర చాలమియు నక్షులు తెల్పెడు రాత్రి యెద్దియో
కొంత విశేష మబ్బినది కోమలికి న్మముబోంట్లకుం గడుఁ
సంతసమే కదా తనదు జవ్వన మెవ్వలన న్ఫలించినన్. 70

వ. అని మర్మంబు దాఁకి నాడుచు నా ప్రీడావతి మొగంబుఁ జూచి

క. ఏ మైన నయ్యె నిఁక నే
లా మీఁజినపనికి నిట్టియంతిపురములో
నో ముద్దరాల! యే గతి
నీ మహిమ గడించుకొంటి విది వెఱఁగు కదన్. 72

సీ. అని యుల్లసము దోఁప నాడు మాటలకు వె
లవెలఁ బాఱుచును దైత్యవిభు తనూజ
కలఁగి రహస్యభంగ భయంబుచేతఁ బ్ర
త్యుత్తరం బేమియుఁ దోఁప కునికి
నిట్టటు గ్రుక్కుచున్నట్టిలా గరసి యా
యతివకుఁ దన చెలియండ్రగుట్టు
బయలు సేయక యున్నఁ బాయ దీ వెడఁగుఁబా
టనియు వారికి నిది యభిమతార్థ

సిద్ధి హేతు వనియుఁ జిత్తంబులోపల
నీతిసరణిఁ బరిగణించి చూచి
యా సునాభసుతల కంచపడంతి యి
ట్లనియె నుచితఫణితి యతిశయిల్ల. 73

క. ఇది యెంత పేర్చెదరు మీ
చదివిన యాకునసె తానుఁ జదివినయది మా
సుదతియు మొదల ఫలించెన్
దదభీష్టము పెద్దపిన్నతనముల వరుసన్. 74

వ. అనుటయుఁ దెలివొందినమొగంబుతోఁ బ్రభావతి యా విహంగిం
జూచి, 75

క. ఎట్టెట్టూ మును వీరల
గుట్టును నీ పోఁగునకుఁ దగుల్పడినదియే

యెట్టుండె నట్టె చెప్పుము
గట్టిగ నావుడు మరాళకామిని నగుచున్. 76

వ. తను నధికభయలజ్జాసమాకులచిత్త లగుచుం గనుసన్నల వారించుచున్న చంద్రవతీ గుణవతులవంకం గనుంగొని చెప్పం గొంకించుటయు నక్తంచరరాజనందనయుం దనమీఁద నాన లిడుచు నడిగినం బులుఁగుఁబడంతి తదనుజల విలోకించి, 77

ఆ. మీర లూర కుండ రీరు దివ్వఁగఁ జేను
వచ్చు ననుట వినరె వనితలార!
యాన పెట్టి యడుగ మాన రా దిఁకఁ జెప్ప
వలసె మీ రహస్య వర్తనములు. 78

వ. అని పలికి ప్రభావతితోడం బ్రద్యుమ్నలేఖాహరణం బొనర్చిన చిలుక సుద్దులు మొదలుకొని వారి ప్రయత్నంబు సకలంబునుం జెప్పిన నవ్వుచు నా పువ్వుఁబోఁడి వ్రీడావనత వదన లైన యమ్ముద్దియల నీక్షించి 79

క. మునిముచ్చులార! మీ చే
సినపని యటు గట్టిపెట్టి చేకొని యేలా
ననుఁ దఱిమితి రిఁక నేమియు
ననకుఁడు నా తోడిదొంగ లైతిరి మీరున్. 80

వ. అనిన నా యింతికి శకుంతకాంత యి ట్లనియె: 81

గీ. లలన యెంతటివారు గావలయు నెందు
నైన నీ తోడివారు గా నంత కిపుడు
ప్రియునితోఁ జెప్పి నీవు రప్పింప కున్న
వీరలకు నెక్కడిది నిజవిభుల రాక. 82

ఉ. ఎల్లియు నేఁడు నీకు హృదయేశ్వరు నెద్దియుఁ బల్క సిగ్గుచే
నుల్లము గొల్పదేని వికచోత్పలలోచన! యేన నేఁడు నీ
వల్లభుతోడఁ జెప్పెద నవశ్యము నీ చెలియండ్రకోర్కి సం
ధిల్లెడునట్లు గాఁగ భవదీయ నియోగమహాత్త్వ శక్తిచేఁ. 83

వ. అని తన్నయనచేష్టా విశేషంబున నంగీకారంబు వడసినది యై
సునాభతనయల్ల నభివీక్షించి యీ ప్రభావతికిం బతి యైనవాఁ
డతిలోక మహిమ మహనీయుండైన యొక్క దివ్యపురుషుండు
గావునఁ దదనుగ్రహంబునం దక్కఁ దక్కిన యుపాయంబుల
నీ యంతఃపురంబు మీ వరులకుం జొర నలవి గా దని తలపోసి
యిట్టిసేతి నిశ్చయించి పలికెతి నని పలికె యి ట్లనియె: 84

క. మది తహతహ విడిచి యిఁకఁ
ముదమున సతులార! కొంగు ముడి వేసికొనుం
డిదె నేఁటి మాఁపటికిఁ గూ
ర్చెద వాలాయముగ నేను బ్రియులను మిమ్మున్. 85

క. అని హసి మృదుస్మిత శో
భన లజ్జావనత వదన పద్మంబులతోఁ

గనుపట్టువారి నిండ్లకు
ననిపించె నిశాచరేశ్వరాత్మజ చేతన్. 86

వ. ఇవ్విధంబున నవ్విధూమణుల నమ్మించినదియై యంచబోటి నాఁటిరాత్రి యాదవుల విడిదికిం బోయి యేకాంతంబునం బ్రద్యుమ్న గద సాంబుల ముువ్వురం గూర్చి 87

క. సాకల్యంబున మీ ప్ర
త్యేకంపుఁబను లైనం గాని యెద్దియు నాకున్
బై కార్యము దెలియదు నా
కౌకస్స్వామికిని జెప్పి యనుపుట కనుడున్. 88

ఉ. అందఱకుం దలాయొకటి స్వార్థము గల్గుట దోఁపం బల్కె సం
క్రందన కార్యవర్తనము గాకయు నాకును బోలె నెవ్వి యే
నిందు నిజార్థము ల్కడమ యిద్దఱకుం గల వేమొ యంచు నా
త్మం దలపోఁత పూనిరి సమంబుగ నప్పుడు వారు ముువ్వురున్

వ. శుచిముఖియు వారిభావంబు భావించి, 90

క. మీ మీ ప్రత్యేకార్థము
లేమియు నొకరొకరెఱుంగ రేమొ వినుం డం
చా ముువురకు ముువురకుం గల
ప్రేమవతుల తెఱఁగు వారి ప్రేమలుఁ దెలిపెన్. 91

వ. తెలిపి ప్రద్యుమ్నుం జూచి: 92

క. నీ వొకఁడవు మాయావివి
గావునఁ బ్రియఁ బొందఁ గంటి గాని యితరు ల
త్యావిలధృతి నున్నా రి
ట్టావాప్తికిఁ బ్రోవఁ గాన కాత్మల లోనన్. 93

వ. కావున వీరల యభిమతసిద్ధియు భవదధీనంబ యిందులకుఁ దగిన యుపాయం బూహింపు మనియె నప్పు డా మువ్వురుం బరస్పర రహస్యకార్య ప్రకటనంబునకు నవ్వుచు సుహృద్భావ సుభగం భావుక నర్మసంవర్మిత వచనంబులతో నొండొరు మొగంబులు గనుంగొనుచు, 94

క. నీ వచ్చు టీవి గని యా
రా వాసవకార్యపరత యను చుంటిఁ గటా
నీ వీ తెఱఁగే యన మఱి
నీవో యన నీవో యనఁగ నిగిడె న్నగవుల్. 95

వ. అంతఁ బ్రద్యుమ్నుండు శుచిముఖుం జూచి నీవు సునాభతనయల కడకుం జని తమ హృదయేశ్వరు లిదె వచ్చెద రని యూఱడింపు మని పనిచి తానును గదసాంబుల కిష్టసిద్ధి యగునట్లుగ నాత్మ కల్పిత భూవివర ద్వారంబున దానవేశ్వర కన్యాంతఃపుర ప్రవేశంబు గలిగించి నిజాంగనం గూడి రమియించుచుండె నప్పుడు,

సీ. ఆననాంభోజ వ్యాపావర్తనా ముహు
ర్వ్యాఘ్నితాధరపాన విలసనంబుఁ

కరకృతాంతర్థి భంగురిత కపోల చుం
బన రణరణక సంభ్రమ భరంబుఁ
బ్రసభాపహృత కుచప్రావరణాంశుక
స్థానాభిషిక్త దోస్స్వస్తికంబు
సమపోఢజఘనవస్త్ర ప్రయోజన సమా
ది ష్టోరుయుగ మిథోవేష్టనంబు

నగుచుఁ దన సిగ్గు పెక్కువ యవిరతంబుఁ
గరకరి యొనర్పఁ రాయిడిఁ గరముఁ గెరలు
నతను రాగ వేగంబున నతిశయిల్లు
రమణు రతి నొప్పె నొక కొన్నిరాత్రు లబల. 97

వ. అంత 98

ఉ. సిబ్బితి మాని నేఁటినిశఁ జిత్తములోపలికాంక్ష దీఱఁ జక్
గుబ్బల నొత్తి యేనె మును గ్రుచ్చి కవుంగిటఁ జేర్చెద న్విభుం
గొబ్బునఁ బట్టి దంతశిఖ నొక్కెద మోవియు నంచుఁ గోరు నా
గుబ్బెత చేపు లెల్లఁ దటిఁ గొంకు నిరంకుశ లజ్జ పెంపునన్. 99

క. యావవ్వుఁ డంతట రతుల వి
భేదములు గ్రమక్రమాభ్యుపేతములుగ నా
పై నలికిఁ గఱపి చిత్రా
పాది సురతరాజ్యమునకుఁ బట్టము గట్టెన్. 100

వ. అందు 101

క. ఏవిధిఁ బతి వేఁడినఁ బుం
భావాదిని లజ్జఁ దొట్రుపడుఁ గాని తుదన్
యౌవనపుం జిందఱ గొని
భావజుసివ మెత్తి యతివ ప్రౌఢిమ నెరపెన్. 102

ఉ. ఆ చనుద్రేఁగు నట్టి జఘనాతిభరంబు విరోధి గాక తో
డై చపలాక్షి కిం పొసఁగె నప్డు సముద్గమవేగనున్నమై
ఖేచరచక్రసామ్యధృతికిం దగ నొక్కటి మీఁదికిం దివన్
భూచరచక్రసామ్యమును బొందెఁ దదన్యము క్రింది కీడ్చుచున్.

వ. తదనంతరంబ 104

సీ. గుబ్బపాలిండ్లు గన్గొను వేడుకను మించు
గాఢ పరీరంభ కౌతుకంబు
గాఢ పరీరంభ కౌతుకంబును మించు
జఘనలోలుప హస్త చాపలంబు
జఘనలోలుప హస్త చాపలంబును మించుఁ
దిలకమంటిన కురు ల్దిద్దు తమియుఁ
దిలకమంటిన కురు ల్దిద్దు తమిని మించు
వాతెఱ చవులాను వలపుపెంపు

వాతెఱ చవులాను వలపుపెంపును మించు
రతులరహియు రతులరహిని మించు
నధరరసము విఘటితాన్యోన్యముగఁ దత్త
ఱిలుచుఁ బతి రమించెఁ జెలువఁ గూడి. 105

వ. ఇత్తెఱంగున నమ్మత్తకాశిని హృదయేశు చిత్తంబు రంజిల్ల నుల్ల
సిల్లెఁ జంద్రవతీగుణవతులుం బతులచేత నతులానురాగపూర్వక
నివర్తిత గాంధర్వవివాహ లగుచుం గ్రమప్రవర్ధమాన నానారతి
ప్రాగల్భ్య నిర్భరంబు లగు విహారంబుల నతిశయిల్లి రివ్విధంబున,

సీ. అతియత్నరుద్ధ లబ్ధాశ్లేష చుంబన
కుచపీడనాద్య మై కొన్నినాళ్ళు
మందమంద క్రియమాణ నానాప్రాతి
కూల్యాభిరామ మై కొన్నినాళ్ళు
కృతకప్రమాదానుమత సముల్లస దసం
కుచితక్రియాక మై కొన్నినాళ్ళు
విరళత్రపా తిరస్కరిణీ పరిస్ఫుర
త్కౌతుకసంరంభ మై కొన్నినాళ్ళు

ప్రకటముఖరిత మేఖలారణిత గుణిత
మణితఘంటార వాఘోష్యమాణ మసృణ
కుసుమసాయకౌద్ధత్య మై కొన్నినాళ్లు
రతి జరగఁ జల్పి రతివలు పతుల సేవ. 107

వ. అందు నొక్కనాఁడు 108

శా. ప్రద్యుమ్నుండు ప్రభావతీ రతివిహారప్రౌఢి సారస్య సం
పద్యుక్తిం గడుఁ జొక్కి 'దక్కితి రతీ మత్ప్రాణమా! నీకు' నం
చుద్యత్ప్రేమసమృద్ధిఁ బల్కె నది యా యోషాలలామ శ్రవ
స్సద్యఃపాత నిశాతశూల సమమై చాలంగ నొంచె న్వెసన్. 109

క. ధాత్రిం జరార్జిత తాదృ
క్చిత్రమిథఃప్రేమ నుల్లసిలుచో బెరు కే
మాత్రము లే కెనసిన ప్రియు
గోత్రస్ఖాలిత్య మోర్వఁ గోమలి వశమే ! 110

ఉ. ఏమని చెప్ప నప్పు డసురేంద్రసుత న్నకలాంగసంప దు
ద్దామ రతోత్సవానుపమ తత్ప్రథమక్షణ సంభవ త్సుఖ
శ్రీమయ మూర్ఛ చేడ్పడఁగఁ జేసెను దుఃఖపుమూర్ఛ యై కడుం
భామల కట్టిచో సవతినామము మారణమంత్ర మౌఁ జుమీ !

గీ. ఆ ప్రభావతి కొంతసే పవ్విధమున
మాన దుఃఖ నిశ్చేష్టిత యైన వెనుక
నుస్సు రనుచును వేఁడి నిట్టూర్పు నిగుడ
వగలఁ బొగులుచుఁ బొరలె మార్మొగముగాఁగ. 112

గీ. అరిగె శయ్యాంతరమునకు నంత లేచి
యతివరో! 'యిది యేమి నాయందుఁ దప్పు
గలిగెనో' యంచుఁ దోన రాఁ గడఁగు విభుని
నట్లు రాకుండ ఘనమైన యాన వెట్టె, 113

క. ప్రద్యుమ్నుఁడు తా నటు చను
నుద్యోగము దక్కి యుస్సురుస్సు రనుచు నా
హృద్యతరాంగి వియోగము
సద్యఃపరితాప మొసఁగ సందేహమునన్, 114

వ. తనకుఁ గొంత సమీపంబున నొక్కపర్యంకంబున నవ్వాలి మొగంబుగా శయనించియున్న యా ప్రభావతికిఁ గర్ణగోచరం బయ్యెడు పాటి పరిమితస్వరంబున నిట్లనియె: 115

ఉ. తామరసాక్షి! నావలనఁ దప్పొక యెయ్యది యైనఁ గంటివో
నా మది తాల్మి చూడఁగ మనంబునఁ గోరెదొ యల్గి కూడినం
బ్రేమలు వింతయింపు సవరించు నటంచునొ యల్కచొప్పు గా
కే మయిన న్నిమిత్త మొకయించుక కల్గెనొ లేచి పోవఁగన్. 116

క. అనుటయు ఘనదుఃఖవశం
బున నొక యుత్తరము నీక పొలఁతుక నిట్టూ
ర్పు నిగిడ్చి యూర కుండిన
దనుజారిసుతుండు ప్రచలితం బగు మతితోన్. 117

శా. నాయం దేయది తప్పు దోఁచినది యో నారీమణీ! నీకు దుః
ఖాయత్తత్వము చూడ నిక్క మిది మత్ప్రాణంబ వీ వెందునుం
జేయ న్నేర్తునె తప్పు నీకు నిది నీచిత్తంబు రాఁ దెల్పుకో
డాయ న్వచ్చెద నాకు రా ముదల పెట్టంగాఁ దగు న్సత్కృపన్.

వ. అట్లుం గాదేని 119

గీ. వనిత! యిటు నీవ వచ్చి నీ వలయుసోదె
గొనుము దప్పున్న మఱి నాకుఁ బెనఁగఁ జోటు
గలదె నీ మొలనూలునఁ గట్టువడుదుఁ
బూనుదును నీవు మెడఁబెట్టు పొగడదండ. 120

క. నావుడును గంత గద్గది
కా వికృతి యడంచుకొంచు ఘనయత్నత వ
ణ్ణావలి యేర్పడఁ బలికెఁ బ్ర
భావతి చెవి యొగ్గి తనదు పతి యాలింపన్. 121

చ. అనఘుఁడ! నిన్ను సోదెగొను నంతటిదాననె యేను? దప్పు లే
దును దలపోయ; నీవలన దోసమె? యాత్మను బాయకున్న వా
రిని బలు కొక్కెమా అనుసరించుట మే నది వించునేఁ దొఱం
గని పెనుఁదప్పు నాయదియ కాక పదింబదిగాఁగ నెంచినన్. 122

ఉ. అట్టి మదీయ మైన వపురాశ్రయలోభ మహాపరాధమే
గట్టిగ లేచి వచ్చుటకుఁ గారణ మైనది నాకు దోసముల్
గట్టుదు నీ మృషాచటు వికారముఁ జూడఁగఁ జేసి యిప్పుడున్
దిట్టును రట్టు సర్వ మగు దీనికి నిన్ననఁ జెల్ల దేమియున్. 123

గీ. దూఱఁ దగు నిన్ను నొకటికిఁ దొంటియట్ల
కల్లకూరిమి నెఱపు వాక్యముల నన్ను
నిప్పుడును బయ లీఁడించె దిదియ కాదె
కుటిల తడిపాఁతఁ గుత్తుకగోయు టనఁగ. 124

ఉ. వట్టి ప్రియోక్తు లెందుఁ దగవా మిముబోంట్ల రసజ్ఞ కాత్మను
న్నట్టివ కాక యిప్పు డివి యట్టివ యైనను నీకు మోహపుం
బట్టపుదేవి యైన రతిభ్రాంతిన పల్కెద వేమొ నాథ! యే
గట్టిగ నా రతిప్రమదఁ గాను ప్రభావతి యంద్రు నన్నిలన్.

క. అని మానదుఃఖ ముద్దీ
పన మొందఁగ నవ్వధూటి ప్రక్క లెగయ నే
డ్చెను వెక్కి వెక్కి లోలో
ననె 'యకటా! యిదియు జీవనమె నా' కనుచున్. 126

క. నాయకుఁడును దాను మును 'ర
తీ!' యని తద్రతులసంగతిన పల్కిన ప
ల్కా యింతికిఁ గోపము రాఁ
జేయుట తద్వచనరీతిచేఁ గని నగుచున్, 127

క. రమణీ! యిందాఁకను దెలి
యము నీ యల్కకు నిమిత్త మదియే భవదు
త్తమ రతి నేఁ గరఁగుచు మె
చ్చుమరఁగ నట్లంటిఁ దాని నది తప్పగునే? 128

క. అనుటయు భవదుత్తమ రతి
యనుపలు కొక్కటియె యాత్మ నంటె సతికి నా
థుని పలుకులలో రతి యీ
సున దృఢవాసిత మితరముఁ జొరనీదు మదిన్. 129

క. ఉవిదయు భవదుత్తమ రతి
భవదుత్తమ రతి యటంచుఁ బతి పలు కీర్ష్యా
వివశతఁ బలుమఱుఁ దడవుచు
నవివేకంబునఁ దదర్థ మరయుచుఁ దనలోన్. 130

క. నాకంటె నకట యుత్తమ
యాకె యగుట చెప్ప వలయునా యీగతి నీ
వాకున నీ దగుప్రేమో
త్సేకమె చాటంగ ననుచుఁ జింతిలు చుండెన్. 131

వ. ఇట్లు తద్దయుం బ్రొద్దు చింతాక్రాంత యై యున్న ప్రభావతికిఁ
బ్రద్యుమ్నుం డిట్లనియె : 132

క. పలుక వొకింతయు నాతోఁ
జిలుకవు కరుణామృతంబు చిను కొకటియు లో
నులుకవు నాదగు దైన్యపుఁ
బలు కవగణనమున వినుచుఁ బద్మదళాక్షీ ! 133

క. చేరక యుండఁగ నా కొక
ఘోరపుటాన యిడి నీవుఁ గూరిమి కెడ యై
కారుణ్య మెడలి నావెత
చేరువనే వినుచు నునికి చిత్రము తరుణీ ! 134

క. దానవునకు నుదయించిన
దానవు గావున లతాంగి ! దయ చాలదు నీ
మానసమున నీవిలఁ బ్రథ
మాన సమస్తోరుగుణ సమంచిత వైనన్. 135

ఉ. నీ విపు డింతపేరలుక నెట్టుకొనన్ ధరియించి యున్కి నా
కోవనజాక్షి ! మందపవనౌషధినాయకముఖ్యు లుగ్ర తా

పావహాు లౌట చిత్రమె నిజాత్మ యనంగుఁడు నోంచుచున్నవాఁ
డీవిధిఁ బ్రేమపాత్రుఁ గినియించినవారికి శత్రు వాత్మయుణ్. 136

గీ. ఆన విడువు మచ్చటికి నే నరుగు దెంచి
యలుక తీర్చెదఁ గాదేని జలరుహాక్షి!
యాన విడువు మిచ్చటికి నీ వరుగుదెంచి
నీదు మధురంపు మోవి తేనియలు నాకు. 137

వ. అని యంత కంతకుఁ బెరిఁగెడు పరిరంభరాగతత్పరతావశంబున,

ఉ. రాఁగదె యో సుధాంశుముఖి! రాఁగదె యో కఠినోన్నత స్తనీ!
రాఁగదె యో విలాసవతి! రాఁగదె యో కలకంఠభాషిణీ!
రాఁగదె యో కళావిదుషి! రాఁగదె యో కలహంసగామినీ!
రాఁగదె యో గుణైకనిధి! రాఁగదె యోలలితాంగి! డగ్గఱన్.

క. కలికీ! రాఁగదె చిలుకల
కొలికీ! రాఁగదె లతాంత కోదండుని పూ
ములికీ! రాఁగదె యూరక
యలికీరార్భటుల నేల యలఁచెదు నన్నున్, 140

వ. అని వేఁడుకొనుచున్నంతం బట్టణంబులోనం దన విడిదివాకిటం బ్రాబోధికంబు లైన వాద్యస్వనంబులు వినంబడుటయు వజ్రనాభు పడవాళ్ళు పిలువ వచ్చువేళ యయ్యెఁగావలయు నింతటం బోక యున్నఁ గార్యంబు తప్పుననుచు లేచి యాత్మకల్పిత భూవివర ద్వారంబున కై చనియె నప్పుడు, 141

క. వెఱపింపఁబోయి వెఱచిన
తెఱఁగునఁ దా వేఁడుకొనఁ బతి న్వానుకొనియెం
దెఱవ తన యల్క కడుఁ గీ
ష్పఱిచి విజృంభించు విరహపరితాపముచేన్. 142

క. తన రమణి యిట్లు తను వెను
కొనుట యెఱుంగఁడు మురారికొడు కపుడు ప్రయో
జనవశతఁ జనియె నతి రయ
మున నాత్మ నివాసమునకు భూవివరమునన్. 143

క. ఆ వనితయు నడివడిని బ
లావధిగా నరిగి యంత నవ్వల సరుగం
గా వెఱచి తిరిగి వచ్చెను
భావము గలఁగంగ విభుని పానుపుకడకున్. 144

వ. ఇట్లు వచ్చి, 145

చ. తన విభు పాదసంగతిని ధన్యము లైన సువర్ణపాదుకల్
చనుఁగవ నొత్తుకొంచు మఱి శయ్యను రాలిన తద్విలిప్త చం
దన లవము ల్శరీరమునఁ దాల్చుచుఁ దత్పరిభుక్తముక్త మా
ల్య నికర మక్షియుగ్మమున నద్దుచు నించుకసేపు రంజిలెన్. 146

చ. తదనుభవోదితస్మృతి కతంబున నవ్విభురామణీయకా
భ్యుదయము చర్చసేయు సురతోత్సవచాతురి యెంచుఁ ప్రేమ సం

పద గణించు లాలనల భంగులు భావన నిల్పి మిక్కిలిన్
హృదయమునందు రాగిలుచు నింద్రవిరోధితనూజ మాటికిన్.

ఉ. అక్కట ! యిట్టివల్లభునియందును గోపము పుట్ట నాకుఁ ద
ప్పొక్కటి యేల తోఁచె నదియున్ మఱిమద్రతిఁగూర్చి యంటఁగాఁ
దక్కక తెల్పె వల్లభుఁడు దానికి నర్థము సప్పు డేను వే
ఱొక్కటిగాఁ దలంచి విడనొల్లన కోపము దైవ వంచనన్. 148

ఉ. ఆ యనఘుండు దాఁదొలుత నంపిన పత్రికలోన నున్నయ
త్యాయతరాగభంగు లరయంగ ననన్యసమానభాగ్యఁ గా
నాయదిచూడ నాదయినయల్క యమూలము కాకయున్నె నా
నాయకుఁ డట్లు ప్రార్థన మొనర్పఁగ నే విన కుస్కిరొప్పనే. 149

క. మగవాఁడుఁ దుమ్మెదయు సరి
జగతి నదియుఁగాక నాఁటి చాటూక్తుల ప్రే
మ గురుత్వము నల పత్రిక
యు గణింపఁగ నతనియందు నొదవునె తప్పుల్. 150

వ. అని విరహవేదనం బొరలుచుండఁ బ్రభాతంబగుటయుఁ బ్రభా
వతి తన గృహదేవతయుం బోలెఁ బూజలందుచు ననన్య విదిత
గుప్తంబై యున్న యా పత్రికం బుచ్చుకొని శృంగారపుందోట
లోనికిఁ జని యొక్క వివిక్తస్థలంబునం గూర్చుండి మున్ను రాగ
వల్లరి చదువఁగా మిగిలిన పత్రికాభాగంబు తనచేత నటమున్ను
బహువారపఠితంబయ్యు నపోత్కంఠఁ గలుగఁజేయుచుండ నల్ప
స్వరంబునఁ దనలో నిట్లని చదువందొడంగె: 151

ద్విరదగతిరగడ.

ఓహంసి ! నీ చేత నున్నయది నా బ్రదుకు
నా హృదయ మింతి కెందము నేకముగ నదుకు
కరుణ నిది పదివేలు కమ్మలుగఁ గైకొనుము
పరఁగ సతితోడ నా పలుకుగా నిట్లనుము !
'విద్యున్నిభాంగిరో ! వినుము నీ కృపగన్నఁ
బ్రద్యుమ్నుఁడను పేరు ఫలితమగు నాకెన్నఁ
దై త్రిలోక్య నిత్యసామ్రాజ్య వైభవ మైనఁ
బోలదొక లేశమును బొలఁతి ! నీ కృపలోన
గరిమ నెల్లెడల నీ కనుసన్నలో వత్తు
హరిమధ్య ! యే బాసయైన దీనికి నిత్తు
నేణాక్షి ! విను నీ యుపేక్ష నా చెవిఁ బడినఁ
బ్రాణము హరించు విరులావార్త వెంబడిన
నీ మోవిచిగురు తేనియలు గ్రోలెడి యాస
నీ మొలకనవ్వు వెన్నెలచలువ గొను నాస
నీ మృదుకపోల సన్నిధిని మోపెడు నాస
నీ మోహనశ్రోణి నిమురఁ గలిగెడు నాస
నీదు పాలిండ్ల నానెడు వక్షమను నాస
నీదు శృంగారకళ నెలవు లంటెడి యాస
నీదు మణితామృతము నింతుఁ జెవినను నాస
నీదు లలితోరువు ల్నెమ్మి నొత్తెడి యాస
నొడలిలోఁ బ్రాణవాయువులు నా కిందాఁక
వెడలకుండఁగ నిట్లు విన్నవించెదఁ గాక

యీా కమ్మపూఁదోఁట యీా తేనియల జళ్ళు
నీ కోమలపుగాడ్పు లీ వెన్నెలబయళ్ళు
తను నైదుపాళ్ళు నింతికి పంచి లోఁ గొనవె
యనయంబు నివి విరహి కపకారు లన వినవె
నిండుచందురుఁడు నీ నెమ్మొగంబు సుహృత్తు
గండుఁగోయిలఫణితి కలభాషలకుఁ దొత్తు
మెఱుఁగుఁ దీగెలు నీదు మృదుతనూలత యంట్లు
కఱకుఁ బ్రాయపుఁ దేంట్లు కచభరశ్రీబంట్లు
కెంజిగురుచాయ నీ కెమ్మోవికిని దాసి
కింజవైభవము కన్గవకు నంతేవాసి
యివి యెల్ల నా కింపు లిల నీవు చేపట్ట
నివియె పెనుమృత్యువు లొకంత నీ వెడపెట్ట'
నని తన్నుఁగూర్చి నే నాడుట చెవిం జొనుపు
వనిత యే మనియె నది వ్రాసి వేగమె యనుపు
మో రాజహంసి! నీ యుల్ల మెందు నహేతు
కారుణ్య మని గట్టిగాఁగ నారసి చూతు
నని చదువుకొన వినియె నటమున్న యే తెంచి
వెనుక నుండి తదీయవిభుఁ డాత్మహ త్తించి, 152

వ. ప్రభావతియు నిట్లు లేఖ చదువుకొని తదర్థంబు మఱియు మఱియు భావంబునం బరామర్శించుచు : 153

మ. ఇవి యాదింగలప్రేమభంగు లిఁక నా యేతెంచుయత్నంబున
ట్టివిధి న్నన్నుఁ బరిగ్రహించుట నిరూఢి న్నేఁటిదాఁకం రతో

త్సవసాహార్ద్రరతుల్ శతోత్తరత మించం జల్పు టాభవ్య ప్రా
భవరూపాదిగుణవ్రజం బరయ నాభాగ్యంబె భాగ్యం బిలన్. 154

క. ఈ రాత్రి యకారణప్పుం
జేరలుకఁ దదాత్మ కెడసి పిరువీఁకగు చా
ప్పారయ భాగ్యవిహీనలు
లే రెవ్వరు నవనిమండలి న్ననుఁ బోలన్. 155

వ. అని చింతించుచుండ, 156

గీ. రాగవల్లరి యంత నా రమణికడకు
నరుగుదెంచి యాసఖివెన్క నచలవృత్తిఁ
బొంచి యున్నట్టి ప్రద్యుమ్నుఁ గాంచి యతని
యక్షిసంజ్ఞ చేఁ గానని యట్ల యుండి, 157

వ. తదనంతరంబ యా యంబుజాక్షి చందం బభివీక్షించి : 158

చ. పయిదలి ! నేఁ డిదేమి ముఖపాండిమ యున్నది మీాజె ప్రత్యుషః
క్రియల బరాకు మాన్చినది కృష్ణచతుర్దశి నాఁటి చంద్ర రే
ఖయు బలె మేను చిక్కినది గాటుక కప్పదె యెప్పుడుం గుచ
ద్వయిఁబికరాజిమ్రోఁతఁ గయిర్వాలెదు పోలెదు చల్లగాడ్పులన్.

ఉ. లోలతరాక్షి ! యా పయిఁటలోనిది యెక్కడి లేఖ యల్లనాఁ
జేలిక యంపినట్టిదియె యెయ్యదియైనను సిగ్గులేల నేఁ

డాలిఖితార్థ మేమయిన నట్టిటు గెంటినఁ జూచెదేమొ యా
బోలిక చూడ నట్ల యధిపు ల్సతులందును సత్యసంధులే. ? 160

క. అని నడుమనడుమఁ బ్రద్యు
మ్నుని వదనముఁ జూచి నగుచు ముద్దియ తల్లో
చేన సంజ్ఞా ప్రేరణమున
దనుజేశ్వరసుతకుఁ మఱియుఁ దా నిట్లనియెన్: 161

క. ఈ రేయిరమణుఁ డెంతయుఁ
గారించినవాఁడు నిన్ను గట్టిగఁ దెలిసెన్
నారీమణి ! మానునె మదిఁ
గూరిమి దాఁచుకొని యలుగఁగూడదు నీకున్. 162

క. నీ వలిగెడుదాఁక ను లే
దో వనితా ! యాటమాని యొడ్డించుకొనం
గా వలసె విభుని యలుకల
చే విరహాకులిత వై కృశించితి విదిగో. 163

ఉ. తానటు లల్క దెచ్చుకొని ధైర్యబలంబున రాక తక్క నీ
వైన వియోగతాపమృదితాకృతి చూడఁగ నప్పుడిష్ట మో
మానిని ! తాను నోర్వఁ డటిమాత్రపియుక్తికి నిష్ఠ మాన్పు నీ
కా నెఱజాణ యోగ్యకరుణామృతవృష్టి నయోగఖేదమున్. 164

వ. అనిన రాగవల్లరికిం బ్రభావతి యి ట్లనియె : 165

సీ. అట్టి యసత్యంపు టలుకలు గల్పించు
కొని వియోగవ్యథఁ గుందఁజేసి
కాంతల యా రూపు కనుఁగొను వేడ్కలు
బాగుండె తోడి నిర్దయులయందు
సంభవించునొ కాని సత్కృపారాశి మ
త్ప్రాణేశుఁ డే వినోదమున కైన
ననుఁ జిన్నవుచ్చి కన్గొనఁజాలఁ డొక ని
మేషార్ధమాత్రంబు నో యంబుజాక్షి!

నేఁటిరాత్రి తెలుంగు నా నేరమున జ
నించె నది యొక్కమాటకే నెమ్మనమున
నలిగి తేలిన యెన్నెన్ని ప్రార్థనముల
దానిచే నెంత యెడసెనో ధవుని మనము. 166

చ. అన విని రాగవల్లరి సమంకురిత స్మిత కోమలావలో
కనముల నా ప్రభావతిని గన్గొనునట్లు తదీశ్వరుంగనుం
గొని బళి గోపపుత్ర! రసికుండవు నీదగు ధౌర్త్య మింతిపై
ఘన మనుమా నవీనసుధగాంచి చవుల్గొనుకోర్కి కోర్కియే? 167

క. నా విని 'యోసి తుటారి! ద
యా వారిధి నధిపుఁగూర్చి యనకు మొకటియుఁ
నా వెట్టికినుక యింతకుఁ
దావల మని చెప్ప వినవె తరుణీ!' యనియెఁ. 168

వ. అని యో రాగవల్లరీ! నీవు నాకు బహిఃప్రాణంబవు గాని సఖీ మాత్రంబవు గావు నీకు దాఁపురంబు సేయ నేల మా తెఱంగు వినిపించెద వినుమని తన కోపనిమిత్తంబును బ్రియుండు తనతోడన రాకుండ నాన వెట్టి తాను శయ్యాంతరంబున కరుగుటయు మొదలుకొని ప్రియ నిర్గమపర్యంతంబుగాఁ దమ వృత్తాంతంబు సకలంబునుం జెప్పఁదగిన ప్రకారంబునఁ జెప్పి యిట్లనియె: 169

క. కాంతుం డాగతి నాయ
త్యంత కఠోరతను నాత్మయందు విఱిగియో
యింత యగు విరహదశ కుప
శాంతి యరసికొననో లేచి చనియెం బెలుచన్. 170

క. తఱి నంత వేఁడుకొన విన
నెఱుఁగని నా నిష్ఠురతను నేఁడు విఱుగుల
స్వైఱిగ నొకో ప్రియుని చిత్తము
విఱుగకయున్నం ద్యజించి వెస నేల చనున్? 171

ఉ. వ్రీడకు మానసంపదకు వెల్తి గదా యిది యంచు నెంచ కేఁ
గూడఁగఁ బాఱి పట్టుటకు గొబ్బున నప్పుడ సాహసించితిన్
వీడియు దాఁప నేర కిది చెప్పెదఁ బ్రాణము నీవు గావునన్
గూడఁగ లేక యంతఁ గడుఁ గుందితి ఘోరవియోగవేదనన్.

ఉ. ఆ పరిపాటి కంతఁ గడు నల్గుచు నట్టి విభున్ దథావిధా
లాపవిచిత్రతం దురపిలంగ వియోగదవాసహత్వమున్

జూపుచుఁ జేర వేఁడు వివశుం గయికోక కఠోరవృత్తిఁ బె
న్పాపముఁ గట్టుకొన్న గతభాగ్యకు నా కివి పాట్లు నచ్చెలీ! 173

సీ. నెఱప కే లున్నవి నెత్తలి రేఁకులు
తమ వాఁడి యెల్ల నా తనువుమీఁదఁ ?
బఱప కే లున్నవి పరభృతశ్రేణులు
శ్రుతులలోఁ దమపల్కు-సూదు లెల్ల ?
నుఱుప కే లున్నవి నెఱయ ధైర్యంబును
గందంపుమల కోడె గాడ్పుగములు ?
విఱుప కే లున్నవి వెస నంటఁ బొదివి వ
పుర్మహాశఁ బరాగ ముర్మురములు ?

నన్ను నొక భూమిలోపలి నాతి గాఁగఁ
దలఁచి వే చంప కేట్లోర్పు దాల్చినవియొ ?
తెగితెగని చిఱుక త్తికోఁతగ వధించు
టుచిత మని యోలి నిశ్చేచు చున్నయవియొ ? 174

చ. అని విరహాంపుఁ బేరలఁత నాశ్రిత చంద్రశిలాతలంబు మీఁ
ద నొరగుచుణ్ సఖిం దిగిచెఁ దన్వి శిరోదిశకై తదంకముం
దనకుఁ దలాడగాఁ గొనఁగఁ దద్జ్ఞత బోఁటియుఁ దత్క్రియా ప్రవ
ర్తనకుఁ దదీశు దాకొలిపి తాఁ దనయింటికిఁ బోయె నవ్వుచుణ్.

గీ. ప్రాణసఖి యిట్లు పన్నిన పన్నుగడలు
తెలియమిం జేసి యపుడు దైతేయకన్య
తనకు నంకోపధాన మట్లనువు పఱిచి
యా లతాంగియ యున్నది యను తలఁపున, 176

ఉ. ప్రాణసఖీ! నిను న్నెరయఁ బాసి చనన్ దఱి వచ్చె నాకుఁ గ
ల్యాణి! తలంపుమీ సుసమయంబుల నన్నని ప్రేమ పెంపునన్
బాణి మెడం దగిల్చి తనపైకిఁ దదాస్యము వంపఁ బూని సు
శ్రోణి నిజేశుమో మగుట చూచి త్రపాద్భుతమోదమగ్నతన్,

క. ఒక్కింత తడవు చేష్టలు
దక్కి కనంబడియెఁ జిత్ర తనువును బోలెన్
మిక్కిలిఁ గమనీయత సతి
దక్కు కురుస్తంభసంగతత్వము కతనన్. 178

వ. అప్పుడు ప్రభావతికిఁ బ్రద్యుమ్నుం డి ట్లనియె: 179

చ. వెఱఁగు పడంగ నేల యలివేణి! భవత్ప్రతిఁగా నెయ్యేను నీ
విరసత మాన్ప లేక పుడు వేఁగుచు నంతటిలోఁ బ్రయోజనాం
తరమతి నేగి నేఁటికిని దాని ప్రసంగము లేమి వచ్చితిన్
దిరిగి వసించితి న్వెనుక దిక్కున నీవిధ మెల్లఁ జూచుచున్. 180

చ. అని యిరుఁగేలఁ గ్రిందటిగ నా సతి బాహులు పట్టి యెత్తి వె
న్వెనుకకు రా వెసం దిగిచి వేడుక నంకకృతోపవేశఁ జే

సె నెరులు దువ్వెఁ జెక్కిటను జెక్కిలి చేర్చెను మోవి చుంబనం
బొనరిచెఁ జన్నులంటెఁ గరయుగ్మము ప్రక్కలఁ బొలెఁ జొన్పుచున్.

మ. సుముఖీ! యెన్నఁడు నింక నల్గనను మంచు న్నొక్కి పట్టె న్నఖా
గ్రములన్ దంతశిఖన్ గుచాధరము నాకాంతుండు తత్కాంతయున్
సుముఖా! యెన్నఁడు నల్గఁజేయ నను మంచు న్మోవి తానట్ల నొ
క్కె మనోనాథు వరిష్ఠనిష్ఠురకుచక్లిష్టాంగుఁ జేసెం దుదన్. 182

చ. అలుక యొకింతకాలము మహత్తరసేతువురీతి నాఁగి భే
దిలి తొలఁగన్ సహస్రముఖతీవ్రత చూపెను దొంటికంటె వా
రల యసమానమానిత పరస్పర కేలి రసప్రవాహ మ
గ్గలికఁ దదుత్తరంగ రతికర్మ విచిత్రతఁ జెప్ప శక్యమే! 183

వ. ఇవ్విధంబునఁ బ్రద్యుమ్నుండు ప్రభావతిం గూడి బహుకాలంబు యథేష్టభోగంబు లనుభవించుచు నప్పటప్పటికి వజ్రనాభుని నపూర్వ నర్తన ప్రవర్తనంబులన్ వశవర్తిం జేసికొనుచుఁ బ్రవర్తిల్లె గదసాంబులును జంద్రవతీ గుణవతులతోడఁ గూడి రాత్రులెల్ల రమియించుచు నాట్యసమయంబులఁ బ్రద్యుమ్ననకు విదూషక పారిపార్శ్వికాది కృత్యంబుల సహాయత్వంబు నడపుచు దైత్యవిభుని చిత్తంబు వడసి రంత, 184

చ. రమణ దలిర్పఁగా ఋతువురాకలు దక్కె నొడళ్ళు చిక్కె చి
ట్టుము లుదయించె వేవిళు లనూనత మించెఁ గపోలసీమఁ బాం

డిమ గనుపట్టెఁ జన్నొనల నీలిమ పుట్టె వలగ్నముం గురు
త్వము పొరసెన్ వళుల్విరిసె దానవకన్యలకుం గ్రమంబునన్.

ప్రభావతి మొదలగు దానవస్త్రీలయందుఁ బ్రద్యుమ్నాదులవలనఁ
బుత్త్రులు గల్గుట

క. నవమాసానంతరమునఁ
బ్రవిమల శుభదినమునం బ్రభావతిగాంచెన్
శివ గుహునిఁ గాంచు కైవడి
నవనిఁ బ్రభావంతుఁ డనఁగ నమరెడు తనయున్. 186

క. ప్రణుతగుణ చంద్రవతి దిన
మణినిభుఁ జంద్రప్రభుం గుమారునిఁ గాంచెన్
గుణవతియుఁ గాంచె నిరుపుర
గుణవంతుం గీర్తిమంతుఁ గోర్కులు పొదలన్. 187

వ. ఇట్లు గాంచిన కుమారు లుదయించుచుం దోడన పరిపూర్ణ
యౌవనులును సకల వేదవేదాంగపారగులును ధనుర్విద్యా సంప
న్నులు నగుచుం గన్యాంతఃపురంబునఁ బ్రవర్తిల్లుచున్నంత
నొక్కనాఁడు తద్రక్షణాధికారులవలన వారలయునికి నిశ్చితం
బుగా విని వజ్రనాభుం డాగ్రహోదగ్రుం డగుచుం దన సభా
సదులఁ గలయం గనుంగొని, 188

వజ్రనాభుఁడు కన్యకాంతఃపురములోఁ గ్రొత్తవా రున్నారని
విని సభ్యులతోఁ జెప్పి వారిఁబట్టితేఁ దలారిని బంపుట

ఉ. కంటిరె కాలవక్రత ప్రకారము దానవముఖ్యులార! నా
యింటికి ద్రోహముం దలఁచి యిష్టసుఖాప్తికి మ్రుచ్చు లిట్లు నూ
ల్కొంట దలంప శేషఫణి కోఱల వ్రేలిడి గోఁకుకోఁగ ము
క్కంటి వెలుంగుకంటఁ జణకంబులు వేఁచుకొనంగఁ బూనరే. 189

గీ. వాండ్రు సురవంశ భవులైన స్వర్గమునకుఁ
బ్రళయ సమయ మిప్పుడు నాగకులజులైన
నాశకాలంబు లుద్భవమున కిదియ
నరు లయిన నంత్యదశ నేఁడ ధరణి కెల్ల. 190

గీ. ప్రాణములతోడ నిట వాండ్రఁ బట్టి తెచ్చి
తెలిసి తల్లోకమును గడతేర్పవలయు
నీవు చని పట్టి తె మ్మని నిజ పురంబు
పెద్ద తలవరిఁ దాఁ బంచె భీమబలుని. 191

గీ. వాఁడు చని తిరుగక యున్న వరుస దండ
నాయకోత్తములను దళవాయిఁ బనిచె
వారుఁ దిరుగ కుండినఁ దదవస్థఁ దెలిపె
నరులు కోట కొమ్మలఁ గట్టినట్టి తలలు. 192

అంతిపురమునకుఁ బోయిన తలారి మొదలగువారు తిరిగి రామిచే వజ్ర నాభుఁడు తమ్ములు మొదలగువారితో నటకేగి యుద్ధము చేయుట

వ. వజ్రనాభుండు తా నత్యంత కోపాటోపదీపితముఖుం డగుచుఁ దన తమ్ముఁడు సునాభుండును సకల బంధుమిత్రామాత్యవర్గంబు లును రథ తురంగ మాతంగ పదాతివ్రాత పాదఘాతంబులచేత భూతలంబు వడవడ వడంక నద్భుతోత్సాహంబునఁ బేర్చి కొలువ నలువు మిగిలి కన్యకా భవన ప్రాకారంబు చుట్టు ముట్టుకొనియె నప్పుడు తమ విడుదుల నున్న ప్రద్యుమ్న గద సాంబులు మన మింతట నంతఃపుర ప్రవేశంబు సేయక తడసిన నీ బెడిదంపు రక్క సుని యక్కజంపు విక్రమంబు కుమారులకు నోర్వ శక్యంబుగా దని పూర్వవిహిత మహీవివర ద్వారంబున నా క్షణంబ ప్రవే శించి భీతివశంబున నొక్కచోటనే చేరియున్న తమ కళత్రంబుల యుత్తలపాటు దీర్చి తత్పూర్వ కృత్త దైత్యగాత్రంబుల నెత్తుటం జొత్తిల్లిన యాయుధంబులు తమ చేతులన యుండ సంభ్ర మంబునం జనుదెంచి మ్రొక్కియున్న కుమారుల సంశ్లాఘా వచనంబుల నలరించి రట్టియెడఁ బ్రద్యుమ్నుండు ప్రభావతిం జూచి యి ట్లనియె: 193

ఆ. మగువ! వినుము మిగులఁ దెగి విక్రమింప మీ
తండ్రి కదలి వచ్చె దర్ప మెసఁగ
మనకు వచ్చుఁ గడుఁ బ్రమాద మే మింతట
యుద్ధమునకుఁ దెగక యూరకున్న. 194

క. కుసుమముల వ్రేట్లాటలు గా
వృషరాజానన! రణంబు లూహించిన వెం
బడి రా వే మటు తొడరెనఁ
దొడిఁబడ నెవ్వాఁడు బిట్టు ద్రుంగునొ మాచేన్. 195

ఉ. చేడియ! నీ మనంబునకుఁ జింత యొకింత జనించె నేని నేఁ
జూడఁగఁ జాల నీ జనకు చొప్పు దలంప హుతుండు గాక తాఁ
గీడు చలంబు మానఁ డనికిం జొర కొండొకత్రోవ ద్రొక్కఁగాఁ
గూడద యేమి సేయుదును ఘోరవిచారము పుట్టె నాత్మలోన్.

చ. అని తనుఁ గూర్చి దానవకులాగ్రణిపైఁ దెగలేని చింత సే
యు నధిపుఁ గోటలగ్గలకు నుగ్రత డగ్గఱు భూరిసైన్యుఁ దం
డ్రినిఁ బరికించి యింతి విభునిం దముఁ గాఁచికొనంగ వేఱ త్రో
వ నెమకె కాన కంతఁ బితృవత్సలభావముఁ బాఱ నూకుచున్.

క. తాన చని మూల నున్న య
నూన తదీయాసిఁ దెచ్చి యొసఁగి గెలువుమీ
దానవపతిఁ దక్కన యను
మానము మాను మని పలికె మానవతి పతిన్. 198

చ. పలికిన సంతసిల్లి హరి పట్టె గదాదుల నార్వురన్ వధూ
నిలయములోని కావలికి నిల్పి రయంబున నొక్కరుండుఁ దా

వెలువడి కోట కుగ్ర బలవేష్టనము న్విడిపించుచున్ నిర
ర్గళగతిఁ జుట్టునుం దిరిగె ఖడ్గవిహార పటుత్వ దీప్తుఁడై. 199

ఉ. కాంచనదీప్తిచేఁ బసిఁడిగట్టు తెఱంగు నగళ్ళకోట సూ
చించఁగఁ దాను భాస్కరుని చెన్ను వహించెను దానిఁ జుట్టి రా
సంచరణం బొనర్చుచును శౌరి తనూజుఁడు కోటచుట్టునున్
డించిన దైత్యసైన్యము వడిం దమము న్వలె విచ్చి పాఱఁగన్.

## ప్రద్యుమ్న వజ్రనాభుల యుద్ధము

క. లగ్గలకు నట్లు కోటకు
దగ్గఱు తన మొనల నెల్లఁ దఱిమి తఱిమి పే
రగ్గలిక చూపు మరు పో
టగ్గించుచు వజ్రనాభుఁ డతని నెదిర్చెన్. 201

వ. ఎదిర్చి యి ట్లనియె : 202

ఉ. ఎవ్వఁడ వీవు నాముదల యించుక లేక చొరంగ రాదు వీఁ
డెవ్వరి కైన బ్రహ్మవర మిట్టిది యే గతిఁ జొచ్చి తీవు ? తా
నివ్విధి నాకుఁ గల్లవర మిచ్చిన బ్రహ్మకు శిక్ష చేసెదన్
గ్రొవ్వడఁగించి నిన్నిపుడ కొట్టెద నీకుల మెల్ల రూపఱన్. 203

వ. అనుటయు నతఁడు, 204

క. నిను నేఁడు తిరిగి చన ని
చ్చినఁ గద బ్రహ్మకును శిక్ష సేయుదు వీ దు
ర్జనతలె కావే మిముఁ జెఱి
చినవి యసత్యోక్తి బ్రహ్మజిహ్వకుఁ గలదే! 205

క. మొదలను బురిఁ జొచ్చితి నీ
ముదలన భద్రనట వేషమున హరి సుతుఁడన్
యదుకులజుఁడఁ బ్రద్యుమ్నుఁడ
మదిచ్చఁ గైకొంటి నీ కొమారితపొందున్. 206

ఉ. కోరికఁ దావకానుజుని కూఁతులకుం బతులైనవారు మా
వారలె నాకు వారికి నవార్యబలు ల్సహజాత యాదవ నో
దారులు గల్గి రాత్మజులు తల్లుల రక్షకు నున్నవారు ప్రా
కారములోన నీ దొరల గన్యలఁ బల్వురఁ దిన్నమృత్యువుల్. 207

గీ. హరికి దేవేంద్రునకు నీవు శరణు చొచ్చి
తేని నీ ప్రాణముల కెందు నేను డెగను
శరణు చొరవేని నావాలు కరుణ గిరుణ
యెఱిఁగినది కాదు నీ వది యెఱిఁగె దిపుడ. 208

గీ. అనిన విని 'యోరి! నీ వేమి యనినఁ జెల్లు
నేను నా దృష్టి యెదుట ని న్నింత తడవు

పెట్టుకొని యుండుటకు ' నని బెట్టిదంపు
టంపవానలు గురిసె భయంకరముగ. 209

క. తన వాలునఁ దచ్ఛరములు
దునుముచుఁ బ్రద్యుమ్నుఁ డతనిఁ దునుము కడంకన్
ఘనరయమునఁ జనఁ దాఁకిరి
సునాభముఖ్యు లగు రాక్షసులు బలములతోన్. 210

క. అది యంతయుఁ గని మనముల
గద సాంబులు గినిసి కోట గవఁకులు దెఱపిం
చి దురాధర్షాటోపత
నెదిర్చిరి సునాభముఖుల నింద్రాహితులన్. 211

శా. అంతం గేశవుఁ డంచవేగరులచే నా దైత్య సంగ్రామ వృ
త్తాంతంబు న్విని తార్క్ష్యవాహనుఁడు చక్రాద్యాయుధ ప్రోల్లస
త్కాంతిక్రాంతదిగంతరుం డయి వడిన్ దావచ్చె నచ్చోటికిన్
సంతోషంబున వజ్రి సత్వరగతి న్సంధించి సేవింపఁగాన్. 212

వ. అప్పు డింద్రుండు ధనురాది సకలహేతి సమేతంబును మాతలి
సారథికంబును నైన తన దివ్యరథంబును బ్రద్యుమ్నునకు ననిపి
గదసాంబులకు ననన్యదుర్జయంబు లైన దివ్య స్యందనంబులఁ
బనిచె దాన నపూర్వోత్సాహంబునఁ బొదలియు యదుకుమా

రులు ప్రతిభటుల మించం జాలక సత్వరంబునఁ బోరుచుండి
రయ్యవసరంబునఁ గృష్ణుండు, 213

క. సాహసము నాహత ప్ర
త్యాహతనై పుణము నొక్కయంతగ సుతుతో
నాహవ మొనరించు మహో
త్సాహనిధి న్వజ్రనాభ దైత్యునిఁ జూచెన్. 214

ప్రద్యుమ్నుఁడు సుదర్శనమున వజ్రనాభు తలఁ ద్రుంచుట

గీ. చూచి యిట్లైన నెన్నండు సులభమగును
విజయ మని మరు చేతికి విష్ణుఁ డిచ్చెఁ
దనదు చక్రము నతఁడును దత్ప్రయోగ
మునను ఖండించె వజ్రనాభుని శిరంబు. 215

గదసాంబులు సునాభాదుల సంహరించుట

క. గద సాంబులు తద్విజయా
భ్యుదయముఁ గని పొంగి బహువిధోగ్రాస్త్రములన్
జిదురుపలుగ నొనరించిరి
కదిసి సునాభాది దనుజగణ దేహంబుల్. 216

వ. అప్పుడు, 217

శా. మందారద్రుమ పుష్పవృష్టితతులుఁ మంద్రస్ఫుర ద్దేవతా
దుందుభ్యారవ సంప్రవర్తనలు నస్తోకాప్సరో నర్తనా
మందోల్లాసము దివ్యగాయకుల సన్మాధుర్యగానంబు నా
నందోత్సేకము నిచ్చె లోకులకు మింటం జాల దీపించుచుఁ. 218

కృష్ణుఁడు ప్రభావంతుఁడు మొదలగువారిని వజ్రపురరాజ్యంబున
కభిషిక్తులఁ జేసి యింటికిఁ బోవుట

వ. అంత నచ్యుతుం డనాథత్వదైన్యదశాపన్నులగు పౌరజనుల ననేక విధ లాలనాచాతుర్య శీతల వచనామృతంబున నపగతాశేష శోకపరితాపుల నపూర్వసంభృతానంద విశేషులఁ గావించి వజ్రనాభుని రాజ్యంబు సర్వంబును జతుర్భాగంబులుగా విభజించి తదాధిపత్యంబునకుఁ బ్రభావంతునిఁ జంద్రప్రభుని గుణవంతునిఁ గీర్తిమంతునిం బట్టాభిషిక్తులం గావించి కొడుకులం గోడండ్రనుం దమ్ముని మఱఁదలిని నత్యంతవిభవంబు మెఱయం దోడ్కొనుచు ద్వారకానగరంబున కరుగుదెంచి దేవేంద్రునిం దదీయ స్థానంబున కనిచి సకల సామ్రాజ్యవిభవంబు లనుభవించుచు నిరంతర కరుణావలోకనంబుల భక్తజనంబుల నవలోకించుచు మహానందంబునం బొలుపొందుచుండె నప్పుడు, 219

క. వావిరిఁ బ్రద్యుమ్నుండు ప్ర
భావతితో నిష్టకేళి పరిపూర్ణత నిం

పావహిలఁగ వర్తిల్లెను
శ్రీవరుఁ దమతండ్రిఁ దగ భజించుచు ఘనుఁడై. 220

గీ. అఘహారణ హరివంశ కథాశ్రయంబు
నాత్మపుత్ర గుణ స్తవ నాంకితంబు
నైన యీ కావ్యమునకు మహాప్రసిద్ధి
యిచ్చుఁ గావుతఁ గరుణ లక్ష్మీశ్వరుండు. 221

శా. శ్రీ రాజేంద్రగుహా త్తమాన్వయ జనుర్విఖ్యాతసౌభాగ్య స
మారాధ్యప్రభు సత్కృపాచతురమ త్యానీతఫాలాక్ష భ
క్త్యారబ్ధ వ్యపగూహనాతిసుఖితా త్మా ప్తక్షమాశాంతి స
ద్వైరాగ్యోదయ బోధముఖ్య బహుసంతాన ప్రసిద్ధుండిలన్.

క. వరచామరవిమమ వృత ది
క్కరటిశ్రుతికీర్తి సామ్యకామ్య త్కృతి గో
చరితాఖిల విద్వత్కుం
జరకర్ణుఁడు కర్ణుఁ డీఁగిచాతుర్యమునన్. 223

వనమయూరము.

భృత్యజనపోషణుఁడు పింగళిపురాంకా
మాత్యకుల భూషణుఁడు మార్దవ మహీయ
స్సత్యశుచిభాషణుఁడు సాధుజనతా సం
పత్త్యుదయపోషణుఁడు భవ్యకృపవేర్మిన్. 224

## గద్యము

ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగిత కవిత్వవైభవ పింగళి
యమరనార్యతనూభవ సౌజన్యగేయ సూరయనామ
ధేయ ప్రణీతంబైన ప్రభావతీ ప్రద్యుమ్నం
బను మహాప్రబంధంబునందుఁ బరిపూర్ణ
భావభాసురంబయిన

పంచమాశ్వాసము.

---

శ్రీ ర స్తు

అ వి ఘ్న మ స్తు

# హరివంశములోని ప్రభావతీ ప్రద్యుమ్న వృత్తాంతము



వైశంపాయనునివలన భారతాంతర్గతం బైన ఖిలంబులలోని హరి వంశమ్ము వినుచున్న జనమేజయుం డతనిం జూచి మున్ను నికుంభవధ ప్రస్తావంబున వజ్రనాభవధంబు సంక్షిప్తంబుగఁ జెప్పంబడె; దాని నీ యనుగ్రహంబుకతంబున విస్తరించి వినవేడుక గలదన నా ముని సంతసించి వజ్రనాభవధంబును బ్రద్యుమ్నాదుల విజయంబును జెప్పెద నాల కింపుమని యిట్లనియె. మున్ను వజ్రనాభుండు నాఁ బ్రఖ్యాతుండును మహాశూరుండును నగు రక్కసుండు మేరుతటంబునఁ దపంబుఁ గావించె. లోకపితామహుండైన చతుర్ముఖుం డతని తపంబునకు సంతసించి నీకు వరం బిచ్చెదఁ దపం బుడుగు మని బతిమాలెను. ఆ దానవ సత్తముండు దేవతలవలని యవధ్యత్వంబును వాయువునకు సయితము స్వాతంత్ర్యం బునం బ్రవేశింప రానిదియు స్వర్ణరత్నమయంబు నగు వజ్రపురంబును దానికిం జుట్టుఁ బెక్కు శాఖానగరంబులు (పేటలు) ను గోరకుండఁగ సకల కామోపపత్తియుఁ గోరెను. తమ్మిచూలి వరదానంబున నవి యన్నియుం బ్రాపింప నతఁ డా పురంబున సుఖంబుండె. అసురులు పెక్కండ్రు లబ్ధవరుండైన యతని నాశ్రయించి రమ్యంబగు నాపురం బున నుపపురంబులను హృష్టులుం బుష్టులునై యుండిరి. ఇట్లుండ

దుష్టాత్ముం డగు వజ్రనాభుండు వరంబున దర్పించి జగంబుల బాధింపం దొడంగి యొకప్పు డింద్రలోకంబునకుం బోయి యతనితో నిట్లనియె: "పాకశాసనా! కశ్యపు సంతానంబున కెల్ల నిజ్జగంబుల మూఁటను స్వత్వంబు సామాన్యంబు; నే నిప్పు డీ త్రైలోక్యంబు నేకచ్ఛత్రంబుగఁ బాలింపం గోరుదు; గాన నీ లోకంబును నా కిమ్ము; నీ తలం పట్లు లేదేని దేవగణంబులతోఁ గూడి కయ్యంబు సేయుము," నా సురశ్రేష్ఠుండు బృహస్పతితో నాలోచించి "వజ్రనాభా! మనకుం దండ్రి యగు కశ్యపుఁ డిపుడు జన్నంబు సేయ దీక్షితుండై యున్నవాఁడు. యజ్ఞ దీక్షానంతర మతఁడు న్యాయ్యంబుగ నీ వివాదంబుఁ దీర్పంగలవాఁ" డన వాఁడు తండ్రియొద్దకుం బోయి యా మహాఋషిచే నట్లు పలికించు కొని వజ్రపురంబునకుం బోయి సుఖంబున నుండె. ఇట నింద్రుండు ద్వారకకుం బోయి కృష్ణునకు వజ్రనాభ వృత్తాంతంబు విన్నవింప నాతఁడు "వసుదేవుండు హయమేధంబు సేయ దీక్షితుండై యున్న వాఁ డా జన్నంబు సమాప్తం బగుడు వజ్రనాభుని ద్రుంతు నతని పురంబు ననుజ్ఞ నొందకుండ వాయువునకుం బ్రవేశింపరాదు గాన దానికిం దగిన యుపాయంబు ముందు చింతింతము పో" మ్మన దేవరాజు స్వస్థానం బునకుం బోయె. తరువాత శౌరి వాజిమేధం బగుచున్నపు డింద్రో పేంద్రులు వజ్రపురప్రవేశోపాయం బన్వేషించుచుండ భద్రుం డను నటుం డొక్కఁ డటకు వచ్చి తన నాట్యంబున నచటి ఋషుల సంతస పెట్టెను. ఆ మును లా వేసగాని వరంబుఁ గోరు మని నిర్బంధింప నమ రోపముఁ డగువాఁ డింద్రోపేంద్రుల యభిప్రాయంబున సరస్వతిచేఁ బ్రేరితుండై మునులకు నమస్కరించి 'చరాచరంబు లగు భూతంబుల వలన నవధ్యత్వంబును గామగమనంబును జరారోగంబుల లేమియు

మృతునేని జీవితునేని వేఱొక్కనినే నెవ్వని ననుకరింపఁ దలంతు వానిం బోలినవాఁడం గావలె ననియు నెల్ల మునులు నావలన సంతసింపవలె ననియుఁ' గోరి వా రట్ల యగుంగాక యన సంత సించి భద్రాశ్వాదివర్షంబులను గాలాభ్రాదిద్వీపంబులను విచ్చలవిడిం జరించుచుఁ బర్వదివసంబుల ద్వారకకు వచ్చుచుం బోవుచునుండె. శక్రుండిది చూచి దేవలోకంబున నున్న ధార్తరాష్ట్రంబులైన హంసల రావించి యిట్లనియె. "అంచలారా! విహంగంబు లెల్లను గశ్యపుని వలన జన్మించినవి గావున మీరు మాకు సోదరులరు. మఱియు దేవ విమానంబులు మీరు వహింతురు. మాకు శత్రువధార్థంబైన కార్యం బొకటి యిపు డవశ్యకర్తవ్యంబై యున్నయది. దేవతలయాజ్ఞ నతిక్ర మించిన మీ కుగ్రదండం బగును. వజ్రనాభుపురంబు దేవతలు ప్రవే శింపరా దని మీకుం దెలియును. హంసంబులకుం బ్రవేశింపరాని చోటు లేదు; గావున మీరు వజ్రపురంబుఁ బ్రవేశించి మంత్రభేదంబు సేయక యుచితం బగు రీతి నతనియంతిపురంబునందలి బావుల మెలం గుఁడు. వజ్రనాభునకు ముల్లోకంబుల లేని చక్కఁదనము గల ప్రభావతి యను కన్యారత్నంబు గలదనియు నామె తల్లికిం బార్వతి యిచ్చిన వరం బున జన్మించె ననియు నా బాల తలిదండ్రులచే స్వయంవరగాఁ జేయం బడినదియై తన యిచ్చవచ్చిన పతిని వరియింపం గల దనియు వింటిమి. కాన మీ రచటనుండి తఱి యగు నపుడు ప్రద్యుమ్నుని కులశీలాది గుణంబు లామెకడ వర్ణించి యనురక్తయయ్యెనా గూఢంబుగాఁ బ్రద్యుమ్ననకు సందేశంబు నడుపుఁడు. సమయానుసారంబుగ మీ బుద్ధివైభవంబు ననుసరించి నాకు మేలుసేయుఁడు. మఱియుఁ గార్ష్ణి యందుఁ బ్రభావతి మనంబెట్టు తగులు న ట్లతని రూపగుణాదులఁ బొగ

డుచు ననుదినంబు నాకును ద్వారకనున్న నా తమ్మునకు నచటి వృత్తాం
తంబుఁ దెలుపుచుఁ బ్రద్యుమ్నుండు వజ్రనాభుకూఁతుం బరిగ్రహించు
నంతదాఁక యత్నంబు సేయుఁడు. వజ్రనాభుఁడు దేవతల కవధ్యుండు
గాన వానిని సంహరింపఁ బ్రద్యుమ్నాదియదుకుమారులు దత్తవరుం
డైన భద్రనటునిరూపంబు ధరియించి యట రాఁగలరు.” ఇట్లు వాస
వుండు సెప్పిన పలుకుల నాచక్రాంగంబులు విని వజ్రపురంబునకుం బోయి
సంస్కృతంబులు నపూర్వంబులు నగు పలుకుల మధురంబుగఁ బలుకుచు
మున్ను వచ్చినవి యయ్యు విస్మయంబు పుట్టించుచు నంతఃపురో
పభోగ్యంబులును గాంచనపద్మోత్పలావృతంబులు నగు డిగ్గియలం జరిం
చుచు నా దైతేయుండు చూచి “మా కుత్సవంబు చేయం గోరినపు డెల్ల
మీా రిటకు వచ్చి స్వగృహంబునం బోలె విస్రబ్ధంబుగా నీ గృహంబున
విహరింపుఁ” డన నవి మహాప్రసాదం బని యందుఁ బ్రవేశించి దేవ
కార్యాపేక్షం జేసి క్రమక్రమంబుగ నచటివారితో నెయ్యంబు గావించు
చుండె. అంతిపురంబునందలి యింతులు గుమిగూడి మానుసులువలె
నవిచేయు చతురకథాలాంపంబులకుఁ జొక్కి మిక్కిలి వినుచుండ్రు.
పిమ్మట నాయండజకులవతంసంబులు చారుహాసినియు సర్వాంగసుంద
రియు నగుప్రభావతిం జూచి పరిచితం జేసికొన నామెయందు శుచిముఖి
యనువరటను జెలిగాఁ బరిగ్రహించె. తరువాత నొకప్పుడు శుచిముఖి
మనోహరంబు లగు నాఖ్యానంబులచే విశ్వాసంబు పుట్టించి చెలియం
జూచి “ప్రభావతీ! నీవు త్రైలోక్య సుందరివి. భీరూ! జవ్వనం
బతిక్రమించి పోవుచున్నది. నదీప్రవాహంబు వోలెఁ బోయినది మఱి
రా దని నీవు నెఱుంగుదువు. కల్యాణీ! ఈ లోకంబునం దరుణులకుఁ
గామోపభోగతుల్యం బగు సుఖంబు వేఱొండు లే దని నిజంబుగఁ జెప్పె

దను. "నీవు తండ్రిచే స్వయంవరగఁ జేయంబడియు దేవాసురులలో నొక్కని రూపశీలగుణంబుల నీకుం దగినవానిని వరియింపక పోయితివి. నీకై వచ్చినవారు రూపశౌర్యాదిగుణయుక్తు లగు వారు, నీకుం దగిన వారు పెక్కండ్రు ప్రత్యాఖ్యాతులై లజ్జితులై మఱలిపోవుచున్నారు; గాని, వచ్చినవాని నేవానిని బరిగ్రహింపనైతివి. కులశీల రూపశౌర్యాదుల నెవ్వానికి ముల్లోకంబుల సాటి గానము; మఱి యెవ్వాని మోము నకుఁ బూర్ణచంద్రుని, నయనంబులకుం గుశేశయంబులను బోల్ప నుత్సహింపము; ప్రభవిష్ణుం డగు విష్ణునిచే నెవ్వఁడు లోకసారం బుద్ధరించి పుత్త్రుండుగాఁ జేయంబడె; నెవ్వఁడు సాంగుఁడైన యనంగుఁడు బాల్యంబున హరియింపంబడిన యెవ్వనిచేఁ బాపాత్ముండు శంబరుండు హతుం డయ్యె; నెవ్వఁడు మానవులలో మానవుండు దానవులలో దానవుండు దేవతలలో దేవుండు నగు; నెవ్వఁ డన్ని మాయల నేర్చియు శీలంబు గాచికొను; నెవ్వఁడు తేజంబున సూర్యుని, గాంతి నగ్నిని, గాంభీర్యంబున హ్రదంబును, నోర్పునఁ బృథివినిం జోలు; నింక నే యే సుగుణంబు లెచట నెచటఁ గల వని నీవు విందువు; మఱియు నే యే సుగుణంబులు ముల్లోకంబులవారికిఁ గామ్యంబు లగు; నవి యన్నియుం గల రుక్మిణీ సుతుం డగు ప్రద్యుమ్నుండు భవదర్థం బెట్లును రాఁడుగా" యనఁ బ్రభావతి యిట్లనియె. "శుచిముఖి! విష్ణువు మనుష్యలోకంబునఁ గృష్ణుండై యున్నవాఁ డని మా తండ్రి చెప్పఁగాను నారదుఁడు చెప్పఁగాను బెక్కుసారులు వింటిని. మఱియు నతఁడు రాక్షసకులంబునకు శత్రువనియు నజేయుం డనియు దీప్తం బైన చక్రంబునను శార్ఙ్గంబునను గదను దానవకులంబుల ననేకంబుల రూపు మాపె ననియు మా తండ్రి శాఖానగరంబుల నున్న రక్కసులకుఁ జెప్పుచుండును. స్త్రీల

కెల్లరకుం బతికులంబు తండ్రికులంబుకంటె నధికమైనది గావలె నని మనోరథం బుండును గావున వృష్ణికులుని రప్పింప నుపాయంబు గల దేని యుపదేశింపుము. అది నాకు మహోపకారంబు. ప్రద్యుమ్నుండు నాకు భర్త యయ్యెనా నా కులంబు పావితం బగును. వృద్ధలగు రాక్షసాంగనలు పెక్కండ్రవలన హరి రక్కసులకుం బీడాకరుం డనియుఁ బ్రద్యుమ్నుని జన్మంబు నతఁడు సేసిన శంబరవధంబును మిగుల వింటిని. నా మనంబున నిచ్చలుఁ బ్రద్యుమ్నుం దలఁతు; గాని, నా కతని సమాగంబునకు సాధనంబు తోఁపదు. చెలియా! నేను నీ దాసురాలను. నిన్ను దూత్యంబున నియోగించెద. నా కతనిం గూడు నుపాయంబు సేయు" మన హంసి మందహాసంబు గావించి యిట్లనియె. "చారుహాసినీ! నేను నీ దూతినై కైశవపాలికిం బోయి నీ యుదార భక్తి నతనికి నివేదించి నీయొద్దకు వచ్చునట్లు చేయుదును; గాని, జ్ఞప్తియం దుంచుకొని నీ తండ్రికి నేను గథాకథనకుశలురాల నని సమయము వచ్చినప్పుడు చెప్పి నన్ను రప్పించునట్లు చేయుము. పిమ్మట నాచేయు మేలు నీవు పొందుదువు" నా నామె తండ్రితో నట్లు చెప్పెను. తరువాత వజ్రనాభుం డొక నాఁ డంతిపురంబున నుండి హంసి రావించి "శుచిముఖీ! నీ కథాకథన కౌశలంబు ప్రభావతి నేఁడు జెప్పె. నీ వే యాశ్చర్యంబులం జూచితి" వన నది "మేరుపార్శ్వంబున నద్భుత కర్మంబు గావించు శాండిలి యను దానిం జూచితిని. దానికిం బార్వతికిని సఖురా లగు కౌసల్య యను దానిం గంటిని. మఱియు మునులచే దత్తవరుం డగు భద్రుం డను నటుని దర్శించితిని. వాఁడు కామరూపి. దేవతలయు గంధర్వులయుఁ బెక్కుతెఱంగుల పాటలును నృత్యంబులు నెఱుంగును. వాఁ డెల్ల దేశంబుల సంచరించుచు నెల్ల

వారికి సమ్మతుండై నృత్యగానంబుల దేవతలకు సయిత మాశ్చర్యము పుట్టించుచున్నాఁడు." నాఁ విని వజ్రనాభుండు "హంసీ! నేనును నటుని వృత్తాంతంబు కొలఁది దినముల క్రిందటఁ జారణులు చెప్పుకొను చుండ వింటిని. గొప్ప ప్రయత్నంబుననేని యతనిం జూడఁ గుతూహలంబు గలదు; గాని, యతని పరిచయంబు లేదు" నావుడు హంసి "యతఁడు దీవు లన్నిటం జరించుచుండును; గాని, గుణవంతుఁ డగు జనుని విన్నఁ దప్పక చూచును. నీ గుణాతిశయంబు విన్న నటుఁ డిక్కడికి వేగ వచ్చు నని తలంపు" మన వజ్రనాభుండు "పక్షినందినీ! అతఁ డిట వచ్చు నుపాయం బెద్దియేని కావింపుము; నీకు మేలు సేసెద" నన నదియు దానితోడియంచలును దదర్థం బని వజ్రనాభునివీడ్కొని వృత్తాంతం బెల్ల నధోక్షజునకును మహేంద్రునకును విన్నవించె. కృష్ణుం డది విని ప్రభావతింగూడను వజ్రనాభుని శాసింపను బ్రద్యుమ్ను నియోగించి దైవి యగు మాయచే నతని నటునిని, సాంబుని విదూషకునిని, గదుని పారిపార్శ్వకునిని జేసి వారముఖ్యులకుఁ గొందఱకు నటీవేషంబులను గల్పించి భద్రునిసామగ్రిం బోలినయెల్ల సామగ్రిని సంఘటించి భైములం గొందఱం దోడిచ్చి పంపెను. వారెల్లరును బ్రద్యుమ్నుండు రచియించిన విమానంబు నెక్కి వజ్రపురంబుఁ జేరి దాని శాఖానగరంబును, రాక్షసాకీర్ణంబు నగు సుపురంబున దేవకార్యార్థమై విడిసిరి. వజ్రనాభుం డదివిని తనపురంబునందలి రక్కసులకు వారిసుఖంబునకై యుత్తమం బగు నిలయంబు లిచ్చి విచిత్రంబులగు వస్త్రంబులను బెక్కు రత్నంబులను నుపాయనంబు చేసి యాతిథ్యంబు గావింపుఁ డని యాజ్ఞ యొసఁగెను. తొలివేల్పు లాతనిచే ననుజ్ఞాతులై వారి కట్లు చేసి మున్నెన్నఁడు వినని నటుండు వచ్చె మనకు మిగుల వేడుక గావించు నని

పర్యాయార్థ (వేషధారణము కొఱకు) మతనికి ననేక మణుల నిచ్చిరి. నటుండును వానినెల్ల గ్రహించి యందలిదానవులకు హర్షంబు పుట్టింప నాటకంబుగాఁ జేయంబడిన రామాయణంబు నభినయించుచు నందు రావణవధేచ్ఛ నైన విష్ణుజన్మంబును, దశరథుని, లోమపాదుని, ఋశ్యశృంగునిని వేశ్యాసహాయంబున శాంతను రామలక్ష్మణులను వారి రూపంబులతోఁ గల్పించె. మున్ను వృత్తాంతంబు నెఱింగి యంతదనుక జీవించిన దానవులది చూచి యా దశరథాదులకును వీరికిని రూపభేదంబు లే దని తక్కినవారికిం జెప్పుచు మిగుల నచ్చెరువు నందిరి. మఱియు నెల్ల వారును వేషధారణంబు, నభినయంబును, బ్రస్తావంబును, బాత్రప్రవేశంబును జూచి విస్మయంబునొంది యనురక్తులై మధ్యనొక్కొక్క విషయంబున లేచి వస్త్రంబులను సువర్ణవలయంబులను హేమవైడూర్య భూషితంబులు మనోహరంబులు నైన హారంబులను నొసఁగుచుండ నటులును గానికల నిచ్చిన వారి యన్వయనామంబులం జెప్పి స్తుతించుచుండిరి. ఇట్లుండ నుపనగరంబు వారెల్ల దివ్యరూపుఁ డగు నటునకు దర్శనంబునకు రా ననుజ్ఞ యీవలయు నని రాజునకు విన్నవించిరి. రక్కసులఱేఁడును మున్నె యెఱింగినవాఁడు గావున హర్షితుండై యా నటుని వజ్రపురంబునకుఁ గొనిరం డని శాఖానగరవాస్తవ్యుల కాజ్ఞ నిచ్చె. వారును నటవేషంబుల నున్న యాదవుల వజ్రపురికిఁ గొనిపోయిరి. పిమ్మట దానవేంద్రుండు విశ్వకర్మ నిర్మితమైన యుత్తమనిశాంతంబు నా నటులకు విడియనిచ్చి మఱియుం గోరినవానినెల్ల శతగుణాధికంబుగ నిచ్చి విశ్రాంతులైన వారిచేఁ గాలోత్సవంబు చేయింపం దలఁచి దానిం జూడ సైనికుల కెల్ల రమ్యం బగు చోటు గల్పించి యంతిపురంబును జాలాదిచ్ఛన్నంబును జతుర్దృశ్యంబు నగు చోట నిల్పి బంధువులతోఁ

దానును గూర్చుండి పెక్కుమణుల నుపాయనం బిచ్చి నృత్యార్థంబు వారి కనుజ్ఞ నిచ్చె. యాదవులును దేవకార్యార్థంబు నటవేషధరులై చతు ర్విధంబు లగు వాద్యంబులు ప్రయోగించిరి. పిమ్మట యాదవులు తెచ్చిన వారనారులు చెవులకు మనంబునకు మిగుల నింపు పుట్టించు స్వరసందో హముతోడను వసంతాదిరాగంబులతోడను గూడిన గంగావతరణంబు మొదలగు వానిం బాడి యసురుల సంతసపెట్టిరి. తరువాత గదుఁడు మొదలగువారు నాందిని (చర్మకోశమయం బగు వాద్యంబును) వాయింపఁ బ్రద్యుమ్నుండు గంగావతరణాశ్రితంబై తన వినయంబు దెలుపు నొక శ్లోకంబుఁ బఠియించి రంభాభిసారంబుం దెలుపు కౌబేరం బైన నాటకం బారంభించె. అందు శూరుండు రావణవేషంబును మనో వతి యను వేశ్య రంభారూపంబును బ్రద్యుమ్నుండు నలకూబరభూమి కను సాంబుఁడు విదూషకు నాకారంబును ధరించి యా యాయి ప్రకర ణంబులఁ గైలాసకల్పనంబును గ్రుద్ధుఁడై నలకూబరుఁడు రావణుని శపించిన విధంబును నలకూబరుఁడు రంభ ననునయించిన ప్రకారంబును నభినయించిరి. దానవులు వారి యభినయాదులను మెచ్చి ప్రశస్తంబు లగు వస్త్రంబులను దరలానువిద్ధంబులై వైదూర్యభూషితంబు లైన హారంబులను, నాకాశగాములైన గజవిమానాదియానంబులను, జింతి తార్థంబుల నిచ్చు మణులను, సుగంధు లగు నగురుచందనాదులను, నా యాయి ప్రేక్షుల నిచ్చి ధనరత్నరహితులైరి. మఱియు దానవీసంఘంబు నిట్లు యయ్యె. ఇట్లుండ నొకనాఁడు శుచిముఖి ప్రభావతిం జేరి 'యాయతలోచనా! నే భైమగుప్తం బైనద్వారవతికిం బోయి వివిక్తం బున దర్శించి నీ యనురాగంబు రౌక్మిణేయునకు విన్నవించితి; నతఁడు పంతసించి. నేఁటిసాయంకాలము నిన్నుఁగవయ నంకేతించె" నన నది

హృష్టయై "హంసీ! నేఁడు నీవును నాయావాసంబున శయనింపుము. నీతోడంగూడి కై శవిని నిర్భయంబుగాఁ జూతు" నన నా యంచ యట్లె యని దానితో విశ్వకర్మరచితంబైన హర్మ్యపృష్ఠంబు నధిరోహించి దానవి చేసిన సంకేతంబు గ్రహించి కాముని యొద్దకుం బోయి ప్రభావతికి నీవు సంకేతించిన దినం బిది యని తెల్పి యతఁ డట్ల యనఁ దన చెలికి రుక్మిణీసుతుం డిదె వచ్చుచున్నవాఁ డని చెప్పి యంద నిల్చె. తరువాత నరిమర్దనుం డైన ప్రద్యుమ్నుండు ప్రభావతికిం గొనిపోవు దాని భ్రమరావృతం బైన దాని నొక్క సుగంధి కుసుమదామంబుం గని తాను నొక్క షట్పదంబై యం దిమిడి యంతిపురంబునకుం బోయి సంధ్యాకాలంబుదాఁక నందలి తుమ్మెదలలో నుండి యవి తొలఁగిపోవఁ దాను బ్రభావతీ కర్ణోత్పలంబున నడఁగియుండె. పిమ్మటఁ బ్రభావతి హంసిం జూచి యుదయించుచున్న చంద్రుం గని "చెలియా! నా యంగంబులు మిగులం దపించుచున్నవి. మోము శోషిల్లుచున్నది. మనంబున నౌత్సుక్యంబు వొడముచున్నది. మందులేని వ్యాధి యెద్దియో సంభవించినది. పూర్ణచంద్రుండు ప్రియుండయ్యుఁ జెలికారంబు హరించుచున్నవాడు. నా ప్రియుం డింకనుం దడసెనేని కుముద్వతీగతం బైన మార్గంబు వట్టెద, అదృష్టపూర్వుండైన భైమప్రవరుని శ్రుత మాత్రంబునం గామించినంతన నింద్యం బైన స్త్రీస్వభావంబున నా యంగంబులు పొగయుచున్నవి. స్వభావశీతలుండు నానాపుష్ప రజోవహుండు నగు వాయువు దావాగ్నిసదృశుండై నా తనువు మిగులం గాల్చుచున్నవాఁడు. స్థైర్యంబున కెంతజతనంబు గావించినను నిర్వీర్యం బైన మనంబు నిలువకున్నది. నా శరీరంబునఁ గంపంబు పుట్టుచున్నయది.

దృష్టి భ్రమించుచున్నది. నేఁ దప్పక క్షయించెద" ననె. కార్ష్ణి యా వచనంబులు విని యీమె నాయందు గాఢానురక్త యని తెలిసి హంసితో "నేను మాల్యంబున షట్పదంబనై యిమిడి వచ్చియే యున్నవాఁడ. ప్రభావతికి విధేయుండ" నని పల్కి యా సౌధంబు వెలిఁగించు తన రూపంబు చూపి సిగ్గునఁ దలవంచిన యా కన్నియం గరంబునఁ దాఁకి "మనోరథశతంబున లబ్ధుండనైన నన్ను నేల యుపేక్షించెదు. సాధ్వసంబు విడువుము, తడవుండ వలఁదుగాదు, కృతాంజలినై యాచించు నన్నుఁ గాలానుసారంబుగా గాంధర్వంబునఁ బరిగ్రహింపు" మని చెప్పి మఱియందలి యగ్నిని స్పృశించి మంత్రంబులం జదువుచుఁ బుష్పంబుల నందు వేల్చి యా యగ్నికి నాతన్విచేఁ బ్రదక్షిణంబు సేయించి దక్షిణహస్తంబు గ్రహించి వరటను ద్వారంబున నుండి మమ్ముఁ గాపాడుమని నియమించి శయనోత్తమంబునకుం గొనిపోయి సుఖంబుగ శయనించి యరుణోదయంబున మేల్కాంచి, ప్రియ నట్లె కేని యొడంబఱిచి నటాలయంబునకుం బోయె. జనమేజయా! యాదవు లిట్లు నటవేషంబున నింద్రకేశవులు వచించిన ప్రకారము కశ్యపుని యజ్ఞావసానంబు ప్రతీక్షించుచు వజ్రనాభుండు ముల్లోకంబులు జయింప జతనంబు సేయుదనుక నట నుండిరి. మనోజవంబులైన హంసంబులు వారివృత్తాంతంబు దినదినంబును వాసవకేశవులకు విన్నవించుచుండె. వా రిట్లు కాలంబు నిరీక్షించుచుండ సర్వభూత మనోహరంబైన ప్రావృట్కాలంబు రా నందుఁ బ్రద్యుమ్నుండు మాయాపాటవంబున శరీరచ్ఛాయను నటాలయంబున నిల్పి రేలుంబవళ్లును రాచనగరనంతర్హితుండును గలహంసారక్షితుండునునై ప్రభావతితో విహరించుచుండె. దానవులెల్లరుం గాలమోహితులై

జాలపాదంబులు శక్రునానతిఁ బురంబున వ్యాపించెననియు యాదవులు నటులనియుం దెలియంజాలక వారి శీలగుణవైదుష్యాదులను గామించు చుండిరి. అసురస్త్రీలును యాదవాంగనల రూపవిలాస గంధాదులను నార్యభావంబును గామించుచుండిరి. ఇట్లుండ వజ్రనాభుం డను వాని తమ్ముఁడు సునాభుం డను వాని కూఁతులు రూపగుణాన్వితలు చంద్రవతీ గుణవతు లను వారొక్కనాఁడు ప్రద్యుమ్నాసక్త యగుదానిం బ్రభావతిం జూచి విస్రంభంబు పుట్టించి యిది యెట్లని యడిగిన నది యిట్లనియె. "దేనినేర్చినంతన కోరినపతియు సౌభాగ్యంబును గలుగు నట్టివిద్య నా కొక్కటి గలదు. ఆ విద్య దేవాసురాదులలో నెవ్వనిం దలంచిన వానిన వశుం జేసి తత్క్షణంబ తెచ్చు. దాని మహిమంబున నేను దేవపుత్త్రుండైన యాతనితోఁ గ్రీడించుచుంటి" నని చూపినవారు రూపసంపన్నుండైన యాతనింజూచి విస్మయంపడుచుండ నాచారుహాసిని "కన్నెలారా! దేవతలు ధర్మరతులును సత్యవ్రతులును దపోరక్తులును. రక్కసులు దంభశీలురు సుఖాసక్తులు ననృతవాదులు ననియు ధర్మాసక్తులకు జయంబు గల్గుననియుఁ దెలియుఁ గాన మీరు నా విద్యను గ్రహించి తగిన దేవపుత్త్రుల వరియింపుఁడు. నా ప్రభావంబున వారి నిప్పుడ పొందఁగల" రన వారు హృష్టలై యంగీకరించిరి. పిమ్మట నామానిని భైమ్ముం దగినవారిం జెప్పుమన రూపశీలాన్వితులు వీరలు నగు గదసాంబుల నతండు చెప్పె. అప్పుడు ప్రభావతి భగినులంజూచి "మున్ను దుర్వాసుండు సంతుష్టుఁడై సౌభాగ్యంబును, సదాకన్యాత్వంబును, గోరినపతియుఁ గల్గునని యీ మంత్రంబు నాకిచ్చె. దీనిం బరిగ్రహింపుఁడు. మీకుం బ్రియసంగమం బగు" నని యుపదేశించె. వారును దాని సోదరీముఖంబువలన నధిగమించి గదసాంబులం దలంచిన

మాయాపియైన కార్ష్ణి సహాయంబున వారు ప్రచ్ఛన్నులై వచ్చిరి. చంద్రవతి గదుని గుణవతి సాంబును గాంధర్వంబునం బరిగ్రహించిరి. (ఇట మిక్కిలిగను సుమనోహరంబుగను గావింపబడిన వర్షర్తువర్ణనము మొదలగునవి గ్రంథవిస్తరభయంబున విడువంబడె.) దాశార్హకుమారులిట్లుండ వజ్రనాభుండు యజ్ఞావసానంబునఁ గశ్యపు దర్శింప నమ్మహాముని యిట్లనియె. "వజ్రనాభా! నావచనంబు వినందలంచితివేని వజ్రపురంబున నుండుము. శక్రుండు తపంబునను పరాక్రమంబున నీకధికుండు, బ్రహ్మణ్యుండును, గృతజ్ఞుండును జ్యేష్ఠుండును నగు. మఱియు సర్వభూతహిత రహితుండైన కృష్ణుండు భూలోకంబునకెల్లం బ్రభువును నీకు నజయ్యుండును నైనవాఁడు. వారి నలిగించినవాఁడు గాలభుజంగంబుం దన్నినవాఁడుంబోలె నచిరకాలంబున నశియించు" నా రక్కసుండు మర్త్తుకాముం డౌషధంబువలె నప్పలు కాదరింపక నమస్కరించి యతని వీడ్కొని దుర్బుద్ధియై ముల్లోకంబుల జయింప నిచ్ఛగించి బంధుల న్మిత్రుల ననేకుల రావించి యింద్రు జయింపం గోరి మున్ముంద యమరావతికిం బ్రయాణసన్నాహంబు సేయించె. అక్కాలంబునన యింద్రకేశవులు హంసంబులం బిలిచి "వజ్రనాభుని వధియింప యదుకుమారుల కనుజ్ఞ యిచ్చితిమని తెల్పుఁ" డన నవిపోయి వారి నొక్కటంగూర్చి యీసందేశంబు విన్నవింప వారు నాలోచించి రక్కసులఱేఁడు ప్రద్యుమ్ననకు హంతవ్యుఁడని నిశ్చయించి తమ భార్యలందఱు గర్భవతులనియు నచిరకాలంబునఁ బ్రసవింతురనియు నాయంచలచే తనవారికిం దెల్పిరి. వారును మఱల నావలక్షపక్షంబులచేతన మీరు భయం పడవలదు. మీకచిరంబుగఁ గామరూపులును గుణంబుల శ్లాఘ్యులును గర్భస్థులై సాంగంబులగు వేదంబుల నస్త్రవిద్యలను నేర్చినవారును

జాతమాత్రసంజాత యౌవనులును నగు పుత్త్రులు జన్మింపంగల" రని తెల్పిరి. పిమ్మటఁ బ్రభావతి యింద్ర కేశవుల ప్రసాదంబునఁ బుట్టినంతన జవ్వనంబును సర్వజ్ఞత్వంబును బ్రాపించినవాని నొక్క కుమారుం గనియె. తరువాత నొక్కనెలకుఁ జంద్రవతీగుణవతులును జంద్రప్రభుఁడు గుణవంతుఁడు నను కుమారులఁ బ్రభావతీసుతుంబోలిన వారలఁ గనిరి. అయ్యదుబాలురు హర్మ్యంబుపై వర్ధిల్లుచు నొక్కనాఁ డాకాశంబున నుండి శుద్ధాంతంబు రక్షించు రక్కసులచే నింద్రోపేంద్రుల యిచ్చచేతన చూడంబడి త్రివిష్టపజయైషి యగు వజ్రనాభునకు నివేదింపంబడిరి. రాక్షసరాజదివిని నాగృహంబునకుం జెఱుపుసేసినవారి వధింప గ్రహింపుఁ డని సైనికుల కాజ్ఞాపింప వారు పట్టుఁడు కొట్టుఁడు చంపుఁడను వాక్యం బులఁ బల్కుచు నెల్ల దిశల నావరించిరి. పుత్త్రవత్సల లగు వారి తల్లు లది విని రోదనంబుసేయుచుండ బ్రద్యుమ్నుండు మందహాసంబు గావించి "మేము జీవించియుండ రాక్షసులేమియుం జేయనోపరు. వెఱవకుఁ" డని ప్రభావతితో మఱియు యిట్లనియె. "నీకతంబున నాకు మాన్యు లైన నీ తండ్రియుం బినతండ్రులు సోదరులు బందుగులు నాయుధ పాణులై మావధంబుఁ గోరి యుద్ధసన్నద్ధులై యున్నవారు. మరణం బునకు వెఱవక తెగించి కదనంబుసేయువారికి విజయంబు గల్గును. నీవు చెల్లెండ్రతో నాలోచించి మాకుఁ గర్తవ్యంబు సెప్పుము." నావుడుఁ బ్రభావతి మోఁకరించి శిరంబున నంజలి ఘటించి దుఃఖించుచు శస్త్రంబు గ్రహించి "నిన్ను రక్షించుకొమ్ము. నీవు జీవించిన దారలం బుత్త్రులం జూడఁగలవు. మున్ను సూర్యాగ్నిసమప్రభుం డైన దుర్వా సుండు వైధవ్య రహితవు జీవత్పుత్త్రివు నగుదువని నాకిచ్చిన వరంబు హృదయాశ్వాసంబు గావించుచున్నయది. మఱియు ననిరుద్ధుని వృత్తాం

తంబు స్మరియించి యీ యసిపుత్త్రిక గ్రహింపు" మని నమస్కరించి యిచ్చినఁ బ్రద్యుమ్నుండు ప్రహృష్టుండై దానిని గ్రహించె. చంద్రవతియు గుణవతియు నట్ల తమ పతులకుం గత్తుల నొసంగిరి. పిమ్మటఁ బ్రద్యుమ్నుండు గదుం జూచి "సాంబునితోఁ గూడి నీ విచటన యుండి రణంబుఁ గావింపుము. నే నాకాశంబునను నెల్లదిక్కులం జరించుచుఁ గయ్యంబునేయుదు" నని మాయచే నొక్క యరదంబు గల్పించుకొని యనంతవీర్యుండైన శేషుని సారథిగా నియమించి ప్రభావతికి హర్షంబు పుట్టించుచుఁ దృణంబులయం దగ్నియుంబోలె దానవులందుఁ జరించుచుఁ గేయూర కంకణోజ్జ్వలంబులైన కరంబులను సకిరీటకుండలంబులైన శిరంబులను నర్ధచంద్రాది బాణంబుల నఱుకుచు మత్తిల్లిన రాక్షసావయవంబులఁ బొలికలనిం గప్పుచుండె. గదసాంబులతోఁ బ్రవిదారణంబు నేయు దానవులును బెక్కండ్రు సంద్రంబున జలజంతువు లట్లు వారి బాణాసారంబున మునింగిరి. ఇట్లుండ హరిహయుం డాకసంబుననుండి యాయాయోధనంబు జూచి హర్షించియనీకంబువిషమం బని తలంచి రక్కసుని తపంబు క్షీణించె నెల్లవారు పురంబుఁ జొరవచ్చునని యెంచి మాతలిసుతుండైన సువర్చసుండను సారథితోఁ దన తేరు గదునకును సాంబునకుఁ బ్రవరాధిష్ఠితంబైన యైరావణంబును బుచ్చి రౌక్మిణేయునకు జయంతుం దోడ్పఱిచె. మహాబలుండైన ప్రద్యుమ్నుండు జయంతుతో సౌధంబుఁ జేరి శరజాలంబుల దానవుల మర్దించుచుఁ గృష్ణానుజుం జూచి "దేవపతిసువర్చస్సారథికంబైన యీ యరదంబు నీకును సుహృద్బ్రాహ్మణాదిష్ఠితంబైన యభ్రగజంబు సాంబునకుం బంపె. నేఁడు ద్వారకయందు రుద్రునకు మహోపకారంబు జరుగుచున్నయది. త్రేపృహృషీకేశుండు నిట రాఁగలండు. దేవవధోద్యతుండైన వజ్రనాభు

నమ్మహాత్ము ననుజ్ఞం గొని వధియింపంగలవారము. సర్వోపాయంబుల నప్రమత్తుండవై కలత్రరక్షణంబు గావింపు" మని చెప్పి సాంబునకు నట్ల యాన తిచ్చి సమరోన్ముఖుండై యసురమాయానిర్మితంబైన తమంబు విరియించి దివ్యంబైన జాలంబునం గోటి ప్రద్యుమ్నుల సృజియించి యెక్కడంజూచినం దానయై దానవుల వధించుచుండె. దేవరాజు నాయరి మర్దనుం జూచి క్షేత్రజ్ఞుం డొక్కరుండయ్యు నెల్లదేహంబుల నున్నట్లు ప్రద్యుముండు సర్వశత్రులయెదుట నుండెనని సంతసించె. ప్రద్యుమ్నుం డిట్లు సాంపరాయికంబు గావించుచు రజని ప్రభాత ప్రాయంబును రాక్షసబలంబు హతత్రిభాగంబునైనం జూచి జన్యంబునకు జయంతుం జాలించి తా నాకాశగంగాజలంబుల వార్చుచుండె. అనంతరము జగ చ్చక్షు వుదయించు ముహూర్తంబునన శ్రీకృష్ణుండు గరుడారూఢుండై యింద్రునొద్దకువచ్చి దైత్యులకు భయంబు పుట్టించు పాంచజన్యంబు పూరించె. పరవీరఘ్నుండైన ప్రద్యుమ్నుం డది విని యాచోటికిం బోవ యాదవప్రవరుండు కుమారుం జూచి యా ఖగరాజు నధిరోహించి సత్వ రంబుగ దైత్యు వధియింపు మన నతండు నింద్రోపేంద్రులకు నమస్క రించి వజ్రనాభు నభ్యాశంబునకు వైనతేయుతోడం బోయి గదచే నతని వక్షంబునం బ్రహరింప వాఁడు రక్తంబు గ్రక్కుచు సొమ్మసిల్లి గత ప్రాణుండువలె నరదంబుపైఁ బడె. రణ దుర్జయుండైన కైశవి యది చూచి యాశ్వసిల్లుమని పల్కుచుండ వాఁడు తెప్పిరిలి "యాదవ బాలుఁడా! నీవు నాకు వీర్యంబున శ్లాఘ్యుండవు. ప్రతిప్రహారస మయం బిది. జాగరూకుండవు గ" మ్మని గర్జితశతోపమంబుగా గర్జిల్లి బహుకంటకంబైన గదనువిడిచె. దానిచే మీనకేతనుండు లలా టంబునం దాడితుండై రుధిరంబు నుద్వమించుచు మోహంబునొందె.

భగవంతుండైన కృష్ణుం డది యెఱింగి జలోద్భవంబైన పాంచజన్యంబు పూరించి వాని నాశ్వాసించె. తదాశ్వాసంబున లబ్ధసంజ్ఞుండైన యదు కుమారుండు తండ్రియిచ్చుందన హస్తగతంబైన సుదర్శనంబును జూచి యింద్రకేశవులకు నమస్కరించి క్షురనేమి సహస్రారంబైన దానిం బ్రయోగించి వజ్రనాభుని శిరంబు ఖండించె. గదుండును హార్మ్యపృష్ఠం బున రణంబుగావించు సునాభుని వధించె. సాంబుండును దక్కిన పెక్కండ్రు రక్కసుల యమసాదనంబునకుం బుచ్చె. వజ్రనాభసోద రుండు నికుంభుండను వాఁడొక్కఁడు నారాయణునకు వెఱచి షట్పురం బున డాఁగె. ఇట్లు సురారియగు వజ్రనాభుఁడు హతుండుగా నింద్ర కేశవు లా పురంబుఁ బ్రవేశించి భయార్దితులైన పౌరుల నెల్లఁ బ్రియా లాపంబుల నాదరించి లబ్ధప్రశమనంబునేసి విస్తీర్ణంబైన రక్కసునిరాజ్యం బును గంబలాదివస్త్రంబులను వివిధంబులగు రత్నంబులను నాల్గుభాగం బులుగా విభజించి జయంతాదుల వృత్తులకు నల్వురకు సమంబుగా నిచ్చి ఋషులయెదుటన నమర నదీజలంబు నభిషేకించిరి. వాసవుం డప్పుడు జయంతుం బిలిచి ప్రాద్యుమ్ని మొదలగువారిం జూపి "వీరు నీకు రక్షణీ యులు. వీరలలో నీ కొమరుండు నాకును మిగిలినవారు కృష్ణునకును వంశకర్తలును నెల్లభూతంబులకు నవధ్యులునై నా యాజ్ఞ నిటనుండి స్వర్గంబునకును ద్వారకకును నటనుండి యిటకు నాకాశ మార్గంబున వచ్చుచుం బోవుచుందురు. వీరికి దిగ్గజోత్పన్నంబులగు గజంబుల నుచ్చైశ్శ్రవోజాతంబులైన హయంబులను గోరినన్ని యిమ్ము. మఱియు శత్రుంజయరిపుంజయంబులను నైరావతజనితంబులైన గజంబుల రెంటిని గదునకు సాంబునకు నిమ్ము వారు వాని నారోహించి యిచ్ఛానుసారం బుగా నాకాశమార్గంబున వచ్చి సుతులఁ జూచి పోవుచుందు" రని

యుపదేశించి యమరావతికిం బోయె. కృష్ణుండును బ్రద్యుమ్ను వీడ్కొని ద్వారవతికిం జనియె. జనమేజయా! ప్రద్యుమ్నాదులు నట నాఱునెల లుండి రాజ్యంబురూఢంబుగా ద్వారవతికిం బోయిరి. విజయాదుల రాజ్యంబు లిప్పుడును మేరుపార్శ్వంబున నున్నవి. ఇంకను లోకం బున్నంత కాలంబు నుండఁగలవు. మఱియు మౌసలంబైన యుద్ధమున వృష్ణులెల్ల దివంబునకుం బోయిన వెనుకసైతము గద ప్రద్యుమ్న సాంబులు కృష్ణప్రసాదంబున వజ్రపురంబునకుం బోవుచు స్వర్గమునకు వచ్చుచు నుండిరి.

ఇది భారతాంతర్గతంబైన ఖిలంబులలోని హరివంశోత్తర భాగంబున నున్న విష్ణుపర్వంబునం దుండి తెనిఁగింపఁబడిన ప్రభావతీ ప్రద్యుమ్న వృత్తాంతము.

పు. మల్లయ్య శాస్త్రి.



శ్రీ

# ప్రభావతీప్రద్యుమ్నము

## ప్రథమాశ్వాసము

శ్రీ పురాణపండ మల్లయ్యశాస్త్రిగారు రచించిన

## టీకాతాత్పర్యము

1. అతిచిత్రవిలాసులు = మిగుల వింతలైన శృంగారచేష్టలు గలవారు. మున్ = వివాహమునకు మునుపు. తారు = ఆ పార్వతీ పరమేశ్వరులు. వియోగామిత చింతన్ = ఎడఁబాటువలనఁ గలిగిన యధికమగు విచారముచేతను. సగమౌటలు = సగము భాగము మిగులునట్లు కృశించుటలను. నిచ్చన్ = ఎల్లకాలమును, తెల్పు కాంక్షామహిమంబు చేన్ = (లోకులకుఁ) దెలియఁజేయు కోరికయొక్క యాధిక్యము చేతనువలెనే.

2. అంగజహేతుకంబులు = మన్మథుఁడు కారణముగాఁ గలవి. అనన్య సమాన హార్దసంసంగులు = సాటిలేని ప్రేమసంబంధము గలవారు. మన్మథుని పుట్టువునకుం బూర్వమే యొండొరుల వలచుటచే నిష్కారణప్రేమగలవారని యర్థము.

3. అమల = స్వచ్ఛమైనట్టి, (ఇది హంసకాంతి). నవీన హైమ = క్రొత్త బంగారము, (పుటము వేసిన బంగారము) యొక్క వికారమైనట్టి. (ఇది హంస ఱెక్కల చివరనున్న బంగారు రేఖలకాంతి). నిజ = తమది (సరస్వతిది, బ్రహ్మది) యగు, యాన = వాహన మగు నంచయొక్కయు, గరుత్ = దాని ఱెక్కల యొక్కయు, ద్యుతిన్ = కాంతిని, ప్రోచు = వృద్ధిపొందించెడు. సత్ = శ్రేష్ఠమైన, వపుః = శరీరములయొక్క, విమలరుచిన్ = స్వచ్ఛమైన కాంతిచేతను, సరస్వతి తన శరీరకాంతిచేత హంసకాంతిని, బ్రహ్మ తన శరీరకాంతిచే హంసఱెక్కల

చివరనున్న బంగారురేఖల కాంతిని వృద్ధిచేయుచుండెనని యాశయము. స్వభక్తులకున్ = తమ్ముం గొల్చువారికిన్. వెండియున్, పైఁడియున్, కీర్తియున్, సుతేజమున్, (కీర్తి తెల్లనిదనియుఁ దేజ మెఱ్ఱనిదనియుఁ గవిసమయము). ఒసఁగు సర్గనిధానమున్ = ఇచ్చెడు సృష్టియను ద్రవ్యరాశిని. తాల్చియున్న యట్లు = (శరీర కాంతిచేతనే) ధరించినట్లు, అలరెడు వాగ్విధాతలు = ప్రకాశించు సరస్వతియు బ్రహ్మయున్.

4. సకల భువనప్రవర్తన హేతువులు = ఎల్లలోకముల ప్రవర్తనమునకుఁ గారణములు.

5. ప్రాచేతసుఁడు = వాల్మీకి, (ప్రచేతసునకుం గొడుకు).

6. ఉదంచద్వైఖరిన్ = స్ఫుట వాక్యములతోఁ, అభివర్ణన = స్తుతి, పరితుష్టి = తృప్తిని, సంతోషమును.

8. ప్రయాగ = ఇదియొక పుణ్యక్షేత్రము. బ్రహ్మదేవుఁ డిచటఁ బెక్కుయాగములు చేయుటచే దీని కీ పేరుగలిగెను. శ్రీగిరి = శ్రీశైలము, గంగాద్వారము = మాయాపురము, లేక హరిద్వారము. సంస్తుత్య పుణ్యస్థలాగ్రియతన్ = స్తోత్రము చేయఁదగిన పుణ్యక్షేత్రములలో ముఖ్యము లగుటచేతను, నైమిశము = ఒక పుణ్యారణ్యము. మున్ను ఋషులు పెక్కండ్రు పుణ్యభూమిని జన్నము చేయంగోరి దాని నిరూపింపలేక యొక్క శకటముపై యజ్ఞ సాధనములం గూర్చుకొని యాబండి యెచట నప్రయత్నంబున నాఁగు నచటఁ గావింతమని నిశ్చయించి పోవంబోవ నొక్కచో నేమి (బండి చక్రముచుట్టు కమ్మి) శిథిల మగుట నదియాఁగె. ఆ స్థలమె నైమిశం బనంబడు, నీలాచలము = జగన్నాథ క్షేత్రము.

10. తత్కావ్యలక్ష్మీ ముఖంబునకుఁ = ఆ కావ్యలక్ష్మియొక్క యారంభమను మోమునకుఁ, తిలకాయమానము = బొట్టువలె నాచరించుచున్నది. ముఖ్యాలంకారమని యర్థము. వంశావతారము = వంశముయొక్క యుత్పత్తి క్రమమును.

11. మునిసింహుఁడు = సింగముం బోలినముని, మునిశ్రేష్ఠుఁడని యర్థము.

12. పురివైరి = శివుఁడు. (మయునిచే నిర్మింపఁబడిన రక్కసుల పట్టణములఁ గాల్చినవాఁడు). లలాటముకన్ను = నొసటనున్న (మూఁడవ) నేత్రమును. ప్రతిపక్షతన్ = పగచేతను, ప్రమాణాది పదార్థ తత్త్వకథ నాత్మకమున్ = ప్రమాణము ప్రమేయము మొదలగువాని స్వరూపమును జెప్పుదానిని, శాస్త్రమున్ = న్యాయశాస్త్రమును, ఆత్మసంవేదముకై = జీవునియొక్కయుఁ బరమాత్మయొక్కయు స్వరూపమును దెలిసికొనుట కొఱకు, రచియించెన్ = నిర్మించెను.

13. ఆగమనిధి = శాస్త్రములకు వాసస్థానము. సద్భోగక్షేత్ర స్వామ్య సమాగతిన్ = మంచివియును ఫల మనుభవించుట కీయఁబడినవియు నగు పొలములహక్కు కలిగియుండుటచేతను, పింగళి పురాంకుఁడు = పింగళి యనుపట్టణము వాసస్థానముగాఁ గలవాఁడు.

14. యోగితా గర్వానుభావుఁడు = యోగాభ్యాసముచేఁ (గల్గిన) దొడ్డమహిమఁ గలవాఁడు. గోపకుమారుని ఖడ్గవర్ణనన్ = కృష్ణుని కత్తియొక్క స్తుతిచేతను, నందకస్తవమను గ్రంథముచేత నని యర్థము. పర్వాపు నిండువెన్నెలల పైన్ = పున్నమనాఁటి నిండు వెన్నెలల మీఁదను, నెఱిన్ = పరాక్రమమును, చూపెడుకీర్తి సంపదన్ = కనుపఱిచెడు కీర్తిశోభను, పున్నమనాఁటి వెన్నెలను జయించుకీర్తినని యర్థము. నెరపెన్ = ప్రకటించెను.

15. జాయ = భార్య, (పుత్త్రిరూపమునఁ దా నెవతెయందు జన్మించునో యది జాయ) అశ్రాంతము = ఎడతెగకుండునట్లు, ప్రోదిచేసికొమ్ము = రక్షించుకొమ్ము.

17. పూర్వపు నిజప్రఖ్యాతి = మునుపుండిన తన ప్రసిద్ధి.

18. పరిసరము = దగ్గఱిచోటు, (తీరము) కృష్ణకెలంకులన్ = కృష్ణానదియొక్క పార్శ్వములందున్ (తీరములందున్), అస్మదాదులు = నేను మొదలగువారు.

19. అమ్మహావంశంబునందున్ = ఆ గొప్పకొలమను వెదురు చెట్టునందున్, అస్మజ్జనక = నాతండ్రియొక్క, జని = పుట్టుక యనెడు, జీవంతికా = బదనికచే, అత్యంత = మిక్కిలి, కమనీయంబు = మనోహరమైనది. పురాతనములగు చెట్లకొమ్మల చివర విలక్షణముగా మొలచు నోషధివిశేషము బదనిక (జీవంతిక) యనంబడు.

20. గంగయనాన్ = గంగయ్యాయని పిలుచునట్లు, శుచితన్ = దీనికి సదాచారముచేత తదూర్జిత యశశ్శ్రీయున్ = ఆ యనస్థిరమైనకీర్తి సంపదయును, గంగయనాన్ = గంగానదీ ప్రవాహామువలెన్, శుచితన్ = తెల్లని కాంతిచేతను, ననియర్థము.

21. మాంగల్యశోభి = సేనుముచే విలసిల్లువాఁడు. వంశకరులు = వంశమును వృద్ధిచేయువారు. రంగత్కీర్తులు = ప్రకాశించుచున్న యశము గలవారు.

22. ప్రాజ్ఞులు = పండితులు; మిగులఁ దెలిసినవారు.

23. తదన్వయము = వారివంశము.

24. అలఘు సాద్గుణ్య సౌభాగ్య కలితుఁడు = గొప్పవియగు మంచి గుణముల తోడను జక్కందనముతోడను గూడినవాఁడని యర్థము.

25. పదాబ్జరేఖన్ = పద్మముంబోలిన పాదమందలి గీఁతను, కంచెలు = వింజామరలు. ఆత్మ సర్వాంగ సమృద్ధితోడన్ = తన (లక్ష్మి) యొక్క యెల్ల యవయవముల సంపదతో, అంబుజ రేఖలప్రేమ = తామరల సముదాయమందలి ప్రేమ. తామరపువ్వు నాకారముం గల గీఁతలయందలి ప్రేమయనియు నర్థము. కైవస మయ్యెను = స్వాధీన మయ్యెను.

26. సూరనిభుఁడు = (తేజమున) సూర్యునితో సమానుఁడు. వేల్పుదొర = ఇంద్రుఁడు, దొరయఁబోఁడు = పోలఁడు, సిరికిన్ = సంపదకున్, నియతనిదానము = తప్పని కారణము. అర్థులు = యాచకులు.

28. ఔరసులు = పుత్త్రులు. సజ్జనస్తుతోదార గుణాభిరాములు = మంచివారిచే స్తోత్రము చేయఁబడిన గొప్ప గుణములచే మనోహరులు. భవ్యుఁడు = వృద్ధినొందఁ (గల) వాఁడు (కాఁగలవాఁడు), నీతయశస్కుఁడు = ప్రాప్తమైన కీర్తి గలవాఁడు.

30. ఉత్ఫుల్లయశుఁడు = వికసించిన (అధికమైన) కీర్తిగలవాఁడు.

31. సూరప్రభుఁడు = సూర్యుని కాంతిని బోలిన కాంతి గలవాఁడు. అగ్రజుఁడు = అన్న. వినయోదారత్వాదులన్ = అడఁకువ, దాతృత్వము మొదలగు వానిచేన్.

32. వ్రీడావతులందును = స్త్రీలయందును, (లజ్జగల వారియందును.) సకల గుణాఢ్యన్ = ఎల్ల మంచిలక్షణములతో నిండినదానిని.

33. మహాగుణనిధి = గొప్పగుణములకు నివాసస్థానము. హారిప్రకారయశమునన్ = మనోహరమైన రీతిగల కీర్తిచేతను. కమలాలయ = లక్ష్మి (పద్మమే గృహము గాఁగలది.) ఉమ = పార్వతి. ఆ లలితాంగిన్ = ఆ సుందరాంగిని. గరితల్ = స్త్రీలు, (పతివ్రతలు).

34. అత్యాయతశీలునిన్ = మిగుల మంచి నడవడిగలవానిని. ఆత్మజులన్ = పుత్త్రులను. సుధీజనధ్యేయగుణప్రశంసున్ = విద్వాంసులకుఁ దలఁపఁదగిన గుణముల (దానము మొదలైనవాని) స్తుతిగలవానిని. ధర్మనిర్మలోపాయుని = ధర్మమునకుం (దగిన) స్వచ్ఛమగు నుపాయము గలవానిని. అతిభవ్యతన్ = మిక్కిలి శుభము(ల) కలిమితోన్.

36. ఇమ్ముగన్ = చక్కఁగాన్. ధృతి = ధైర్యముతోడను. బల = శక్తితోడను. సహితుల్ = కూడినవారు.

37. జ్యేష్ఠుఁడు = ఉత్తముఁడు.

38. అగ్రజానుజులు = అన్నయును దమ్ముఁడును. పురంధ్రి = సంతానముగల యింతి, (ఇంటిం గాపాడునది.) బహుసహోదరాంచితుండు = పెక్కండ్రు సోదరులచేఁ బూజింపఁబడినవాఁడు.

39. సాధ్వి = పతివ్రత.

40. అనఘ = దోషములేని. సౌభాగ్య = ప్రియుని కింపు పుట్టించు సొగసును. వర్తన = నడవడియు. అర్థ = ప్రయోజనము గాఁగల. అంగలక్ష్మి = శరీరశోభగలది.

సకలశోభనుఁ బ్రయోజనమైన మంచి నడవడియు సౌభాగ్యముం గలదని యర్థము. అర్ధాంగలక్ష్మి = భార్య. భోగభాగ్యములన్ = సుఖానుభవముచేతను, ఐశ్వర్యముచేతను. మదనునియంబకున్ = మన్మథుని తల్లి (లక్ష్మి)కిన్. అంబికకున్ = పార్వతికిన్. సాటి = సమానురాలు.

41. భ్రాజితమతి = ప్రకాశించు బుద్ధిగలవాఁడు. భ్రాజిత = ప్రకాశించెడు. బోధ = జ్ఞానముయొక్క. అర్థనా = అడిగికొనుట (తెలిసికొనుట) యందు. అభిరతుఁడు = కోరికగలవాఁడు.

42. సమ్యక్పాత్రము = మిక్కిలి తగినది.

43. అక్షయ = తక్కువకాని. గుణ = గుణములును. విభవ = సంపదయును గల. ఏతాదృక్షకులోత్తంసునకున్ = మీఁదఁ జెప్పిన వంశమునకు శిరోభూషణమైన వానికిన్. అసదృక్ష = సాటిలేని. విదూరప్రేక్షా = దూరపుటాలోచనచేతను. అసి = కత్తిచేతను. లలిత = మనోహరమైన. ధర్మసురక్షా = ధర్మపరిపాలనమును (శ్రుతిస్మృతులచే విధింపఁబడినది ధర్మము.) అంసునకున్ = భుజమునుం గలవానికిన్. ఉరుగభస్తిరాహంసునకున్ = అధికమైన కాంతిభారముగల సూర్యుఁడగువానికిని. సూర్యునింబోలు నధికమైన కాంతిగలవానికని యర్థము.

44. అధీతి = చదువుకొనుటచే. లోకాతిగ = లోకమును అతిక్రమించిన. నిరుపమానమైన యని యర్థము. వశితా = ఇంద్రియజయముచేతను. జిత = ఓడింపఁబడిన. అంతరామిత్రునకున్ = లోపలి శత్రువులుగలవానికిన్. (కామక్రోధలోభమోహమదమత్సరము లాఱును లోపలిశత్రువులు.)

45. పృథులా = పెద్దదియగు. (ఇది యశోచిత్యమునఁ బ్రథయనుదానితో నన్వయించును.) ఆకాశీసేతుప్రథ = కాశి మొదలు సేతువు (రాముఁడు లంకకుం బోవునపుడు రామేశ్వరమునొద్ద సముద్రమునకుం గట్టిన గట్టు) వఱకు వ్యాపించిన ప్రసిద్ధి గల. నిడుమానూరి కృష్ణరాయసముద్రప్రథిత = నిడుమానూరు కృష్ణరాయసముద్రమనను పేళ్లతో, ప్రథిత = ప్రఖ్యాతిఁ జెందిన. అగ్రహార = పన్ను లేకుండ నీయఁబడిన గ్రామభూములయొక్క, భోగ = అనుభవముచేతను. ఆతిథేయ = అతిథిపూజయందాసక్తిగల.

నిజసంతతి = తన సంతానముచేతను. ప్రతీతాత్మనః = పేరొందినవానికిన్. అగ్రహారము నేమ బ్రాహ్మణులయిండ్లుగల గ్రామమునకే చెల్లునని చెప్పవలయు కాని యిక్కడ నా గ్రామమునకు సంబంధించిన భూములకు నైనను చెల్లును.

46. అభిషంగ = తిరస్కారముచే. అనాఘ్రాత = వాసన చూడఁబడని, (స్పృశింపఁబడని యని యర్థము.) నీతిసంపత్తికిన్ = నీతి సమృద్ధికలవానికిన్. భూమిరక్ష్యాదుల సంపాదించు నుపాయములం దెలుపు విద్య నీతి యనంబడు. (ఎల్లయభీష్టములఁ బొందించు సత్ప్రవర్తనము నీతి యనఁబడు.)

47. స్థిర = (మీఁదఁ జెప్పినవానియొక్క) శాశ్వతమైన. శంకరశిలా జలనిధి = క్షీరసముద్రముంబోలిన కొలమునకు. సోమత్ = చంద్రుఁడువలె నాచరించుచున్న. సోమారాధ్య = సోముఁడను శైవునియొక్క. కృపా = దయచేతను. లబ్ధ = ప్రాప్తమైన. అటులశివభక్తి = నిష్కపటమైన శివునందలి భక్తిచేతను. శోభితాచారునకున్ = అలంకరింపఁబడిన నడవడి గల వానికిన్, (పూజ్యులయం దనురాగము భక్తి.)

48. కమలా = లక్ష్మి. అంబా = ఆమె తల్లి = గంగానది. లక్ష్మి సముద్రమునకుం గూఁతురు గావున గంగకుం గూఁతురయగు. గురుఁడు = ఆ గంగానదికిం దండ్రి (జన్మస్థానము. హిమవంతుఁడు.) కమనీయ = మనోహరములగు. (ఇది వ్యర్థవిశేషణము) మనీషి = విద్వాంసులకున్. వ్యపగమనీయునకున్ = సేవింపఁదగినవానికిన్. అంబమాంబికారమణునకున్ = అంబమ్మ యను నామె భర్తకున్.

49. అర్చితధీమజ్జనకునకున్ = పూజింపఁబడిన బుద్ధిమంతుల సముదాయముకల వానికిన్. ఇందుఁగ ప్రత్యయము సమూహార్థకము. బుద్ధిమంతుల గౌరవించువాని కని యర్థము. హరనుతి = శివునియొక్క స్తోత్రముచేతను. సమార్జిత = సంపాదింపఁబడిన. మాయోన్మజ్జనకునకున్ = మాయనుండి తేలుట గల వానికిన్. శివుని స్తుతించుటచే మాయ నతిక్రమించినవాని కని యర్థము. అమల = స్వచ్ఛమైన. చిత్ = (ఆన) జ్ఞానముచేతను. అవమత్ = హీనుఁ డగుచున్న. జనకునకున్ = జనకమహారాజు గలవానికిన్. స్వచ్ఛమైన బ్రహ్మజ్ఞానముచే జనకునిం దిరస్కరించిన వాని కని యర్థము. అమృతరసనిమజ్జనకున్ = మోక్షాసక్తియందు మునిఁగిన వానికిన్.

50. ఉరుమత్యమరామాత్యునకున్ = గొప్పబుద్ధిచే బృహస్పతికిన్ (సమానుఁడగువానికిన్.) అజ = బ్రహ్మయొక్క. ఉపయమన = పెండ్లి(చేసికొనుట) చేతను. కృతార్థోద్యమ = సఫలమైన ప్రయత్నముగల. రామా = స్త్రీకిన్. (సరస్వతికిన్). అత్యుపమేయ = అధికమైన యుపమేయమగు, సరస్వతింబోలిన యనియర్థము.) ఆయను రామా = అంబమ్మయను భార్యచేతను. అత్యురుగుణోదయయశశ్శ్రీకిన్ = మిగుల గొప్పదియగు గుణోత్పత్తియుఁ గీర్తిసంపదయుఁ గల వానికిన్.

52. శ్రీరమణీరమణీయ మహోరస్స్థలుఁడు = లక్ష్మి యను నింతిచే మనోహరమైన గొప్ప వక్షము గల వాఁడు. ఆరూఢాదరతన్ = అంకురించిన ప్రీతిచేతను.

53. పర్యాలోచనము = బాగుగ నాలోచించుట. నడతెంచు = వచ్చు. నాకము = స్వర్గము. (కము = సుఖము. అదికానిది = అకము = దుఃఖము. అదిలేని చోటు నాకము.)

54. తాల్చిన = ధరించిన. మున్నీటి మొలనూలి = సముద్ర మను నొడ్డాణము యొక్క. రత్నంపుమొగపు = మణుల (తోఁ జేయఁబడిన) ముఖభాగము. చీలయుంచుకొనుట కేర్పఱిచిన వస్తువయిన పూదె.) జలధిచేరట పాఁపతలచుట్టు = సముద్రమనెడి సర్పపుంబాగ; పాము + తలచుట్టు = పాఁపతలచుట్టు; ధరిత్రీమూర్తి శివుచిత్రతిలకము = భూరూపమైన శివునియొక్క పలువన్నెలుగలబొట్టు. (పంచమహాభూతములును, సూర్యచంద్రులును, సోమయాజియు శివునిమూర్తులు.) అపరదిక్సతి = పశ్చిమదిక్కను నింతి. పుట్టంబు తుది వ్రాఁతమొగడ = వస్త్రముచివర (సరిగతో) నేసిన మొగ్గ. వరుణగోపురబద్ధవార్ధితోరణమధ్య గుంఫితనవపుష్పగుచ్ఛము = వరుణదేవునియొక్క కోట గుమ్మమునకుం గట్టఁబడిన సముద్రమను తోరణములోఁ గూర్చఁబడిన క్రొత్త పూలగుత్తి. దీప్తివిసర = కాంతి సముదాయముయొక్క. విసరణ = వ్యాప్తిచేతను. ఉపశోభితము = ప్రకాశముం జెందినది.

55. నిలింపవల్లభునింపు పెంపు = ఇంద్రుని యానందాతిశయమును. ఉల్లసితవిలోచనములన్ = వికసించిన కన్నులతోన్.

56. తలకొలిపెడునే = కలిగించునా. నాకస్వామి = ఇంద్రుఁడు.

57. జడనిధి = సముద్రము. ఆటవెలఁది = నాట్యము చేయునట్టి స్త్రీ. (స_క్తి).

58. కష్వారఁగన్ = నల్పు కలుగుచుండఁగాన్. శీవి = వైభవము.

59. కోహడధూపధూమములతోన్ = అకాలమందు వృక్షాదులకుఁ బువ్వులు మొదలగువానిం బుట్టించు వస్తువులపొగలతోన్. తత్పురీవనవ్యూహమున్ = ఆ పట్టణమునందలి తోఁటలసమూహము. అంబుపాన = నీరు త్రాగుటయందలి. కౌతూహల = వేడుకచేతను. లంబమాన = వ్రేలాడుచున్న. నవతోయదరాజి = క్రొత్తమేఘములపరుసచే. విరాజిత = ప్రకాశించుచున్న. అబ్ధిసందేహ = సముద్రమనెడు సంశయముయొక్క. నితాంతకందళన = ఎడతెగక పుట్టించుటచేత. దీపిత = ప్రకాశింపఁ జేయఁబడిన. నైపుణిన్ = నేర్పుచేతను.

60. భోగపుఁజుట్లు = సర్పశరీరముయొక్క వలయములు. భూరికిరీట = బంగారు కిరీటము (మకుటము) చేతను. సముజ్జ్వలత్ = ప్రకాశించుచున్న. ఫణాపూగము = పడగల సముదాయము. భోగివిభేంద్రుఁడు = సర్పరాజు, శేషుఁడు. ఉపేంద్రున్ = కృష్ణునిని. (ఇతఁడు వామనావతారమున నదితిగర్భమున నింద్రునకుం దరువాత జన్మించుటచే నీ పేరు కలిగెను.) ఈగతిన్ = కోటలు మొదలగువాని యాకారముచేతను. నిర్జరేశ్వరా = ఓ యింద్రా. (నిర్జరులు = ముసలితనము లేనివారు = దేవతలు. వారి కీశ్వరుఁ డింద్రుఁడు.)

61. మొగుళ్లు = మేఘములు. హర్మ్యాగ్రవిన్యస్త కేతువులందున్ = మేడల చివర నిల్పఁబడిన టెక్కెము (జెండా) లందున్. అవచూడ = టెక్కెపుగుడ్డల క్రింది భాగముననున్న కుచ్చులయొక్క. ఉపల = మణులయొక్క. దీప్తి = కాంతులచేతను. చిత్రితములై = పలురంగులు కలవియై. ఇది మొగళ్లవిశేషణము. కాలాగరుధూపధూమతతులో = నల్లనియగురను పరిమళద్రవ్యముయొక్క పొగలగుంపులో. అభ్రంబులో = మేఘములో. ఓ యనునది సంశయార్థము. (ధూపధూమము. ఇది ప్రౌఢప్రయోగము.)

62. హరిహయుఁడు = ఇంద్రుఁడు. (ఆకుపచ్చని గుఱ్ఱములు గలవాఁడు.) అంగిరసునకైనన్ = బృహస్పతికైనను. విస్ఫురన్మరకతపట్టిమస్థలియొ = ప్రకాశించుచున్న మరకతము లను మణుల (తోఁగట్టఁబడిన) భూమియో. మసృణము = మృదువైన. కెంపు = ఎఱుపుయొక్క. ఉమ్మరమునన్ = ఆధిక్యముచేతన్. నెఱమామిడి = ప్రశస్తమైన మామిడి.

63. కలధౌతకేళినగంబు = వెండి (తోఁజేయఁబడిన) క్రీడాపర్వతము. ఘనప్రసూనచాంపేయవనరాజి = దట్టమైన పువ్వులు గల సంపెంగతోఁట. హరినీలసోపానసరణి = ఇంద్రనీలమణుల మెట్లవరుస. వగలుచున్నది = ప్రకటించుచున్నది. పసపుఁ ఘటలవ సౌభాగ్యంబు = పసపుపుఁదీగల (తోనేర్పఱిచిన) కంచెయొక్క చక్కందనము. జటాజూటరుచిని = జడల సముదాయముయొక్క కాంతిని. పసిని = కోలను. సురనదిగతిన్ = ఆకాశగంగవలెను. ఉడుపతికళన్ = చంద్రకళను. అనిమిషాధిపా = ఇంద్రా. (అనిమిషులు = ఱెప్పపాటులేనివారు = దేవతలు.)

64. ఆలోల = మిగులఁ జలించుచున్న. శైవాలజాల = నాఁచుతీఁగెల సమూహముయొక్క. లాలిత్యంబు = చక్కందనము. జంగమోద్యానవేషము = సంచరించుస్వభావముగల పూఁదోఁటలయొక్క వేషమును వహింపన్. రంగత్ = ప్రకాశించుచున్న. ఉత్తుంగ = పొడవైన. తరంగసంఘాతంబు = కెరటముల (అలల) సముదాయము. నవగోటల తెఱంగు = నవచెఱకు కోటలవిధమును. డిండీర మండల = నురుఁగురాశియొక్క. అఖండ = పూర్ణమైన. సౌభాగ్యంబు = సౌందర్యము. చరసౌధచయవిలాసము = తిరుగుచున్న మేడల సముదాయముయొక్క సొగసును. శ్రీకర = శోభను గలిగించెడు. శీకర = నీటి తుంపరలయొక్క. అస్తోకప్రవర్షంబు = అధికమైన వర్షము. తత్తదాశోపయాతవాతవశతచేతన్ = ఆ యా దిక్కులనుండి వచ్చిన గాలికి లోఁబడుటచేతను. ఏతత్పురవర్య = ఈపట్టణ శ్రేష్ఠముయొక్క. పర్యుపాసనా = సేవించుటకై. శాసన = ఆజ్ఞచేతను. సమానీత = తీసికొనిరాఁబడిన. పరపురీపరంపరాలీలన్ = శత్రుపుర సముదాయముయొక్క విలాసమును. నెఱపెడున్ = ప్రకటించును.

65. సాగరము = సముద్రము. సగరపుత్త్రులచేఁ ద్రవ్వఁబడుటచే దీని కీ పేరు గలిగెను. తద్జ్ఞులు = దాని నెఱిఁగినవారు. పరిఖ = కందకము.

66. తరుణీకటిద్యుతిధన్యవనావళి = జఘనము లనియెడు మెఱుపుల సంఘముచేఁ గృతార్థమైన వనసముదాయము. ఘనున్ = మేఘమును. అలజ్జతన్ = సిగ్గు లేమిని. పూఁదేనియసోనకాలువల్ = పూవుల (మకరందము) యొక్క వర్షముచేఁ (గలిగిన) చిన్నప్రవాహములు.

67. నూత్నగారుత్మతస్తంభ = క్రొత్తవి యగు గరుడపచ్చలను రత్నముల (తోఁ జేయఁబడిన) కంబములతోడను. సంభృత = సంపాదింపఁబడిన. అభేద = భేదము లేమిని. సామ్యము నని యర్థము. అవలంబి = ధరించిన. రంభాతతి = అరఁటిచెట్లచేతను. విభూషిత = అలంకరింపఁబడిన. గోపుర = కోటగుమ్మముయొక్క. పార్శ్వభాగంబు = ప్రక్కప్రదేశములు గలది. ఉభయపార్శ్వ = రెండుప్రక్కల (ను). సౌధపీఠికా = మేడలవరుసను. అతిగూఢ = ఎక్కువ. ప్రోషితవిలాసినీ = ప్రోషితయగు స్త్రీయొక్క. కటాక్షనివహా = క్రేఁగంటిచూపుల గుంపులచేతను. మహాగుణశిక్షిత = మిగుల నెక్కువ సంఖ్యగలవియై చేయఁబడిన. వర్త్మతోరణంబు = త్రోవయందలి తోరణపుఁబంక్తులు గలవాఁడును. కక్ష్యాంతరములు = వేరువేరు ముంగిళ్లు. పరస్పరాప్త సంభావనంబులు = ఒండొరులకుం దగిన సన్మానములు. ఆస్తంభసంభ్రమము సంభృతంబులు అఁట గాని వేగిరపాటుచేఁ జేయఁబడినవి.

68. కుశలముకలిమి = శుభప్రాప్తి. ప్రత్యక్షమే = కన్నుల యెదుటనున్నదియే. అటమటము = వంచనము.

69. అవధానముతోన్ = మెలఁకువతోన్. మన్మనోవ్యథాభరము = నా మనసునందున్న ఖేదాతిశయమును.

70. ప్రసన్నున్ = సంతోషపడిన వానిని. మారుతాతపములకున్ = గాలికిని నెండకును. నిజానుమతిన్ = తన సెలవునన్. తక్కన్ = తప్పన్. ప్రవేశ మొనర్పరాని యట్టిపసన్ = చొరరాని బలముచేతను. తనర్చు దానిన్. తన సెలవుచేతనకాని గాలియు నెండయు నయితము ప్రవేశింపరాని దాని నని యర్థము.

71. ఉపభోగంబులన్ = అనుభవములతోన్.

72. ఉన్నతమదాంధతన్ = ఎక్కువ గర్వమునం గలిగిన గ్రుడ్డితనముచేతను. దాడి = శత్రువులజయింప సేనలతో వెడలిపోవుట. పోతరము = క్రొవ్వు. పూరికిఁ గైకొనక = గడ్డిపోఁచతోనైన సమానముగఁ జూడక యని యర్థము. అప్సరోనఖాగ్రాత = అచ్చరలగమియొక్క. నిశాత = పదనుగలవిగాఁ జేయఁబడిన. (సూక్ష్మములైన యని యర్థము) పాణిరుహా = గోళ్ళు. (తోఁజిమ్మఁబడిన) వారి = ఉదకము నందు. సలాలస = వేడుకగల. నవ్యపల్లవంబు = క్రొత్త చిగురాకులు గలది. ఇది నందనమునకు విశేషణము. అచ్చరల సన్నపుగోళ్ళచేఁ జిమ్మఁబడిన నీటిచే వర్ధిల్లిన చిగుళ్ళు గలది యని యర్థము. ఇట నిశాత విశేషణము వానినుండి జాఱు నీటి తుంపరలకు మిగుల సూక్ష్మత్వముం దెలుపును. దీనిచేఁ బల్లవముల సౌకుమార్యము గమ్యము.

73. దనుజాధిరోహతాడనభంజనాదులకున్ = రాక్షసుల యెక్కుట, విఱుచుట మొదలగువానికిన్. సంతానకములు = లేఁతవియగు సంతానవృక్షములు. శోష్యపర్యుషితమనుష్యమాంసంబులు = ఎండవేయఁదగినవియును, చాలఁగాలము నాఁటివియు నగు మనుష్యమాంసములను. దానవద్విపఘటాలానతాదురవస్థన్ = రక్కసులయేనుఁగులకుం గట్టు కఱ్ఱలగుట యనెడు దురవస్థను. (చెడుదశను) (ద్విపము = రెంటితో నీరు త్రాగునది; ఏనుఁగు. ఘట = ఏనుఁగులసముదాయము, ఆలానము = ఏనుఁగుం గట్టు కట్టె.) మనుజఖాదిస్వేదమలినవస్త్రాదులు = రాక్షసులయొక్క చెమ్మటచే మురికి గల బట్టలు మొదలగు వానిని. (మనుజఖాది = మనుజులం దినువాఁడు; రక్కసుఁడు.)

75. అప్రతిహతంబులు = మాఱులేనివి.

76. దుర్మత్సరంబు = చెడ్డయోర్వలేమి.

77. శాంతసంరంభంబుగాన్ = తగ్గినవేగిరపాటు కలుగునట్లుగాన్. తీఱమి కొలంది = చేయవలసిన పనియొక్కమితిని. అనూనంబుగాన్ = కొఱఁత లేకుండునట్లు. పాలుపెట్టించితిమి = (వేరువేరుగా) నిర్ణయించితిమి.

78. ఉలుపా = కానుక. అనామధేయపు దైత్యునకున్ = పేరులేని రక్కసునకున్. (అప్రసిద్ధునకని యర్థము). కిర్గాడియసురకున్ = నీచుఁడగు రక్కసునకున్.

పెద్దఱికంబు = గౌరవమును. మను = సుందరముగా. అర్చలు = పూజను. పినుఁగుఁగొక్కు-సునకున్ = అత్యాశగల రాక్షసునకున్.

79. అలౌకిక = లోకాతీతమైనది (లోకమున నెక్కడ లేనిది యని యర్థము.) గనుకనే. అద్భుత = అబ్బురమైన. శ్రీ = శోభచేతను. రుచిర = మనోహరమైన. త్వదీయనగరీ = నీ పురముయొక్క. గరిమాతిశయ = మిక్కిలి గొప్పతనముయొక్క. అవలోకలీలా = చూచుట యను క్రియయందలి. రస = అనురాగముచేతను. దూరోజ్ఝిత = దూరముగా విడువఁబడిన. సకలవ్యథచిత్తుఁడనై = అన్ని బాధలుగల మనసుగలవాఁడనై. యథాపురాకారతన్ = మునుపటి యాకారముతోన్. తోఁచెదనా = కాన్పించెదనేమో. తనుద్యుతిన్ = శరీరకాంతిని.

80. చండదానవుండు = ప్రతాపముగల రక్కసుఁడు. సన్నాహము = యుద్ధప్రయత్నము.

81. మెఱియలవంటి రక్కసులు = కొత్తెరములం బోలిన వారు. మిక్కిలి దృఢమైన శరీరము గలవారని యర్థము. క్రొవ్వు = మదము. ఏడ్తెఱ = శౌర్యము. నెఱి = మర్యాద. మట్టికొంచున్ = త్రొక్కికొంచున్. మదగ్రమహాసనస్థితిన్ = నాయెదుటి పెద్ద పీఁటయందునికిచేతను.

82. తదీయులు = వాని సేవకులు. రెట్టన్ = బుజమును. వెడంగుపాటు = నిశ్చేష్టత్వము. ఒలయఁగన్ = పొందఁగాన్. ఒదుంగుచున్ = తొలఁగుచున్.

83. పెంపేదఁగన్ = గౌరవము పోవునట్లు. ప్రామాదికము = పొరపాటువలన వచ్చినది.

84. ఉప్పతిల్లెడు = పుట్టు. గాంభీర్యంబున్ = మనసునందలి కోపము మొదలైనవానిఁ దెలియఁజేయు చిన్నెలు లేకుండుటను. సంభ్రమించుటన్ = వేగిరపడుటను. నిలింపద్వేషి = దేవతలకువిరోధి (వజ్రనాభుఁడు).

85. దివ్యవస్తువులు = స్వర్గమున నున్న పదార్థములను.

86. నటనలన్ = అభినయములను. లేనిదాని నున్నట్లు ప్రకటించు టభినయము.

87. బిడౌజుఁడు = ఇంద్రుఁడు. శత్రువుల భేదించు ప్రతాపము గల వాఁడు.

88. నిగ్రహించెదన్ = సాధించెదను (ఓడించెదను). యాతుధానుఁడు = రాక్షసుఁడు.

89. ఎడసేసికొనాడుకోన్ = భేదము గలుగునట్లు మాటలాడుటకు.

90. తియ్యనినోరఁట తేఁప మేయుట న్యాయంబు గాదు = కమ్మని వస్తువులం దిన్న నోటితోఁ జేఁదు వస్తువులం దినుట తగవు గాదు. మృదువు లగు మాటలు పలికిన నోటితో నిష్ఠురము లాడఁదగ దని భావము. అతివ్యగ్రతమున్ = మిక్కిలి వేగిరపాటు నను. ప్రతివిధానము = మాఱుసేఁత. నిజయజనావసానమునన్ = తన యజ్ఞముయొక్క యంతమునందు. యథార్హసాంత్వనాలాపంబులన్ = తగిన ప్రియవచనములతోన్.

91. ఇంబు = ఆనందము. అడరంగన్ = అతిశయింపఁగాన్. రజనీచరుఁడు రాక్షసుఁడు.

92. మదోద్ధతత్వమునన్ = మదగర్వాతిశయముచేన్. ఏపుటించి = ప్రవాదపెట్టి. తెలియకుండ వచ్చి యని యర్థము.

94. పాడిన్ = న్యాయమును. తొలంగన్ = విడుచుట.

95. నికటంబు = ప్రక్కకు వచ్చినది. రిత్తవోవునే = వ్యర్థమగునా.

96. వరప్రోల్లాసి = (బ్రహ్మ యిచ్చిన) వరముచే మిగుల సంతసించువాఁడు. ఏకాగ్రతన్ = ఒక్కతలఁపుతోన్.

97. ఉపాయాన్వేషమున్ = వెరవుపరికించుటను. ఓర్వఁగలరో = ఓడింపఁగలరో.

98. యజ్ఞనిర్వాహణధురీణుండు = యజ్ఞము చేయించుటయొక్క భారము పూనినవాఁడు.

99. నిఖిలదేశ = ఎల్లదేశములనుండి. ఆయాత = వచ్చిన. నృపతి = రాజుల యొక్క. భూషా = (శరీరములందలి) నగలయొక్క. కర్ష = ఒరపిడివలన (గలిగిన). రేణు = ధూళులవలన. సంశోషిత = బాగుగఁ బోషింపఁబడిన. క్షోణీకంబు = భూమి గలదియును. మహిత = పూజ్యమైన. అవభృథ = యజ్ఞదీక్షాంతమునఁ జేయు కర్మాంగమైన స్నానముయొక్క. (యజ్ఞాంతమందు నెక్కుడు తక్కువల వలనఁ గలిగిన దోషముల నివారించుటకై చేయు కర్మస్నానవభృథము). లాభ = ప్రాప్తిచేతను (కలిగిన). మహిమ = గొప్పతనముచేతను. ధన్యత్వభాక్ = కృతార్థత్వము నొందిన. జల = నీటిచేతను. దర్శిత = కనుపఱుపఁబడిన. అపూర్వ = మున్నెన్నఁడులేని. సౌష్ఠవంబు = పరిశుద్ధిగలది. వర = శ్రేష్ఠమైన. మంత్ర, దేవతలను స్తుతించు వేదభాగముయొక్కయు. తంత్ర = క్రియలయొక్కయు. హవ్యద్రవ్య = నేయి మొదలగు వస్తువులయొక్కయు. సాద్గుణ్య = మంచి గుణములచేతను. సంభృత = సంపాదింపఁబడిన. అనల = అగ్ని యొక్క. నవోజ్జ్వల్యకంబు = నూతనమైన ప్రకాశముగలది. సన్నుత = స్తోత్రము చేయఁబడిన. సాన్నాయ్య = పాలును పెరుగును గలసిన హోమద్రవ్యము యొక్క. సౌరభసంపత్ = పరిమళము యొక్క కలిమితోన్. ఆఢ్యంభవిష్ణు = పూర్ణ మగు స్వభావము కలది గనుకనే. ప్రపూతానిలంబు = మిగులఁ బావనమైన వాయువు గలది. హోమధూమాను రంజితగోత్రతలంబు = హోమపుఁ బొగలచే రంగువేయఁబడిన యాకసము గలది. అగుచున్. వసుదేవు నధ్వరంబు = వసుదేవుని యజ్ఞము.

100. తదీయక్షేమంకరనామ సంస్మరణ పుణ్యావాప్తిన్ = ఆ కృష్ణుని సంబంధమగు మేలుకలిగించెడు పేరఁ దలఁచుటవలని పుణ్యపుఁ గలిమిచేన్. అక్షయ్యంబు = తఱుఁగనిది. అగు పెంపుఁ = అగు నభివృద్ధిని. తాల్చు నాన్ = ధరించునని. (స్మృతులుం బురాణములును) చెప్పచుండఁగాన్.

101. తత్తదర్హ సంభావలనచేతన్ = వారి వారికిం దగిన సన్మానములచేతను పరితోషంబు నొందించి = సంతసపెట్టి. పారితోషికంబులు = బహుమానములు.

102. కలికిపిసాళినవ్వు = చక్కనిదియు నెగతాళిం దెలుపునదియు నగు నవ్వు. వటుధూర్తులు = ధూర్తులైనవటులు. మోసగాండ్రైన బ్రహ్మచారులని యర్థము. తెగుబాపలము = సాహసము కలవారము.

103. ఎలనవ్వు = చిఱునగవు. గంభీరపుఁ బేరెలుఁగు = లోఁతైన పెద్ద కంఠధ్వని.

104. వేదసౌరభములు = వేదములనెడు పరిమళములను. శుచి = పరిశుద్ధి యనెడు తెలుపుగల. బ్రాహ్మణజాతి బ్రాహ్మణులను మను జాజిచెట్లయొక్క. కోరకములారా! = మొగ్గలారా! బ్రహ్మవర్చసపావకస్ఫూర్జితస్ఫులింగంబు సారె = బ్రహ్మవర్చస మనెడు నగ్నియొక్క పెట పెటలాడు ధ్వనిగల మిణుంగురులారా. (వేదముఁ జదువుట మొదలైన వానివలనఁ గలుగు తేజము బ్రహ్మవర్చసము). అట్టి కసికలంతలు = చిన్న కుండలయొక్క మూతులంత పరిమాణము గలవారు. బింకమునన్ = గర్వము చేతను. బ్రహ్మశిఖ = చతుర్ముఖుని జుట్టును. ఉపనిషత్తుల ననియు నర్థము. దంటమాటలకున్ = ప్రౌఢ మాటలకున్. శాఠ్యమునకున్ = మోసమునకును. పడి = శ్రమనొంది. ఆనతి = మ్రొక్కును. పట్టినట్టి సత్ప్రజ్ఞులార = అవలంబించిన విద్వాంసులార. వడుగులార = బ్రహ్మచారులారా! వెన్నునివామనత్వంబు = విష్ణునివామనావతారమును. అభినయించు తంత్రులారా = ప్రకటించు బాలురారా. మీ ప్రసాదము = మీ యనుగ్రహము. (అనుగ్రహముచే నీయఁబడిన మాఱుగోఁచు లని యర్థము). సమృద్ధికారణము = సంపదకుం గారణము.

105. దండగంబునన్ = చెడ్డతనము చేతను.

107. మెట్టాడు చిట్టివడుగులన్ = చిందులు ద్రొక్కెడు చిన్నవయసునున్న బ్రహ్మచారులను. నట్టు = నటుఁడు. వాలకంపు సొమ్ములందున్ = వేషము వేసికొనుట కుపయోగించు వస్తువులందున్. అట్టాడుచున్న వారు = తిరుగుచున్న వారు. ఎచ్చరికన్ = జాగ్రత్తతోన్. ఉదరిపడుచు = తలవని తలఁపుగా వచ్చు భయము మొదలగువానిచే వణఁకుచున్. అధిక్షేపించి = తిరస్కరించి.

108. ద్రుచ్చుఁదనాల పుట్టిన యిండ్లు = దొంగతనముల కునికిపట్లు. భ్రమయించుచున్ = పొరపాటు పఱచుచున్. నగళ్లు = అంతఃపురములను. చక్కడఁచుచున్ = సంహరించుచున్. పేనుగ్రుక్కిన పాటిగాన్ = ధ్వనిచేయకుండనని యర్థము.

109. ఉపాయాన్వేషి = సాధనము వెదకువాఁడు. "విప్రవాక్యం జనార్దన" యన్నాటయర్థమై = శ్లో. ఉపశ్శకుంసగార్గ్యస్తు శకునంతు బృహస్పతిః। మనో జయంతు మాండవ్యో విప్రవాక్యం జనార్దనః॥ ఎద్దియేనొక కార్యమునకుం బోవునపుడు గార్గ్యుఁడు వేళవను, బృహస్పతి శకునమును, మాండవ్యుఁడు మనోనిశ్చయమును, జనార్దనుఁ డనుకూలమగు బ్రాహ్మణవచనమును గార్యసాధకములని ప్రశంసించిరి. దీని నాలవ చరణము సత్యమైన యర్థము గలదాయె. పరఁగన్ = ప్రకాశింపఁగాన్. వనజాక్షుండు = కృష్ణుఁడు. తద్వాక్య క్రమంబు = అబ్రాహ్మణబాలుని మాటలను. (వేషగాండ్రు వేషములతోఁ బవలంతఃపురములకు నైతము పోయి వానిం బాగుగఁ బరికీలించి రాత్రు లక్కడకుం బోయి యచటివానిని మోసపుచ్చి దొంగతనము మొదలగునవి చేయుదురను వానిని) నిజాపేక్షకున్ = తన తలఁపునకున్. (వజ్రనాభుని పురికేట్లు పోయినఁ గార్యసిద్ధి యగు నను నన తలఁపునకు నని యర్థము). ఉత్తరంబుగ గ్రహించెన్.

110. విశ్వంభరుఁడు = విశ్వమును బోషించువాఁడు; కృష్ణుఁడు. ఉపశ్రుతి = ఎద్దియే నొక కార్యము చేయఁదలచిన వారు దాని యశాగామముల నిర్ణయింప నొక్కసుజనుని యింటిపంచకుం బోయి కులదేవతలకు నమస్కరించి వానికిం దెలియకుండ నా యింటిపయిం బువ్వులు నక్షతలుం జల్లి యప్పటివారి పల్కు లాలించుట. ఇటఁ దలఁచిన పని యశాగామముల సూచించు నితరుల సంభాషణమును వినుట యని యర్థము. సుకరములు = శ్రమలేకుండఁ జేయఁదగినవి. దనుజాపాయంబునకున్ = రాక్షస (వజ్రనాభ) వినాశమునకున్. దేవశైవలినీ = అకాశగంగ యందలి. విహార = క్రీడ యందు. మహారస = ఎక్కువ ప్రేమచేతను. తరంగిత = పుట్టినతరంగములు గల. (ఉప్పొంగుచున్న యని యర్థము). అంతరంగంబులు = మనసుగలవి. అగు, చక్రాంగంబులన్ = హంసలను.

111. ఒదవుట = ఉపయోగించుట.

112. అసురరిపుఁడు = దేవశత్రువు. (వజ్రనాభుఁడు). పఱచినట్టి యా పాట్లు = పొందించినట్టి వెనుకటి శ్రమములను.

114. సోఁకఁగన్ = ప్రయత్నము గలుగునట్లు. యుక్తముగా ననియేని యర్థము. వేగుపదపంగన్ = శత్రువుని రాజ్యమునందలి వర్తమానములం దెలిసికొని చెప్పుట.

116. సురారాతికిన్ = దేవతలకుం బగవానికిన్ (వజ్రనాభునకున్) కేళీదీర్ఘిక = క్రీడార్థమై దిగుటకు మెట్లుగల నూయి.

117. పులోమజావల్లభునకున్ = ఇంద్రునకున్. (పులోమజ = పులోముని కూఁతురు ; శచి. ఆమెయొక్క, వల్లభుఁడు = భర్త.) శుచిముఖివల్లభుఁడు శుచిముఖి యను హంసికి మగఁడు, (వ్యాకరణ జ్ఞానముచే నిర్దుష్టమగు పలుకులుగలది శుచిముఖి.) మరాళశ్రేష్ఠుఁడు = హంస శ్రేష్ఠుఁడు. ఉల్లసితవదనుఁడు = వికసించినమోము గల వాఁడు. ప్రాభవాభిమానంబునన్ = ప్రభుత్వము (వలని) గర్వముచేతను. పరిహృతతామసుండు = విడువఁబడిన తమోగుణము గల వాఁడు. (ప్రమాదము, నాలస్యము, నిద్ర మొదలగు వానిం బుట్టించునది తమోగుణము). కించిదూనంబుగాన్ = కొంచెము తక్కువగాన్. మదీయజాయ వలనన్ = నా భార్య వలనన్. బలరిపున్ = ఇంద్రునిని. (బలుఁడను రాక్షసుం జంపినవానిని) శతమఖునకున్ = ఇంద్రునకున్. (నూఱుజన్నములు చేసినవానికిన్).

118. ఎడవులఁబట్టి = చాలా కాలమునుండి. మతిచాలమిన్ = తెలివితక్కువ చేతను. కడుపుఁ గక్కుఱితిన్ = కడుపు నిండించుకొను నాసతోన్.

120. గగనస్రవంతి = ఆకాశగంగ. శఠాత్మమానసంబును = మోసగాని (నీచుని) మనసును. నిస్సారసత్వంబు = సారస్యములేమి. తామరపూవుల లేమి యని రెండవ యర్థము. కుందనపుఁదమ్మి = బంగారు తామరపూవు(ల)ను. జలమాత్రశేషము = నీరొక్కటియే మిగులు గలది. నెఱయన్ = పూర్ణముగాన్. కనకనలినజాతమెల్లన్ = బంగారు తామర తెగల నన్నిటిని.

121. కొలంకులన్ = చిన్న నీటిగుంటలందున్. తటాకంబులన్ = చెఱువులందును. కేళీసరసులన్ = క్రీడార్థమైన సరస్సులందున్. బొడ్డనబావులన్ =

వసుమం జిన్నసాయి గలిగి చుట్టు మెట్లుగల పెద్ద నూతులందున్. సుదల = సెలవులు. అస్మదీయ సంక్రీడనంబు కలిమి = మా విహారము గల్గుట. మేము సంచరించుట యని యర్థము. అహరహంబును = ప్రతిదినమును. సామ్రాజ్యలక్ష్మీసాక్షాత్కారా కారిణి = ప్రభుత్వ సంపదయొక్క ప్రత్యక్షమగుటం బోలునది. ప్రత్యక్షమైన రాజ్య లక్ష్మివలె నున్నది యని యర్థము. తత్తటంబునన్ = ఆ కొలఁకు నొడ్డున. వాలుఁ గంటి = (వాలు + కన్ను) సోగకన్నులు గలది.

123. విరచితాంగీకృతయై = చేయఁబడిన యొప్పుదల గలదై. అంగీకరించిన దని యర్థము.

124. కలకంఠి = మధురమైన కంఠధ్వనికలది. అకలంకసౌహార్దంబునన్ = కపటములేని స్నేహముచేతను.

125. సుప్రసన్నయై = మిగుల ననుగ్రహించినదై. ప్రత్యక్షయై యని యర్థము. విమలదరస్మితామృతము పెల్లుగ = స్వచ్ఛమగు చిఱునగ వనెడి యమృత ప్రవాహము. పిక్కటిల్లన్ = నిండఁగాన్. వ్యాపింపఁగాన్. మమత = నాకు సంబంధించినదను నభిమానము చేతను. మేనిమురువునన్ = శరీరము పొదవుచున్.

126. సంకల్పమాత్రతత్క్షణసన్నిధాపితంబు = తలంచుకొనిన వెంటనే ప్రాప్త మైనది యని యర్థము. రూపము = కడియములు మొదలగువానిచే నలంకరింపఁబడని యవయవములును దేనిచే నలంకరింపఁబడినట్లు ప్రకాశించునోయట్టి చక్కఁదనము. లావణ్యము = మెఱుఁగుకాంతి. శౌర్యము = పరాక్రమము. కఱపన్ = ఉపదే శింపఁగాన్. చిత్రఫలకము = చిత్తరువు వ్రాసినపలక.

127. నికటంబునన్ = సమీపమునందున్.

128. దనుజవిరోధి పుత్త్రునకున్ = ప్రద్యుమ్నునకున్. (రాక్షసులకుం బగవాఁ డగు కృష్ణుని కొమారునకున్) అధికవిశ్వాస యోగ్యము = మిక్కిలి నమ్మఁదగినది. అచిరభావి ఫలము = శీఘ్రముగ రాఁగల ఫలము గలది.

**129.** తదీయ = ఆ కన్నియ సంబంధమైన. స్వప్నకథనానంతర = కలం జెప్పుటకుఁ దరువాత. ప్రవృత్తంబులైన = జరిగిన. మత్తకాశినుల = స్త్రీలయొక్క ఉత్తర ప్రత్యుత్తరంబుల వెంబడిన్. అకించిత్ = అధికముగాను. అంచిత = ఒప్పు చున్న. సహజ = కూడఁబుట్టిన. మాధుకీధురీణ = తీపునుధరించిన. వాణీరామణీయ కంబు = మాటల చక్కఁదనము. కార్యకామనీయకంబునన్ = పనియందలి కోర్కె చేతను. ఇనుమడించి = రెట్టించి; అధికమై. బిడౌజున్ = ఇంద్రుని. నిబిడౌజున్ = అధికమైన యుత్సాహము గలవానిని.

**130.** వెఱఁగందుచున్ = ఆశ్చర్యపడుచున్.

**132.** నేమము = నియమము. సంతోషము (తృప్తి), దానము మొదలగువాని సముదాయ మని యర్థము. అగజ = పార్వతిని.

**133.** వలిమలయాఁడుబిడ్డ = పార్వతిన్. (వలిమల = చల్లనికొండ (హిమ వంతము) ఆఁడుబిడ్డ = కూఁతురు.) పొలయఁగరానిచోటన్ = తిరుగుటకు వీలులేని చోటన్.

**134.** చిచ్చు = నిప్పు. లేక; చిచ్చుడుమచ్చరీఁడు = ఉడికెడువాఁడు నోర్వ లేమిగలవాఁడును. కారణములేకయే పరులశుభమును సహింపనివాఁడని యర్థము. ఈ సుద్ది = ఈ వృత్తాంతమును.

**135.** సుబ్బెడున్ = బయలుపడును.

**136.** ఎల్లసృష్టిలోన్ = జగమునందెల్లను. సురూపతేపసన్ = చక్కఁదనము యొక్క బలముచేతను.

**137.** పొదరుటీలమిన్ = అల్లుకొనిన తీగెలు మొదలగువానిచే మఱుఁగగు చోటను. పొదరింట నని యర్థము. కప్పుఁబావడ = కప్పువస్త్రము. గవుసెనను. జీవకళ = చైతన్యము. ఉట్టిపడన్ = కలుగునట్లు. శివ = పార్వతి. యా చెలువు నకున్ = యా ప్రియునకున్.

138. ఆభిముఖ్యము = ఎట్టయెదుటనుండుటను. తలంకెను = భయపడెను.

139. సత్యపుంభ్రమసమృద్ధిని = నిజ పురుషుఁడను భ్రాంతియొక్క యతిశయము చేతను. తత్తరము = (చూడవలెననెడు) వేగిరిపాటు. త్రప = సిగ్గు. ఓసరిల్లుచున్ = తొలఁగుచున్.

140. వెఱ = భయము. చిత్రతానిశ్చయము = బొమ్మ యనెడు నిశ్చయము. ఎచ్చరింపన్ = ప్రేరేపింపఁగాన్.

142 బెడంగు = అందము. నిజాత్యంతికనైపుణీమహిమ = తనదియగు నెక్కువ నేర్పుచేతనని యర్థము. అంచనన్ = ఇట్టిదాఁ బంపవచ్చు నను తలఁపుచేతను.

144. ఇచ్చకము = మోమునెదుటఁ జెప్పు ప్రియవచనము(ల)ను. ఇచ్చెలువంబు = ఈ చక్కఁదనమును.

145. కందర్పాగంబు = మన్మథునివలన (పుట్టిన) ప్రేమమును. శీఘ్రానయనంబునకున్ = త్వరగఁదోడి తెచ్చుటకు.

146. ధారిణ్యాభరణాయమానబుధతాధారుండు = భూమి కలంకారమగుచున్న పాండిత్యమునకుఁ నిలువఁ జోటగువాఁడు. భూమ = బాహుళ్యము చేతను. (అధికముగా ననియర్థము). ఉల్లసత్ = ప్రకాశించుచున్న. కారుణ్యామృత = దయ యనెడు నమృతముయొక్క. శైత్య = చల్లందనమే. నిత్య = శాశ్వతమైన. దృగలంకారుండు = దృష్టుల యలంకారము గలవాఁడు (ఇతరులయొక్క దుఃఖము బోఁగొట్టు నిచ్చదయ. ఇది కన్నుల యందుండు నని ప్రసిద్ధి.) నేత్రాంత = కనుఁగొనలయందు. . గాహ = ప్రవేశించిన. ఆరుణ్యాంకుర = ఎఱ్ఱఁదనము మొలకచేతనే. కల్పిత = చేయఁబడిన. అరిమద సంహారుండు = శత్రువుల గర్వముయొక్క నాశనము గలవాఁడు. కీర్త్యంగనా = కీర్తి యను చక్కని స్త్రీయొక్క. తారుణ్య = పడుచుఁదనముయొక్క. అగళిత = జారకుండుటను. ఔషధ = మందైన. అభిజనవిస్తారుండు = వంశ విస్తారముగల వాఁడు. అనిన్ = యుద్ధమునందు. శూరుండు = పరాక్రమశాలి.

147. సారతరవైదికసమాచారుఁడు = ప్రశస్తమైన వేదోక్తమైన నడవడిగలవాఁడు. సాంగానంగాకారుఁడు = శరీరముతోఁగూడి (ధరించి)న మన్మథుం బోలిన యాకారము గలవాఁడు. సభలన్, సన్నుతవచఃప్రకారుఁడు = స్తుతింపఁబడిన మాటల పద్ధతి గలవాఁడు.

148. సౌమనసాచలవరధీరుఁడు = మేరుపర్వతముంబోలె ధీరుఁడు. ధీరుఁడు = బుద్ధినివశపఱిచి కొన్నవాఁడు (కామక్రోధాదులచేఁ జలింపని మనసుగల వాఁ డని యర్థము) సుమనసులు = దేవతలు. వారియచలవరము (సౌమనసాచలవరము) = వారువసించు పర్వత శ్రేష్ఠము; మేరువు. శశ్వదుదారుఁడు = ఎప్పుడును దాత. సంహృతవైరుఁడు = చంపఁబడిన శత్రుత్వముగలవాఁడు. సాదిమసారుఁడు = పూర్వపువారి న్యాయముంబోలిన న్యాయముతోఁ గూడినవాఁడు, (తన ధర్మమును విడువమి న్యాయము). సంవిదగారుఁడు = జ్ఞానమునకు వాసస్థానము.

---

# ద్వితీయాశ్వాసము

1. శ్రీఘన = సంపదచేఁ బ్రసిద్ధులైన. గౌతమగోత్ర = గౌతముని వంశమునఁ బుట్టిన. ప్రాచీనామాత్య = పూర్వపు మంత్రులయొక్క. కీర్తిభామా = కీర్తియను నింతికి. విష్వద్రీచీనగమన = అన్నిదిక్కుల వ్యాపించిన సంచారము యొక్క. శిక్షా = నేర్పుటయందు. ఏకాచార్యుఁడు = ఒకఁడే యుపాధ్యాయుఁడు. తన ప్రాచీనులకీర్తి నన్నిదిక్కుల వ్యాపింపఁ జేసిన వాఁడని యర్థము.

2. అపేక్షితప్రయోజనాను కూల్యంబుకంటెన్ = కోరఁబడిన కార్యమునకు సహాయ పడుటకంటెన్. వెంటిరాయంచ = రాజహంసియొక్క. అంచిత = పూజింపఁబడిన. (మనోహరమైన యని యర్థము) వచనరచనా = వాక్కులం బల్కుట యందలి. విచక్షణత్వంబు = నేర్పు. ఇంపుసొంపు = సంతోషాతిశయమును. నిచ్చలంబులై = స్థిరమైనవియై.

3. శబ్దసంస్కారము = శబ్దశుద్ధిని. (సుశబ్దప్రయోగము నని యర్థము) పద మైత్రి = పదముల పొందిక. అర్థసంపదలన్ = అర్థపుఁగలిమితోన్. తలఁపు = భావము. అక్లిష్టతను = క్లిష్టమను దోషములేమితోన్. వ్యవధానముగా నర్థమిచ్చు పదములం ప్రయోగించుట క్లిష్టము. (శ్రమలేకుండ నని యర్థము) ప్రదీపితము = ప్రకాశింపఁ జేయఁబడినది. పునరుక్తి దోషము = చెప్పినది మఱలఁ జెప్పుట యను దోషము. ఆకాంక్షితసుపూర్తి = అన్వయమునకుఁ గావలసిన పదములయొక్క నింపు టను. శాఖాచంక్రమము= కొమ్మల కెగఁ బ్రాఁకుట. ప్రస్తుతమైనదానికి విశేషముగా సంబంధము లేని యంశము నధికముగాఁ జెప్పుట. ప్రకృతార్థ భావంబు = ప్రకృతాం శమును గూర్చిన యభిప్రాయము. పాదుకొన్ = స్థిరపడునట్లు. ఉపపత్తి = దృష్టాం తము. అత్యూర్జితముగన్ = మిక్కిలి దృఢపడునట్లు. ఒకటన్ = ఒకచోటనైనను. పూర్వోత్తర విరోధము = వెనుకఁజెప్పిన దానికిని ముందుఁ జెప్పఁబోవు దానికిని వైరము. తత్తదవయవ వాక్యతాత్పర్య భేదములు = ఆయాయి యప్రధానములగు వాక్యముల వేఱు వేఱు తలఁపులు. మహావాక్య తాత్పర్యమునకున్ = ప్రధానవాక్యము యొక్క యభిప్రాయమునకున్. ఒనరన్ = అనుకూల పడునట్లు. (కవియిందంచ పల్కులస్తుతించు నెపమునఁ గవిత్వమున నుండవలసిన లక్షణముల నన్నింటిం జెప్పెను).

4. వరటామణి = మణింబోలిన హంసి. విహంగయోషవె = పక్షివనితవా ? కావని యర్థము. భాషాప్రావీణ్యము = మాటల (నాడుటయందలి) నేర్పును. వాగ్దే వత = సరస్వతి. ఆకె = ఆమె. (సరస్వతి) దిద్దిన = (విద్య) నేర్పిన ; కవి = నీట వసించు పిట్ట. (హంసి). శృంగారాది రసములు గల శబ్దార్థములం గూర్చి కబ్బము చేయు (వాఁడు) నది.

5. అనిమిషవర = ఇంద్రుఁడా, (అనిమిషులు = ఱెప్పపాటు లేనివారు ; దేవతలు. వారికి, వరుఁడు = ప్రభువు). రెండవపక్షము = రెండవసారి చెప్పిన మాట యని యర్థము. బుధుఁడు= విద్వాంసుఁడు. దేవుఁడనియు నర్థము. తివియక = ఆకర్షింపక. వెలివోనిచ్చునే = దాఁటిపోనిచ్చునా ?

6. పద్మజుని తేరు = బ్రహ్మదేవుని రథమును; తివుచు = లాగెడు ; తద్విమల శిక్షణ = ఆ సరస్వతి యొక్క యొప్పిదమైన నేర్పుట చేతను. సరస్వతి చక్కఁగా నేర్పుటచేత నని యర్థము.

7. పర్యాకులిత భావంబునన్ = కలఁత నొందిన మనసుతోన్.

8. వాసుదేవుఁడు = కృష్ణుఁడు. (ఎల్లవస్తువుల యందు నిల్చుచు నెల్లవస్తువులఁ దనయందు నిలుపువాఁడు.) నవీనాదృతిన్ = అపూర్వమైన సన్మానముతోన్. అతని బుద్ధి = అతని యాలోచనమును.

10. విశదపక్షపాతుల ప్రవర్తనములు = తెల్లని ఱెక్కల ప్రసారము గలవాని నడవడులు. స్పష్టమైన ప్రేమగల వారి నడవడు లనియు నర్థము.

12. అష్టమహిషీసమేతుఁడు = ఎనమండ్రు భార్యలతోఁ గూడినవాఁడు. ఆలయోపవనసరస్తీరమండపవర్తి = ఇంటిదగ్గరనున్న తోఁటయందలి కొలఁకునొడ్డున నున్న చావడిలో నున్నవాఁడు.

13. నభమున్ = ఆకాశమునుండి. కనకాంచితపక్షచకచకద్యుతిచేన్ = బంగారు (గీఱల)చే నొప్పుచున్న ఱెక్కల యొక్క చకచకలాడు కాంతిచేతను.

14. రక్కసుల గొంగ = కృష్ణుఁడు. (రాక్షసుల సంహరించు వాఁడు.)

15. శుశ్రూష = సేవను. కాళంజిన్ = తాంబూలము నుమియు పాత్రమును. విరిచామరము = పువ్వుల విసనకఱ్ఱను. గిండి = సన్నపు మూతిగల చెంబు (కూజా)ను. క్రొమ్మెఱుఁగులతోడి కార్మొగులు వోలెన్ = క్రొత్త మెఱుపులతోఁ గూడిన వానకాలపు మబ్బువలె. నిండునెలరీతిన్ = పూర్ణచంద్రునిరీతివంటి రీతిచేతను. పూర్ణచంద్రుఁడు వలె నని యర్థము. తారకాన్వితనభంబుపోలుపున్ = చుక్కలతో గూడిన యాకసము విధమును. తెలిపెడి నెత్తమ్మికొలని కెలనన్ = తెలియఁజేసెడు తామర పూవుల (గల) చెఱువు ప్రక్కను.

19. పులుఁగుపడఁతి = పక్షివనిత. (హంసి.) కళాకౌశలమున్ = గానాది విద్యల యందలి నేర్పును.

20. ప్రోర్జితలీలన్ = అధికమగు విలాసముతో నని యర్థము. తెరల్చి = తొలఁగించి. జాంబవతీకరనాగవల్లికాదళములు = జాంబవతి చేతియందలి తములపాకులను. ప్రమదలు = స్త్రీలు.

21. నిరవశేషముగన్ = మిగులకుండు నట్లు.

23. పక్షివధూవచనక్రమంబుచేన్ = హంసియొక్క మాటలరీతిచేత. హంసి చెప్పిన మాటలచేత నని యర్థము. కడమ = మిగిలిన యంశము.

25. బలవిభవాభిశోభితుఁడు = సత్త్వయొక్క గొప్పతనముచేతను బ్రకాశము నందినవాఁడు. అభంగురశౌర్యధురంధరుండు = వక్రముగాని (తిన్నని యని యర్థము) పరాక్రమభారమును వహించినవాఁడు. నిచ్చలముగన్ = నిశ్చయముగన్. దివిజవైరులకంటెన్ = రాక్షసులకంటెన్. (దివిజులు = స్వర్గమున జనియించినవారు; దేవతలు; వారికి, వైరులు = పగవారు.)

26. వైపు = ఉపాయమును.

27. అవధ్యత = చంపఁదగమి. సప్తద్వీపగమనంబు = ఏడు దీవులకుం బోవుట. ముదలఁగొనుము = సెలవుతీసికొనుము.

28. అవాంతరకృత్యంబులు = నడుమఁ జేయందగిన పనులను. తత్తదుపాయంబులు = వానివానికిం (దగిన) సాధనములను. జాలపాదవనిత = హంసి. జాలపాదము = వలంబోలిన పలుచని చర్మముతోఁ గూడిన పాదములుగలది = హంస; వనిత = దాని స్త్రీ. వాహ్యాళివిహారసారస్యంబునన్ = వేడుకగాఁ దిరుగుట యను క్రీడయందలి ప్రేమమందున్.

29. హృదయంబువెంబడిన = తలఁపుయొక్క వెంటనే; తలఁచినవెంటనే యని యర్థము. ఘోటకము = గుఱ్ఱము. పనుపడన్ = తగునట్లు. కనకంపుఁగోలన్. బంగారుకఱ్ఱతోన్. నడిమింటనె = ఆకాశమధ్యమందె. త్రిమ్మరన్ = తిరుగునట్లు. తారి = సమీపించి.

31. ఎంతభరంబు = ఎంత శ్రమము గలిగించునది. శ్రమగలిగించు నది గాదని యర్థము. అగ్రగామిగన్ = ముందటికిఁబోవునదియగునట్లు. చిత్రగతిన్ = వేఱు వేఱు విధమగు నడకచేతను. ఆశ్చర్యము గలిగించు నడకచేత నని యర్థము. రత్నమయ దండముకాంతులు = మణివికారమైన కఱ్ఱయొక్క కాంతులు. కాఁడిపాఱఁగన్ = గ్రుచ్చుకొనునట్లు, గాఢముగ వ్యాపించున ట్లని యర్థము.

33. అయ్యేక తురగంబు = ఆప్రద్యుమ్నుఁ డెక్కిన యొక్క గుఱ్ఱమే. మండల గతిచారి = గుండ్రమైన నడకతోఁ దిరుగునది. సరూపాశ్వాలి = ఏకాకారముగల గుఱ్ఱములవరుస. అనతిస్ఫుటావయవంబుగా = బొత్తిగ స్పష్టముగాని యంగములు గలుగునట్లు. ఏకాంగవేష్టనత = ఒకే యాకారమైన యవయవముల యల్లిక. కాలు చేయి మొదలైన వాని ముద్దయని యర్థము. తద్విభూషణ ద్యుతిరాజిమాత్రంబు = ఆ గుఱ్ఱపుసొమ్ములకాంతి సముదాయ మొక్కటియే. గతివేగము = నడకవడి. అగ్గలింప రాఁగన్ = అధికము కాఁగాన్. (ఇది వెనుకటి వాక్యములతో నన్వయించును.) వాగె = కళ్లెపుఁద్రాడు. ఎచ్చరిక = జాగ్రత్త. కళ్లెపుఁద్రాటిని జాగ్రత్తగఁ బట్టుకొమ్మని యాశయము. పరాకు = తత్పరతను (బొందుము) (ఒకదానియందె మనస్సు నిల్పుట తత్పరత) పరాకు = ప్రమాదమును (బొందకు) మని యేనిచెప్పనగు. జియ్య = ఓప్రభువా! తెచ్చవడి = చేష్ట లుడిగి. ప్రౌఢికతనన్ = నేర్పు (కల్గుట యను) కారణముచేతను.

34. ఉరుజవశాలి = మిగుల వేగముగలది. ఉల్ముకచక్రనయావలంబి = చక్రాకారమైన కొఱవియొక్క రీతి నవలంబించునది. త్రిప్పంబడిన కొఱవిం బోలిన దని యర్థము. ధృతాభినవభాండతకున్ = ధరింపఁబడిన క్రొత్తదియగు తన భూషణ మనెడు కుండకున్. తద్భ్రమణ దండగతిన్ = ఆ చక్రము త్రిప్పుకోలయొక్క రీతివంటి రీతిచేతను. ఆ చక్రముం ద్రిప్పు కోలవలె ననియె యర్థము.

అన్వయక్రమము :—ఉరుజవశాలి, అత్తురగము, ధృతాభి నవభాండతకున్, తగన్, ఉన్కిపట్టు, తాన్, ఉల్ముకచక్రనయావలంబియై, హరిపుత్రుఁడు, తద్భ్రమణ దండగతిన్, తరలక, పైని, ఒప్పఁగన్, ఎడఁతెవ్వక, తిరుగురయంబుచేతన్, కుమ్మరి సారెచాడ్పునన్, కడున్, పరఁగెన్.

36. వల్గావిభాగకుశలతన్. వల్గా = కళ్ళెపుఁ ద్రాటియొక్క. (గమనమునకుం దగునట్లు) వేఱువేఱు విధములం బట్టుకొనుట యందలి నేర్పుచేతను, వల్గ యుపలక్షకముగావున మునికోల, చబుకు, మడమ, మొదలగు తక్కిన సాధనముల చేతనును నడిపించు తెలివిచేతనని యర్థము. వల్గ, యుత్తిప్తాదిభేద ములచేఁ బలుతెఱంగులు గలదని హయలీలావతి. (కళ్ళెపుఁ ద్రాటియొక్క = కళ్ళెపుఁ ద్రాటిని.) వల్గత్కుండల మకీచివల్గులు = చలించుచున్న తమ్మంట్లయొక్క సోగ కాంతులు. వల్గితముఖ = వల్గితము మొదలైన. గతిపంచక వల్గువిహారము లన్ = నడక లైదింటియొక్కయు సుందరమైన సంచారములచేతను. ఆస్కందితము, రేచితము, ధోరితము, వల్గితము, ప్లుతము నను నైదును గుఱ్ఱపు నడకలు. అతివేగము నతిమందమునుగాని గుఱ్ఱపునడక యాస్కందితము. అంతకంటె నధికమైన చక్కని నడకధోరితము. తాళగతితోఁ బరుగిడుట రేచితము, మీఁదికింగాళ్ళు గదలించుచు వేగముగఁ బోవుట వల్గితము, అంతమేరయు సమముగా వేగముగాఁ బోవుట ప్లుతము. సైంధవమున్ = గుఱ్ఱమును (సింధుదేశమునఁబుట్టినది) అలయించెను = శ్రమ పెట్టెను.

37. కంతుఁడు = మన్మథుఁడు. (ప్రద్యుమ్నుఁడు). నానా = పెక్కుతెఱఁ గులు గల. వీథి = సంచార ప్రదేశములందున్. గతిప్రభేద = వేఱువేఱు నడ కలచే. విహృతిన్ = (వేడుకగాఁ) దిరుగుటచేతను. దుష్టాశ్వములకు సాధు త్వము నేర్పుటకును. తక్కినవానికి గతిదార్ఢ్యము గలుగుటకును నేర్పఱిచిన పరి మితములగు సంచారప్రదేశములు వీథు లనంబడును. ఇవి లఘ్వీ, మధ్యమ, యుత్తమ యని ముప్విధము లనియు మొదటిదాని కెనుబది ధనువులయు, రెండవదానికిఁ దొంబది ధనువులయు, మూఁడవదానికి నూఱు ధనువులయుఁ బరిమాణ ముండవలె ననియు వీని యందుఁ గ్రమముగ నుత్తమ మధ్యమాధమాశ్వములఁ ద్రిప్పవలయు ననియుం గొందఱు చెప్పుదురు. (ధనుఃపరిమాణము రమారమి రెండుగజములు). మఱికొందఱు (భోజరాజా దులు) సమోన్నాతాది భేదములచే వీథులు తొమ్మిది విధము లని చెప్పుదురు.) సంతృ ప్తుఁడై=తనివి జెందినవాఁడై. వాగె=కళ్ళెపుఁ ద్రాటిని. కుదించినన్=లాగిపట్టు కొనఁగాన్. మరుజ్జననము=వాయువువలె వడి గలిగినది. ఆ గంధర్వము=ఆ గుఱ్ఱము. పురుషక = పురుషక మను నునికిచేతను. ప్రోన్నమ్ర = మిగుల మీఁదికెత్తిన. పూర్వాంగమై = మీఁది శరీరము గలదియై. గుఱ్ఱములు వెనుకటి పాదములతో

భూమియందుండి ముందటి పాదములను మీఁదికిఁ జాఁపియుంట పురుషకము. అర్కాశ్వసంతానస్పర్థను = సూర్యుని గుఱ్ఱపుగమితోడి పోటిచేతను.

38. సముపలాలన = బుజ్జవముతో. యుత = కూడిన. స్కంధ = మెడయొక్క. అంతిక = సమీపమునందలి. ఆస్ఫాల = చఱచుటచేతను. దమిత = అణఁపఁబడిన. తేజోమహార్ఘత్వకంబు = ప్రతాపముయొక్క గర్వము గలది. దంతాళికా = కళ్లెపుం ద్రాటియొక్క. నియంత్రణ = బిగించుటచేతను. సమున్నామితా = ఎత్తఁబడినదియును. ఆకుంచితా = కొంచెపఱుపఁబడినదియు నగు. గ్రీవా = మెడచేతను. సముంచితంబు = బాగుగ నొప్పుచున్నది. దందహ్యమాన = మిగులం గుదియింపఁబడుచున్నది గనుకనే. శబ్దాయమాన = ధ్వని చేయుచున్న. ఖలీన = కళ్లెముయొక్క. కషణ = ఒరపిడి చేతను. జర్జరిత = శిథిలమైన. (చీల్చఁబడిన యని యర్థము). సృక్వద్వయంబు = సెలవుల జంట గలది. ఘన = అధికమైన. ఘర్మ = చెమటయొక్క. డిండీరఖండ = నుఱుఁగు ముక్కలచేతను. పాండురిత = తెల్లనిదిగఁ జేయఁబడిన. పల్యయనపట్టి = జీను (మెత్తె) చర్మముయొక్క. ఉభయప్రాంతకంబు = రెండుకొనల చోట్లుం గలది. అగుహయమున్ = అగు గుఱ్ఱమునుండి. అంకవన్నె = గుఱ్ఱము నెక్కువారు శ్రమలేకుండ నెక్కుటకుఁ బల్లముయొక్క ప్రక్క నేర్పఱిచిన యినుప మెట్టు. (రికాబు). సాహిణి = గుఱ్ఱపువాఁడు. సురాళించి = దిగదుడిచి.

39. గగనసరణిన్ = ఆకాశ మార్గమునను.

40. మరాళవితతులతోన్ = హంసగుంపులతోన్.

41. వైచిన పైఁడిప్రాఁత క్రొమ్ముడుఁగు దువ్వాలువలు = (కానుకగ) విసరిన బంగారుసరిగతో నల్లిన చిత్తరువులు గలవియుఁ గ్రొత్తవియుఁ బరిశుభ్రమైనవియు నగు బట్టలజతలు. దర్శకు = ప్రద్యుమ్నునియొక్క. నెఱరౌతుతనము పేర్మికిన్ = ప్రశస్తముగా గుఱ్ఱమును నడుపుటయొక్క గొప్పతనమునకున్. గ్రమ్ముకొను సతేజఃకీర్తి ఘనములు = మూఁగెడు ప్రతాపముతోఁ గూడిన కీర్తిసుద్దులు. హయఫేనధావళ్యయాచ్ఞార్థమై = గుఱ్ఱపు సంబంధమైన నురువులయొక్క తెలుపు నడిగికొనుటకై. ప్రాలుతటిదనుగత సితాబ్దంబులు = దిగియెడు మెఱుపులచే వెంబడింపఁబడిన తెల్లనిమబ్బులు. వాజివిభ్రమజితావర్తతన్ = గుఱ్ఱముయొక్క సుడుల

చేతను జయింపఁబడిన (తన) సుడులు గలది యగుటచేతను. తూలఁదు = చలించు. దివ్యులయేటి = మందాకినీనదియొక్క. స్వాబ్జరేణు = (బంగారు) తామరలపరాగముతోఁ గూడిన. ఊర్ములు = తరంగములు. చూపఱకు = చూచువారలకును. జలదపథమున నుండి = ఆకాశ మార్గమునుండి. వర్ణనాసీమన్ = స్తుతియొక్క హద్దును. అతికరించెన్ = తిరస్కరించెను. స్తుతిఁజేయ నలవిగాకుండె నని భావము.

42. వసుధచేరువన్ = భూమికి సమీపమునందు. అతి నిశ్చలప్రసారిత పత్త్రంబులు = బొత్తిగఁ గదలకుండునవియుఁ జాఁపఁ బడినవియునగు ఱెక్కలు గలవి. సరిగడవఁగన్ = మీఱునట్లు. బోరలు = రొమ్ములు. తెట్టగిలన్ = వెలికిఁ గనుపడునట్లు. ఎఱకలు = ఱెక్కలను. ఱెక్కార్చి = ఱెక్కలాడించి. ఒక వింత యొయ్యారముగన్ = ఒకానొక చిత్రమైన విలాసము గలుగునట్లు. మలంచి = త్రిప్పి. హైమరేఖా = బంగారు గీఱలచేతను. విచిత్ర = ఆశ్చర్యముం గలిగించు. నిజాంగరుహ = తన ఱెక్కలయొక్క. వినిర్మలతన్ = స్వచ్ఛత్వముచేతను.

43. ఉద్యోత మానకౌతుకంబున్ = మిగులం బ్రకాశించుచున్న వేడుకచేతను. అన్యోపరోధంబునన్ = ఇతరుల యడ్డగింతచేతను. కార్యవిరోధంబు = పనికి(ఁగలుగు) నాటంకమును. భవదీయ సన్నిధాన సౌభాగ్యంబునన్ = మీదియగు దగ్గఱనుండుట (మీరు దగ్గఱనుండుట)చేఁ (గల్గు) శోభచేతను. తనిసి = తృప్తిఁబొంది. దివ్యజాతి = స్వర్గమునం బుట్టువుగల.

44. దివస్పతిపంపునన్ = ఇంద్రునాజ్ఞచేతను.

45. యోగ్యసమర్హణ = తగినవారిపూజను. ప్రయోజనసిద్ధికిన్ = కార్యసాఫల్యమునకు.

46. సురాపగన్ = ఆకాశ గంగయందు.

47. కాశ్యపులము = కశ్యపుని సంతాన మగువారము. (ఇది మీ తండ్రి యుపేంద్రునకు నింద్రునకుఁ దగ్గఱ బంధువుల మను నభిప్రాయముం దెలుపును).

48. ఆదిన్ = మొదటను; ప్రసంగము = ప్రస్తావనము.

49. పదరక = కోపింపక ; నిందింపక యనియేని యర్థము.

50. భవత్పరిపృష్టము = నీచే నడుగఁబడినది. సంగతిగాదు = తగదు.

51. కొంకి = సందేహించి. శంబరాంతకుఁడు = ప్రద్యుమ్నుఁడు. (శంబరుఁడను రక్కసునిం జంపినవాఁడు.) అతని చూపు. దీప్తైకాంతకాంక్షంబు = ప్రకాశింపఁజేయఁబడిన యేకాంతమునందలి కోర్కె కలది. మాననీయులు = గారవింపఁదగినవారు. ఎడ = దూరము. చెలువు = అందమును. కులుకులికిపలుకులన్ = చిమ్మెడుచక్కనిపలుకుల యందున్. కలకలత్వంబు = ఉన్నమాధుర్యము. అపూర్వపర్వంబు = క్రొత్తపండుగ. పర్వుచుండఁగన్ = వ్యాపించుచుండఁగన్.

53. వేగు = (వాని) వృత్తాంతముంగూర్చి (వృత్తాంతముం దెలిసికొని చెప్పుటకున్.) పంపఁగాన్, అమరాహితువీటికిన్ = దేవశత్రువు (వజ్రనాభుని) యొక్క పురమునకు.

55. దుర్ఘటము = సాధింపరానిది.

56. తెగరు = సాహసింపరు. మరుత్కంటకున్ = దేవతల నీచశత్రువును. (వజ్రనాభుని) నియోగముబలిమిన్ = ఆజ్ఞాబలముచేత. పీఁచమడంపనె = చంపనా యని యర్థము.

57. ఇరవుకొనన్ = స్థిరపడునట్లు.

58. భిదురధరుండు = వజ్రాయుధమును ధరించినవాఁడు. (ఇంద్రుఁడు.) దీర్ఘవిచారము = ఎడతెగని యాలోచనము. కోఁచవాఱక = పిఱికితనమునందక. ఉదుటునఁ = గర్వముచేతను, నెరవు = పూర్ణము. గొప్పది.

59. కయ్యపువేడ్కన్ = యుద్ధమునందలి వేడుకను. రేఁచుకొని = ఉద్రేకింపఁజేసి. డయ్యక = శ్రమముఁజెందక. పెనుడాకను = ఎక్కువ శౌర్యముచేతను. చేతులకున్ = చేతులబలిమికిన్. ఆఁటి నిల్చువాఁడు = ఓపియుండువాఁడు. పోటుబంటునకున్ = పోరికి జడియని వానికిన్. కౌతుకకారి = వేడుకం జేయువాఁడు.

60. ప్రల్లదంబునన్ = దౌర్జన్యముచేతను; దురములు = యుద్ధములు. తివురు దురు = వేడుకపడుదురు. పిఱికికండ = అధైర్యము. బిరుదుమగలు = శూరులు.

62. కాంతతరాంగిన్ = మిగుల మనోహరమైన శరీరముగలదానిని. శుద్ధాంత = అంతఃపురమునందున్న. సరః ప్రకాంత = ప్రశస్తమైన కొలఁకునందు. సముదంచిత = మిగులా నొప్పుచున్న. కేలిన్ = ఆటను. చరించుచుండి = చేయుచుండి. (దీనికిం గర్తృపదము నేను). వయస్య = చెలికత్తె. తత్ప్రాంత లతాగృహంబునన్ = ఆ కొలని దగ్గఱనున్న పొదరింటియందున్.

63. తిర్యగ్వనితను = పక్షివనితను; (ఈ విశేషణము సౌందర్యముఁ దెలిసికొనఁ దగిన తెల్వి లేనిదానను మఱియు నాఁడుదాని చక్కఁదనముఁ జూచి సంతసింపఁదగని దాన నను నభిప్రాయమును బోధించును). అమర్యాదా నందమగ్నమతిన్ = హద్దులేని సంతోషమున మునిఁగిన బుద్ధిగలదానిని.

64. నెత్తమ్ములు = తామరపువ్వులు. క్రొన్నెల = లేఁత చందురువంక. వట ఫలశ్రీలు = మఱ్ఱిపండ్లశోభలు. పులినము = ఇసుకతిన్నె. హరిమధ్యమము = సింగపు నడుము. హైమకుంభము = బంగారుబిందె. మణిదర్పణములు = మాణిక్యపుటద్దములు. తిలప్రసవము = నువ్వుఁబువ్వు. శఫరులు = చేఁపలు. సింగిణులు = విండ్లు. అళులు = తుమ్మెదలు. ఇవి వరుసగాన్ బాదములకును, గోళ్ళకును, మడమలకును, పిఱుఁదులకును, నడుమునకును, కుచములకును, చెక్కిళ్ళకును, ముక్కునకును, కన్నుల కును, కనుబొమలకును, తలవెంట్రుకలకును నుపమానములు.

తాఁబేటిచిప్పలు, అమ్ములపొదులు, అనఁటికంబములు, సుడి, నవమృణాళ ములు, (లేఁత తామర తూండ్లు) చివురులు, మదనుశంఖము, పగడము, చంద్రఖండము. శ్రీకారములును వరుసగాన్ మీఁగాళ్ళకును, పిక్కలకును, తొడలకును, బొడ్డునకును, బాహువులకును, వ్రేళ్ళకును, కంఠమునకు, పెదవికిని, నుదిటికిని, చెవులకు నుపమాన ములు. ఉపమలు = పోల్పఁదగిన వస్తువులు. తడవక్ = తల పెట్టుటకుక్.

65. చామరములు = చమర మను మృగములయొక్క తోఁకలు, (సవరములు). వెనుకకుఁ జనుట = పాఱిపోవుట. వెనుకభాగమున నుండుట యనియు నర్థము.

(ఇట నీ రెంటి యర్థములను భేదమున్నను నతిశయోక్తి బలమున నభేద నిశ్చయము. ఇందు ముందు వాక్యముల నిట్లే తెలియవలయును. ఓడినవారు పాఱిపోవుటయు వాలములు వెనుక నుంచుటయు లోకప్రసిద్ధము. నీలరత్నము, పూరిన్ = గఱికపోఁచను. కఱచుట = గ్రహించుట. భక్షించుట యనియు నర్థము. ఓడినవారు గడ్డిఁగఱచుటయు నుత్తమ నీలముగఱిక నాకర్షించుటయుఁ బ్రసిద్ధము. తేఁటి = తుమ్మెద, భ్రమరకము = తుమ్మెద పిల్ల. ముంగురు లనియు నర్థము. ఓడినవారు గెలిచినవారి పేరు తమ పిల్లలకుఁ బెట్టికొనుట గలదు. అధికనీలిమన్ = ఎక్కువ నల్లందనముచే విషయమై; ఆ తెఱవకురులకున్, ఓడిచూ = అపజయము నొందిరియే చుమీ.

66. తేఁటుల్, అకలుషనీలిమన్ = నిర్మలమైన నల్లందనము నందు. ఆ కన్య కకచములకున్ = ఆ ప్రభావతి శిరోజములకు. ఓడిపాఱినవియై, మకరందార్థము = పూఁదేనియకై, వికచములగు పుష్పములకె = వికసించిన పువ్వులకే. కచములు లేని వానికేయనియుం దోఁచును. కచములకోడినవి గావునఁ కచములు లేని వానికే పోవు చుండె నని యాశయము.

67. తరుణిమొగము, చంద్రభీతఘనధ్వాంతసంచయమునకున్ = చందురుని వలన జడిసిన గొప్ప చీఁకట్ల సముదాయమునకున్. అభయమొసఁగి = అభయమిచ్చి; భయములేదు రక్షించెద నని శపథపూర్వకముగాఁ జెప్పి యని యర్థము. వేణీభరంబను నెపమునన్ = పెద్ద జడయను మిష చేతను, వెనుకవేసికొన్నది = వెనుక నిలిపి కొన్నది. ఇది = ఇట్లు చేయుట. చంద్రున్, కైకొనమికిన్ = సరకుసేయకుండుటకు. సాక్షిగాదె = గుఱుతుకాదా యని యర్థము.

68. కాంతతర = మిగుల మనోహరమైన. ఫాలసంజ్ఞిత = నుదురను పేరు గల. కంతు = మన్మథునియొక్క. విజయలేఖ పట్టికా = (గెలుపుందెలుపు) వ్రాఁత గల పలకయందున్. విన్యస్త = నిలుపఁబడిన. అద్యంత శ్రీకారములు = మొదటిది యుం జివరదియు నగు శ్రీ యను నక్షరములు.

69. తిలకము = (నుదుటదిద్దిన) నిడుదబొట్టు. సంహిత = కూర్పఁబడిన. ఊర్ధ్వముఖ = మీఁదికిం బ్రసరించిన. తీక్ష్ణ = పదును గల. శరాగ్రము = బాణపు ములికి. కాఁగన్, బొమల్ = కనుబొమలు. నాసికాంచల = ముక్కుచివర భాగ

మనెడు. విలసత్ = ప్రకాశించుచున్న. ప్రకోష్ఠ = ముంజేయి గల. సుమసాయక = మన్మథుని యొక్క (పూవుటమ్ముగల వాఁడు). ముష్టి = పిడికిలిచేతను. గృహీత = పట్టుకొనఁ బడిన. మధ్య = నడిమిభాగము గల. శార్ఙ్గలతయన్ = ధనుర్వల్లియో యను నట్లు. తనరన్ = ఒప్పఁగాన్. నవ్యాడాలు = నవ్యకాంతి. ఇరుగొమ్ములన్ = (ధనువు యొక్క) రెండుకొనలయందును. వ్రేలుఁవెల్లజల్లుల గతిన్ = వ్రేలాడుచుండెడు తెల్ల సవరపుఁ గుచ్చులువలె. మదిరాక్షి = ప్రభావతి (మద్యముం బోలిన = మనోహరమైన కన్నులుగల స్త్రీ మదిరాక్షి.) మెఱుంగుఁజెక్కులన్, సొవలున్.

70. ఈక్షణతారకాఖ్యరోలంబక దంపతుల్ = కనుగ్రుడ్లనెడి తుమ్మెదల జంట. ఇది క్రాలెడునను దానికిఁ గర్త. అంబురుహాక్షినాసిక = ప్రభావతియొక్క ముక్కు. నిజాన్వయ శత్రువున్ = తమ (తుమ్మెదల) కొలమునకు విరోధిని. చంపక ప్రసూనంబున్ = సంపంగెపూవును. కరంబు గెల్చుట = మిగుల (తప్పక) జయించుటను. మనంబునఁబెట్టి = తలంచి. తదీయ = ఆ ముక్కుయొక్క. పార్శ్వయుగ్మంబునన్ = ఇరుప్రక్క లందును, ఎంతయున్, సంభ్రమించుచున్ = మిగుల వేగిరించుచున్. పెనువళావళిన్ = మిగుల వేడుకతోన్. నిత్యసేవకతన్ = ఎడతెగని సేవతోన్. క్రాలెడున్ = ఉండును.

71. బింబఫలోష్ఠికన్నులనుబేడిసమీలు = ప్రభావతి (దొండపండుంబోలిన పెదవిగలది.) యొక్క కన్నులను చేఁపలు. (బేడిస = నూఱుకోఱలు గల పెద్దచేఁప.) పర్వుచున్న శ్రుతినామ సరోయుగశోభలు = వ్యాపించుచున్న చెవులను పేరుగల కొలఁకులదీప్తులు. ఇట్టునట్టును = ఒకవైపునకొకటియు రెండవ వైపునకు రెండవదియు. తమిన్ = కోరికతోన్. పిరువీఁకుసేయఁగన్ = పట్టికొని లాగఁగా. ఎందుకుఁగాక = ఏవైపునకుఁజేరక. మధ్యన్ = రెంటినడుమను. పరువులువాఱెడిన్. చాపలము = నిలుకడలేమి.

72. ఆపాదమస్తకాంగములయందున్ = కాలుమొదలు తలవఱకుఁ గలయన్ని యవయవములందును. మించి = అతిశయించి. పటలీలన్ = వస్త్రముయొక్క సొగసువంటి సొగసుచేతను; వస్త్రమువలె నని యర్థము. తరళతో దంచితము =

చాంచల్యముతో నొప్పుచున్నది. అగు, యువతి లావణ్యమును = ప్రభావతియొక్క కాంతి విశేషమును. కన్నుఁగవయున్ = కన్నులజంటయును. అతనుదంటమీల టెక్కెయమనన్ = మన్మథుని యొక్క రెండు చేఁపలు గల కేతన (జెండా) మోయునట్లు. అమరున్. శరీరమందలి లావణ్యము కేతనవస్త్రమువలెను గన్నులు దానియందలి చేఁపలు వలెను నుండె నని యాశయము.

73. చకోరయుగ్మము = చకోరపుంబక్షుల జత. భక్తభావమునన్ = అన్న భావముచేతను. భక్తిగలుగుట చేత ననియు నర్థము. ద్విజరాజుపాదముల్ = చంద్ర కిరణములను. బ్రాహ్మణశ్రేష్ఠుల చరణముల నని రెండవ యర్థము. (ఈరెండువాక్యము లందు నర్థద్వయమునకు నభేదము.) తప్పక = విడువక. సేవచేయు సుకృతంబునన్ = సేవచేయుటవలనఁ గలిగిన పుణ్యముచేతను. ఈ యొప్పు = ఈ చక్కందనమును. కాంచె ననన్ = పొందెనో యనునట్లు. కన్నులొప్పున్. అవి = ఆ చకోరములు. క్రోలిన తేటవెన్నెలలు = త్రావిన నిర్మలమైన చంద్రకాంతులు. చిప్పిలినట్లు = పైకి వెడలినట్లు. సతిలేనగవున్, తెలినిగ్గుఁజూపులున్, మించున్ = ప్రకాశించును.

74. పికమో = కోయిలయో. శుకమో = చిలుకయో. సౌవర = (ప్రభావతి) కంఠధ్వనిసంబంధమైన. మాధురి = మాధుర్యమందలి. స్పృహాపసన్ = (తమకుఁ గలుగవలె ననెడి కోర్కెయొక్క బలముచేతను. తదీయ = ఆ ప్రభావతి సంబంధమైన. జిహ్వా = నాల్క. విలసత్ = ప్రకాశించుచున్న. సరస్వతిన్ = వాగ్దేవిని. ఉపాసనచేయుచున్ = ధ్యానించుచున్. అగ్రభూమిన్ = (ఆ దేవత) ముందటన్. ఇంపు = (ఆ సరస్వతికి) సంతసము. ఆవహిలంగన్ = కలుగుటకు. ఏర్చి = ప్రశస్తమైనదానిని విభజించి. ఉపహారముగాన్ = కానుకగాన్. ఇడినట్టి పల్లవంబో = సమర్పించిన చిగురో. విమలంపు బింబఫలమోయనన్ = స్వచ్ఛ మగు దొండపండో యనునట్లు. ఇంతికిన్, వాతెఱ = పెదవి. ఒప్పున్. ఎల్లవారును దాము భుజించు పదార్థము నుపాసించు దేవతకు నివేదించుట ప్రసిద్ధము.

75. మగువయధరంబు = ప్రభావతియొక్క క్రింది పెదవి. బంధుజీవకమును = మంకెనపువ్వును. కన్నసత్కీర్తిగతిన్ = సంపాదించిన మంచికీర్తివిధముచేతను (కీర్తి వలెను) నాసాగ్రమణిమరీచి = ముక్కుచివరనున్న ముత్యపుఁగాంతి. అడ్డబాసయందలి ముత్యముయొక్క కాంతి). వెలుంగున్ = ప్రకాశించును.

76. మృదులపవనాహతిన్ = మంద మైనగాలితాఁకుడుచేతను. తోఁచుమొల్లమొగ్గ చాలుగతిన్ = కాన్పించెడు సన్నజాజిమొగ్గల వరుసవలె. ఇంతిపల్వరుస, మోవి చాటునన్, పలుకఁబడిన్ = మాటల వెంబడిని. కన్పాభ్రాంతి పఱచున్ = కను మోసము చేయును.

77. కులుకుట = వెదచల్లుట. దంతావళిరుచి = దంతముల వరుసయొక్క కాంతి. అను శీకరపుం దెలినిగ్గునన్ = అనెడు తుంపరల యాకారమైన తెల్లని కాంతి చేతను.

78. బాహులతికలు = తీవలంబోలిన (యామె) బాహువులు. కనకకర్ణికా ఘారాళికాంతులు = బంగారు దుద్దులయొక్క యాటంకములేని కాంతులను. అదికి = అంటుకొని. ఇరుగడలన్ = (కంఠముయొక్క) రెండుప్రక్కలను. బిరుదు సంపెంగ దండలు = శౌర్యమునకుఁ జిన్నె లగు సంపెంగ పూలదండలను. వైచిన కర ణిన్. పరఁగన్ = ప్రకాశింపఁగా. కాంతగళము = ప్రభావతియొక్క కంఠము. కంబువిజయము = శంఖముయొక్క గెలుపును. పచరించున్ = ప్రకటించును.

79. గొజ్జఁగవిరిరేకుల బంతిగములు = గొజ్జంగపువ్వురేకులతోఁ గట్టిన బంతులు (వలెనున్న) (గొజ్జఁగపూవులు చంద్రకిరణప్రసారమున వికసించు నని చెప్పుదురు). వెలఁది కరంబుల్ = ప్రభావతియొక్క చేతులను. ఖరకరకరభిన్నములై = సూర్యునికాంతు లచే వికసింపఁజేయఁబడినవియై. వాఁడిచేతులు గలవాని చేతులతోఁ జీల్పఁబడినవియై యనియు నర్థము. (రెండర్థములకు నభేదాధ్యవసాయము). కరము = మిక్కిలి. ఎలమిన్ = వికాసమును. (సంతోషమును.) వహించు నరుణ కమలంబులతోన్ = పొందెడి యెఱ్ఱదామర పువ్వులతో. పురిడింపఁదగునె = పోల్పవచ్చునా? మిగుల మృదువులగు గొజ్జంగి పూలబంతులంబోలిన యామె చేతులను గఱకు చేతులతో భిన్న ములై సంతసించు నెఱ్ఱదామరలతో నెట్లు పోల్పవచ్చు నని భావము.

80. జిలుఁగు = సన్ననైన. కోకయుగళి = చక్రవాకములజోడు. పెనఁగు రీతిన్ = యుద్ధముచేయునట్లు. క్రేవలన్ = ప్రక్కలయందు. చలత్పక్షలీలన్ = కదలుచున్న ఱెక్కల విలాసముచేత. (ఱెక్కలువలెన్) మెఱుఁగు దొరఁగలు = కాంతి పరంపరలు.

81. పడఁతినూఁగారు, (చెన్నుమీరు నునుదాని కర్త). దారుతర నాభి యనెడు గంభీర సరసిలోన్ = మిగుల మనోహరమైన నాభి యనియెడి లోఁతుగల కొలఁకు నడుమను. కడఁగి = ప్రయత్నించి. క్రీడించు = విహరించెడు. మరుని మన్మథుని యొక్క. శృంగారరసపుఁ జిమ్మనపుఁగ్రోవి = (శృంగారరసము + చిమ్మనము + క్రోవి,) శృంగారరస మనెడు జలమును జిమ్మునట్టి గొట్టముయొక్క. ధారవాన్ = ధారయో యనునట్లు. చెన్నుమీఱున్ = అందముచే నతిశయించును.

82. అజ్జలజాననకౌను = ఆ యింతినడుము. తనుతరరోమవల్లరికిన్ = మిగుల సన్నపు నూగారునకున్. ఇరువంకలన్ = రెండుప్రక్కలందును. కల్దులేదునాన్ = ఉన్నదోలేదో యనునట్లు. అనయమున్ = మిక్కిలి. సూక్ష్మసూక్ష్మముగన్ = సన్న సన్నముగా. మించి = అతిశయించి. కడుసన్నపుఁగారు మెఱుంగు దీగె = మిగుల సన్నమగు వర్షాకాలపుఁ దీవమెఱపు. చక్కనినిడుబీఁటవాటి = మనోహరమైన పొడగగు పగులునొంది. కనఁగాఁబడునట్లు. అతి యత్నదృశ్యమై = మిక్కిలి ప్రయత్నముచేఁ జూడఁదగినదియై. (ఇది కౌనునకు విశేషణము)లోచనములకున్. సొంపొనర్చున్ = ఆనందమును గూర్చును.

83. చనుఁగవవ్రేఁగునన్ = చన్నుల జంటయొక్క బరువుచేత. గిటగిటమను నెన్నడుము = మిగుల సంచలించెడు (ప్రభావతియొక్క) నడుము. ఏమగునో యను, శంకన్ = సందేహముచేతను. జలజాసనుఁడు = బ్రహ్మ.(తామరపూవుగద్దియవాఁడు). కనకపుఁగట్టు = (కనకము + కట్టు) బంగారుకట్టును. ఇడినాఁడో = ఏర్పఱిచినాఁడో అనఁగన్ = అనునట్లు. వనితవళులు = ప్రభావతియొక్క కడుపుమీఁది ముడుతలు. ఇంపెసఁగున్.

84. అభ్రకుసుమసౌరభ సాధనార్థ హేతువు = ఆకసమునందలి తామరపూవుయొక్క పరిమళము సాధించు హేతువు. ఆశ్రయాసిద్ధము = ఆశ్రయముయొక్క యసిద్ధి గలది (పరిమళమున కాధారమైన పుష్పమే లేనిది.) అనియెడి యయ్యాలెల్లన్ = అని చెప్పెడి పెద్ద లందఱును. (తార్కికులు). నెన్నడిమి పేరిమింటన్ = నడు మనెడి యాకసమునందు. అన్నెలఁత బొడ్డుపొన్నవిరిన్ = ఆ ప్రభావతియొక్క నాభి యనెడు పొన్నపువ్వును. నిక్కముగన్ = నిజముగ. చూచి, చిన్నఁబోదురు = (ఆకసమునం బువ్వు లేదని వారు చెప్పినమాట ప్రత్యక్షవిరుద్ధ మగుటచే) విచారపడి

యెదరు. గగనారవిందం = ఆకసమునందలి తామరపూవు, ఇది పక్షము = సాధ్యమున కాశ్రయము. సురభి = పరిమళముగలది. (ఇది సాధ్యము). అరవిందత్వాత్ = తామరపూ వగుట వలన. (ఇది హేతువు = సాధనము) సరోజారవిందవత్ = కొలఁకులోని తామరపూవువలెనే. (ఇది యుదాహరణము.) ఈ ప్రయోగము నందలి హేతువు పరిమళన కాశ్రయ మని చెప్పెడి పక్షమగు నాకసపుందామర పువ్వు లేదు గావున సాధ్యమైన పరిమళమును సాధింప లేదని తార్కికులు చెప్పుదురు. విద్వాంసులగు నాతార్కికు లీమె నడుమను నాకసమునఁ బొడ్డను కొన్నపూవుం జూచి విచారపడియెద రని యాశయము. అమె నడుము మిగుల సూక్ష్మ మనియును బొడ్డు కొన్నపూవుంబోలు ననియు ఫలితము.

౮౫. సుకవులు = మంచికవులు. (ఇది విపరీతలక్షణచే మంచిజ్ఞానము లేని కవులను దెలుపును) క్రిందు = (అనఁటిచెట్టుయొక్క) అడుగుభాగమును. మీఁదు = పైభాగమును. అరసిచూడక = బాగుగఁ బరిశీలింపక. (యుక్తాయుక్తములు వివేకింపక యనియు నర్థము) అకటా = అయ్యో. ఈడని యాడుకొన్న హాటకకదళీవిలాసము = (ఊరులకున్) సమాన మని చెప్పిన బంగారపు టనఁటుల చక్కఁదనము. విపరీతముగాక = తలక్రిందుగాక. విరుద్ధముగాక యనియు నర్థము. సాటియే = సమానమా? అనఁటులు తలక్రిందైననే కాని యాఁదోఁక లగు నామె తొడలకు సమానములు గావని భావము. అనఁటులు సాటియను మాట విరుద్ధ మనియు భావము. కరిరాజహస్తముల్ = ఏనుఁగు తుండములు. ఎంత తలక్రిందైనను = ఎంత యధోముఖముగ వ్రేలాడినను. ఎంత శ్రమ పడిన ననియు నర్థము. అకలుష = నిర్మలమైన. రామణీయక = అందముచేతను. అంచిత = ఒప్పుచున్న. కోమల = మృదువులగు. తద్వ్యాధూరులక్ష్మికిన్ = ఆ కన్నెయూరుశోభకున్. సరిగావు = సమానములు గావు. ఆఁదోఁకలుగ నుండినను గజహస్తములు కఠినములును గలుషములును గాన సరిగా వని భావము.

86. రమణిజంఘలు = ప్రభావతిపిక్కలు. శాలిగర్భములు = వరిపొట్టలు. హీరదీప్తిజలపూర్తిన్ = వజ్రమణుల కాంతులను నీటినిండుచేన్. ఒప్పునందియలు = ప్రకాశించు కాలికడియములు. మళ్ళు = వరిచేలు. కచ్ఛపంబులబోలి = తాఁబేళ్ళనుబోలి.

87. సౌందర్యశ్రీలన్ = చక్కఁదన మనెడు సంపదలచేతను. కందళత్ = అంకురించుచున్న. ఉజ్జ్వల = ప్రకాశించుచున్న. నఖాంశు = గోళ్ళకాంతు లనెడు.

కైతవయుక్తిన్ = మిషకలిమిచేతను. మిషచేత ననియే యర్థము. నగున్ = పరిహసించును.

88. శృంగగ్రాహికన్ = శృంగగ్రాహికాన్యాయముచేతను. ఆవుల గుణములం దెలిసినవాఁడు వానిం దెలియఁగోరిన వారిని మందలోనికిం దీసికొనిపోయి వేఱువేఱుగా నొక్కొక్క యావు కొమ్ములం బట్టుకొని వానిని వర్ణించి చెప్పుట శృంగగ్రాహిక యనంబడును. చెప్పన్ = ఈ న్యాయముచే నామె యవయవముల చక్కందనముం దెలియఁజేయుటకు. వేఱుతెరువుల్ = వేఱు మార్గములు. సిద్ధింపమింజేసి = లభింపక పోవుటచేతను. (ఆమె యవయవములలో నొక్కొక్కదానిని వేఱువేఱుగా గ్రహించి యీ యవయవము చక్కందన మిట్టి దని స్పష్టముగఁ జెప్పుటకుఁ దగిన యుపాయము దొరకకపోవుటచేతను). చిత్రాంగశ్రీనిధిన్ = అబ్బురమైన శరీరశోభగల. అవ్వధూమణిన్ = ఆ స్త్రీశ్రేష్ఠమును. స్థూలారుంధతీ న్యాయమార్గాంగీకారమునన్ = స్థూలారుంధతీన్యాయమ్ము యొక్క త్రోవ నంగీకరించుటచేతను. ఆకాశమున నున్నదియు నగు నరుంధతీ నక్షత్రమును దెలియఁగోరినవానికి దానిం దెలిసినవాఁడు మొట్టమొదటనే తెలుపుట సాధ్యము కాకపోవుటచేత దానిదగ్గఱ నున్న పెద్ద నక్షత్రము నరుంధతి యని తెలియఁజెప్పి వాఁడు దానిని బాగుగ గుఱుతుపట్టిన తరువాత నరుంధతి దాని సమీపమున నున్నది కాని యది కాదని తెలియంజెప్పుట స్థూలారుంధతీన్యాయము. వచించితిని = ఈ న్యాయముచే నామె చక్కందనమంతయు నొకసారియే చెప్పుటకు సాధ్యము కామిచే సాధారణముగాఁ జెప్పితిని. చంద్రాద్యోపమల్ = చంద్రుఁడు మొదలగు నుపమానవస్తువులు. సూచనాభంగుల్ = (ఆమె యవయవముల చక్కందనమును) సూచించు రీతిగలవి. కాని, ఆ యంగముల్ = ఆ ప్రభావతి ముఖము మొదలగు నవయవములు. అదస్సహస్రగుణ సౌభాగ్యంబులు = ఈ చంద్రుఁడు మొదలగు నుపమాన వస్తువులకంటె వేయిరెట్లధికమైన చక్కఁదనము గలవి. (అగున్).

89. మనోజుఁడు = మన్మథుఁడు. వెన్నెలతేట నిగ్గు = వెన్నెలయొక్క నిర్మలమైన గొప్పకాంతిని. పదార్వన్నెయజాళువాపసిఁడిరంగు = మేలిమి బంగారముయొక్క కాంతి నని యర్థము. మెఱుంగులభాళధళ్యమున్ = మెఱుపుల సంబంధ మగు (కన్నులకు) మిఱుమిట్లు గొలుపు శక్తిని (గ్రహించి). కన్నియరూపుగాన్ = ప్రభావతి యాకార మేర్పడునట్లు. కరువుగట్టి = పోఁతపోయుటకై యచ్చుగట్టి. నెఱనేర్పుతోఁ = మిక్కిలి నేర్పుతోన్.

90. ఎమ్మెయిన్ = ఏ ప్రకారముచేతను. ప్రజ్ఞ = బుద్ధివిశేషము. మీఱన్ = అతిశయించునట్లు. వచియించెదనన్నన్ = చెప్పెద నని తలఁచినను. ఆకొమ్మచెడంగులోనన్ = ఆ కన్నియ చక్కందనములోన్. ఒకకోటితమాంశమునైనన్ = మిక్కిలి స్వల్పభాగము నైనను. వచింపలేన = చెప్పుటకే చాలను. (ఆకారణమున) మదుక్తిశక్తి = నా మాటలబలిమి. అంతమాత్రమ్మ = అంత పరిమాణముకలదియే. ఆమె యందములో నొక కొంతయైనను జెప్పఁజాల ననుటచే నాకు మాటలాడు శక్తి లేదని తలఁపఁగూడదని యర్థము. (ఏలయన) మా యమ్మ = నన్నుఁ బెంచినది యగు, సరస్వతీసతి, నన్నున్, తనంతటిదానిఁగన్ = తనతో సమానురా లగునట్లు. దిద్దుటన్ = శిక్షించుటచేతను (తనతో సమానురాల నగునట్లు నాకు విద్య నేర్పుటచేత నని యర్థము) నేను అతివాఙ్మహిమాఢ్యన్ = మాటలనాడు (విషయమైన) గొప్ప తనముతో నిండిన దానను.

91. హంసవంశావతంసుఁడు = హంసకుల శ్రేష్ఠుఁడు. అంబుజాసనరాణివాసంబునందున్ = బ్రహ్మదేవుని యంతిపురమునందున్. కరతలామలకంబులు = అఱచేతనున్నయుసిరి కాయవలె స్ఫుటముగాఁ బ్రకాశించునవి. అఱచేత నున్న నిర్మలజలము వలె స్పష్టముగఁ దెలియఁబడిన వని యేని యర్థము. మన్ముఖంబు = నా సంభాషణము. (ఇట ముఖశబ్దములక్షణచేఁ దద్వ్యాపారముం దెల్పును.) శబ్దసంస్కారపూతంబు = వ్యాకరణజ్ఞానముచేతను బవిత్రమైనది. నా నోరు శబ్దజ్ఞానముచేఁ బవిత్రమైన దనియేని యర్థము.

92. నలినజురాణివాసము = బ్రహ్మదేవుని భార్య, సరస్వతి. తనచేతిప్రోదిరాచిలుకను = తన చేత నున్న పెంపుడు చిలుకను. ననున్, వాదుకున్ = వాదమునకున్. నిజము తెలిసికొనుటకై యొక రొకరితోఁ జేయు సంభాషణము వాద మనియు, నొకరొకరి జయింపం గోరచేయు సంభాషణము జల్ప మనియుఁ బ్రాచీనులు చెప్పిరి. కాని యిట జల్ప మను నర్థమునందే వాద శబ్దము ప్రయోగింపఁబడియెను. తాన్ = ఆ సరస్వతి. నియమించి = ఆజ్ఞాపించి. అందున్ = మా యిద్దఱ కవిత్వములోన్. నా పలుకులన్ = నా కవిత్వమందున్. కొంతవాసి = కొంత యాధిక్యమును. కని = తెలిసికొని. నఖాంచలమునన్ = గోరికొనతోన్. నాదు ఱెక్కనులి = నా ఱెక్కలచిక్కును. చక్కఁగ దువ్వుచున్ = సరిచేయుచున్.

93. భువనైకమాత = లోకములకెల్లం దల్లియగు; అయ్యబల = ఆ సరస్వతి. ప్రబలములు = అధికమైనవి. కౌతుక = వేడుకచేతను. కృపారస = దయచేతను. వత్సలతా = స్నేహముచేతను. ఆదరంబులన్ = గౌరవముచేతను. చక్కని వస్తువులం జూడ వేగిరపాటు కౌతుకము. పరుల కుపకారము చేయంగోరుట దయ. పెద్దలకు బాలుర యెడలఁ గల ప్రేమము వత్సలత. వారి వారి విద్య మొదలగు వానికిం దగినట్లు గౌరవించు టాదరము. శబలితచిత్తయై = అనేకవిధములైన యంతఃకరణ వృత్తులు గలదియై. ఉపమాతిశయోక్తి కామధేనువు బిరుదము = ఉపమాలంకారము నతిశయోక్త్యలంకారమును గోరినట్లు చెప్పఁగలది యను నర్థమిచ్చు నీ బిరుదమును. (అసాధారణమైన సామర్థ్యముం దెలుపు గుఱుతు బిరుదు.) ఇచ్చి, తల్లిఖిత నూపురము = ఆ బిరుదాక్షరముల వ్రాఁత గల కాలియందెను. తాన = ఆ సరస్వతియే. మదంఘ్రిన్ = నా పాదము నందున్. తొడిగెన్.

94. నిజనూపురగతవర్ణనికాయము = తన కాలియందె యందలి యక్కరముల సముదాయమును. దనుజకన్యకోమరు = ప్రభావతియొక్క చక్కందనము. ఇట్టి నాదు పలుకులకున్ = సరస్వతిని గవిత్వమున మెప్పించి బిరుదమందిన నా మాటలకు సైతము. అగమ్యము = గోచరము కానిది. వర్ణింప సాధ్యము కాని దని యర్థము.

95. జగన్మోహనాంగిన్ = లోకమునం దెల్లవారిని మోహింపఁజేయు శరీరము గలదానిని (ప్రభావతిని).

96. ఏ యంగకమున్ = ఏ చిన్న యవయవమును. భావనచేయక = ఏకాగ్రమైన బుద్ధితోఁ దలఁపక. చేసినన్ = అట్లు తలఁచినన్. మది. ఆనందాయత్తతన్ = ఆనందమునకు లోఁబడుటచేత. చొక్కున్ = పరవశమగును. పరాయత్తపు బుద్ధిన్ = పరాధీనమైన మనసుతోన్. చెలువన్, వ్రాయన్. అలవియె = శక్యమా ?

98. చేకులు నేనిన్ = సంభవించినయెడల. తొలువేలుపు = బ్రహ్మ.

99. అజుఁడు = బ్రహ్మ. (పుట్టువులేని వాఁడు.) అయి = తెచ్చి. చిత్రమహిమచేన్ = అబ్బురమైన గొప్పతనముచేతను. అబ్బురమైన సామర్థ్యముచేత నని యర్థము.

100. అది = బ్రహ్మ చెప్పినమాట. మాటమాట వెంబడిన్ = ఒక మాట చెప్పిన తరువాత వచ్చిన ప్రసంగమునఁ జెప్పవలసిన మఱికొన్ని మాటలు చెప్పిన తరువాతను. సంస్మృతి పదవిన్ = జ్ఞప్తి మార్గమును. చెందెన్ = పొందెను. ప్రస్తావము ననుసరించి మాట్లాడుచుండఁగా జ్ఞప్తికివచ్చె నని భావము. ఎందేన్ = ఎప్పుడైనను. అనుభవ భవసంస్కారంబునకున్ = అనుభవముచేఁ బుట్టిన జ్ఞానమునకున్. (కన్ను ముక్కు మొదలగు నింద్రియములచే నేదేని యొక పదార్థ మనుభవించినపు డిది యిట్టిదను తెల్విపొడమి యాత్మయందు స్థిరమై ప్రస్తావము వచ్చినప్పుడు దానిని జ్ఞప్తికిఁ దెచ్చును. దీనినే సంస్కార మందురు.) ఉద్బోధము = వికాసము. (పైకుబుకుట). అగుఁ గదా = సంభవించును గదా ?

101. దనుజేంద్రాంగనకున్ = వజ్రనాభుని భార్యకున్. ఆలోక మోహన = నేఁజెప్పిన ప్రభావతి. (లోకమును మోహింపఁజేయునది.) అంబికావరమహత్త్వ స్ఫూర్తిన్ = పార్వతి (యిచ్చిన) వరముయొక్క గొప్ప తనముచేతను. తదంగాలౌకిక శ్రీ ప్రవర్తనము = ఆమె శరీరమునందలి నిరుపమానమైన చక్కఁదనము కలిమిని. సంస్మృతంబైన యంభోజాతజాతోక్తియున్ = జ్ఞప్తికివచ్చిన బ్రహ్మదేవుని మాటయును. (అంభోజాతము = పద్మము. జాతుఁడు = దానం బుట్టినవాఁడు.) రెంటికిన్ = రెంటిని. తార్కాణ మయ్యెన్ = నిరూపించిన దయ్యెను.

102. యదుకుల కలశజలధి పూర్ణశశాంకా = యదువంశ మను సముద్రమునకు నిండు చంద్రుఁడా! అర్థవంతము = అర్థము కలది. (అధికముగాఁ బ్రకాశించు కాంతి (ప్రభ) కలది యగుటచే నామె ప్రభావతి యను పేరుకల దయ్యె నని యర్థము.)

103. చిత్రఫలకాభిలిఖితున్ = చిత్తరువు (వ్రాయఁదగిన) పలకయందు వ్రాయఁబడిన వానిని. ఒక్క రమ్యపురుషున్ = ఒక చక్కని మగవానిని.

104. ఆ కన్న ప్రతిమ సుద్దులు = (మేము వజ్రనాభ పురమునందు) మునుపు చూచిన బొమ్మయొక్క వృత్తాంతములు. మునుపు = నిన్నుఁజూడక పూర్వము. కలిమిఁ జేసి = కలుగుటచేతన్. మహనీయ తదీయాకృతి పోలుపు = పూజ్య మగు నా పురుషుని యాకారముయొక్క పోలిక. భవదాకృతిన్ = నీ శరీరమునందున్. కని =

చూచి. అతఁ డితండ యనుకొంటిమి = ఆ పలకలో వ్రాయఁబడిన యతఁ డితఁడే యనుకొంటిమి.

105. తడయుట = జాగుచేయుట. పనుపన్ = పంపుటకు. ఉప్పర వీథికిన్ = ఆకసమునకున్. అరాళంబులు = వక్రమైనవి. (ఇది మయూఖవిశేషణము.) నిజ = తమ. (అంచల) గరుత్ = ఱెక్కలయందలి. కనకరేఖా = బంగారు గీఱలయొక్క. మయూఖంబులు = కాంతులు. ఆఖండలారి దిక్కునకున్ = వజ్రనాభుని పురము వైపునకున్. (ఆఖండలుఁడు = పర్వతముల ఱెక్కలఁ గొట్టినవాఁడు. ఇంద్రుఁడు. అరి = అతనికి శత్రువు.) అక్కజంపు ఱెలమిన్ = వింత వికాసముతోన్. కొనలువారి = ప్రసరించి యని యర్థము. ఉద్దీపించు = ప్రకాశించుచున్న. ప్రద్యుమ్న, ప్రతాపవైభవంబునుంబోలెన్ = తేజస్సంపత్తివలెన్. ఆలోకనీయంబులు = చూడందగినవి. (ఇదియు మయూఖ విశేషణము.) తత్పురస్సర = ఆ ప్రతాపము ముందుగల. తదీయ = ఆ ప్రద్యుమ్నుని సంబంధమైన. కీర్తిమూర్తి విశేషంబులోయనన్ = కీర్తిశరీరములో యనునట్లు (ఇది యంచల కుపమానము). సోయగంబునన్ = చక్కఁదనముతోన్. నిష్పంద ప్రసారితంబులు = కదలకుండం జాఁపఁబడినవి. తనూరుహంబులతోడన్ = ఱెక్కలతోన్. అవిరళధవళిమస్పర్ధన్ = అధికమగు తెల్లందనము (నఁగలిగిన) పోటిచేతను. ఉభయపార్శ్వ భాగపాండుర బలాహకంబులన్ = రెండుప్రక్కల నున్న తెల్లమేఘములను. అహంకృతి పెక్కువన్ = గర్వముయొక్క గొప్పతనముచేతను. (ఎక్కువగర్వము చేత నని యర్థము.) ఒక్కపెట్ట = ఒక్కమాఱు. పక్షయుగళవిక్షేప వ్యాపారంబుల చేతన్ = ఱెక్కలజంటయొక్క యాడించుట యను క్రియచేతను. ప్రడీన = వేగముగ నెగురుట. ఉడ్డీన = మీఁదికెగురుట. సండీన = ఒండొంటితోఁగలసి చెట్టుమొదలైన వానిమీఁది కెగురుట (యునను) యానభేదవినోదంబులు = వేఱు వేఱు నడకలయందలి వేడుకలను. రోదోంతరము = భూమికి నాకాశమునకు నడిమితావును. కలయన్ = అంతటను. మలయు = వ్యాపించెడు. తమ యమలంపుఁ దెలిదళుకున్ = తమ స్వచ్ఛమైన తెల్లకాంతిని. చిలికి = చల్లి. అది = ఆ కాంతి. మలయజంపుఁగల యంపిచెలువున్ = మంచిగందము (తోఁ గూర్చఁబడ్డు) నీటియందమును. అలవరింపన్ = వహింపఁగాన్. అందున్ = ఆ చోటను. కుందనంపురంగ వల్లికామతల్లికల యుల్లాసంబు = బంగారు (వికారమైనవియును, ప్రశస్తమైనవియునగు ప్రముగ్గులయొక్క యందమును. వెల్లిగొలుపు = ప్రవహింపఁజేసెడు. గరుదంత = ఱెక్కల కొనలయొక్క. కాంతివల్లరులచేతన్ = తీవల

వంటి కాంతులచేతను. అతిశయిల్లుచున్, దీనికి మరాళములు కర్త. ఒండొంటి సందునన్ = బారులుగట్టి పరుగెత్తు నంచలయొక్క నడిమిచోటను. సందర్శనీయంబులు = చూడందగినవి. అగు, నభో విభాగంబులవలనన్ = ఆకాశ ప్రదేశముల వలనన్. అస్థాన = వేఱుచోటను. (భూమియందు యమున గంగతోఁ బ్రయాగ యను పురసమీపమునఁ గలియును. వేఱుచోటన దానికంటె మఱియొకచోటున నని యర్థము.) భానుసంభవా = యమునా నదియొక్క. సంభేద = కూడుటచేతను. సంభృతా = సంపాదింపఁబడిన. శబలతా = చిత్రవర్ణముయొక్క. విలాస = సొగసుచేతను. భాసుర = ప్రకాశించుచున్న. గంగాప్రవాహ = మిన్నేటి వెల్లువయొక్క. సందేహ కందళనంబులకున్ = సంశయాంకురములకున్. (వెల్లువయను సంశయాంకురముల కని యర్థము) అనుగుణంబు = తగినది. అయిన, పరపునన్ = వెడల్పుచేతను. నిడుపాఁజులుగట్టి = పొడవుగం బారుతీరి. చదలన్ = ఆకసమునందున్.

106. జలఖేల దంగనాకలకలంబులకున్ = నీటియందుఁ గ్రీడించు నింతుల గొప్పధ్వనికిన్. ఇది వీరి దని తెలియకుండ గుంపునుండి వచ్చిన మ్రోఁతే కలకలము. ఓలలాటలతమిన్ = నీటి యాటలయందలి వేడుకచేతను. చెల్వాల ఢాకకున్ = స్త్రీలయొక్క ముట్టడికి. ఉలుకక = జడియక. లీలావతీ = సొగసుకత్తెలగు నింతులయొక్క. హస్త = చేతులయందలి. లీలాబ్జ = విలాసార్థమైన తామర పూవులయొక్క. కేసరంబులకున్ = దారములకున్. పసిగొంచున్ = వాసనపట్టి గ్రహించుచున్. పాటవమునన్ = నేర్పుతోన్. ఆరూఢిగాన్ = నిశ్చయముగాన్.

107. ప్రద్యుమ్నుండు, ప్రభావతీరుచిర రూపబ్రహ్మముఁ = ప్రభావతియొక్క మనోహరమైన యాకార మను బ్రహ్మమును. (సత్యజ్ఞానానంద స్వరూపమును నెల్ల జగములకు నాధారము నగు పదార్థము బ్రహ్మము.) హంసయోషిత్ = అంచబోటియొక్క. యాథార్థ్యధురీణ = సత్యత్వమును వహించిన. (నిజమైన) వాక్ = మాటయను. ఉపనిషత్సిద్ధాంత = వేదాంతనిశ్చయముయొక్క. మార్గానుసార = త్రోవ యనుసరించుటచేతను. ఉద్యత్ = పుట్టుచున్న. ప్రజ్ఞఁ = జ్ఞానముచేతను. మనన సంయుక్తంబు = (ఆ రూపబ్రహ్మమును) మననముతోఁ గూడినదానిని. (విన్న దానిని యుక్తులతో నాలోచించుట మననము.) కావించుచున్. అది = ఆ రూపబ్రహ్మము. హృద్యంబై = మనస్సునకుం బ్రియమైనదియై. అలరఁ = ప్రకాశిం

పడఁగాన్. కనుపడఁగా నని యర్థము. చిత్తమున్ = మనసును. కడున్ = మిక్కిలిగా. నిల్పెన్ = దానియం దుంచెను.

ఒకానొక బుద్ధిమంతుఁ డుపనిషద్వాక్యములచే బ్రహ్మస్వరూపమును విని దానం బుట్టిన తెల్విచే నది యిట్లుండు నని బాగుగ నాలోచించి మనసు దాన నిల్పునట్లు ప్రద్యుమ్నుఁడు హంసి చెప్పిన వాక్యములచేఁ బ్రభావతియొక్క చక్కఁదనమును విని యది యిట్లుండనోపు నని తన యుక్తులచే నిశ్చయించి మనసు దాన నిల్పె నని యాశయము.

108. హరిసుతుండు = ప్రద్యుమ్నుఁడు. శుచిముఖీవాక్యదర్పణ = శుచిముఖి యొక్క మాట లను నద్దమునందున్. స్ఫురిత = ప్రతిబింబించిన. నిరుపమాన = సాటిలేని. దనుజేంద్రకన్యకామణి = మణింబోలిన రాక్షసరాజపుత్త్రి (ప్రభావతి) యొక్క. మనోజ్ఞ = మనోహరమైన. రూపరేఖావిలాస సంరూఢము = చక్కఁదనమునందును, రేకలయందును, శృంగారచేష్టలయందును దగులుకొన్నది. అయిన, ఆత్మన్ = మనసును. మఱలింప నేరక = త్రిప్పికొన నేరక. అర్హవర్తనలు = తగినట్లుండుటలను. ఎత్తులిడక = (దగ్గఱనున్నవారు) ప్రోత్సాహపెట్టకుండ. మజ్జన ముఖ్యవిధులకున్ = స్నానము భోజనము మొదలగు పనులకు. చనఁడు. క్రియలు = పనులను. తబ్బిబ్బుగాన్ = తడఁబాటుగాన్. చలుపున్ = చేయును. ఒక పని చేయవలసినపుడు మఱియొక పనిని జేయు నని యర్థము. వీడ్పాటుగాన్ = వ్యత్యాసముగా. పనుచున్ = ఆజ్ఞాపించును. ఒకపని సేయవలసినవాని నింకొక పనికిని మఱియొక పని చేయవలసినవాని నింకొక పనికి నాజ్ఞాపించు నని యర్థము.

109. (ప్రద్యుమ్నుఁడు) పక్షివనితోక్తుల వెంబడిన్ = హంసియొక్క మాటల (విన్న) తరువాతను. మాటలననుసరించి యనియే యని యర్థము.) ఉద్యదపేక్షన్ = ఉదయించిన కోర్కెచేతను. కేశవక్త్రాద్యఖిలాంగలక్ష్మి = (ప్రభావతియొక్క) జడ, మోము, మొదలైన యన్ని యవయవముల చక్కఁదనమును. చంచరీక చంద్రాద్యుపమాన శోభకున్ = తుమ్మెదలు, చందురుఁడు మొదలగు నుపమాన వస్తువుల చక్కఁదనము కంటె. సహస్ర గుణంబుగన్ = వేయి రెట్లధిక మగునట్లు. మది కందిన యంతయున్ = మనసునకు లాంగిన దంతయును. నయించి = కూర్చి. ఆహృద్యతరాంగి మూర్తిసొబగు = మిగుల మనోహరమైన యవయవములు గల యా ప్రభావతియొక్క

శరీరసౌందర్యమును. ఆత్మలోన్ = మనసునందు. ఒకింతగన్ = కొంచెముగ. చూచున్.

110. అతండు. మదిగొనినంత మేరయును = మనసు తెలిసికొనిన దంతయును) (గ్రహించినంతవఱ కని యర్థము.) ఉపమానకోటి యొప్పిదము. (చంద్రుండు మొదలగు నుపమానవస్తువుల చక్కందనమును. పెక్కు మడుంగులుగాఁగన్ = పెక్కు రెట్లధికముగా. తలంచి = ఊహించి. తత్తదవయవత్వ సుస్థితికిన్ = (ప్రభావతియొక్క) యా యా (యుపమానములకుం దగిన) ముఖాదుల మంచియునికికి, తార్పఁగన్ = కూర్పఁగా. పోల్పఁగా నని యర్థము; అమ్మదిరాక్షిరూపమెయ్యది, యదియే = ఆమెనిజమైన యాకారమే, కనంబడియెన్. అచ్ఛప్రబుద్ధికిన్ = నిర్మలమైన మనస్సునకు. అగమ్యముల్ = తెలియరానివి. లేవు.

111. హత్తించున్ = కూర్పును. తదవలోకము = ఆమె దర్శనము కలఁకన్ = క్షోభచేతను. కొల్లవిడుచున్ = చూఱవిడుచును. రోయున్ = అసహ్యపడున్. కుందున్ = ఖేదపడును. పెన్వేతలన్ = అధిక బాధలయందున్. కినియున్ = కోపించును.

112. పటు = సమర్థమైన. ప్రతాప = ప్రభావముచేతను. (ధనమువలనను, సేనవలనను బుట్టు తేజము ప్రతాపము). నయ = నీతిచేతను. మైత్రి = స్నేహముచేతను. నిత్య = ఎల్లకాలము. నమ్రీభవత్సామంతుండు = విధేయు లగుచున్న చుట్టుపట్ల నున్న దేశాధిపతులు గలవాఁడు. రాజులఁ గొందఱ నీతిచేతను, గొందఱఁ బ్రభావముచేతను, మఱికొందఱ నెయ్యముచేతను వశపఱుచుకొన్న వాఁడని యర్థము. సుకీర్తి...సీమంతుండు = మంచి కీర్తి యను ముత్యాలదండచే నలంకరింపఁబడిన దిక్కులను నింతులపాపట గలవాఁడు. ఎల్లదిక్కుల వ్యాపించిన కీర్తిగలవాఁడని యర్థము. విపక్ష...హేమంతుండు = (తనకు) విరోధు లగు మంత్రుల ముఖపద్మముల కాంతిం బెఱికివేయు విషయమై హేమంతఋతు వైనవాఁడు. హేమంతమునఁ బద్మములు నశించుటయుఁ గొన్ని యున్నను గాంతిహీనము లగుటయు లోకవిదితము. నిజస్తవాను కలనాహ్రీమంతుఁడు = తనస్తుతి నొందుటచేతను లజ్జగలవాఁడు.

113. అఖిలకకుబ్బాంధవరమ్యకీర్తికుఁడు = ఎల్లదిక్కుల చుట్టఱికముచే మనోహరమైన కీర్తి గలవాఁడు. నలినీపత్ర = తామరపాకునందలి. అబ్బిందు సమ = నీటి

బిందువును బోలినవాఁడును. (ఎల్లవ్యవహారమ్ముం జేయుచున్నను దేనియందును సంగము లేనివాఁ డని యర్థము) ప్రకృతిఘ్నుష్ = అజ్ఞానమును బోఁగొట్టునట్టి. బోధమయ = జ్ఞానస్వరూపమైన. ఆత్మతత్త్వ కోవిదుఁడు = పరమాత్మ తత్త్వమునందుఁ బండితుఁడును.

114. కుముదబంధునిభుండు = చందురునితో సమానుఁడు. పింగళి...సభుండు = పింగళివంశమునకు మూలపురుషుఁ డయిన గోంకమంత్రియొక్క కీర్తి (ప్రకటించు) వృత్తాంతములచే సంతోషముతో గూడిన గొప్పసభ (యందలి జనులు) గల వాఁడును. వైదికశాస్త్ర...శుభుండు = వేదానుకూలము లగు శాస్త్రము లనెడు సముద్రముల యొక్క యెడతెగని త్రచ్చుటచేతను సంపాదింపఁబడిన మేలు గలవాఁడు. సంతత భక్తి...లోకవిభుండు = ఎడతెగని భక్తియొక్క కూడికచేఁ బూజింపంబడిన శివుఁడు గలవాఁడు. విత్తనిరంకుశ ప్రతిభుండు = పొందఁబడిన స్వతంత్ర ప్రజ్ఞ గల వాఁడును.

---

## తృతీయాశ్వాసము

---

1. శ్రీమత్ = శోభాయుక్తమైన. భక్తివిశేషస్థేమ = భక్త్యతిశయముయొక్క స్థైర్యముచేతను. స్థిరమైన భక్తివిశేషముచేత నని యర్థము. అవిశ్రాంత = ఎడతెగకుండునట్లు. విహిత = చేయఁబడిన. శివతత్త్వకథామీమాంసుఁడు = శివస్వరూపమును దెలుపు కథలయొక్క విచారము గలవాఁడని యర్థము. దీప్తికా = కాంతి యందుకా. అపరహంసుఁడు = రెండవ సూర్యుఁడు.

2. ఏకాంతవర్తి = ఒంటిపాటున నున్నవాఁడు. హస్తవిన్యస్తగండస్థలుండు = చేతియం దుంచఁబడిన చెక్కిలి గల వాఁడు. చెంపం జేయిచేర్చి యెద్దియో విచారించు చున్నవాఁడని యర్థము.

౩. చొరఁగల్మియ = ప్రవేశించుటయే. దొడ్డఁట = గొప్పకార్య మని చెప్పదురు. చూడఁగాఁ = చూచుట. కల్గినఁ = సంభవించినఁ. నా తలఁపుబడిఁ = నా కోర్కె ననుసరించి యని యర్థము. తదాత్మయుఁ = ఆమె మనసు సహితము. తార్కొనక = సంబంధింపక. అది = ఆమె కౌఁగిలి.

4. అరసిచూడఁగఁ = పరిశీలింపఁగా. ఆసపాటొనర్చుచుఁ = కోర్కె పుట్టించుచు. త్రిప్పుచున్నది = ఆకర్షించుచున్నది. రహిఁ = ఆనందముతో. ఆసక్తితో ననియేని యర్థము. తద్వచనము చొప్పుఁ = ఆ మాటల జాడయును. ఏమి నియతంబు = ఏమి స్థిరమైనది? (కా దని యర్థము.) సమాకృతులు = తుల్యమైన రూపములు.

5. పదిలంబుగాఁ = గట్టిగా. వట్టి దొరతనంపు నీటు = వ్యర్థమైన దొరతనము (వలని) గర్వమును. పాపపులజ్జ = చెడుసిగ్గు. నోరదిమెఁ = నోరు నొక్కెను. (సిగ్గుచే నా కోరికం జెప్పనైతి నని యాశయము.) అది = సిగ్గున నా కోర్కెం జెప్పకుండుట. అనాదరంబు తెఱఁగై = ఆదరము లేకుండుటయొక్క రీతియై. (ప్రేమలేని య ట్లని యర్థము.) తోఁచెనేమొ = కాన్పించెనేమొ? గఱువల్ = పూజ్యులు. విద్వాంసు లని యర్థము. చవిగాని కథల్ = రుచింపని వృత్తాంతములను.

6. మనసిచ్చిన మాటలు = మనసునం గల కోర్కెం దెలుపు మాటలను. పల్కకుండఁగాఁగాని = పల్కక పోవుటచేతఁగాని. (పల్కితినేని) మరాళి = హంసి. అద్దనుజ కన్యకకై = ప్రభావతి (పని) కొఱకు. ఒత్తిచూచి = బలవంతపెట్టి. కాదేని = అట్లు మాటాడుట కా యంచ పూనుకొనకుండిన. ప్రసంగముఁ = ప్రస్తావమును. తిగిచి = (తానే) తెచ్చి. తదీయరూపముఁ = ఆమె చక్కఁదనమును. ఏల నుతించుఁ = ఎందునకు స్తుతించును?

7. అటుగాక = హంసి యామె పనికై నన్ను బలవంతపెట్టి మాట్లాడఁ దలఁపకుండినను. పటు వాచారసికుల్ = పొంకపు మాటలాడుటయందుఁ బ్రేమగలవారు. ప్రసంగమైనఁ = ప్రస్తావము రాఁగాఁ. అద్భుత రామణీయక గుణాఢ్యంబైన సద్వస్తువుఁ = అబ్బురమైన చక్కఁదనముతోడను నట్టి యితర గుణములతోడను నిండిన

మంచి పదార్థమును. (చక్కఁదనమును గుణమె కాని వేఱుగా గ్రహించుట యదిగల చోటఁ దక్కిన మంచి గుణము లన్నియు నుండు నని సాముద్రికులు చెప్పుటచే గుణములలో నదిముఖ్య మని తెలుపుటకు.) పారంబు ముట్టన్ = కడవఁబడునని యర్థము. రసోత్కటతన్ = ప్రేమాతిశయము చేతను. చెప్పక మానఁజాలరు. అను పక్షంబు, ఒండు, భావించినన్ = చెప్పక విడువఁజాల రను రెండవ పక్షము నవలంబించి యాలోచింపఁగాన్. వనితాంగ వర్ణనమున్ = (హంసి) ప్రభావతి చక్కఁదనముం జెప్పుటకు. అన్యథా సిద్ధియున్ = వేఱు విధమునం బ్రాప్తియును. నిక్కంబు = నిశ్చయముగ. ఘటిల్లున్ = సమకూడును.

8. మదుదగ్రమనస్స్థితిన్ = నాయొక్క పొడవైన (అధికమైన) మనసు నిలుకడను. కాంచుటెన్నన్ = తెలిసికొనుట నాలోచింపఁగాన్. సురరిపుఁ జంపన్ = వజ్రనాభుని జంపుటకు. అనుపు సుద్దులు = పంపెడుమాటలు. పుట్టఁగఁ బోలున్ = జరిగియుండును.

9. అన్నియున్ = హంసి తానే ప్రస్తావన దెచ్చి యామె చక్కఁదనము నాకుఁ దెలుపుట మొదలగువానిని. ఏక వాక్యముగన్ = ఒక (యభిప్రాయమునే తెలుపు) వాక్యమగునట్లు. అరయన్ = ఆలోచింపఁగాన్. అసలు పెంచుపక్షమే = (నా) కోర్కుల నభివృద్ధి సేయుపక్షమే. కొంతమించి, ఉన్నది.

10. శివ = పార్వతి. లేఖననిమిత్తము = వ్రాసియిచ్చుటకుం గారణము. వేఱ = నన్నామెకు మగనిం జేయు నిచ్చగాక), మఱియొకటి. తదభీష్టయువపరీక్షామాత్రఫలకము = ఆప్రభావతికిష్టుఁడగు తరుణుని, (యొక్క) పరిశీలించుటయే ప్రయోజనముగాఁ గలది. ఇదిలేఖన నిమిత్తమను దాని విశేషణము. (ఆమెచేతం గోరఁబడిన ప్రాయంపు వానిం దెలిసికొనుటయే కర్జముగలదియై యని యర్థము.) చెల్వన్ = ప్రభావతిని. వెడ్డుపెట్టునోకో = మోసపుచ్చునేమో? ఇదియ = ప్రభావతి పార్వతి యొక్క వరమువలనఁ బుట్టినదనుటయే. త్రోపువడునోకో = నిరాకరింపబడునేమో? అసత్యమగునేమో యని యర్థము.

11. నలుమోములవేలుపు = చతుర్ముఖుఁడు. బ్రహ్మదేవుఁడు. అట్టి ప్రసంగపు వేళన్ = ఆ ప్రభావతిమాటలు తెచ్చినపుడు. అవ్వరాననకున్ = శ్రేష్ఠమైన మోము గల దానికిన్. ఆ ప్రభావతికిన్.

12. వావిరిఁ = అధికముగాఁ. అవ్విలాసవతివార్తలపట్టునఁ = ఆ ప్రభావతి (శృంగారచేష్టలుగల యింతి) యొక్క వృత్తాంతముల విషయమున. ప్రశ్నావసరంబులు = అడుగఁదగిన సమయములు. ఎన్నియెన్నియైనఁ = ఎన్నిదొరకినను. ఒకయర్థము నేని = (ఆమెనుగూర్చిన) యొక యంశమును సయితము. అడుగంగలేమిఁ = అడుగకపోవుటచేతను. ముద్దియసన్నిధిఁ = ప్రభావతిదగ్గఱఁ. ప్రసంగము వచ్చినఁ = (నా) ప్రస్తావము వచ్చినఁ. వరటాలలామ = హంసశ్రేష్ఠము. ఇచ్చావిముఖుండు = కోర్కెలేని వాఁ డని యర్థము.

13. సరోజముఖిపొంతకుఁ = ప్రభావతియొద్దకుఁ. తదిష్టవచనంబు = ఆ కన్నెకుం బ్రియమైన మాటను. కొనిపోవఁ = తీసుకొనిపోవుటకు. కానమిఁ = దొరకకపోవుటచేతను. నిష్ఫలంబు = ప్రయోజనములేనిది. తద్వశమైనది = ఆ హంసికి లోఁబడినది. (అది చేయవలసిన పని యర్థము.) దైవతకార్యభారము = దేవతల సంబంధమైన కార్యాతిశయము, (గొప్పపని).

14. ఏగతిఁ = ఏపనిచేతనైనను. ఆస = (నేఁదలఁచినకార్యము సిద్ధించుననను) నపేక్ష. అది = ఆ శుచిముఖి. మహామతి = గొప్పతెల్విగలది, (రాఁబోవు దానిం తెలిసికొను తెల్వి మతి యనంబడు). నా యాంతరగతిఁ = నా యభిప్రాయము నని యర్థము. కనదే = తెలియదా ? అప్రతిషిద్ధమనుమతంభవతియనఁ = నిరాకరింపఁబడనిది యంగీకరింపఁ బడినదియని (జనులు) చెప్పుటను. వినదే = వినియుండదా ?

హంసి నాయొద్దఁ బ్రభావతి ప్రస్తావము తానే తెచ్చి యామె చక్కఁదనము వర్ణించి యా కన్నెకుం బార్వతి ఫలకమున సర్వాంగసుందరుఁ డగు నొక పురుషుని వ్రాసి యిచ్చెననియు నా పురుషుపోల్కె నీయందుఁ బూర్ణముగఁ గల దనియు నన్నామె వలచినట్లు సూచించు మాటలు పల్కినపుడు నే నివారింపకుండుటచే నా కది సమ్మత మని తెలిసియే యుండు నని యాశయము.

15. ఓపెడుఁ = చాలును. చూపఱకుఁ = చూచువారికిఁ.

16. అని = ఇట్లు. భావనాబలంబునన్ = తలఁపుయొక్క యతిశయముచేతను నిరంతరము తలంచుకొనుటచేత నని యరము.) ఘటితము = కూర్పఁబడినది.

అగు, మగువమధురాకృతి = ప్రభావతి మనోహరాకారమును. అప్పుసన్ = ఆలోమ్మునందున్. చేర్పన్ = కూర్చుటకున్. కడఁగి = యత్నించి. (కౌఁగిలింప యత్నించి యని యర్థము.) తత్తరమునన్ = సంభ్రమముతో. వెగడుపడుచున్ = తొట్రుపడుచు. పొదలు విరాళిన్ = అతిశయించు వలపుచేతను.

17. ప్రొద్దుగడపుట = కాలక్షేపముసేయుట. తద్దయున్ = మిక్కిలి. భరంబు = బరువైనది.

18. నిబిడంపు జిగితోడన్ = దట్టమైన కాంతితోన్. బిగువు పొలిండ్లయొప్పిదము = ఉన్నతములగు కుచముల చక్కందమును. నెరపన్ = ప్రకటింపఁగా నని యర్థము. నునుఁగెంపు = నున్నని యెఱుపును. నూతన పల్లవంబులు = క్రొత్త చివుళ్ళు. ఎలమిన్ = వికాసమును. పర్వెడునట్టి = పొంచెడునట్టి. ఎలదీగియలసొంపు = లేఁత తీగలయొక్క చక్కందనము. పేరెములువాఱు గండుఁ దుమ్మెద చాలు = (ఇటునటుం) బారెడు పొగరెక్కిన తుమ్మెదలవరుస. బెడఁగు = అందమును. విరులతెలిడాలు = పూవుల తెల్లనికాంతి. మధురసపు నిగ్గు = పూఁదేనెయొక్క గొప్పకాంతి. ఉద్యానభాగము = పూఁదోఁట యుండుచోటు. ప్రభావతీమయంబు = ప్రభావతియొక్క వికారము. తోఁచెన్ = కాన్పించెను.

19. యువతిపైవిరాళి = ప్రభావతియందలి వలపును. ఆసన్ = కోర్కెచేతను. తదితరము = ఆమెకంటెం దక్కిన దానిని.

20. ప్రభావతీ విభ్రమభ్రమవశంబునన్ = ప్రభావతియొక్క విలాసమనెడు భ్రాంతికి లోఁబడుటచేతను. ఆమె శరీర మను భ్రమచేత ననియే యర్థము.

21. కెంగేలంచున్ = ఎఱ్ఱనిచేయి యని భ్రమించుచున్. చెల్లఁబో = అయ్యో! ఇది సంతాపార్థకమైన యవ్యయము. పయ్యెద = పైఁట. (పయి + ఎద = ఎదపై నుండు వస్త్ర మని యర్థము.) పరాగోదయము = (వస్త్రాకారముగా నెగురు) పుప్పొడి తెర. రహిదొఱంగి = సంతసమును విడిచి. ఖేదపడి యని యర్థము. వేనలి = జడను. ఒడిసి = పట్టుకొని అనిమిత్తకృపన్ = కారణము లేని దయచేతను. హితవు = కాలాంతరమున మేలుగలిగించు పనిని. నెరపెడి = తెలిపెడి. పొందు = సంయోగము, స్నేహము.

23. చూడనబ్బునేని = చూచుటకు దొరికినన్. కాన్పించినయెడ నని యర్థము. నాదు కన్నులు కన్నులు = నా నేత్రములు సఫలమైన వని యర్థము. అగ్రగణ్యుండవ్ = మొదటలెక్కింపఁ దగినవాఁడ.

24. సురారివార్త = రక్కసుని (వజ్రనాభుని) వృత్తాంతమును. కడలఁ బోక = దూరముగఁబోక యని యర్థము.

25. వినుకలిచేతన్ = (ప్రభావతియొక్క చక్కందనమును) వినుటచేతనే. విరహవేదన = ఎడఁబాటువలని బాధ. కనుకలిన్ = చూపుతోన్. ఎంత, పరిపూర్తి వహించెనో = నిండుఁదనము నొందెనో. (అధికమయ్యెనో యని యర్థము) దీనికి విరహవేదన కర్త.

26. అంతమీఁదన్ = ఎక్కువ వేదన నొందిన తరువాతను. మద్విధంబున్ = నా ప్రకారమును. (నేను బ్రత్యుత్తర మీయకపోవుట యని యర్థము) ఆసలేమి = కోరికవ్యర్థ మగుటను. ఎట్లొనో = ఏమి చేయఁ దెగించునో యని యర్థము.

27. దేవతాపతి యానచొప్పు = ఇంద్రుని సెలవు ప్రకారము. మదీయ హృద్గతిన్ = నా యభిప్రాయమును. సతికిన్ = ప్రభావతికిన్. అంత = నా కామె యందు గల వలపును నే నొందు వెతను) సర్వమును తెల్పెడునట్లుగన్.

28. నివ్వటిల్లెడు చింతన్ = పుట్టు విచారముచేతను. అంతరంగంబు = మనస్సు. దుర్గమంబు = వారింపరానిది. అయిన, విరహార్తికతనన్ = ఎడఁబాటు వలని దుఃఖ మను కారణముచేతను. వార్తాహరణ యోగ్యాయోగ్య వివేకంబు = జాబుం దీసికొనిపోఁదగినవారిని తగనివారని నేఱుచేయు (తెలిసికొను) తెల్వి.

29. అమలపక్షతన్ = తెల్లని ఱెక్కలకలిమితోన్. దోషములేని వారి యందలి ప్రేమతో ననియు నర్థము.

30. అభ్రమార్గమున్ = ఆకసము త్రోవను. దీనాలాపములు = గర్వము లేని మాటలను. కారుణ్యమునన్ = దయతోన్.

31. ముగియఁగాన్ = సమాప్త మగునటు.

32. అరసి = వెదకి. మత్ప్రార్థనమునన్ = నాకోరికచేతను. లేశమాత్రంబును = కొంచెమైనను. పక్షంబుల నడుమన్ = ఱెక్కలనడుమను. అతిరయంబుతోడన్ = మిగుల వేగముతోన్. దండకున్ = దగ్గఱకున్. తడయక = జాగుచేయక.

33. తన బలగము = తన పరివారము. తన తోడి యంచలని యర్థము. దానవాంతఃపురకామినీ, సమీప, సంచార, పరిచయంబు = రక్కసుని (వజ్రనాభుని) యంతిపురమునందలి, యింతుల, దగ్గఱ, దిరుగుటకుఁ దగిన, నెయ్యమును. అమంద = అధికమగు. కందర్పతాప = మన్మథబాధయొక్క. శమనార్థంబుగన్ = నివారించుకొనుటకై.

34. మందస్మిత ద్యుతిప్రసాదంబునన్ = చిఱునగవు కాంతి యనుగ్రహము చేతను. చిఱునగవుయొక్క తెల్లనికాంతి వానిపైఁ బ్రసరించుటచేత నని యర్థము. విరులపాండిమ = పువ్వులయొక్క తెల్లందనము. కటాక్ష శ్రీలసాహాయ్యకమునన్ = కెరఁగంటి చూపులశోభయొక్క తోడ్పాటుచేతను. తుమ్మెదపిండుచెలువము = తుమ్మెదల సముదాయముయొక్క చక్కందనము. (కాంతియని యర్థము.) అభ్యుదయమొందెన్ = మేలొందెను. (అతిశయించె నని యర్థము.) కరతలచ్ఛవి = అఱచేతుల చాయ. పుష్టిని వహించెన్ = బలుపునొందెను. నిశ్వాస గంధముప్రోదిన్ = నిట్టూర్పు సువాసనల సంరక్షణముచేతను. సహాయముచేత నని యర్థము. నెత్తావివైభవము = పరిమళసంపద. అవి = పువ్వులు మొదలగునవి. తోడ్తోన = వెంటనే. ఆర్తిన్ = (విరహమువలని) దుఃఖమును. పెనిచెన్ = వృద్ధిచేసెను. రజః = రజోగుణమునకును. (పుప్పొడికి నని రెండవ యర్థము. తక్కినచోట్లను నిట్టె) మాలిన్య = పాపమునకున్. (నల్లందనమునకు) పల్లవత్వ = విటకాని తనమునకు. (చిగురాకుం దనమునకు.) చాపలంబునకున్ = తుందుడుకుఁ దనమునకు. (ఎవ్వడుం గదలియాడుటకును) (ఇటు రెం డర్థములకు నభేద నిశ్చయము.) ఆధారమై పరఁగెడు వారికిని = వాసస్థానమైన వారికిని. మేలొనర్చినవారికిని = ఉపకారము చేసినవారికిని. ఎగ్గు = కీడు. పాటిలదె = సంభవింపదా?

35. విరహిరక్తము = ఒండొరుల నెడఁబాసి నాయికా నాయకుల నెత్తురు. పాంథ = మార్గస్థుల (భార్యల నెడఁబాసినవారల) యొక్క, మేదస్స్నేహ = మెదటి యందలి చమురుతో. భరిత = నింపఁబడిన. కామాస్త్రాళిసాన్ = మన్మథుని బాణ

సమూహమో యనునట్లు. సరస ప్రసూనములు = పూఁదేనెతోఁ గూడిన పుష్పములు. ధ్వజము మిడిమింటన్ = మన్మథునియొక్క యంపలువేయు ధనువుమండి. పాలునీలపు గుంపుభంగిన్ = వ్యాపించెడు (ఎగిరెడు) నీలపు గుంపువలెన్. పుష్పంధయములు = తుమ్మెదలు, చేతోజ = మన్మథునియొక్క. జల = నేసలచేతను. సముద్ధూత = ఎగురఁగొట్టఁబడిన. ధూళియవంగన్ = నేలమిన్నుమ్మవలెన్. రాజిల్లు సుమనః పరాగములు = ప్రకాశించు పుష్పొడులును. అసమసాయక = మన్మథుని (బేసిబాణములు గలవాని) యొక్క. జయబిరుదావళీ = గెలుపు (ండెలుపు) బిరుదుపాటలయొక్క. నిపాత = చప్పుటయందు. వరవంశజుః = శ్రేష్ఠులగు స్తోత్రముచేయు వారియొక్క. ఘనాస్ఫోటియంగన్ = గొప్ప ధ్వనియో యనునట్లు. గుండెదిగులు = గుండె యదరుట. (భయము నని యర్థము.)

36. వంవస్యమాన కంతు సంతాప = మిగుల నధికమగుచున్న మన్మథునియొక్క వేఁడి గలది.

37. వనాంతఖేలనము = పూఁదోఁటలోఁ గ్రీడించుట. భావ్యర్థము = కాఁగల కార్యమును.

38. ఆత్మసంకల్ప వాసనావిశేషవశంబునన్ = తన తలఁపుల స్మృతికి లోఁబడుటచేతను, తానంతకుఁ బూర్వము తలఁచిన కోర్కులన్నియు జ్ఞప్తికి వచ్చుటచేత నని యర్థము. అనేక విధశృంగార భావచేష్టావిశిష్టతన్ = పెక్కు తెఱఁగులను రత్యాదులతోడను, హావాదులతోడను గూడుటతోన్. సంభోగ విషయకమైన యిచ్ఛావిశేషము రతియనియుఁ, గనుబొమలు మొదలగు వానిమార్పుచేత గొంచెము తెలియందగిన మనోవికారము హావ మనియుఁ జెప్పంబడు. యదుకులప్రదీపున్ = యదువంశమును ప్రకాశింపంజేయు ప్రద్యుమ్నుని. క్రేడించియున్ = ఒక ప్రక్కకుఁ దొలఁగియు. నిర్నిమేషయయ్యున్ = ఱెప్పపాటు లేనిదయ్యును. నిమీలితాక్షియయ్యున్ = మూయంబడిన కన్నులు గలయ దియ్యును. అనేక భావంబులు = రత్యాదిభావంబులు పెక్కులు. ఆవహిల్లన్ = కలుగునట్లుగాన్.

39. అనయమున్ = మిక్కిలి. అజస్రమున్ = ఎడతెగకుండన్. గాటముగాన్ = అధికముగాన్. ఒక వింత వింత యింపు = మున్నెన్నఁడు లేని యానంద

మును. నెరపుచున్ = నిండించుచున్. తరలిపోవఁగనీదు = కదలిపోనీదు. రసోద్ధతిన్ = ప్రేమాతిశయము చేతను. నిజేశురూపమున్ = తన ప్రియుని చిత్తరువును. అక్కునఁజేర్చెన్ = వక్షమునం గూర్చెను. (కౌఁగిలించెను).

40. నిశ్చేష్ట = కదలలేనిది. చొక్కి = పరవశురాలయి. (ఒడ లెఱుంగ నిదియై). చిత్రరూపము = పటమునందు వ్రాయఁబడిన ప్రద్యుమ్నునాకారము. తోఁపన్ = కాన్పింపగాన్, కాంక్షలు = కోర్కెలు. అదరన్ = అతిశయింపఁగాన్.

41. మనోహరాంగుఁడు = చక్కని శరీరము గలవాఁడు. కొంచినన్ = (నేను సిగ్గుచే) సంకోచించినను. అత్తఱిన్ = ఆ కాలమునందున్. రసభావములు = శృంగారరసమును, జేష్టలును.

42. ఉవ్విళ్లూరుచున్ = వేగిరపడుచున్. కాంతాళంబునన్ = అధైర్యము చేతను.

43. కర్తృ = పూజచేయు నాయొక్క యేని. కర్మ = (నేఁ) జేయు పూజ యొక్క యేని. సాధన = పూజ కుపకరణములగు పూవులు మొదలగు వాని యొక్క యేని. వైగుణ్యము = విరుద్ధగుణముల కలిమి, (ఉండవలసిన మంచిగుణములు లేక చెడుగుణము లుండుట లోప మని యర్థము). అమిత వ్యథన్ = హద్దులేని దుఃఖమును.

44. చెలువుఁడు = చక్కని వాఁడు. సుబ్బదె = ప్రకాశింపదా? ఏఁచుట = బాధించుట.

45. అనురూపగతిన్ = తగిన రీతితోన్. ఇత్తన్విచిత్తంబు = ఈమె మనసును. పడసి = తెలిసికొని. చెలిమికలిమి = స్నేహ మను సంపదను. హత్తించుకొనుటకున్ = సంపాదించు కొనుటకున్. అనుగుణంబగువేళ = తగిన కాలము. వితర్కించి = ఊహించి. యదృచ్ఛన పోలెన్ = తలవని తలఁపు చేతనువలెన్. సవిమర్శదృష్టిని = చక్కఁగ విచారించెడు చూపుతోన్. సరిగడచుదాఁకన్ = అంతయు నతిక్రమించువఱకు.

46. ఉపలక్షించుచున్ = చూచుచున్. కపోలయుగ్మము = చెక్కుఁదోయి. దరహాసపుఁగాంతిన్ = చిఱునగవు కాంతిచేన్. చపలేక్షణ = నిలుకడలేని చూపులు గలది. (ప్రభావతి).

47. ఇది = ఈ హంసి. కలుదులపులుగు = నేర్పుగల పిట్ట. పరపెడున్ = ప్రసరింపఁజేయును. మెఱుఁగుంబోడికిన్ = ప్రభావతికిన్. (మెఱుఁగు + మేను = మెఱుఁగుబోఁడి = మెఱుపుం బోలిన దేహము కలది).

48. అబ్రపడి = ఆశ్చర్యమునొంది. అతనికై వడి = అతనిపోల్కి. పరిశీలించి = పరిశీలించి. అద్భుతప్రమోద సందేహంబులు = అచ్చెరువును, సంతోషమును, సందియమును, (తిర్యగ్జంతువు వివ నింపగు పల్కులు పల్కుటచే నాశ్చర్యమును, తా నిదివఱకుఁ జిత్తరువునం గల యందగాఁడు లోకమునం గలఁడో లేఁడో యను కొనుచుండఁగాఁ గలఁడని చెప్పుటచే సంతసమును, నిక్కము చెప్పెనో లేదో యను సందియమును). క్రందుకొనుచున్ = మిక్కిలి యగుచున్. కందళింపన్ = అంకురింపఁగాన్.

49. ఇట్లయో = నీవు చూచిన పురుషు నాకార మీలాగునవే యుండెనో. విభేదము = విశేషము. భయంబు = (దగ్గఱకు వచ్చిన బాధింతు మను) వెఱపు. మా భావము = మా తలఁపును. (మేము బాధించు తలఁపుఁ గలవారమో కామో).

51. భయావహులన్ = వెఱపు గలిగించు వారిని. కానివారిన్ = వెఱపు గలిగింపని వారిని. ఆకృతిన = ఆకారముచేతనే. కనంగాన్ = తెలిసికొనుటకున్. వలఁతిన్ = సమర్థురాలను. ఏకతమాడన్ = ఆలోచించుకొనుచుండఁగాన్. (ఇతరులు వినకుండ మాట్లాడు కొనుచుండఁగా నని యర్థము).

52. వెఱఁగంది = ఆశ్చర్యపడి. అలవరించు కలుకు బెలుంగు = కలిగించెడు చక్కని కంఠధ్వనిని. కలకలికి పలుకులకె = కలిగిన మనోహరము లగు మాటలకే. వలచి = ప్రేమించి. మొలచుకుతుకంబునన్ = అంకురించిన వేడుకతోన్. అతివశంవద హృదయులై = (దానికి) మిగుల లోఁబడిన మనసు గలవారై. సుద్దులు = మాటలు. ఉద్దీపిత రాగంబులు = ఎక్కువ చేయఁబడిన ప్రేమగలవి. గఱువతనంబులాగులు =

పెద్దఱికపు విధములు. ఏ గరితలందును = ఏ స్త్రీలయందును. చీని కఱుదులు = దీని జాణతనములు; (నేర్పులు). ఎంతయరుదులు = ఎంత వింత పుట్టించునవి. ఆదరాహ్లాద మేదుర నిరీక్షణంబులన్ = గౌరవముచేతను, సంతసముచేతను జిక్కనైన చూపులతోన్. నీ భాషణంబు = (ఇద్దఱు మాట్లాడునపుడు మఱియొకఁడు పిలువకుండఁ బోఁగూడదను) మాట. ప్రోడలగు గఱువలు = నిపుణులగు విద్వాంసులు. నివర్తించుకొనన్ = పోఁగొట్టుకొనుటకు. నిశ్చలంబుగాన్ = (మనసు) కదలకుండునట్లుగాన్. పన్నిదంబు చఱచిన వారము = పందెము వేసినవారము.

53. అనుటయున్ = ఇట్లు రాగవల్లరి పలికినతోడనే. వేఱొక పనికైనన్ = ఇంకొక కార్యమునకైనను. (ఈ కన్నియ యాతని వలచి తెలిసికొనఁగోరి యడిగిన దని యర్థము).

54. ఈక్షితాన్యోన్యవదనలు = చూడఁబడిన యొండొరుల మొగములు గల వారు. చీని వాక్యాశయము = ఈ యంచపలుకుల తాత్పర్యము.

55. సవిమర్శదృష్టినాటితక విధానము = బాగుగ విచారముతోఁ గూడిన చూపుయొక్క యభినయ ప్రకారమును. ఒకింత నడపి = కొంచెము చేసి. (మున్నే యాపటమునందలి యాకారము ప్రద్యుమ్నుని దని తా నెఱిఁగియుండుటచే నిప్పుడు పరిశీలింప నక్కఱలేకుండిన నప్పుడే బాగుగ విచారించి యది యతని రూపమని తెలిసికొన్నట్లు వారికిఁ దోఁచునట్లు చేసి). పదిలముగాన్ = జాగ్రత్తగాన్. అతని రూపము = నే మున్ను చూచిన పురుషు నాకారమే.

56. మహత్తర మోదవిశేష సంభ్రమమునన్ = అధికమగు నానందముచే (గల్గిన) యెక్కువ వేగిరపాటుతోన్. తత్తనురుహంబులు = ఆయంచ ఱెక్కలను.

57. ఆరసి = ఆపదం దొలఁగించి. మూర్తిమత్వమున్ = రూపమును. కాంచిన భాగ్యదేవతవు = పొందిన యదృష్టదేవతవు.

58. నిజవయస్యన్ = తన చెలిని.

59. ఈప్సితార్థసిద్ధికిన్ = కోరఁబడిన పని నెఱవేఱుటకు. ఇంతమాత్రంబ = ఇది యతని యాకార మని చెప్పుటయే. ఈ చిత్రమూర్తి యందున్ = ఈ పటమునందలి ప్రతిమయందున్. అతని లక్షణములు = హంసిచూచిన పురుషుని గుఱుతులు.

60. నిరూపించి = బాగుగఁ బరిశోధించి.

61. త్రిలోకారిన్ = ముల్లోకములనున్న వారికిఁ బగవానిని. శంబరున్ = శంబరుఁడను రక్కసుని. త్రుంచునప్పటి ప్రహార కిణంబులు = చంపునప్పటి దెబ్బలవలని కాయలు. రతి కంకణాంకములు = రతియొక్క కడియాల యానవాళ్ళు. (భార్యయగు రతి కౌఁగిలించినపుడు నాటిన యామె చేతికడియాల గుఱుతు లని యన్నము). వీరశృంగార కళాఢ్యున్ = వీరకళచేతను, శృంగార కళచేతను. సంపన్నున్ = మిక్కిలి పరాక్రమమును, చక్కఁదనమును గలవాని నని యర్థము.

62. ఈ లక్షణ కథనంబుచేతన్ = ఈ మీఁదటి గుఱుతులం జెప్పుటచేతను. అతని నామజాత్యాదులు = అతని పేరుం గులము మొదలగునవి.

63. ఎంత మనసిచ్చి = ఎంత యభిప్రాయమును వెల్లడించి. వచించిరి = మాట్లాడిరో. అంతమాత్రన్ = దానికిం దగిన కొలఁదిని. ప్రతిభాషణము = జవాబును. గెలుపోటులు = జయాపజయములను. తీర్పన్ = నిశ్చయించుటకు.

64. ఈ యెఱుక = ఈ స్నేహమును.

65. దనుజకన్యకాలలామ = శ్రేష్ఠురాలగు ప్రభావతి. పొదుగఁబట్టి = ఆక్రమించి పట్టికొని.

66. నిద్దంపుఁ బండువెన్నెల = దట్టమైన ముదురు వెన్నెలను. కాయు ఱెక్కలయొప్పు = పుట్టించెడు ఱెక్కల యందమును. (పున్నమనాటి వెన్నెలవలెఁ బ్రకాశించు ఱెక్కలకాంతి నని యర్థము.) మించు పక్షాంతహాటకరేఖలు = ప్రకాశించు ఱెక్కలచివర (నున్న) బంగారు గీఱలను. కమనీయము = చక్కనిది. మహాగమన గాంభీర్యాది విలసనంబు = పడినడక, గాంభీర్యము, మొదలైనవాని

ప్రకాశమును. (లోని సంతసము మొదలగువానిం దెలుపు వికారములులేమి గాంభీర్యము). మాధుర్యధుర్య కోమల వచనామృతంబు = కమ్మందనమును వహించిన (శ్రావ్యమైన) మృదువులగు పలుకులను నమృతమును. కౌతుకాంతరంబు = వేఱొక వేడుకను. ఉవ్విళ్ళుగొలుపు = ఎప్పుడుగల్గు నని త్వరపుట్టించెడు. (కోరిక పుట్టించెడు ననియేని యర్థము). నీదు సంగతి = నీ స్నేహమును. రాగవల్లరిపేరు = రాగవల్లరి చెలియన్న పేరే యనియును. నీవు నిజమును = సత్యముగ నీవే చెలికత్తె వనియును. నెయ్యంపుఁజెలిమి = సంతసముతోఁగూడిన స్నేహమును. ఒనర్తుఁ.

67. ప్రణయము = అడఁకువ. (ప్రేమ యని యేని యర్థము). ఒడఁబడంగ వలయుఁ = సమ్మతింపవలయును.

68. ఎప్పుడు (నాయునికి) రహస్య విచారవిఘ్నము = ఏకాంత మాడుటకు నడ్డము. ఔాట నీకుం దోఁచెఁ, అపుడు, ఇంతయుఁ = నాతో నీవు చెలిమిచేయుటకుఁ గారణముగాఁజెప్పిన నా చక్కందనమునంతను. రోసెదు = రోఁతపడుదువు. (నిందింతు వని యేని యర్థము). దీనిచేతఁ = నాతో స్నేహముచేయు తలఁపుచేతను. మంతనంపుఁబని = ఆలోచించు కార్యమును. ఏమఱక = పరాకుపడక. అంపుఁడు = సెలవిండు.

70. ఉడ్డాడింపఁ = మనసును క్షోభపెట్టుట. మా యేకాంతపుఁ బనికిఁ = మా రహస్య కార్యమునకుఁ. విరోధి = అడ్డము సేయునది. (మఱియు) నిర్వాహకముఁ = (ఆ పనిని) నెఱవేర్చునదియును. (అగును).

71. ఇదే = నీవు మాతలఁచిన పనిని సఫలముచేయు శక్తి కలదాన వగుటయే. నిమిత్తంబుగాఁ = కారణముగాఁ. సఖ్యంబు = (నీ) చెలిమిని. ప్రార్థించెదము = కోరెదము. కేవలంబైన = ఒకటియగు. తావక రామణీయకంబునన = నీ చక్కందనముచేతనే. నీదు పలుకుం దెరువులు = నీయొక్క మాటలత్రోవలను. పరికింపఁ = పరిశోధింపఁగాఁ. ఇది = మా రహస్య కార్యమును. విస్పష్టంబు = మిగుల వెల్లడియైనది. శుద్ధాంత స్థితి దోషంబునంజేసి = అంతిపురమున నుండుట యను తప్పిదముచేతను. (అంతిపురములో నున్న కన్నెలు తలిదండ్రులకుఁ దెలియకుండ నితరులతో నొక పురుషునిగూర్చి చెప్పుట తప్పు గావున నని యర్థము). ఏమయి = మాయంతట

మేము. మాటుపెట్టక = దాఁపక. గొబ్బునన్ = శీఘ్రముగన్. చొరమి = ప్రవేశింప కుండుట.

72. వట్టి మఱుంగుపెట్టి = (మాతలఁచినపనిని) ప్రయోజనములేని దాఁపఱికము చేసి. నుడువంబనిలేదు = చెప్పుటవలనఁ గార్యములేదు. అదియెల్లన్ = దాఁపఱికము చేయుటంతయును. భేరిన్ = దుందుభి యను వాద్యమును, జోకొట్టుటకాక = మెల్లఁగాఁ జఱచుటకాక. (మేము మా పనిని దాఁచినకొలఁదిని, భేరిని మెల్లఁగం జఱచిన కొలఁదిని ధ్వని యధికమగునట్లు నీకు మిగుల వెల్లడిచేయుటయేకాని తెలియఁజేయకుండుట సాధ్యముకా దని భావము). నీవు, కంటినన్నట్టి శుభాంగుఁడు = చూచితినని చెప్పిన చక్కనివాఁడు. ఈ రమణి యాసలకున్ = ఈ యింతి కోర్కెలకున్. ఆస్పదము = ఆలంబనము. (పట్టుఁగొమ్మ) ఈమె వలచినవాఁడని యర్థము. అన్వయాది కథనంబుగన్ = ఆతనివంశము మొదలైనవాని చెప్పుట గలుగునట్లు. తెల్పి = అతని నెఱిఁగించి.

73. ఎడసేయుట = ఆలస్యముచేయుట. ఈ లతాంగిన్ = ఈ యింతిని. ప్రాణసంకటపఱచుట = ప్రాణబాధ నొందించుట. మా వృత్తము = మా నడవడిని.

74. వచనవక్రత = మాటల వంకరతనమును. (శ్లేషచే వేఱర్థము గలుగునట్లని, తెలిసినదానిం దెలియనట్లని పలుకుటను).

75. అంతిపురంబు కన్యలఁట = అంతఃపురంబులోనున్న పడుచులఁట. అఁట యనునది మిగుల గొప్పతనమును దెలుపును. ఆత్మతెఱంగు = తమ విధమును. తమ తలఁపు నని యర్థము. అభిధాప్రయుక్తిన్ = కంఠోక్తిచేతను. ప్రత్యక్షముగఁ జెప్పుటచేతనని యర్థము. ఒక్కింతయున్ = కొంచెమైనను. ఏర్పఱింపరఁట = తేటపఱుపరఁట. నాకు నాకె = నాయంతట నేనే యని యర్థము. అర్థాంతరముల్ = వేఱువేఱర్థములను. గడించుకొని = కల్పించుకొని. అంజక = భయపడక. యువస్తుతుల్ = పడుచువాండ్ర యొక్క (చక్కఁదనము మొదలగువానిని) పొగడుటను. ఎట్లు. ప్రపంచింతున్ = తెలియఁజేయుదును. గుట్టు = రహస్యమును.

76. మనోహారి = మనసును దొంగిలించినవాఁడు.

77. తద్వర్ణన = ఆ పురమునందలి విశేషములం బొగడుట. వాణీరమణునకైనన్ = బ్రహ్మకైనను. దుష్పారము = శ్రమచేఁ దుద ముట్టింపం దగినది. కష్టసాధ్య మని యర్థము. సమస్త సౌభాగ్యములన్ = ఎల్ల సంపదలచేతను. అపారము = అధికమైనది.

78. ప్రకృత యుపకథావిలంబమునకున్ = నీ వడిగిన పడుచువాని వృత్తాంతము (ం జెప్ప) నాలసించుటకున్.

79. వరటారత్నము ! = శ్రేష్ఠమైన హంసీ ! కతరాజవు = ఎల్ల వృత్తాంత ములకుం బ్రభువవు. వృత్తాంతములు తెలిసినదాన వని యర్థము. విహగి = ఆడుపిట్ట.

80. సర్వ భద్రపరిపూర్ణుఁడు = ఎల్ల మంగళములతో నిండినవాఁడు. షోడశ సహస్రవధూ ప్రియున్ = పదియునాఱువేల యింతులకుం బ్రాణనాయకునిన్. అష్ట మహిషీజనులు = ఎనమంద్రు భార్యలు.

81. సుధాంశువదన ! = ఓ చంద్రముఖీ ! అగ్రగణ్యయై = మొదట లెక్కింపఁ దగినదియై. పట్టి = కుమారుఁడు. ఇది = ఈ పటమునందలిది. ఆ యనఘు రూపము = ఆ ప్రద్యుమ్ను నాకారము.

82. అతండు, శౌర్యమయుండు = అధికమైన పరాక్రమము గలవాఁడు. భుజ సత్వనిధానము = బాహుబలమున కునికిపట్టు. గాంభీర్యపుఁ బ్రోక = గాంభీర్యపు రాశి. సత్కళల పెన్నని = ఎల్లవిద్యలకు నాకరము. రూపము = ఆకారమును. తాల్చినట్టి యౌదార్యము = ధరించినట్టి దాతృత్వము. పెక్కులేటికిన్ = పలు మాటలేల ? ఉదాత్తగుణోదయము = గొప్ప గుణముల యాధిక్యము. ఆ యపూర్వ సౌందర్యతకున్ = ఆ యపురూపమైన చక్కందనమునకున్. (సుందర శబ్దముమీఁద భావార్థమున 'ష్యఞ్' ప్రత్యయము చేర్పఁగా సౌందర్యశబ్దము సిద్ధించును. పిమ్మట నపూర్వ శబ్దముతో దానింగూర్చి బహువ్రీహిచేయఁగా నపూర్వ సౌందర్యుఁడు = దానిపైని భావార్థమునకైన 'తల్' ప్రత్యయము చేర్పఁగా నపూర్వసౌందర్యత యగును గాని ; యిట్టి ప్రయోగములు సంస్కృతమునందేని, తెలుఁగునందేని తఱుచుగఁ

గాన్పింపవు). ఎంత, యెంత, యుచితంబగున్ = ఏ, యే, కొలఁది నుండఁదగినదియో. అంతయుఁగల్గి = ఆ యా కొలఁదినిబొంది. శోభిలున్ = ప్రకాశించును.

84. సంతోషంబు, నిలింపారాతి రాట్కన్యకున్ = రాక్షసరాజు కూఁతునకున్. ఇటఁగువర్ణకము సంబంధార్థకము. (నిలింపులు = దేవతలు. అరాతులు = (వారి) శత్రులు = రాక్షసులు. రాట్ = (వారి) రాజగు వజ్రనాభుఁడు). ఆత్మన్ = మనసు నందున్. పిక్కటిలుచున్ = అధిక మగుచున్. సర్వాంకషంబై = అంతటను వ్యాపించి నదియై. శరీరాంతర్భాగము = దేహములోపలి భాగమునందున్. (ఇట సప్తమ్యర్థమునఁ బ్రథమ.) పట్టుచాలమిన్ = అవకాశము లేకుండుటచేతను. త్రపాశిక్షన్ = లజ్జయొక్క శిక్షచేతను. (లజ్జగావించిన విద్యాభ్యాసముచేత నని యర్థము). తత్కాంతా రత్నము = ఆ స్త్రీశ్రేష్ఠము, (ప్రభావతి). ఒనర్చునట్టి యవహిత్థా యత్నమున్ = చేసెడు దాఁపరికము సేయుటయందలి పూనికను. సంతసము మొదలగు వానివలనం బుట్టు వికారములను సిగ్గు మొదలగువానిచే గోపనము సేయు టవహిత్థ. మీఱుచున్ = అతిక్రమించుచున్. ముఖపద్మంబున్ = పద్మముంబోలిన మోమును. అత్యంతం బున్ = మిక్కిలిగాన్. వికసిల్లఁజేసెన్.

85. తార్కాణగాన్ = నిదర్శనముగాన్. నామ జన్మములున్ = పేరును బుట్టుకయును. తద్వసతియున్ = ఆయనయొక్క యిల్లు సైతమును. సంసిద్ధము = తెలియఁబడినది. ఆందోళమున్ = సంశయమును.

86. ఆలాప చాతుర్యంబు = మాటలనేర్పును. కడమ కార్యంబు = మిగిలిన పని యును. (నిన్నుం బ్రద్యుమ్నుఁడు పెండ్లియాడుట యనుపని నని యర్థము). సాధించునట్టి దిట్టతనంబు = నెఱవేర్చు శక్తి. సకలకళలన్ = ఎల్ల విద్యలందును. నడిసన్న చదురుల ప్రోదిన్ = పొగడుగన్న నేర్పరుల (విద్వాంసుల) పోషణముచేతను. కాలిపెండె రంబున్ = కాలియందెను (ఎద్దియే నొక్క విద్యయందుఁ బాండిత్యము గలవారికి బిరుద ముగా నిచ్చు నందెకాని, పరాక్రమశాలులు కాలఁధరించు నందెకాని పెండెరము, గండ పెండెరము ననంబడును). తజ్జన్మ నామ విద్యాభ్యాసాదులు = ఆ యంచ పుట్టువుఁ బేరును జదువు నేర్చికొనుట మొదలగువానిని. చెలికత్తియ కలతెఱంగు = మిత్రురాలియొక్క యున్న విధమును. తదాదిగాన్ = ఆ పటము చూచినది మొదలుకొని యని యర్థము. ముదితకున్ = ఆ యింతికిన్. ఒదవిన మదనావస్థ లెల్లన్ = పుట్టిన చక్షుఃప్రీతి మొదలగు

దశలను. (ప్రత్యక్ష చిత్రాదులయం దాదరమునఁ బ్రియుం దర్శించుట చక్షుఃప్రీతి యనంబడు). పల్లవాధర యాకారంబు = ప్రభావతి (చిగురువంటి మోవిఁగలదాని) దేహమును.

87. ముక్కుఅయందుఁ = అడ్డబాసయందుఁ. తెలివళుకొత్తు ముత్తియము = తెల్లగాఁ బ్రకాశించు ముత్యము. నీలంబు = నీలమణి. కాదుసూ = కాదుచుమీ. ఉవిదసందిళ్ళఁ = ఈ యింతిదండ చేతులందుఁ. మితిచూడఁ. ఇడిన యూర్మికలు = ఉంచిన యుంగరములు. బాహుపురులు = దండకడియములు. కావుసూ. కర్ణికలఁ = దుద్దులందుఁ. ప్రాఁగెంపుఁదునుకల రంగు = పద్మరాగ మణుల కాంతి. వజ్రపుదీప్తి = వజ్రమణులకాంతి. ఊర్పు వేఁడిమిఁ = శ్వాసముల వెచ్చఁదనముచేతను. (కోర్కి సఫలము కామిచేఁగల్గు చింత నిదిగల్గును.) కృశతఁ = శరీరము చిక్కుట చేతను. (ప్రియవిరహమున నాహారాదులు లేమి నిది జన్మించును). బాష్పోదయమునఁ = కన్నీరు కారుటచేతను. (దుఃఖ రోషాదులచే నిది పుట్టును). గండపాండిమఁ = చెక్కులందలి తెల్లందనముచేతను. (ఇది విభావాదులచే నుప్పతిల్లును). తలఁచినపని నెఱవేర్చుకొనుటకుం దగిన యుపాయముతోఁపమిం గలుగు ఖేదము, విషాదము. తత్తత్ప్రకారములను = (ముత్తెములు మొదలగునవి) నీలములు మొదలగువాని విధముచేతను. విహంగమ పురంధ్రి = పక్షివనితా!

88. ఈ = ఇపుడు నేఁజెప్పిన. నిజాంతర = తమ లోపలఁగలిగిన. స్మర వికృతి ప్రవర్తనలమాటలు = మన్మథ వికారముతో నున్నవారి పలుకులు. నెరయఁ = పూర్ణముగాఁ. డాఁచు రహస్యములు = దాఁపఱికము చేయందగిన యేకాంతములు. ఆప్తలై = హితము గోరువారై.

89. సఖ్యంబుఁ = స్నేహమును. సాప్తపదీనంబుగాఁగఁ = ఏడుమాటలు మాట్లాడుటచే సిద్ధించునది యగునట్లు. ఎంచును = తలఁచును. చెప్పు నని యర్థము. (విద్వాంసులు స్వల్ప సంభాషణచేతనే స్నేహము సిద్ధించునని చెప్పుదు రని భావము.) హృదయంగమముగఁ = మనసున కింపైన దగునట్లు. ఏతన్మనోరథంబు = ఈ మనోరికను. ఈడేర్పవలయుఁ = సఫలము చేయవలయును. ఒక్క ప్రసంగవశతఁ = ఒక ప్రస్తావము తటస్థించుటచేత నని యర్థము.

90. ఇవ్వనరుహాక్షిన్ = ఈ ప్రభావతిని. (తామరపూవులఁబోలిన కన్నులు గలదానిని) అరుదైన తదాకృతి శోభకున్ = అపూర్వమైన యాతని (ప్రద్యుమ్నుని) దేహ సౌందర్యమునకున్. జోడు = సమానమైనది. తగినది యని యర్థము. ఈ విలాసవతి యాకృతి చెల్వము = ఈ యందగత్తె (ప్రభావతి) యొక్క శరీరము యొక్క చక్కఁదనమే. కావునన్ = అగుటచేతను. తలంపైనన్ = (అతనిం జూచినపుడు) జ్ఞప్తికి రాఁగాన్. ప్రసక్తి నెంబడిన్ = ప్రస్తావము ననుసరించి. వచింపఁగా వలసెన్.

91. వచియించినన్ = (నే నీమె చక్కఁదనమును) చెప్పఁగాన్. అతఁడు = ప్రద్యుమ్నుఁడు. అచలస్థితిన్ = పర్వతముయొక్క స్థితింబోలిన స్థితిచేతను. (రాయివలె నని యర్థము). ఔఁగాదను వచనంబు = (నేను జెప్పినది సమ్మత) మగును, కాదు అను పల్కును. నుడువకయుండెన్. ఏతదర్థ మెఱుఁగమిన్ = ఈ కార్యము నెఱుఁగకుండుటచేతను. (ఈమె కాతనియందు వలపుఁ గలదని యెఱుఁగ కుండుటచేతను) అదియ = పలుకకుండుటయే.

92. అనన్ = హంసి యిట్లు పలుకఁగాన్. చివుక్కురుమనన్ = కలఁతనొందఁగాన్. వివర్ణము = (మునుపటికంటె) వేఱురంగుగలది. (తెల్లఁబడినది). అగు, వదనముతోన్ = మోముతోన్. కనుపట్టుడున్ = కాన్పింపఁగాన్.

94. నిన్ = నీ చక్కఁదనమును. ఏమియున్ బ్రతి వాక్యంబు = ఎద్దియును బ్రత్యుత్తరము. తద్రతికాంతున్ = నీవుకోరిన ప్రద్యుమ్నుని. వేసన్ = శీఘ్రముగాన్. పంతంబాడుకోన్ = ప్రతిజ్ఞచేసి చెప్పుటకు. నిశ్చలంబైన పూన్కిన్ = స్థిరమైన ప్రయత్నముతోన్. శపథముతో ననియే నర్థము. తెచ్చెదన్.

95. ఉమచిత్తమునకున్ = పార్వతి మనసునకున్. రాదో = అనుకూలము కాదేమొ. అనవలదు = అనుటకూడదు. భక్తపరతంత్రకున్ = తనయం దనురాగము గల వారికి లోఁబడునట్టి దానికిన్. ఆ భవానికిన్ = పార్వతికిన్. (భక్తులకోర్కుల నెఱవేర్చు పార్వతి కని యర్థము.) భవదిష్టము = నీచేతఁ గోరఁబడినది.

96. సందిగ్ధఫలంబు = సందేహింపఁబడిన ఫలముగలది. ప్రద్యుమ్నవాంఛ = ప్రద్యుమ్నునియందలి కోర్కి. అతను పావక = మన్మథాగ్నియొక్క. ప్రజ్వాలన =

మండించు విషయమై. ధాయ్యామంత్రాయ మానంబు = ధాయ్య యను ఋక్కుగా నగుచున్నది. (యజ్ఞాదులయం దగ్నిం బ్రజ్వలింపఁజేయునపుడు చదువుఋక్కు ధాయ్య యనంబడు). అయిన, తావకీన = నీదియగు. సౌందర్య సంపత్ = చక్కఁదనమను సంపదయొక్క. సహస్రతమ భాగ = వేయవ పాలియొక్క. కథన మాత్రంబునన్ = చెప్పుటచేతనే. అపాస్త ధైర్యున్ = పోఁగొట్టఁబడిన ధైర్యము కలవానిని. కింకరున్ = సేవకునిని. చెప్పినట్లు చేయువాని నని యర్థము. నీ రామణీయక మహిమ = నీ చక్కఁదనముయొక్క గొప్పతనమును. ఇది = నీ చక్కఁదనమును. మదన వశంవద హృదయుండు = మన్మథునకు లొంగిన మనసు గలవాఁడు. కానివాఁడునున్. కలఁడె = ఉండునా? లేఁడని యర్థము. నీ చక్కఁదనము విన్నవాఁడు తప్పక కామపీడితుఁ డగు నని యాశయము. అనుపమేయ రూపలావణ్య గర్వంబునన్ = సాటిలేని చక్కఁదనముయొక్కయుఁ, గాంతియొక్కయు గర్వముచేతను. బలముచేతనేని, రూపలావణ్యాదులచేతనేని, మఱి దేనిచేతనేని తన కితరులు సదృశులు గారని తలఁచుకొనుట గర్వము. నానా భువనసంచారిణిన్ = పెక్కు లోకములం దిరుగుదానను. కోమలఁ బ్రాయంపుఁ గొమరులు = యౌవనము గల పురుషులు. పెడచెవులం బెట్టి = చెవుల వెనుకఁ బెట్టి. ప్రేమతో వినక యని యర్థము. కటకటంబడుచున్ = ఖేదపడుచున్.

97. ప్రియోదంతము = (నా) ప్రాణనాయకుని వృత్తాంతమును. అరుదారన్ = వింతపుట్టునట్లు. తుదన్ = చిట్టచివరను. విరసంబు = రసములేనిది. అయిన, వచః ప్రపంచనముచేన్ = మాటలయొక్క విస్తరించుటచేతను. రసములేనిమాటలం జెప్పుటచేత నని యర్థము. వేఁపంగన్ = పరితాపము గలిగించుట.

98. నియోగించి = ఆజ్ఞాపించి. విశదముగన్ = స్పష్టముగాన్.

99. ఉల్లంబు = మనసు. కొలుపద = అంగీకరింపనే లేదు. ప్రారబ్ధంబు = ఈ జన్మమునకుం గారణమైన పూర్వకర్మము.

100. ఈ సకల సద్గుణపూర్ణునిన్ = ఇప్పుడు నీవు చెప్పిన యెల్ల మంచి గుణములతో నిండిన ప్రద్యుమ్నుని. మత్కులవైరి తనూజుండు = నా (రాక్షస) జాతికిం బగవాఁ డగు (వెన్నుని) కొడుకు. సురారికుల నిర్మథనుండు = రాక్షసజాతిని నశింపంజేయువాఁడు.

101. తలపోసి = ఎంచి. కొంపఁదగునా = విచారింపవచ్చునా? నా మది తెఱంగున్ = నా మనస్సుయొక్క విధమును. జగజ్జననిమాటలు = లోకములకుం దల్లి (పార్వతి) యొక్క పలుకులను. వించున్ = ఆలకించుచున్. పురుషాంతరానుమతి = (ప్రద్యుమ్నునిఁ గాక) వేఱొక పురుషు (వరియించు) నంగీకారము. చేకుఱునో యని = సంభవించునేమో యని. శంకచేసెదు = సందేహింతువు. ఇంకన్ = ఇంత స్ఫుటముగా నేఁ జెప్పిన పిమ్మటను. నా హృదయములోఁతు = (ఎవరికిం జెప్పఁదగని) నా మనసుయొక్క లోఁతని యర్థము. ఒంటు ప్రతిజ్ఞ = ఒక శపథము.

102. ఒరున్ = మఱొక్కనిని. వరించువాట = పెండ్లియాడెద ననుమాటను. ఆ ఘనుఁడు = ఆ ప్రద్యుమ్నుఁడు. ఒల్లకున్నన్ = (నన్నుఁ) ప్రేమింపకుండినన్. తనువు = శరీరమును. మనసిజశిఖిన్ = మన్మథాగ్నియందున్. వేల్చి = హోమము చేసి. మన్మథబాధచే మరణించి యని భావము. మఱుసటిమేనన్ = ఇంకొక శరీరమందున్. తరువాతి పుట్టువునం దని యర్థము. చెందుదున్ = (అతనిఁ) బొందుదున్.

103. ఈ తుదపక్షమే = యీ చివరఁజెప్పిన (మరణించి యింకొక జన్మమున నతనిం జెందుద నను) పక్షమే. నిశ్చితము = నిశ్చయింపఁబడినది. తద్గళద్యోతిత కంకణాంకయగు తొయ్యలిన్ = అతని కంఠముచేఁ దెల్పఁబడిన కడియముల యానవాళ్లు గల యింతిని. ఒక్కతెన్. కల్గన్ = ఉన్నట్లు. ఈవుచెప్పితి. ప్రాగ్భవంబునన్ = మునుపటి పుట్టువునందున్.

104. తదీయంబు = ఆ ప్రద్యుమ్నుని సంబంధమైనది. అయిన, సతీవాల్లభ్యంబునకున్ = భార్యయందలి ప్రేమకున్. (ప్రద్యుమ్నునకు భార్యయందుఁగల ప్రేమకు) ముచ్చట పడుచున్ = వేడుకపడుచున్. (కోరుచున్).

105. వక్షోనిపీడనము = ఱొమ్ముయొక్క రాయిడి. చుంబనము = ముద్దు. ఆ కళావిదుమంతనంబులు = ఆ విద్వాంసుని (ప్రద్యుమ్నుని) యేకాంతములు. (సంగీతాది విద్యల నేర్చినవాఁడు కళావిదుఁడు) రమణసౌభాగ్యకలిత = మగని యొక్క కోరఁదగుటతోఁ గూడినది. మగనిచేత మిగులం బ్రేమింపంబడు నది యని యర్థము.

106. పెద్దయుంబ్రొద్దు = చాలఁగాలము. విరహవేదనాదోధూయమాన మానస = (మగని) యెడఁ బాటుచేతఁ (గలిగిన) బాధచే మిగుల దుఃఖించుచున్న మనసుగలది.

107. దుస్తరము = దాఁట శక్యముగానిది. అవస్థ = స్థితిని. చేరికన్ = సంబంధమును. దురాశాపాశము = చెడుకోర్కె యను త్రాడు. బంధము = కట్టు. వెలువడఁగనీక = వెడలిపోనీక. ఆఁగి = నిల్పి. అహరహంబు = ప్రతిదినమును. మదనాగ్ని = మన్మథతాపము నని యర్థము. అవుగాములు = కార్యము కావుటయో, కాకపోవుటయో. అదియ = ఎట్లయిన నా యాశను వారించుటయే. మత్ప్రాణరక్ష = నా ప్రాణముల రక్షించుట.

108. ఆ తరుణికిన్ = ఆ జవ్వనికిన్. కల; హరితనయ వరణానురాగంబు = ప్రద్యుమ్ను వరించుటయందలి ప్రేమము. అవారణీయంబు = వారింపరానిది. నిర్వహింపక = సఫలముచేయక. తడసినన్ = ఆలస్యముచేసినన్. ఎడరు = ఆపద. పొట్టిల్లన్ = (ప్రభావతికి) సంభవించెనేని. కార్యంబు = దేవతలపని (వజ్రనాభు సంహరించుట). తప్పు ననియున్ = సంభవింప దనియును.

109. మదితమిన్ = (నీ) మనసునందలి కోర్కెని. చూడన్ = పరీక్షించుటకున్. కొన్ని వెడమాటలు = కొన్ని వ్యర్థము లగు పలుకులను. తావకరూపవైభవాభ్యుదయము = నీ చక్కఁదనముయొక్క గొప్పతనమును. వినఁగలిన్ = వినుటచేలను. విరాళిన్ = వలపుచేత. కుందెడున్ = బాధపడును.

110. దీనికిన్ = అతఁడు నీ చక్కఁదనమును విని వలపుచే బాధ నొందుటకున్. నిమిత్తంబును = కారణమును. దైవనియమంబు = భగవంతు నేర్పాటు.

111. ప్రణయకలహము = స్నేహముచేతనైన కయ్యము, నాయికానాయకుల కొండొరులయెడఁ గల చనవునం జేసిన యపరాధమునం బుట్టిన జగడము. అబ్జభవుఁడు = బ్రహ్మ. తద్విరహపీడన్ = సరస్వతియెడఁ బాటు (చేతఁగలిగిన) వెతను. తేర్పన్ = ప్రసన్నురాలిం జేయుటకున్. తదాప్తులు = ఆమె యిష్టసఖులు.

112. సరస = మనోహరమైన. క్రీడా = ఆటలయొక్క, ఆచార = చేయుటకు. సచివత్వమునన్ = సేవకత్వమునందున్, చక్కని యాటలాడుట యను కొలువునందున్.

113. తనపొలఁతి పొలయలుకన్ = తనభార్య (సరస్వతి) యొక్క ప్రణయకోపమును. నాయికా నాయకుల కొండొరులయెడఁ గలిగిన చనవునం జేసిన యపరాధమునం బుట్టిన కోపమును.

114. నిగమరాశి = వేదసమూహము. ముఖస్థము = నోరనున్నది. అగుట, నీ సుప్రసాద సన్నిధి మహత్త్వము = నీగొప్ప యనుగ్రహముయొక్క సాక్షాత్కరించుట (కలుగుట) యను గొప్పతనమే. నీ యనుగ్రహము గలుగుటచేతనే వేదములు నానోరనుండునని యాశయము. సంగీత సాహిత్య సౌరభంబు = సంగీతముయొక్కయు, శబ్దార్థజ్ఞానముయొక్కయు గుణాతిశయము. నీ విలాసమ చర్చికా విశేషము = నీ ప్రశస్తమైన శృంగారపుఁ జేష్టలయొక్క గొప్పతనమే. వేణు వీణాదులరాణలు = పిల్లనగ్రోవి వీణ మొదలగువాని (స్వర) మాధుర్యము. నీ కటాక్ష శ్రీ విపాకభేదము = నీ కడకంటిచూపుల పంటయొక్క విశేషమే. వేణు వీణాదులమాధుర్యము నీ యనుగ్రహముచేతనే ప్రాప్తమగునది యని భావము. అఖిలలోక వ్యవహారసిద్ధి = ఎల్లజనుల వ్యవహారము నెఱవేఱుట. అనుగ్రహలీలన్ = ప్రేమతో నేలికొనుట యను క్రియను. కావించుటన్ = చేయుటచేతనే. ఎల్లవారిని నీ వనుగ్రహించి మాటలాడుశక్తి దయచేయుటచేతనే వారు తమ వ్యవహారముల నెఱవేర్చుకొనుచుందురని భావము. ఏకాంత = రహస్యమగు, దాస్య = పనుల విషయమై. కింకరుని యందున్ = సేవకుని యందున్. అత్యంతము పనిచేయు సేవకుని యందని యేని యర్థము.

115. మనోజార్తిన్ = మన్మథ బాధచేతను. కరము = మిక్కిలి. తప్తుండు = తాపము నొందింపఁ బడినవాఁడు.

116. ఏఁచుట = బాధించుట. నెలఁతపైన్ = ఇంతియందున్. విరాళి = వలపు.

117. రతీప్రియుభావమున్ = మన్మథుని మనసును. అపహరించుపాటిది = ఆకర్షించునంతటి శక్తి గలది. లావణ్యాదులన్ = కాంతి మొదలగువానిచేతను. ప్రతి

బింబమును గ్రహించు నిగనిగలాడు కాంతిలావణ్యము. రతివిలాసినికిన్ = ప్రద్యుమ్నుని భార్యయగు రతియను (విలాసముగల) స్త్రీ కంటెన్. ప్రియునిఁ జూచుటచే నింతులకుం గలుగునదియు, హర్షము మొదలగు వానిం దెలుపునదియు నగు ముఖనేత్రాది వికారము, విలాసము.

118. విమర్శవంతులు = బాగుగఁ బరికించువారు. ప్రభావతిపస = ప్రభావతి చక్కఁదనము. రతిసొబగుకంటెన్ = రతి సౌందర్యముకంటెన్. ముమ్మడి = మూఁడు రెట్లు. నలుమడి = నాలుగురెట్లు. వాసి = శ్రేష్ఠము. (అధిక మని యర్థము).

119. ప్రభావతిరూపంబు = ప్రభావతియొక్క చక్కఁదనము. మదీయసృష్టి యందున్ = నా సృష్టియందున్. నాచే రచియింపఁబడిన జగమునం దని యర్థము. పార్వతీ వరప్రసాదజనిత = పార్వతియొక్క వరము ననుగ్రహించుటచేతం బుట్టింపఁ బడినది. (పార్వతి యిచ్చిన వరమునం బుట్టినదని యర్థము.) దేవతలు తమ్మారాధించెడు వారికిచ్చిన కోర్కి వరము. నిజాంగనారోషంబు = తన భార్య (ప్రణయ) కోపమును. కాలవిలంబనా సహిష్ణుత్వంబున్ = బ్రహ్మయొక్క చాలఁగాల మోర్వలేమిని. బ్రహ్మ చాలసేపు పెండ్లమునెడఁ బాసి యుండలేమి నని యర్థము. భవదాయల్లక భరంబునన్ = నీ విరహాతిశయముచేతను. రతీవిలాసంబున్ = రతియొక్క శృంగార చేష్టయును. తదంతరాయంబు = దానికి (నిన్నుఁ బ్రద్యుమ్నుఁడు పెండ్లిచేసి కొనుటకు) విఘ్నమును.

120. ఓ యంచగరితే = ఓ హంసీ! హితవుగన్ = మేలు గలుగునట్లు. అదికితి = (సంబంధము లేకున్న) నున్నట్లు చెప్పితివి. కాముఁడు = మన్మథుఁడు. ప్రభావతీ కాంక్షన్ = ప్రభావతియందలి కోర్కిచేతను. కలఁగొనేని = కలఁత చెందినన్. (పరితపించినన్). మన చెలియ కిష్టుఁడు = మన మిత్రురాలికిఁ బ్రియుఁడు. (ప్రద్యుమ్నుఁడు) విరాళిఁగొనుట = వలపుఁ జెందుట.

121. నవ్వి = (ప్రద్యుమ్నునకును, మన్మథునకును భేదము లేదని వా రెఱుఁగమికి) హసించి. సకల సద్రూప = ఎల్ల చక్కనివారికిని. ఉపమానత్వ = పోలిక యగుటచేతను. (గల్గిన), శోభనకీర్తి ప్రథితుండు = మేలయిన కీర్తిచేఁ బ్రసిద్ధుఁడగు నా మన్మథుఁడు. తొల్లిటి సురూపశ్రీన్ = మునుపటి చక్కఁదనముయొక్క శోభను.

(మన్మథుఁడుగా నున్నప్పటి చక్కఁదనపు శోభ నని యర్థము). కడున్మించు చెన్ను = మిక్కిలి యతిశయించెడు నందము. మెఱయఁగ = ప్రకాశింపఁగాఁ.

122. నిజశంకలకున్ = తన సందేహములకున్. పరిహారములు = పోఁగొట్టు వానిని. (సందియములు వారించు నుత్తరముల నని యర్థము.) గెంటకయుండఁగ = పోకుండఁగ. తన యాసన్ = తన కోర్కిని. నిలుపన్. దితిసుతతనయ = రక్కసుని (వజ్రనాభుని) కూఁతురు, (ప్రభావతి). రమణున్ = ప్రియునిన్. కలయన్ = కూడుటకున్. తమకించు మదిన్ = వేగిరించు మనసుతోన్.

124. ఈ దృశము = ఇటువంటిది. అనుకంపన్ = దయను. నెపమునన్ = మిషచేతను. గురునాజ్ఞన్ = తండ్రి సెలవును. దొరకించుకొనుట = సంపాదించుట. పెను మచ్చరపురాశి = చలముల గొప్పప్రోవు. (ఇతరుల మేలుఁ జూచి యోర్వలేమి మచ్చరము. చలము నిదియే.) అస్మదిచ్ఛకున్ = మన కోర్కికిన్. అనుకూలుఁడు = ఇష్టపడువాఁడు. విరహవారిధిన్ = ఎడఁబాటను సముద్రమును. కడచెళ్ళుట = అతిక్రమించుట. వలవని దురాశలన్ = కోరరాని చెడు కోర్కులచేతను. సంభవింపని కోర్కులచేత నని యర్థము. కుమారిలుట = (ఎవ్వరికిం దెలియకుండ) లోలోననే పరితపించుట.

కలిసిన నాయికా నాయకులకు నెద్దియే నొక్క కారణముచే మఱలంగలియ నాలస్యమగుట విరహమనియు, మున్నెన్నఁడుం గలియనివారికిఁ బరస్పరముం గలియు నిచ్చ యభిలాషము నయోగపూర్వము ననియు నాలంకారికులు వియోగమును విభజించిరి. కాని, కవులు రెండు విధములైన వియోగమునకును విరహశబ్దమునే తెలుపుగ వాడుచుండిరి.

125. ప్రజ్వరిలుదర్పక జ్వాలనముచేన్ = మండుచుండెడు మన్మథాగ్నిచేతను. అనయమున్ = మిక్కిలి. శోషిలి = కృశించి. మోవిసరసత = పెదవియొక్క సారస్యమును. పెదవియొక్క యెఱ్ఱఁదనము నని యర్థము. లోచనములన్ = కన్నుల నుండి. వెదలించెన్ = ప్రకటించెను. ఆమె మన్మథజ్వరముచేఁ బీడిత యగుటచే నెఱ్ఱని పెదవి నల్లంబడె ననియుఁ, దెల్లని కన్ను లెఱ్ఱంబడె ననియు భావము.

126. కట్టెదురన్ = (కడున్ + ఎదురన్) ఎట్టయెదుటను. ఉరిన్ = పక్షులం బట్టుటకుం బన్నిన త్రాటను. వలయందనియేని యర్థము. వెఱపుతోన్ = భయము తోన్. ఎగయఁబెనఁగన్ = ఎగురుటకుఁ బెనఁగులాడు చుండఁగాన్.

127. ఘనసంభ్రమమునన్ = అధికమైన వేగిరపాటుతోన్. దయాకలంబు = కనికరముచేఁ గలఁతఁజెందినది. మనోవృత్తిన్ = మనోవ్యాపారముచేతను. రయమునన్ = త్వరతోన్.

128. అంఘ్రియురిన్ = కాలిబందపుఁ ద్రాటిని. అబ్బామిని కేల్ = ఆ ప్రభావతి చేతిని. (చేతినుండి యని యర్థము).

130. శుకపక్షంబులలోన నుండి = చిలుక ఱెక్కలనడుమ నుండి. తదతిక్షోభంబునన్ = ఆ చిలుకయొక్క కలఁతచేతను. (ఆ చిలుక బంధమునుండి యెగురుటకు ఱెక్కలను మిక్కిలి యాడించుట చేతను). పత్రిక = ఒకజాబు. దైతేయాధిపాంతఃపురంబు = రక్కసుల ఱేని (వజ్రనాభుని) కూఁతురు. అంతఃపురశబ్దమునకు నిట రాణివాసముననుండు స్త్రీయని యర్థము. వెఱఁగంది = ఆశ్చర్యపడి. ఇట్లులనున్. ఇది = నేను జెప్పునది. విచార్యంబు = ఆలోచింపం దగినది. కొంకక = జడియక. (ఈ జాబును) ఎవ్వరంపిరొకో. తేనోపుదే = తేఁగలవా ?

131. పఱచెన్ = పరుగెత్తెను.

132. వయస్యన్ = చెలికత్తెను. ఒడ్డిరో = పన్నిరో? పికాళిన్ = కోయిలల గుంపును. శిక్షింతున్ = దండింతును. ఇది = ఈ తప్పును. ఓర్వఁగ నోపున్ = క్షమింపఁదగును.

133. ప్రభాతాబ్జ లసన్నేత్ర = సూర్యోదయ కాలమునందలి తామరపూఁవలె వికసిల్లుచున్న కన్నులుగల యింతీ ! (ప్రభావతీ)! ఈ పత్రిక చందంబ = ఈ జాబు (వచ్చిన) విత మే. అది = ఆ పత్రికను. విచ్చి = విడఁదీసి. భాసురఫణితిన్ = ప్రకాశించుచున్న మాటలతోన్. ముందరి పద్యములోని చదువుచు ననుదానితో నన్వయము.

134. శ్రీమత్ = శోభావతియగు. సరస్వతీ రామా = సరస్వతి యను నింతి యొక్క. కృపా = దయచేతను. సంప్రయుక్త = ఈయఁబడిన. ఉపమాతిశయోక్తి కామధేను వను బిరుదు (ను దెలుపు నక్షరములే) చిన్నె (ఆనవాలు) గాఁగల. దివ్యమంజీర సంశోభిత పాదకున్ = చక్కని కడియముచే నలంకరింపఁబడిన పాదము గలదానికిన్. శుచిముఖికిన్. ప్రద్యుమ్నుఁడు. ఊర్జిత ప్రణయ పూర్వకముగాన్ = స్థిరమైన స్నేహము ముందు గలుగునట్లుగాన్. కారణముగా ననియేని యర్థము.

135. పలికినన్ = చెలి యిట్లు చెప్పఁగా. ఆ యలినిభవేణి = తుమ్మెదల చాలుంబోలిన జడగల యా యింతి (ప్రభావతి). పత్రికలోనన్ = జాబునందున్. అట్ల యున్నదియె = నీవు చదివినట్లున్నదా? అడకించెదో = పరిహాసము చేయుదువో.

136. ఆవిధిన్ = నీవు చదివినరీతిని. తప్పకున్నన్ = అతిక్రమింపక యుండినను. (ఆ పత్రికయందు నీవు చదివినట్లున్నను). ననున్ చేకొనుటెట్లు = (ప్రద్యుమ్నుఁడు) ననుగ్రహించుటయెట్లు. అందుఁ బ్రప్రభాభావతి యని వ్రాసియుండుటచేతను, నేను ప్రభావతి యను పేరుకల దాననగుటచేతను నందు వ్రాయఁబడినదానను నేనేయని నిశ్చయింపవలను గా దని భావము. లెస్స = బాగుగన్. చూడుము = (ఆ లేఖను) బరికింపుము. అనన్ = ఇట్లు ప్రభావతి పల్కఁగాన్. భవదాఖ్యయె = నీపేరె. భ్రాంతిచేన్ = భ్రమచేతను. (ఉన్నది లేనట్లును లేని దున్నట్లును దోఁచుట భ్రాంతి.) వర్ణపునరుక్తిగన్ = వ్రాసిన యక్కరమే మఱల వచ్చునట్లుగన్.

138. అది = ఆ జాబులోని యంశము. ఎట్టటుకానిమ్ము = ఎట్లుండిన నట్లుండనిమ్ము. అవలన్ = తరువాతను. కడమ = తక్కినదానిని.

139. ప్రథమ శ్రుతాంతంబున్ = ముందుఁ బ్రభావతిచే వినంబడిన దాని చివరభాగమును.

140. నిర్వచనవృత్తిన్ = మాటలాడని స్థితితోన్. ఏన్. ఉన్కి = ఉండుట. కల్లగుట్టు = వట్టి గాంభీర్యము. ఆయింతి యంగములు = ఆప్రభావతి యవయవములను. ఎట్లు చెప్పితి = ఏప్రకారము చెప్పితివో? అట్ల = ఆ ప్రకారముగానే. అవి యెల్లన్ = ఆ యంగము లన్నియును. నా యాత్మన్ = నా మనసునందున్. పడియచ్చు

సన్ = పడియచ్చుతోన్ (అదిమి రూప మేర్పఱుచుటకై వస్త్రంగులు మొదలగువారు తొలిచిన ముద్ర. పడియచ్చు). అంటి = తగుల్కొని. మలిచినగతిన్ = తొలిచిన విధముచేతను. దృఢత్వముఁ జెంది = బలపడి. స్వగుణసంపద్గౌరవమునన్ = ఆ యంగములయందలి చక్కఁదనము మొదలగువాని శ్రేష్ఠత్వముయొక్క బరువుచేతను. ఊఁది = నొక్కి. బడలించుచున్నవి = శ్రమపెట్టుచున్నవి. అధరసుధన్ = అధరామృతముచేతను. తేర్పుమని = (నా) యాయాసముం బోఁగొట్టుమని. ఆ మృగాక్షిన్ = లేడి కన్నులంబోలిన కన్నులు గలదానిని. వేఁడుము = ప్రార్థింపుము. గొబ్బునన్ = వేగముగాన్.

141. బోటి = చెలికత్తె. పెనఁగఁబోక = కలహించి లాగుకొనుటకు యత్నింపక. వలపు = ప్రేమమును. పచ్చిగాఁగన్ = దాఁపఱికము లేనిది యగునట్లు. తేటపఱిచి = స్పష్టపరచి. నీయిచ్చన్ = నీకోర్కెతోన్.

142. కోపలజ్జాలోల = కోపముచేతను, సిగ్గుచేతను జలించునది. పెక్కాన లిడుచున్ = అనేక శపథములు సేయుచున్. (చాలనొట్లుపెట్టుచున్). నీయోజ = నీ విషము. మేలు = శుభమైనది. విపరీతలక్షణచేత నీరీతి బాగుగా నున్నది కాదని యర్థము. పదివేలు వచ్చెన్ = చాల లాభమువచ్చెను. మీఁదటియట్లే మిగుల నష్టము వచ్చెనని యర్థము. ఈ యాకునకున్ = ఈ జాబునకున్. ఆ మహోమహుండు = ఆ గొప్పవేడుక కాఁడు. పుత్తెంచినాఁడు = పంపినాఁడు. ఆ శకుంతకాంత = హంసి. (శకుంతములు = పక్షులు. కాంత = స్త్రీ). భావించుకొనుము = ఆలోచించుకొనుము. పోకడమాలినతనంబు = చెడునడవడి. వాల్లభ్యంబు = ప్రేమను. నెఱపి = ప్రకటించి. భాగ్యవతులు = అదృష్టవతులు. కులదేవతన్ = ఇలువేల్పును. ఇట్టటు సేయుటకంటెన్ = మఱియొకలాగు చేయుటకంటె. (పాడు చేయుటకంటెన్.) అమంగళంబు = అశుభము. అదరవైచియు = బెదరించియు. బుజ్జగించియున్ = బ్రతిమాలియున్. బోధించియున్ = మేలుమాటలం జెప్పియు. వారించెన్ = (ఆ జాబుం జింపకుండ) నడ్డగించెను. ఇంచుకదవ్వులన = కొంచెపు దూరమందె. పొదిగిపట్టినన్ = నొక్కి పట్టుకొనఁగాన్. చీకాకు పఱిచినన్ = శ్రమపెట్టఁగాన్. రేసి = (హంసి) విజృంభించి. తన శక్తినంతయుఁ జూపించి యని యర్థము. గడుసుంబులుంగ = ధీరమగుపక్షీ! ఎలిఁగించి = కూసి. వే వేగన్ = మిగులం ద్వరగాన్. రక్కసుల కేని యాఁడుబిడ్డ = వజ్రనాభుని కూఁతురు.

143. కొంపోకుండినన్ = తీసికొని వెళ్ళకున్నన్. అదయతన్ = కనికరము లేమి చేతను. చంపిన నన్నొకటిన = చంపితే నన్నొకదానినే (చంపుదువు).

145. పనికొదవలు = కార్యలోపములు. ఈడిగిలినన్ = రానని వెంబడి రనముచేఁ గదలకుండినన్. నొచ్చుట = బాధనొందుట. మీఁదిమిక్కిలి = మిక్కిలి యధికము.

146. ఎట్టిగతినైనన్ = ఏవిధముచేతనైనను. దయ = కనికరము. ఇతరుల బాధ తొలఁగింపనిచ్చు దయ.

147. చలము = పట్టుదల. ఏల = ఎందుకనన్. నాదు గోప్యమున్ = నా రహస్యమును. వచించెదన్ = చెప్పెదను. ఆర్చి = ఆడించి. తలన్ = శిరసు నందున్. తేళ్ళఁబెట్టన్. జేలవె = మూర్ఖురాలవా? తెలిసినదానవిట్లు నిర్బంధించుట తలందేళ్ళఁ బెట్టుటవలె బాధకముగాదా యని భావము. రహస్యము తప్పనన్న చోన్ = రహస్యము చెడునన్నప్పుడు. తాలిమిన్ = ఓర్పుతో. కప్పిపుచ్చినన్ = ఆ రహస్యమును దాఁచినన్. తద్గుణము = ఆ దాఁచుటవలని గుణము. ఒక్కొక చోన్ = ఒక్కొకప్పుడు. ఫలించున్. ఆవేళన్ = దాఁచుమని కోరినప్పుడు. పపంచుసేయన్ = ప్రకటించినన్. పీసము = కొంచెమైనను. (ఫలము) కల్గదు. హింసయున్ = ఆపదయును. తప్పదు. ఏకాంతము నెవ్వరికిం జెప్పకుమన్నప్పుడు చెప్పకున్న నొకప్పు డది ఫలించినను గీడు గల్గదు. దాఁచుమన్నపుడు దాఁపకపోయినఁ గొంచెమైనను ఫలింపకుండుటయెకాక తప్పక కీడు గల్గునని భావము.

148. కావునన్ = రహస్యము వెల్లడిచేసినఁ దప్పక కీడుగల్గునను కారణము చేతను. వివిక్త స్థలంబునన్ = ఏకాంతమునన్ (ఎవ్వరు లేనిచోటను). వివేకించి = బాగుగ విచారించి. లీలామహీధర శిఖరంబుపైన్ = క్రీడాపర్వతపుఁ గొనయందున్. బల్మిన్ = బలముచేతను. బలత్కారము చేత ననియేని యర్థము. కడమపెట్టక = మిగిలింపక. అంతయున్ = సకలమును.

149. చారుతరమూర్తి = మిగులం జక్కని యాకారము గలవాఁడు. ఒక యారామములోన్ = ఒక పూఁదోఁటలోన్. అతి వ్యథాకులుఁడు = ఎక్కువ పీడచేఁ గలఁత జెందినవాఁడు.

151. పలవరించెదు = వ్యర్థములగు పలుకులం బలికెదవు. అత్యాదరుండై = మిగుల గౌరవము గలవాఁడై.

152. శ్రౌతస్మార్త = వేదముల చేతను, మన్వాది స్మృతులచేతను జెప్పబడిన. పథ = మార్గముయొక్క. అనువర్తన = అనుసరించుటయే. పరిష్కార = అలంకారముగాఁగల. ఆత్మవర్ణాశ్రమ = తన జాతియొక్కయు, నాశ్రమము యొక్కయు. స్ఫీత = అధికమైన. ఆచార = నడువడిచేతను. పవిత్రమూర్తి = పావనమైన యాకారముగల వాఁడు. కులమునకు, నాశ్రమమునకుఁ దగునట్లు వేదముల చేతను, ధర్మశాస్త్రములచేతను జెప్పఁబడిన యాచారము గలవాఁడని యర్థము. శమ = ఓర్పు. (మనసును వశపఱుచుకొనుట) చేతను. గాంభీర్య = సంతసము మొదలైనవాని దెలుపు వికారములు లేకుండుటచేతను. క్షమా = పరులు చేసిన యపకారములు సహించుటచేతను. సత్యనిష్ఠా = నిజమునందలి నిలుకడ (ఎల్లప్పుడు నిజమునే మాట్లాడుట) చేతను. తుష్ట్యాదిగుణ = సంతోషము మొదలగువాని చేతను. ఉరుకీర్తి = గొప్ప కీర్తిగలవాఁడును. సముదంచత్ = ప్రకాశించుచున్న. నీతివిద్యా = నీతిశాస్త్రమునందలి. మహాచాతుర్య = గొప్ప నేర్పుచేతను. అపరకావ్యుఁడు = రెండవ శుక్రాచార్యుఁడు. నీతిశాస్త్రమున శుక్రుంబోలినవాఁడు. అత్యంతమున్ = మిక్కిలిగాన్. ఆర్యజనతా సంభావ్యుఁడు = ఆర్యులగు జనుల సముదాయమునకు గౌరవింపఁ దగినవాఁడు (సద్గుణముల కలిమిచే సేవింపందగిన వారార్యులు).

153. చారిమకారి = చమత్కారముం గలిగించు నదియు. మహత్తర = మిగులం గొప్పదియు నగు. గౌరిమ = తెల్లందనముచేతను. హారి = మనోహరమైనదియు. మహనీయ = పూజ్యమైనదియు. గాఢ = అధిక మైనదియు నగు. యశుఁడు = కీర్తిగలవాఁడు. గంభీరమదారినిషూదుఁడు = గంభీరులును, గర్వము గలవారు నగు పగవారిం జంపువాఁడు. భూరిమద = ఎక్కువ పొగరుగల. అరి = (లోపలి) శత్రుల (కామక్రోధాదుల) యొక్క. మహిమ = గొప్ప తనముయొక్క (గొప్పతనమును) వ్యపోహకుఁడు = అణఁచువాఁడు.

154. ఇందు = చంద్రునియొక్కయు. పూతక్రతాయీతనూజ = జయంతుని యొక్కయు. (పూతక్రతాయి = ఇంద్రుని భార్య. శచి). అర్థరాణ్ణందన =

నలుకూబరుని యొక్కయు. (అర్థరాట్ = సామ్మున కధిపతి కుబేరుఁడు). స్వాంతభూ = మన్మథుని యొక్కయు. నైషధ = నలునియొక్కయు. ఇళాసుత = పురూరవ చక్రవర్తి యొక్కయు. అమంద సౌందర్య = గొప్ప యందమునకు. (అందమును). సంస్మార = తలఁపునకుం దెచ్చునట్టి. ఆకార = దేహ (సౌందర్య)ముచేత. సంస్పందిత = దలింపఁజేయఁబడిన. స్త్రీధృతిప్రాభవుండు = ఆఁడువారి ధైర్య మహిమగలవాఁడు (నగు నమరేశార్యుఁడు) ఎంతయుఁ = మిక్కిలి. (శాశ్వతపదవి నుండుఁగాక) !

# చ తు ర్థా శ్వా స ము

1. శ్రీ రుచిరుఁడు = శోభచే మిగుల మనోహరుఁడు. విమలాచార ధురంధరుఁడు = స్వచ్ఛమైన యాచారముయొక్క బరువును వహించినవాఁడు. మంచి నడత గలవాఁడని యర్థము. గోష్ఠీ = సంభాషణము. ఉక్తిన్ = మాట (ల) యందు. సురగురుఁడు = బృహస్పతి. బృహస్పతివలె మనోహరముగ మాట్లాడఁగలవాఁడు.

2. ఆరామవర్తి = పూఁదోఁటలో నున్నవాఁడు. దైన్యాతిభారంబు = దురవస్థయొక్క యతిశయమును. కారుణ్యపరవశత్వంబున్ = దయకు లోఁబడుటను. ఒందిన దాననై = మిగుల దయకల దాననై యని యర్థము. శౌగాములు = మంచి చెడ్డలను. కమ్మ = జాబును. పత్త్రంబులలో = ఱెక్కలలో. లీనంబుగా = అణఁగి యుండునట్లు. కలహంస కులకల కలాకులంబులు = కలహంసల గుంపుయొక్క కలకలముచేతను వ్యాప్తమైనవి. ధూమ్రవర్ణముగల ముక్కును, గాళ్ళను, ఱెక్కలుం గల యంచ కలహంస. శోగవర్ణము ధూమ్రవర్ణము. ఇది దీనిదని తెలియవుండ గుంపు నుండి పుట్టినధ్వని కలకలము. పరిచయంబున = స్నేహముతో.

3. ఈఁగడ = జాడ. కుజమునందు = చెట్టునందు (కు = భూమియందు జము = మొలచినది).

5. తనకార్యము = తనకుం గావలసినపని. అదియ = ప్రద్యుమ్నునిజాబు గ్రహించుటయే. అనయము = మిక్కిలిగా. ముదము = సంతసము. ఒదవన్ = పుట్టఁగా. మదిన = మనసునందే. అడఁచి = అణఁగునట్లుచేసి. (ఆ సంతసముం దెలియనీయక యని యర్థము). ఇంత యొనరునె = ఇంత యనుకూలముగా నుండునా?

6. ఈ పత్రికాప్రసంగంబు = ఈ కమ్మయొక్క ప్రస్తావమును. నిస్సారంబుగా = సారము లేనిదిగా. పోనాడి = నిరాకరించి. ప్రసంగాంతరంబునన్ = వేఱుమాటలుఁ దలపెట్టుటచేతను. మఱపించి = ఈ జాబును మఱచునట్లుచేసి.

7. భ్రాంతుఁడు = బుద్ధి నిలుకడలేనివాఁడు. (వెఱ్ఱివాఁడు). ధ్రువము = నిశ్చయము. ఒరసి = పరీక్షించి.

8. నీళ్ళునమలుచు = సందేహించుచు. చెప్పన్ = (ద్వారకకుఁ దాను బోయిన పనిని) చెప్పుటకు. కొంకన్ = భయపడఁగా.

9. బెణఁకనీక = కదలనీక. ఇందు = ఈ చిలుక ద్వారకకుఁ బోవుటయందు. నేయర్థము = ఏమిపని కలదొయను తలఁపునన్. సరిపోదున్ = నశింతును. మాట పట్టీక = (ఈ రహస్యమును బయటఁబెట్టనని) యొట్టుఁబెట్టుకొనక. వీఁకన్ = దైన్యముతో.

10. నవనిధానిములును = (కుబేరుని) తొమ్మిది సొమ్ముల రాసులను. (మహాపద్మము, పద్మము, శంఖము, మకరము, కచ్ఛపము, ముకుందము, కుందము, నీలము, వరము నను నివి నవనిధులు). తవిలి = ఆసక్తిపడి. అనఘచరితులు = మంచినడవడిగలవారు. ఏలిన వారి రహస్యభంగమునకున్ = తమ్ముం బోషించువారి యేకాంతము యొక్క చెఱుపునకున్. (వెలిపుచ్చుట కని యర్థము). అనుమతింపఁజాలరు = ఒప్పికొనలేరు.

11. అడిగినమాటపట్టు = గోరినబాసయొక్క యవలంబనమును.

12. సొబగునన్ = చక్కఁదనముచేతను. అధికలు = గొప్పవారు.

13. విహారము = వేడుకగాఁ దిరుగుట. అభ్యర్ణసత్సభాగతుండగువాని = పైన (సునాభుని) మంచిసభను బొందినవానిని. రాజసభలోనికి వచ్చినవాని నని యర్థము. నాఁడున్. తన్పి = తృప్తినొందించి. సౌవిదప్రతతులన్ = అంతిపురములోని సేవకుల సముదాయములను. కూర్చి = సహాయపఱిచి. దేవులు = సునాభునిభార్యలు. కుమారికాన్వయము = కన్నెలజతయును. వినతితో = మిగుల వడఁకువతో.

14. పతిమనోవల్లభలు = మగని మనసునకుం బ్రియురాండ్రు. బాదులు = (ఉగ్గుంబాలుఁబోసి) పెంచిన దాసులు. తలిరుబోండ్లు = చిగురాకుం బోలిన దేహము గలవారు. తలిరు + మేను = తలిరుబోఁడి. (చంద్రవతియు, గుణవతియు).

15. విస్ఫురద్గుణశోభితల్ = ప్రకాశించుచున్న (శౌర్యసౌందర్యాది) గుణము లచే నలంకరింపఁబడ్డవారు.

16. ఒకటిన్ వెతన్ = ఒకదుఃఖమును. ఇవి = ఈ మాటలను. విన్నన్ = సునాభుఁ డాలకించినన్. పెనుఁజేటు = అధికమగు చెఱుపు. అసురులకున్ = రక్కసులకున్. పగవీడఁట = శత్రుపుర మని యెల్లవారుం జెప్పుకొందురు. (అఁట ప్రసిద్ధార్థకము).

17. ఆ పలుకు = నారదుఁడు చెప్పినమాట. ఎచట. సుబ్బకుండ = బయలు పడకుండ. అడఁచిరి = దాఁచికొనిరి. కూర్మి = ప్రేమము.

18. భోగయోగ్యము = సుఖముఁ (బొందుట) కుఁదగినది. అగు, ప్రాయము = వయసు. భర్తృసంగమన మనోరథంబున్ = మగనియొక్క (తో) కూడుటయందలి కోర్కియును. అతిగాఢము = మిగులబలపడినది. కాఁగన్. పతిప్రవృత్తిలాభము = మగనివార్తయొక్క (వార్త) దొరకుట. కడుదవ్వు = మిగుల దూరమైనది. కాఁగన్. మగనివృత్తాంతము చాలఁగాలము తెలియమిచేత నని యర్థము. గతక్షమన్ = పోయిన యోర్పుచేతను. సైఁపలేకపోవుటచేనని యర్థము. కుసుమాస్త్ర బాణములన్ = మన్మథబాణముల చేతను. అలసి = శ్రమపడి. కాంతియెచిక్కఁగన్ = లావణ్య మొక్కటియే మిగులునట్లుగాన్. చిక్కిరి = కృశించిరి.

19. అర్మిలిన్ = ప్రేమచేతను. ముచ్చటకాపుగా = సల్లాపమునకుం గాపుగా. తమ వినోదపు నెచ్చెలిగా = ఆ యిద్దఱియొక్క సుఖముగాఁ గాలక్షేపము సేయుటకు

సెయ్యిరాలుగా. కడుమచ్చికన్ = మిక్కిలి యాసక్తితోన్. ప్రత్యుపక్రియా సచ్చరితంబునన్ = (వారునాకుఁ జేసిన యుపకారమునకు) మఱుమేలు సేయుటచే (నా)మంచి నడవడిని. చూపంగన్ = చూపుటకు. అజస్రము = ఎల్లకాలమును. కోరుచుండుదున్.

20. భావజశరపీడన్ = మన్మథుని బాణముల చేతనైన బాధను. నా వెరవునన్ = నా యుపాయము చేతను.

21. మఱియున్ = వారి సేమము దెలిసికొని వచ్చుటయేకాక. అప్పటికొలఁదిని = నేనువారితో మాట్లాడు కాలముయొక్క పరిమాణముచేతను (పరిమాణము ననుసరించి). మంతనముగ =రహస్యముగ. మీ కోర్కిన్ = మీ యొక్క (వారిని వివాహము చేసికొనవలె ననెడి) యిచ్చను. చెప్పవచ్చినన్ = చెప్పుట కవకాశము కలిగెనేని. చెప్పి, మాఱుమాట = ప్రత్యుత్తరమును. తెచ్చెదను.

22. మద్విరహాసహత్వంబునం జేసి = నా యెడఁబాటున కోర్వలేమి చేతను. నన్ను విడిచియుండలేమిచేత నని యర్థము. అనుమానించినన్ = సందేహించినను. నాచేతనైనపాటి గమనకార్యంబు = నాచేత సాధింపందగినంత పరిమాణముగల పోవుట యొక్క (పోయిన) పనిని. ఆ లేఖ = నీవు నన్నుఁ బట్టుకొనినప్పుడు జాఱినకమ్మ. గుఱుతెఱింగెనేని = ఆనవాలుపట్టెనేని. ఏమి కొఱగామి = ఏమి కీడు. సంఘటిల్లునోయని = కలుగునోయని. తెలంకెదన్ = జడిసెదను. మత్పునర్దర్శనంబునకై = నాయొక్క (నన్ను) మఱలంజూచుటకై. మితిపెట్టిన దినంబు = నిర్ణయించుకొన్న రోజు, (గడువుదినము). ఎంతవంతన్ = ఎంత దుఃఖముతో. పొడసూపవలయు = కాన్పింపవలయును.

23. ఘనపయోవృష్టికి = మబ్బునీరు (వాన) గురియుటకు. చాతకములు వోలె = వానకోయిలలువలె. చాతకము నేలంబడిన నీరు త్రాగక వానగురియునప్పుడాకసముననుండి నీరు త్రాగునని చెప్పుదురు. భాస్కరోదయమునకు = సూర్యోదయమునకు. అబ్జములువోలె = తామర పూవులువలెను. ఇందుముఖులు = చందురుం బోలిన మోముగలవారు. (ఆ కన్నెలు).

25. చెప్పినంతవట్టు = చెప్పినదంతయు. కలదనిపించిరఁట = సత్యమని పలికించిన నని యర్థము. మదుపకారవృత్తి = నా యుపకారపు నడవడిని.

26. తదాకారాంకితమూర్తి = ఆ హంసిచేఁ బట్టఁబడిన దేహముగలది. కెళవులు = ప్రక్క తావులను. అరయుచు = వెదకుచు. శుద్ధాంతమున = అంతఃపురమునందు.

27. సౌధ విటంకమతల్లిక = మేడయొక్క ప్రశస్తమయిన కపోతపాలిక. (ముంజూరునకు సమీపమునఁ బావురాలు మొదలగునవి యుండుటకుఁ గట్టిన కట్టగూడు విటంకము కపోతపాలికయు ననంబడు. మేడలు మొదలగు వానియందుఁ బావురములు మొదలగునవి యుండుట కేర్పఱచిన చదరములగు కంబములని కొందఱు చెప్పుదురు). మాటుగ = (తనకు)ఁ జాటుగా. లాఁతిలేములు = పెఱయింతులు. చేరికన్ = సమీపమునందు. పాలయకుండ = ప్రవేశింపకుండ. అరసి = పరికించి. అకలంకస్వరతన్ = నిర్మలమగు స్వరముకలిమితో.

28. ఎలుంగు = కంఠస్వరము. ఉల్లసిల్లిరి = సంతసించిరి. అని = ఆ చిల్క పల్కు. వీనులన్ = చెవులయందు. ఊఁదుకప్పురపుఁ జలువలన్ = చల్లెడి కర్పూరపు ముక్కల చల్లందనమును. విరాళియలఁతన్ = వలపువలని యాయాసమును. వడిన్ = వేగముతో. తీర్పన్ = నివారింపఁగా. (పూర్వమునందలి క్రియతో నన్వయము).

29. అతి సంభ్రమంబునన్ = మిగుల వేగిర పాటుతో. హంసికావృతము = హంసిచే నాక్రమింపఁబడినది. అగు. చిలుకతెఱఁగు = చిలుకయొక్క విధమును. తద్భయనివృత్తి = వారి (తమ రహస్య మితరులు తెలియుదు రను) వెఱపుయొక్క మఱలుట. కాఁగన్ = అగునట్లు.

30. ప్రాతికూల్యంబు = (మీకార్యమునకు) విరోధము నని యర్థము. నిజము చేసినది = బాసయిచ్చినది. (ప్రమాణము చేసినది). కొంకకుఁడు = భయపడకుఁడు.

31. వెళ్ళ నాడించుకొని = స్పష్టముగాఁ బలికించి. ఉపకారంబు = మేలును. ఎక్కించి = సమకూర్చి. తత్ప్రార్థనావశీకృతహృదయ = ఆ కన్నెలయొక్క వేఁడుటచే వశపఱుచు కొనఁబడిన మనసుగలది.

32. ఇంద్రనిభుఁడు = ఇంద్రునితో సమానుఁడు. సాద్గుణ్యరాశి = మంచి గుణముల సముదాయము. (శౌర్యము, నౌదార్యముఁ, జక్కఁదనము మొదలగు మంచి గుణము లన్నియుఁ గలవాఁడు).

33. చాతురిన్ = నేర్పుతో. ఉచిత సమయములన్ = తగిన వేళలయందు. మచ్చిక = లాలనమును. పరిచయము ననియేని యర్థము. మఱియు నాసక్తి ననియుం జెప్పనొప్పును. ఈ యర్థమున మాటలాడి యని యధ్యాహరించి చేసితి ననుదానికిఁ బుట్టించితినని యర్థము చెప్పవలెను.

34. అంతన్ = పిమ్మటను. మీ హృదయేశులకున్ = మీ ప్రియులకు. మీ యభీష్టము తెఱఁగుల్ = మీ కోర్కుల వితమును. విదితముచేసితి = తెలిపితిని. మీ బ్రతుకుల తదపేక్షకైక పర్యంతతయు = మీ జీవితముల యొక్క (మీ జీవితములు) వా రుపేక్షించునంత వఱ కుండుటయును. తుదన్ = చిట్టచివరను. తెల్పితి.

35. ఏ యుపాయముల = ఏ తెరవుల చేతనైనను. ఇంతలోన = వారుమిమ్ముఁ బెండ్లియాడు నీ లోపలనే. ధృతిన్ = ధైర్యమును. సడలనిత్తురేని = విడిచెదరేని. ధైర్యమ్మునువదలి దేహమును విడిచితిరేని యని భావము. ఆత్మహతియ = తమ్ముఁదాము చంపికొనుట (వలనవచ్చెడు పాపమే). కాక, పతిహనన పాతకమున్ = మగనియొక్క (మగనిని) హింసించుటవలన వచ్చెడు దోషముసైతము. కల్గన్ = (మీకు) సంభవించు నట్లు. పల్కిరి = చెప్పిరి. వారువచ్చి వరియించు నందాఁక మీరు జీవింపరేని వారును జీవింప రని భావము.

36. కర్ణయుగళంబున్ = చెవులజంటను. కరయుగంబులన్ = రెండు చేతులతోను, (మీఁదటి యమంగళమగు పలుకు విన నిచ్చలేక) మూసికొనుచు. తమకున్ = వా రిద్దఱకును. అంత = మీఁదఁ జెప్పినంతటి యాపద యని యర్థము. దీర్ఘాయురన్వితులు = చిరాయువుతోఁ గూడినవారు. వియోగవనరాశిన్ = ఎడఁబాటను సముద్రమునందు. తమమాటయాస = వారి (తప్పక వచ్చెద మని దృఢముగాఁ జెప్పిన) పలుకులయొక్క (పలుకులవలని) యపేక్షయే. పెన్దెప్ప. కాన్. అచలమైనతాల్మిన్ = కదలని (విడువని) ధైర్యముతో. అస్మదీయ ప్రాణ సంరక్షయందు = మా ప్రాణముల కాపాడుట విషయమై. తగిన త్రోవ = తగిన యుపాయము. మా భాగ్యవశమున =

మా యదృష్టవశముచేతను. ఓర్చుటయకాక = సహించుటయకాని, తమకింప = నేగిరించుట. యుక్తమగునె = తగునా ? సముచితవాక్యసరణిన్ = తగిన మాటల పద్ధతితో.

37. మిగులన్ తడయక = చాల నాలస్యముసేయక. రూఢితో పాయమున్ = తగిన సాధనమును. ఆపాదించెదన్ = కల్పించెదను.

38. ఆ చెలువ పనుపునన్ = ఆ ప్రభావతి యాజ్ఞచేతను. తనుబుకొని = వెంబడించి. నిమిత్తము = కారణము. అచ్చట = ప్రభావతియొద్ద. ఇచ్చటి రహస్యంబు. వెలివోవనీక = బయలుపడనీక. నిచ్చలంపు మనంబులన్ = నిశ్చలమైన (భయములేని) మనసులతో. అత్యంత సంతుష్టాంతరంగలు = మిగుల సంతసించిన మనసు గలవారలు.

39. నీ సౌభాగ్యపు విలసనము = నీయదృష్టముయొక్క ప్రకాశమే. (నీయందుఁ బ్రియునకుఁగల ప్రేమయొక్క ప్రకాశమే). అర్మిలిన్ = కోరికతో (ప్రేమతో నని యేని యర్థము).

41. విశదముగ = స్పష్టముగా. ఎక్కడిది = ఎక్కడనుండువచ్చె. ఇట = ఇక్కడను. తేక = (దానిని) తీసికొనిరాక. నీ కడుపుకంచె = నీ కడుపు మాంసము. విత్తుఁగ = చీల్తునుగదా ! నీ కడుపు కోయుదు నని యర్థము. (ఇది ముద్దుచేఁ జిన్నపిల్లలు మొదలగు వారింగూర్చి పలికెడు పలుకు). నీ కడుపు కందవిత్తుగ ననియుఁ గొందఱు చదువుదురు. అప్పుడు, నీ కడుపు = నీ గర్భము. కందవిత్తు = కందవిత్తనము. కన్ = అగునట్లు. కందవిత్తన మొకసారి వేసినఁ బెక్కు పిలకలం బెట్టి యభివృద్ధి పొందినట్లు నీకడుపు (సంతానము) మిక్కిలి యభివృద్ధిఁ జెందునట్లుగా. ఏల విడిచితి వని వెనుకవానితో నన్వయము.

43. నందుచు = పీడనొందుచు. లేఖ = జాబును. ఆ పులుఁగువలన = ఆ చిలుకవలన. ముదాపూర్ణతన్ = సంతసముయొక్క (సంతసము) నిండుటచేతను. మిగుల సంతసముచేత నని యర్థము. ఉబ్బి = పొంగి. విడిచితిని.

44. అతండు = నీ ప్రియుఁడు. అనిచిన పత్రిక = పంపిన జాబు. తద్విచారంబు = ఆ చిలుకయొక్క (వృత్తాంతమును) బరిశీలించుట.

45. ఆ పత్త్రికార్థము = ఆ కమ్మలోని (శబ్దముల) యర్థము. ఏన్. విన్నట్లె అగున్. కదమ్మ. అది = రాగవల్లరి. అవల = తరువాతను. ఒడిసి = పట్టుకొని. బలిమిన్ = బలాత్కారముచేతను. ఈ పడుచు = ఈ కన్నియ. (ప్రభావతి). అనన్య ప్రకాశనీయంబులు = ఇతరులకుం బయలు పఱుపరానివి. అయిన, ప్రేమ భంగులన్ = స్నేహము యొక్క యవస్థావిశేషములను. నాయికా నాయకుల కొండొరుల యందు దృఢంబుగ మనంబు దగులుట ప్రేమము. ఆ కాముకుని కూర్ములు = ఆ ప్రియుని నెయ్యము దెలుపు వాక్యములను. మోదసంపదన్ = సంతోషాతిశయముచేతను. పొదలనిమ్ము = వృద్ధి నొందనిమ్ము.

46. భ్రాంత్యావిష్టుండు = భ్రాంతిచే నావేశింపఁ బడినవాఁడు. వెఱ్ఱియెత్తిన వాఁడని యర్థము. అమితపుఁ గూర్మల్ = హద్దులేని ప్రేమం దెలుపు మాటలను. ఏమి ప్రాయఁడు ?

47. ఈ తరుణిగుణంబులు = ఈమె చక్కఁదనము మొదలగువానిని. విరక్తి స్థిరుఁడట్లు = ప్రేమలేమిచేఁ జలింపని మనసు గలవాఁడువలె. విరహార్తుఁడన్ = ఎడఁబాటుచేఁ బీడింపఁబడిన వాఁడను. అనుట. వెఱఁగయ్యెడున్ = ఆశ్చర్యముం గలిగించును. ఆశ్చర్యము గలుగునని యేని చెప్పఁదగు.

48. సదృశశ్రీయుక్తిన్ = తనకుం దగిన శోభయొక్క కలిమితో. తనర్చుబిత్తరిన్ = ప్రకాశించు సందగత్తెను. నెఱి = న్యాయమును. తొలంగక = విడువక. ఆతని యాత్మ = ఆతని మనసు. కులిశంబో = వజ్రమొ! (రూప యౌవనాదులం దనకుఁ దగిన యింతి తన్ను వలచిన దని విన్నవాని కెంత స్థిరచిత్తునకైనను మదన వికారంబు పుట్టకమాన దని భావము).

50. సకల = సమస్తమైన. (ఇది గుణవిశేషణము). సౌభాగ్య = ప్రియుని కింపు పుట్టించు సొంపునకును. భాగ్య = ఐశ్వర్యమునకును. లక్షణ = గుఱుతులగు. గుణ = చక్కఁదనము, నడఁతోవ మొదలగువానికి. ఏకఖని = ముఖ్య వాసస్థానము. (అగు) ప్రభావతి. సిద్ధసంకల్ప = ఈడేరిన తలఁపుగలది. శాస్త్రములు = అవశ్యము చేయవలసిన కార్యములను గాని, తప్పక విడువవలసిన వానిం గాని తెలుపు వేదములును,

మన్వాది స్మృతులును శాస్త్రములు. కొందఱు గజతురగ శకునసాముద్రిక గ్రంథము లును, వ్యాకరణ పురాణేతిహాసాదులును శాస్త్రములు అందురు. కాని యిచట సిద్ధము భాగ్యవంతులు, గుణవంతులు నగువారు తలఁచిన కార్యములు తప్పక సిద్ధించు ననెడు లౌకిక వాక్యములను, నట్టి పురాణాది వాక్యములను, సాముద్రిక వచనములను మాత్రము చెప్పును. విబుధులకు = విద్వాంసులకు. ప్రత్యయానర్హతన్ = నమ్ముటకుం దగని వగుటచేతను. వృథాభరమె = వ్యర్థమైన బరువే. కావె?

52. సిద్ధసంకల్పత = ఫలియించిన కోర్కులు గలుగుట. గుమ్మడుకాయంతో నావగింజయుఁ బోదు = నేఁ దలఁచిన కార్యములోఁ గొలఁది భాగమైనను గాలే దని యర్థము. (ఇది యెవ్వరైనను దలఁచిన కార్యము పూర్తిగా నెఱవేఱకున్నను ఫలించు నని తోఁచునప్పు డితరులు మీ కార్యము తలఁచినట్లగు నని పల్కఁగా వారు దానియందు దృఢమైన నమ్మకము లేమిచే ననెడు లోకోక్తి). నా చింతాభరంబులో = నా చింతా రాతిశయములో. లేశమాత్రంబు = కొంచమైనను. ఉడుగుట = విడుచుట. తాదృశా శ్చర్య సౌందర్య కోమలాంగుఁడు. అట్టి (నీచే వర్ణింపఁబడిన) వింతయైన చక్కఁదన ముతోఁ (గూడిన) మృదువగు దేహము గలవాఁడు. ఎంత యలసెనో = ఎంత శ్రమ పడియెనో. ఎంత కుందెనో = ఎంత కృశించెనో. వెతయు = దుఃఖము నైనను. తొంటికంటె = మునుపటికంటె. విశేషము = అధికము. ఒదవెన్ = కలిగెను. తెర యింపన్ = దాఁటుటకు. తెరువు = ఉపాయ మని యర్థము. అసురపతి = రాక్షస రాజు (మా తండ్రి వజ్రనాభుఁడు). అల్లుఁడనము = అల్లుఁడగుటను. ఒల్లఁడు = అంగీ కరింపఁడు.

53. నాకవిరోధి యనుమతి = స్వర్గమున (నున్నవారల)కుం బగవాని (వజ్రనా భుని) యొక్క యంగీకారమును. సాధించుటకు = సంపాదించుటకు. అనువు = సందు. సరసకథా కథనప్రవీణ = చక్కని వృత్తాంతములయొక్క చెప్పుటయందు మిగుల నేర్పు గలది. సకలవిద్యాధురీణ = ఎల్లవిద్యల బరువు మోచినది. (అన్నిశాస్త్ర ములఁ దగిన పాండిత్యము గలది). ప్రభువులన్ = (అనుగ్రహించిన, రక్షించుటకు నాగ్రహించిన దండించుటకుఁ దగినవారిని) రాజులను. ఉబుసుపుచ్చి = (వేడుక మాట లతో) పనిలేని కాలమును గడపి. మెచ్చింపనేర్చున్ = (తనయందుఁ) బ్రీతిపుట్టించుటకుం దగును. భవజ్జనకునకు = నీ తండ్రికి. సమ్ముఖమ్మునకు = (ఆయన) యెదుటికి. మీఁదటి కార్యంబునకు = తరువాతి పనికి. దైవంబు = పూర్వ జన్మమందలి కర్మము. (అదృ

ష్టము). మాటబడిన = (నన్నుఁదీసికొని రమ్మని నీతండ్రి) చెప్పినపల్కు వెంబడినే. పిలుసింతుగాని.

54. విశ్రుతతేజుఁడు = ఎల్లవారిచే మిక్కిలి వినంబడిన ప్రతాపము గలవాఁడు. (వజ్రనాభుఁడు). వెలుపలికొల్వు = వెలుపల నున్నసభ (లోనిజనుల)ను. వీడ్కొలిపి = సెలవిచ్చిపంపి. రాణివాసమున = అంతిపురమునందు. ఆడెడిపాడెడి పువ్వుఁబోండ్ల సేవలు = నాట్యము చేయునట్టియు, గానము చేయునట్టియు స్త్రీల (వేశ్యల) యూడిగములను. కొనుచుండ = గ్రహించుచుండఁగా. చేరి = (ప్రభావతి) వెళ్లి. తగువర్తనన్ = (తండ్రియొద్ద) నుండఁదగిన యునికితో. వత్సలతయు = ప్రేమమును. పెద్దలకుఁ బాలురయందుండు నెయ్యము వత్సలత. గారవంబు = ముద్దును. వెదచల్లెడు మాటలన్ = ప్రకటించెడు పల్కులతో. ఆదరింపఁగన్.

55. ప్రసంగంబు = ప్రస్తావమును. తిగిచి = తెచ్చి. సవినయ మధుర భాషణంబులన్ = అడఁకువతోఁ గూడినవియు, నింపుగలిగించు నవియు నగు పలుకులతో.

56. బొడ్డన బావులన్ = దిగి నీళ్లు ముంచుకొనుటకు వీలగునట్లు మెట్లుకట్టిన కోనేటుల యందు. గని = ఉత్పత్తిస్థానము.

57. వచోనిపుణత్వమునందున్ = మాటలయొక్క నేర్పునందును. సత్కథారచనలయందున్ = మంచి వృత్తాంతములయొక్క (వృత్తాంతములను) జెప్పుట యందును. నీతి విదురత్వమునందున్ = నీతిశాస్త్ర పాండిత్యమునందును. బహుశ్రవావలోక చణతయందున్ = గొప్పకీర్తి గలవారియొక్క (విద్వాంసులయొక్క యనియేని చెప్పఁదగు) దర్శనముచేతఁ గల్గిన ప్రసిద్ధియందును. దానికి = ఆ హంసికి. సరి = సమానుల నని యర్థము. చతురతా విశేషములు = దాని కాయాయి చదువులయందుఁ గల నేర్పుల నని యర్థము.

58. అనుఁగుఁ గూఁతు మాటలు = ప్రియపుత్రికయొక్క పలుకులను. ముద్దు సేయుచు = ఆదరించుచు.

59. విద్యావిలసనము = చదువులయొక్క ప్రకాశమును.

60. సుధారసముల సోనలు = అమృతరసముయొక్క (బిందువులను). వర్షించు = చిలికెను. మృదుల = మెత్తని (వినసొంపగు). సుస్వరభణితిన్ = మంచి ధ్వనిగల వాక్కు(ల)తో. గ్రుక్కక = తొట్రుపాటు నొందక. (సంకోచింపక యనియేని). పనిలేని పునఃపదములు = అక్కఱలేనివియు, మఱియొక్కసారి ప్రయోగించినవియు నగు శబ్దములను. ఇడక = ఉపయోగింపక. లీల = విలాసము. తలిర్పన్ = ఒప్పఁగా. (ముందరి పద్దెములోని వక్కాణించె ననుదానితో నన్వయము). కవి యిందు హంసి ప్రసంగమును స్తుతియించు నెపమున దానిం జేయవలసిన విధమును జెప్పెను.

61. పూర్వపక్షములు = వాదమునకు మొదటి యంశములను. జోకన్ = ఉత్సాహముతో. పెంచుచున్ = ఎక్కువగాఁ జేయుచు. అక్షీణప్రౌఢిన్ = తక్కువకాని (అధికమగు) నేర్పుచేతను. తిరస్కరించుచున్ = (వాని) నిరాకరించుచున్. తుదన్ = చివరను. సిద్ధాంతములు = తగిన యుత్తరములను (ప్రమాణములచే నిర్ణయింపఁబడిన యర్థము సిద్ధాంతము) నిల్పుచున్. కాణాదంబును = వైశేషికమతమును. ఇది కణాదమునిచేఁ జెప్పఁబడినది గావున నీ పేరు కలిగెను. విశేషమను పదార్థము గలదని చెప్పువారు వైశేషికులు. (నిత్యములగు పరమాణువులు మొదలగు వానియందుఁ బరస్పరభేదముం దెలుపు ధర్మము విశేషము). ఇందు ద్రవ్యాదులగు నేడు పదార్థములు విచారింపఁబడును. ఈ విచారముచే దుఃఖనాశరూప మగు మోక్షము వచ్చునని యిందుఁ జెప్పఁబడెను. ఇప్పుడు తఱచుగాఁ జదువు తర్కమునకిది మూలము. గౌతమీయమును = గౌతమునిచే రచియింపఁబడిన న్యాయశాస్త్రమును. దీనియందుఁ బ్రమాణప్రమేయాదులు పదియునాఱు పదార్థములు నిరూపింపఁబడియెను. మఱియు నీ పదార్థముల తత్త్వజ్ఞానమున మోక్షము గలుగు ననియుఁ జెప్పఁబడె. సాంఖ్యంబున్ = కపిలాచార్యునిచేఁ గల్పింపంబడిన తత్త్వశాస్త్రమును. కపిలుఁడు దీనియం దిరువదియాఱు తత్త్వములను; బ్రకృతిపురుషుఁడు మొదలగువానిని నిరూపించి. ప్రకృతి = ప్రధానము. (అద్వైతులు దీనినే మాయయందురు). పరసహాయము నొందకయే ప్రపంచ నిర్మాణము మొదలగు వానిం జేయుననియుఁ బ్రకృతికంటె వేఱుగఁ బురుషు నెఱుంగుటచే మోక్షము కల్గుననియుఁ జెప్పెను. భుజంగాగ్రణీవాణీమార్గము = పతంజలియొక్క యోగశాస్త్రమును. (భుజంగములు = పాములు. అగ్రణి = వానియందు. ముఖ్యుఁడు = శేషుఁడు). అతని (యవతార మగు పతంజలి) యొక్క వాణీ = సరస్వతి; గ్రంథము (యోగశాస్త్రము). దానియొక్క, మార్గము = మార్గమును. మనసును బాహ్యపదార్థములనుండి మఱలించి భగవంతునందు నిలుపుట యోగము.

ఇదియును దీని యంగము లగు యమనియమాదులును నీగ్రంథమునందు విస్తరముగఁ జెప్పంబడియె. జైమినీయమతమున్ = జైమిని యను మునిచే రచియింపఁబడిన మీమాంసయొక్క యభిప్రాయమును. వ్యాసశిష్యుఁడగు జైమిని దీనియందు యజ్ఞాది కర్మముల స్వరూపములను, వాని ఫలములను, నాకర్మములం జేయందగిన యధికారులను నిరూపించెను. వ్యాసోక్తశాస్త్రంబు = వ్యాసునిచే రచియింపఁ బడిన యుత్తర మీమాంసమును. (మీమాంస = పూజిత విచారణ) దీనియం దామునిచే జీవునికంటె వేఱు గాని బ్రహ్మముయొక్క స్వరూపము చక్కఁగ విచారింపఁబడియె. వక్కాణించెన్ = స్ఫుటముగా నుపన్యసించెను.

62. అవ్విహగి = ఆ యంచ. ఏవేళన్ = ఏ కాలమునందు. ఎద్ది = (తనకు సాధించుటకు). మతంబు = ఇష్టమో. అప్పుడు = ఆ కాలమునందు. (అద్ది = దానిని). దృఢానుమానములన్ = బలమైన యనుమాన ప్రమాణములచేతను. (కార్యము మొదలగువానిచేఁ గారణము మొదలగువాని నూహించు టనుమానము). దైత్యశ్రేష్ఠుఁడు = రక్కసులయం దుత్తముఁడు (వజ్రనాభుఁడు). ఓహో యనన్ = బళీ యనునట్లు. స్తుతించు నట్లని యర్థము. సంస్థాపించున్ = తిరుగులేకుండునట్లు స్థిరపఱుచును. అన్య శాస్త్రమతస్థాపనవేళన్ = ఇతర శాస్త్రముల యభిప్రాయముయొక్క (యభిప్రాయ మును) నిలుపఁగోరిన కాలమందు. వానివానికి = (తాను జెప్పిన) మునుపటి యనుమాన ప్రమాణముల కన్నిటికిని. ఉపాధిగ్రస్తతా వ్యాప్తిభంగ ముఖానేక సుదూషణంబులు = ఉపాధిగ్రస్తత్వము. వ్యాప్తిభంగము మొదలగు మంచి (నివారింపరాని) దోషము లను. (వజ్రనాభుఁడు స్తుతించునట్లు). వెసన్ = శీఘ్రముగాను. కల్పించున్ = రచి యించును. సాధ్యమున్నచో నుండి సాధనమున్నచో నుండనిది యుపాధి. పర్వతము. ధూమముగలది. వహ్ని గలుగుటవలనను ననుమానమునందు ఆర్ద్రేంధనసంయోగము (తడికట్టెలకూడిక) పాధి. ఇది సాధ్యమ (సాధింపఁదగినది)గు పొగయున్నచోట నున్నది. సాధనమ (హేతువు)గు నిప్పున్న యయోగోలకము (ఇనుపగుండు) మొదలగు వానియందు లేదు. కావున, నిది యనుమాన దోషమని తార్కికులు చెప్పుదురు. దానితోఁ గూడుట యుపాధిగ్రస్తత్వము.

హేతు వున్నచోట నెల్లసాధ్యముండుట వ్యాప్తి. ఉ. పర్వతము వహ్నికలది, ధూమముకలది యగుటవలనను ననుమానమునందు హేతువగు ధూమమున్న పర్వతము నందుఁ దప్పక యగ్నియుండును. కాన, నెచ్చటఁ బొగయున్నదో యచ్చట నిప్పు

తప్పకయుండునని వ్యాప్తి చెప్పవచ్చును. ఇది (యీ భూభాగమును) లోహలేఖ్యము (ఇనుప గునపము మొదలగువానిచే భేదింపఁదగినది). పార్థివమగుట (భూవికారమగుట) వలనను ననుమానమునందు పార్థివత్వ లోహలేఖ్యత్వములు పెక్కుచోట్లఁగూడి యుండినను పార్థివమగు వజ్రమునందు లోహలేఖ్యత్వములేమిచే నీఁదటియట్లు వ్యాప్తి కుదురదు. కావున నిట్టి యనుమానములయందు వ్యాప్తిభంగమను దోషము కలదని చెప్పుదురు.

64. ఆ యసురభర్త = వజ్రనాభుఁడు. ప్రశంసించునట్లు. జాలపాదభామినీమణి = శ్రేష్ఠురాలగు నా హంసి. కావ్యములయొక్కయు. వ్యంజనావృత్తిచేఁ గర్తవ్యముల (చేయవలసిన మంచిపనుల)యందుఁ బ్రవృత్తి, (ప్రవేశమును) నిషిద్ధముల (చెడుపనుల) యందునివృత్తి (మఱలుటను) బోధించు గ్రంథములు కావ్యములు. (శబ్దార్థసమన్వయము బాగుగ నైన పిమ్మట వాక్యార్థము నలంకరించుటకై వేఱ అర్థమును దెలుపు శబ్దవ్యాపారము వ్యంజన). నాటక = నాటకములయొక్కయు. దేనియందుఁ బురాణాది ప్రసిద్ధుఁడగు ధీరోదాత్తనాయకుఁడును, ముఖ్యముగ శృంగార వీరరసములలో నొక్కటియు సప్రధానముగఁ దక్కిన రసంబులును వర్ణింపఁబడునో యట్టి ప్రబంధము నాటకము. (గంభీరుఁడును, బలముగలవాఁడును, దయాళువుఁ దన్నుఁ దాను స్తుతించుకొననివాఁడును, బగవానినైనను సద్గుణములఁ బ్రశంసించువాఁడు నగు నాయకుఁడు ధీరోదాత్తుఁడు). అలంకార = అలంకారశాస్త్రముయొక్కయు. శృంగారాది రసముల నుపమ మొదలగు నలంకారములను, మాధుర్యాది గుణములు మొదలగు వానిం దెలుపునది యలంకారశాస్త్రము. గాన = సంగీతశాస్త్రముయొక్కయు. మదనశాస్త్ర = కళాశాస్త్రముయొక్కయు. పరిచయ మహిమంబు = జ్ఞానము యొక్క గొప్పతనమును (వీనియందలి పాండిత్యాతిశయమును) ఉద్దామపటిమన్ = గొప్పసామర్థ్యముతో. నెఱపెన్ = ప్రకటించెను.

65. నానా దిగంతచారిణివి = ఎల్లదిక్కులచివరలను దిరిగినదానవు. విచారించుట = ఆలోచించుటను. అభినయించి = ప్రకటించి. (తా నదివఱకే నిశ్చయించుకొన్నది. గావున నాలోచింపవలసినది లేకున్న నాలోచించి నట్లతనికిఁ దోఁచునట్లుచేసి)

67. అత్యద్భుతంపు నాట్యపటిమ పెంపు = మిక్కిలి వింతయగు నాట్యమునందలి నేర్పుయొక్క యతిశయమును. సాత్త్వికము, నాంగికము, నాహార్యకము, వాచికము

నను నాల్గువిధములగు నభినయములచే ధీరోదాత్తాదులగు నాయకుల యవస్థ ననుకరించుట నాట్యము. స్తంభము (రాగము భయము మొదలగువానిచేఁ గలుగు ప్రాన్పాటు) మొద లగువాని ననిమేషత్వము (రెప్పపాటులేమి) మొదలగువానిచేఁ బ్రకటించుట సాత్త్వి కము. చేయిమొదలగు నవయవములచే నర్థమును సూచించుట యాంగికము. అనుక రించు నవస్థకుం దగిన యలంకారములు ధరించు టాహార్యకము. ఆయాయి రసములకుం దగిన రాగములతోఁ బద్దెములం జదువుట వాచికము. అనుకరించుటయన నటుఁ డెవ్వని యవస్థం బ్రకటించునో వానితాదాత్మ్యము (అభేదము) నొందుట.

68. సవిస్తరముగన్ = పెక్కు మాటలతోఁ గూడునట్లు. ఆశ్చర్య కౌతుకా యత్తాత్ముఁడు = వింతకును, వేడుకకును లోఁబడిన మనసుగల వాఁడు. (అతనియాట నేర్పు వినఁగానే మిగుల నచ్చెరువంది యది చూడ వేడుకగలవాఁడై). ప్రవీణవు = నేర్పు గలవాఁడవు. మెచ్చు = బహుమానము.

69. ఇంతయున్ = నీతండ్రియొద్ద భద్రుఁడను నటుని స్తుతియించి యతనిఁ దీసి కొని రా సెలవునొంది నేఁ బోవుట. భవత్ప్రియార్థమె = నీ యిష్టమును సాధించు కొఱకే. భద్రు నిచ్చటికిం దెచ్చుటకే యని యర్థము. నీ మగనిం దెచ్చుటకే యని యర్థాంతరము.

70. గూఢవృత్తిన్ = రహస్యమగు వ్యాపారముతో. (ఇతరులకుం దెలియ కుండునట్లు). తదిష్టసాధనపరత = ఆమెకుం బ్రియమైన కార్యముయొక్క నెఱవేర్చుట యం దాసక్తిని. నియుక్త = ఆజ్ఞాపింపఁబడినది. అసురజయ సహాయ్యకంబు = రాక్షసులయొక్కజయమునకుఁ (రాక్షసులను గెలుచుటకు) తోడ్పాటును. తదీయ శాసనంబున = కృష్ణుని యానతిచేతను. వాసవునకు = ఇంద్రునకు. వియోగతా పాతిభారంబునన్ = ఎడఁబాటు (వలని) కాఁకయొక్క యతిశయముచేతను. అసుర సురగుచు = నిట్టూర్పు నిగుడించుచున్. నొగిలి = బడలి. తదుదంతచింతంజేసి = ఆమె వృత్తాంతమందలి తలఁపుచేతను. ఆమె వృత్తాంతముం దెలియఁ గోరుటచేత నని యర్థము. నిజాగమనంబ = తన (హంసియొక్క) రాకనే. అతిమాత్రాదరగౌరవంబు = అధిక మగు ప్రీతితోఁగూడిన మన్ననను. ఏకతంబునన్ = ఎవ్వరులేని చోటను.

71. హాళికలిమిన్ హాళి = ఆసక్తియొక్క (ఆసక్తి). కలిమిన్ = కలుగుటచేత.

72. హంసీకులోత్తంసము = అంచజాతియందు మత్తమురాలగు శుచిముఖి. (ఉత్తంసము = శిఖం జుట్టు పూలదండ. ఇచట శ్రేష్ఠవాచకము). తన్మూలమున్ = ఆకోర్కికిం గారణమును. (పార్వతి ప్రద్యుమ్నుని వ్రాసియిచ్చుటను). ఇది = ఆమెకోర్కెని. నాఁడె = నేను మున్ను నీయొద్దకు వచ్చినదినముననే. తద్ఘనశోభాస్తుతి = ఆమె గొప్ప చక్కందనముయొక్క పొగడ్తను.

73. గుట్టు = రహస్యము. ఆకళించినదానన్ = తెలిసికొన్నదానను. భవానీకృపానుగ్రహపతి ప్రకారంబు = పార్వతియొక్క దయచేతను, అనుగ్రహము చేతనుఁ బ్రాపించిన మగనివిధమును. (పార్వతి కనికరించి ప్రభావతిని తనభక్తురాలుగా నెంచి ప్రద్యుమ్ను నామెకు మగనిం జేసిన విధమును).

74. ఓ యదుప్రవరుఁడ = యదువంశమునఁ బుట్టినవారిలో నుత్తముఁడా! చూపు = ప్రభావతి దృష్టి. భవదమలాకృతి ప్రతిమన్ = నీస్వచ్ఛమగు నాకారముయొక్క బొమ్మయందున్. పర్వినయప్పుడు = వ్యాపించిన యప్పుడు. (నీప్రతిమం జూచునపుడు). క్రమ్మఱన్ = మఱలను. తివన్ = (వెనుకకు) లాగుటకును. కదలింపన్ = చలింపఁ జేయుటకును. రాక = వశపడక. సుదతిన్ = ప్రభావతిని. గతచేష్టితన్ = పోయిన చేష్టలుగల దానిని. (ఒడలెఱుఁగనిదానిని) చేసెన్ = కావించెను. (దీనికిం జూపుకర్త). ఏమి చెప్పుదున్ = ఏమి చెప్పను ? (ఈ యంశ మనుభవమునం దెలియవలయుంగాని చెప్ప సాధ్యము కాదని భావము). అత్తఱిన్ = ఆ సమయమునన్. (ప్రభావతిని బరవశురాలిం జేసినప్పుడు). రాగ = ప్రేమయొక్కయు. కుతూహల = వేడుకయొక్కయు. విస్మయ = ఆశ్చర్యముయొక్కయు. అతిగౌరవమునన్ = ఎక్కువ గొప్పతనముచేతను. ఎంతవ్రేఁగగుచున్ = ఎంత బరువు కలది యగుచున్. రాపడియుండెనో = కదలనిదియై యుండెనో. కాని దీనికిని జూపే కర్త. (దీనికిం బూర్వవాక్యముతో నన్వయము).

75. కొసరక = సంకోచింపక. చూపుచేత. కడున్ = మిక్కిలి. క్రోలిన నీచెలువంబు = గ్రహించిన నీ చక్కందనము. చెల్వమానసమునన్ = ప్రభావతి యొక్క మనస్సునందున్. ఎంతఘనంబుగన్ = ఎంతయధికముగాన్. హత్తె

నోకాని తగుల్కొనెనో కాని. అప్పుడు = నీ బొమ్మం జూచినప్పుడు. ఓ రసిక శిఖావతంస = ఓ ప్రద్యుమ్నుఁడా! (శృంగారాది రసముల నెఱిఁగినవారికి శిరోభూషణమా)! కిసలయపాణి = ప్రభావతియొక్క. (చిగురాకుంబోలిన చేతులుగలది). క్రేవన్ = పార్శ్వమునందున్. పొరింబొరిన్ = మాటిమాటికిన్. గగుర్పొడిచెన్ = గగుర్పాటు. సుఖమువలనంగాని, భయవిస్మయాదులవలనంగాని కలుగును. (అధికముగా నని యేని యర్థము).

76. వావిరిన్ = క్రమముతోన్. భవత్ = నీయొక్క. పరిరంభణ = కౌఁగిలి. చుంబన = ముద్దుపెట్టుకొనుట. ఆది = మొదలగు. నానావిధ = పెక్కు తెఱఁగులుగల. భోగ = సుఖానుభవములయొక్క. లీలకున్ = విలాసమునకున్. ఉవ్విళులూరుచున్కిన్ = త్వర (వేడుక) పడుచుండుటచేతను. వ్రీడావతి = ప్రభావతి. (సిగ్గుకలది). కొన్ని నిశలన్ = కొన్ని రాత్రులయందున్. విలసిల్లు కుట్టమితభావ విశేష విజృంభణంబులన్ = ప్రకాశించు కుట్టమిత మను శృంగారచేష్టయొక్క యతిశయమును. తెల్పెన్. (అధరపీడనము మొదలగువానిచేఁ గోప మభినయించుచున్నను లోపల నధికమగు నానందముం బొందునట్టి యింతులచేష్ట కుట్టమితము).

77. పద్మాక్షి = ప్రభావతి. అక్షులు = కన్నులు. అహోరాత్రములందున్ = పగళులయందును, రాత్రులయందును (వరుసగాన్). పద్మకుముద స్ఫూర్తిన్ = తామరపూవులయొక్కయుఁ, గలువపూవులయొక్కయుఁ గాంతిని. విడంబింపన్ = అనుకరింపఁగా, (పోలఁగా). తత్ = అట్టి. స్వప్న = కలయొక్క. ఆగమ = వచ్చుటయందలి. అమర్ష = కోపముచేతను. విహ్వాలితస్వాంతయ పోలెన్ = చలించిన మనసు కలదివలెనే. నిద్రన్. నెఱయన్ = పూర్ణముగాన్. వర్జించెన్ = విడచెను. తప్పుచేసినవారి విషయమై మనసు మండుట మర్షము. నిద్రవలన మున్ను నీతోఁ గలసినట్లును, గలహించినట్లును గలవచ్చుటచే దానియందలి కోపమననో యనునట్లామె రేలుంబగలు నిద్ర మానె నని యాశయము. ఇందు జాగరమను మన్మథావస్థ చెప్పంబడియె.

78. అత్తరుణికి = ఆ ప్రభావతికి. నెమ్మేను = శరీరము. చిత్తజ మహాగ్ని కాఁకలన్ = మన్మథుఁడనెడు గొప్ప అగ్నియొక్క వేఁడిచేతను. ఎత్తు తఱిగి =

తూనికచేతను దక్కువయై. (మిగులంగృశించి యని యర్థము). ఎంతయు = మిక్కిలిగా. వన్నెయెక్కెన్ = కాంతిచే నతిశయించెను. జను లందఱు. పుత్తడిబొమ్మయను మాట = (ఆమె) బంగారుబొమ్మ యనుమాట. ఏల = ఎందునకు. బొంకు = అసత్యము. అగున్. జను లామె పుత్తడిబొమ్మ యనుమాట సత్యముకాదు కాఁబట్టి బంగారు కాల్చినకొలఁదిఁ దూనికచేఁ దగ్గి వన్నెచే నతిశయించినట్లామె శరీరము మన్మథ తాపము నొందిన కొలఁదిని కృశించి యెక్కువ లావణ్యము నొందెనని భావము. ఇందు గార్శ్యము = చిక్కుట యను మన్మథావస్థ చెప్పంబడియె.

79. రోలంబ నికురుంబ నీలిమశ్రీన్ బోలెన్ = తుమ్మెదలగుంపుయొక్క నల్లందనముయొక్క శోభం బోలినశోభ (గల్గుట) చేతనో యనునట్లు. వేణిన్ = జడను. ముట్టుట = తాఁకుట. కడున్ = మిక్కిలి. విరసము = ఇష్టములేనిది. అయ్యెను. మదకోకిలశుకస్వరసామ్యమునఁ బోలెన్ = మదముతోఁ గూడిన కోయిలలయొక్కయుఁ, జిలుకలయొక్కయుఁ గంఠధ్వనితోడి పోల్కి గల్గుట చేతనువలనే. సఖులసల్లాపము = చెలులమాటలు. అసహ్యము = ఓర్వరానిది. అయ్యెను. పరిపూర్ణ చంద్రబింబ సమత్వమునఁ బోలెన్ = నిండు చందురుని బింబముయొక్క సాటి (గల్గుట) చేతనోయనునట్లు. నిలువుటద్దము. అదర్శనీయము = చూడఁగూడనిది. అయ్యెను. ప్రసవాస్త్రవివిధమార్గణవర్ణస్ఫూర్తిఁ బోలెన్ = మన్మథుని పలువన్నెలుగల పూలబాణములయొక్క ఛాయం బోలినఛాయను ధరించుటచేతను వలనే. రత్నభూషాళి = వజ్రములు కెంపులు మొదలగు మణులతోఁ గలసిన నగల సమూహము. అగ్రాహ్యము = ధరింపరానిది. అయ్యెను. నీ విలసనంబులు = నీ క్రీడలను. ఉల్లమునన్ = మనసునందు. తలపోయుటయొక్క టెక్కున్ = ఆలోచించుట యొక దానిని విడిచి. ఆ పడఁతికిన్ = ప్రభావతికి. ఇతరవస్తు రుచులన్నియును = మిగిలిన పదార్థములయందలి కోర్కు లన్నియును. కానివావి = విడువందగిన చుట్టఱికము గలవి. అయ్యెను. ఇం దరతియను నవస్థ చెప్పంబడియె. ప్రియునికంటె నితరములగు నెల్లవానియందును. వైరాగ్యమరతి. అరతిచేతనే యీమెకుఁ గల్గిన జడముట్టుట మొదలగు వానియందలి యనిష్టమును దుమ్మెదలు మొదలగునవి యుద్దీపనవిభావములు (మనసునం బుట్టిన యనురాగమును వృద్ధిచేయునవి) గావున వాని సామ్యముచేతఁ గల్గినట్లుండెనని యుత్ప్రేక్షించెను.

80. తానె = ప్రభావతియే. (నీవున్నచోటు) వెదకికొని. ఇటు = ఈ పురమునకున్. రాన్ = వచ్చుటకు. సాహసమొంది = తెగింపునొంది. (తెగించి). మాటికిన్. కదలున్ = బయలువెడలును. అంత = పిమ్మటను. నీ రూపు = నీ యాకారము. తోఁచినన్ = భ్రమచేఁ గాన్పింపఁగా. మదిరేక్షణ = ప్రభావతి. (మదము కప్పిన కన్నులుకలది; మద్యముంబోలిన కన్నులుగల దనియేని యర్థము). తత్తఱిలుచున్ = వేగిరించుచున్. మగుడున్ = వెనుకకుఁ దిరుగును. ఇందెన్నఁడును జూడని ప్రియు నుద్దేశించి తానే పోవయత్నించె ననుటచే లజ్జాత్యాగమును, నెదుటఁ బ్రియుఁడు లేకున్నను నున్నట్లు తలఁచుటచే నున్మాదము నను నవస్థయుఁజెప్పం బడియె. మఱియును నావేగమను శృంగారభావంబును జెప్పంబడియె. ఇష్టప్రాప్తి వలనఁ గలుగు చిత్తసంభ్రమ మావేగము.

81. ఆ పడఁతి = ఆ ప్రభావతి. కడుశోషిలుచు = మిగుల మూర్ఛిలుచు నని యర్థము. చూపఱన్ = చూచువారిని. అడలఁజేసెన్ = దుఃఖపెట్టెను. నీ పత్రిక = నీవు చిలుకచే నంపిన జాబు. ఆ నిమిషములోపలన్. రాదేని. దశాంతరమున్ = వేఱొక యవస్థ (మరణప్రయత్నము) సయితము. పాటిలున్ = సంభవించియుండును. ఇందుఁ గడపటివియగు మూర్ఛయు, మరణము నను నవస్థలు రెండును జెప్పఁబడినవి. ప్రత్యక్షముగ మరణమును వర్ణించుట యమంగళము గావున మరణార్థమయిన ప్రయత్నమే మరణావస్థ యని ధనికుఁడు హేమచంద్రుఁడు మొదలగువారును, మరణమభినయింప సాధ్యము కామిచేఁ గావ్యముల నుదాహరింపఁదగదని శారదాతనయుఁడుం జెప్పిరని రత్నాపణము.

82. తాత్కాలికస్థితి కారణంబు = ఆ కాలమునందలి (జీవించి) యుండుటకు హేతువు.

83. విరహ దశన్ = ఎడఁబాటు చేతనని యర్థము. అలఁగుటయ = శ్రమపడుటయే. సరిగన్ = (ఆమెతో) సమానముగ. కుందుట = బాధనొందుట.

84. భావనచేసి = ఆలోచించి. ఇంతుల తాల్మికల్మి = ఆఁడువారి ధైర్యసంపద. క్షణభంగురము = క్షణకాలమున నశించునది. వాత = గాలిచే. ఆవిల= కలఁతనొందిన. (కదల్పఁబడిన). పల్లవ = చిగురాకుయొక్క. అంచల = అగ్రము

సందలి. *హిమాంబు కణంబును = మంచునీటి తుంపర యయితేను. మేల్ = ప్రశస్తమైనది. స్థిరమైన దని యర్థము. ఎంతయు విలంబమునఁ = ఎంత శీఘ్రకాలమునందు. కృపన్ = దయతో. ప్రోచెదో = రక్షించెదవో.

86. గ్రక్కునన్ = త్వరగా. దివిజరిపు మేడలపై = రక్కసుని (వజ్రనాభుని) మేడలయందు. తమకము = వేగిరపాటు. ఉన్నది.

87. దైత్యునియ్యకోలు = రాక్షసుని (వజ్రనాభుని) సమ్మతిని. లేక = పొందక. వీడు = పట్టణమును. చొరరాకయునికిన్ = ప్రవేశించుట సాధ్యము కాకుండుటను. అరసి = తెలిసికొని. వేఁగుచు నున్నాఁడవన్ = బాధపడుచుంటివని. తలపోయు కార్యము = ఆలోచించుపని. ఏమయ్యెను?

88. తత్పురప్రవేశ చింత = ఆ రక్కసుని పట్టణము చేరుటకైన విచారము. తదుపాయంబు = ఆ పురముం బ్రవేశించుటకుఁ (దగిన) సాధనమును. వధకార్యంబునకున్ = చంపుట యనుపనికి. భవదిష్టసాధనానుకూల్యంబు = నీకుం బ్రియమైన పని నెఱవేర్చుకొనుటకుఁ దోడ్పడుటను. ఏతదర్థంబు = ఈ కార్యముకొఱకు. తావకీన కార్యానుగుణ్యంబు = నీ సంబంధమగు పనికిం దగిన సహాయమును. నడపుచుండెదన్ = చేయుచుండెదను.

89. అతఁడు = ప్రద్యుమ్నుఁడు. ఉదుటుఁదనమును = గర్వమును. శౌర్యమనియు నర్థము. వలపును = (ఆమెయందలి) కోర్కెయును. ఒండొంటితోడ = ఒకటి వేఱొకదానితో. దంటగొని = జతగూడి. క్రమ్మన్ = పొంగఁగా. అమరారి కరుల కుంభములు = దేవతల పగవాని (వజ్రనాభుని) యొక్క యేనుఁగుల శిరసులందలి మాంసపిండములు. వ్రయ్యఁగన్ = బ్రద్దలగునట్లు. మొత్తన్ = కొట్టుటకును. నఖాగ్రములన్ = గోళ్ళచివరలచేతను. ఒత్తన్ = అదుముటకును. సమదరాక్షసరథచక్రంబులు = గర్వించిన రాక్షసుల బండికండ్లను. ఇలన్ = భూమియందు. కూల్పన్ = పడఁగొట్టుటకును. కాంతశ్రోణికిన్ = ప్రభావతి పిఱుఁదునకు. ఊడిగంబు = సేవను. చల్పన్ = చేయుటకును. అసురేంద్రజయశంఖము = వజ్రనాభుని గెలుపు (దెలుపు) శంఖమును. ధనుర్వార్తలు = వింటియొక్క వృత్తాంతములను. వింటిశక్తి నని యర్థము. కడతేర్పన్ = నశింపఁ

జేయుటకును. పడఁతికనుబొమసంజ్ఞన్ = ప్రభావతికనుసన్నచేతను. దళితములు = చీల్పఁబడినవానిని. తత్తనూజచూపులు = అతనికూఁతు (ప్రభావతియొక్క) చూపులను. ఫలితములు = సార్థకమైనవానిని. నెమ్మదిన్ = మనసునందు. తాల్చెను.

90. అతనునిన్ = ప్రద్యుమ్ననిని. అలంఘ్యదర్పున్ = అణఁపరాని గర్వముగలవానిని. బ్రహ్మవరబలోద్ధతునిన్ = బ్రహ్మయొక్క వరముచేతను (బ్రాప్తమైన) బలముచే నిచ్చవచ్చినట్లు తిరుగువానిని. దేవహితార్థమై = దేవతల మేలుకొఱకై. తన్మహత్త్వంబును = వాని (వజ్రనాభుని) గొప్పతనమును. ఘటింపించిన తదుపాయమును = కూడునట్లుచేసిన (సంపాదించిన) యాపురముచేరుటకుఁ (దగిన) సాధనమును. విశదముగ = స్పష్టముగా. అందు = ఆ ముప్పురిలో. రుక్మిణీసుతుఁడు = ప్రద్యుమ్నుఁడు. భద్రాఖ్యురూపున్ = భద్రుఁడను నటుని వేషమును. పారిపార్శ్వకుని యాకారమును = పారిపార్శ్వకుని వేషమును. విదూషకుని ప్రకారంబున్ = విదూషకుని వేషమును. తాల్చి = ధరించి.

సాత్త్వికాదులగు నభినయములచేత ధీరోదాత్తుఁడు మొదలగు నాయకుల యవస్థ నభినయించువాఁడు నటుఁడు.

“ భరతే నాభినీతంయోభావంనానారసాశ్రయం । పరిష్కరోతిపార్శ్వస్థః సభవేత్పారిపార్శ్వక ” యని పారిపార్శ్వకుని లక్షణము భావప్రకాశమునం జెప్పంబడియె. [నటునిచే నభినయింపంబడినదియు శృంగారాదులగు రసముల కాశ్రయమును నగు సాత్త్వికాది భావమును బ్రక్కనుండి (రాగముం బాడుచుఁ దాళము వాయించుచు) శోభిల్లఁజేయు (బలపఱుచు) వాఁడు పారిపార్శ్వకుఁడు.]

“ తదాత్వప్రతిభోనర్మ చతుర్భేదప్రయోగవిత్ । వేదవిన్నర్మవాదీయోనేతుస్సస్యాద్విదూషక ” యని భావప్రకాశముననే విదూషక లక్షణమును జెప్పంబడియె. (సమయోచితమైన తెల్విగలవాఁడును, నర్మము మొదలగువానిం దెలిసినవాఁడును, వేదముం జదివినవాఁడును, బరిహాసపూర్వకముగ మాట్లాడువాఁడును నగు రాజుచెలికాఁడుఁ విదూషకుఁడు).

91. పరస్పర = ఒండొరులచేతను. అవిదిత = తెలియఁబడని. స్వప్రియాంగనా = తన తనకిష్టురాలగు నింతియొక్క. సమాగమ = పొందికకు. అను

గుణతన్ = అనుకూలమగుటచేతను. ఈ యాత్ర = ఈ ప్రయాణము. నాదు భాగ్యవిలసనంబ = నాపుణ్యముయొక్క ప్రకాశమే. అనుచున్. ప్రత్యేకము = వేలు వేలుగా. ప్రమదంబు = సంతసమును. ఒందిరి.

92. వారసీమంతినీవ్రాతంబు = భోగముదాండ్ర సముదాయము. వైణికు = వీణాగానముచేయువారును. వైణవికు = పిల్లనగ్రోవితోఁ బాడువారును. మౌరజికు = మద్దెలవాయించువారును (నగు). జనాది = జనులు మొదలగు. నాట్యసామగ్రి = ఆటకుందగిన సాధన సముదాయము. యశోచితగతిన్ = తగిన కీర్తితోన్. ప్రాంతమునన్ = దగ్గఱను. శాఖానగరములయందున్ = పేటలయందును. రాజు వాసము చేయు పట్టణమునందు జను లందఱు నుండుటకుఁ జోటు చాలమిచే దాని సమీపమునున్న నదియొడ్డుననేని, చెఱువునొడ్డుననేని కట్టింపఁబడిన మఱియొక పురము శాఖానగరము. విరివి = విస్తారము. మేళంబు = వేశ్యాదిసముదాయముతోన్. విడిసివిడిసి = పెక్కు స్థలములయందు దిగి. వార్తకెక్కన్ = ప్రసిద్ధికెక్కునట్లుగా. నెఱపిరి = ప్రకటించిరి.

93. తద్వార్తలు = ఆనటుల వృత్తాంతములను. గాఢపువేడుకతో = అతిశయించెడు కోరికతో. ఉచితసమయమునందున్ = తగిన కాలమునందు.

94. సమకట్టి = సిద్ధపడి. తదర్థము = అవిద్యంజూపుటకుఁ దగినది. అయినన్. సన్నాహవిశేషముతోడ = ఎక్కువ ప్రయత్నముతో. రమణ = ఒప్పిదము. తలిర్పంగన్ = చిగురింపఁగా. ప్రకాశింపఁగా నని యర్థము. నృత్యరంగస్థలికి = నాట్యము (చేయు) చోటికి.

95. వియోగతాపంబునన్ = కలయికలేమిచేఁ గల్గిన వేఁడిచేతను. నొగుల కుండ = శ్రమపడకుండ. తదాశాశీతలోపచారంబునన్ = వారి సంగమము గల్గునను నపేక్ష (పుట్టించుట) యనెడు చల్లని యుపచారముచేతను. సేదదేర్చుచునుండి = ఆయాసమును బోఁగొట్టుచుండి. అట్లు = నాట్యవిద్యం జూపఁదగిన వేషముతో. క్షణ క్షణ ప్రవర్ధమానప్రభావతీరాగవృత్తాంతంబునన్ = ప్రతిక్షణము నెక్కువగుచున్న ప్రభావతియొక్క కూరిమిం దెల్పుట చేతను. (ప్రియునితోఁ గలియు తలఁపు రాగము). ఔత్సుక్యంబు = వేడుకను (మనోహరమగు వానింజూచుటకు వేగిరించు ఔత్సుక్యము).

పెనుచుచు = వృద్ధిచేయుచు. అతిగూఢంబుగా = మిగుల రహస్యముగా. నీ హృదయ వల్లభ = నీ ప్రియురాలగు ప్రభావతి. తదాగమనీయహర్మ్యస్థలంబును = ఆమె యొక్క రాఁదగిన (ఆమెరాఁదగిన) మేడయొక్క ప్రదేశమును. చూపిపోయెను.

96. పూర్వరంగ ప్రవర్తన = పూర్వరంగ వ్యాపారమును. (మొదటి సూత్రధారుఁడు). పొందుపఱుప = చేయఁగా.

వజ్రనాభుఁడు. రాజ్యవైభవము = ప్రభుత్వ సంపదను. మెఱసి = ప్రకటించి. నానాబంధు మిత్ర సచివ సంఘంబుతోడ = పెక్కండ్రు చుట్టములయుఁ జెలులయుఁ గొలువుఁడు కాండ్రయు సముదాయముతో. ఆస్థానమహామండపమునందు = సభచేయునట్టి పెద్దచావడియందు. ఒడ్డోలగముననుండి = గొప్పసభచేసి యుండి. రాణివాసపుజనంబు = అంతిపురములో నున్నవారి సముదాయము. పరులదృష్టికి = ఇతరుల చూపునకు. అగోచరము = కాన్పింపనిది. అగు. సంవృతస్థలిన్ = (తెర మొదలగువానిచే) మఱుఁగగుచోటను. నిల్చి. చూచునట్టుగ. చేసి. సావధాన స్వాంతుఁడు = ఎచ్చరికతోఁగూడిన మనసుఁగలవాఁడు. అగుచు. సొంపారువేడ్కన్ = ఒప్పిదమగు నభిలాషతో. చూడన్ = కనుఁగొనుచుండఁగా. శంబరద్వేషి = ప్రద్యుమ్నుఁడు. (శంబరుఁ డను రక్కసుం జంపినవాఁడు). సురహితముగన్ = దేవతులకు మేలుకలుగునట్లు. మాయానాట్య సూత్రధారవృత్తిన్ = కపటపునాట్యము నకు సూత్రధారి వేషమును. కైకొని = స్వీకరించి. సంవిహితరంగ మంగళాచారుఁడు = లెస్సగాఁ జేయఁబడిన రంగమంగళముగల వాఁడు. ఒనరెన్ = ఒప్పెను.

"ఆసూత్రయన్గుణాన్నేతుః కవేరపిచ వస్తునః । రంగప్రసాధన ప్రౌఢః సూత్రధార ఇహోదితః" యని సూత్రధారలక్షణము భావప్రకాశమునం జెప్పంబడియె. (కథానాయకునియొక్కయుఁ, గవియొక్కయుఁ, బ్రస్తుతమైన కథయొక్కయు గుణముల వర్ణించుచు రంగప్రసాధనము చేయువాఁడు సూత్రధారుఁడు).

ఈ లక్షణములుగల సూత్రధారు లిద్దఱు గలరనియు, మొదటివాఁడు పూర్వరంగముగావించి వెడలిపోయినతరువాత నటుఁడను పేరుగల రెండవ సూత్రధారుఁడు ప్రవేశించి రంగమంగళము (రంగప్రసాధనము) ను జేసి కావ్యార్థము ప్రస్తావింపవలెననియుం గొందఱు చెప్పుదురు. "పూర్వరంగం విధాయాదౌ సూత్రధారే వినిర్గతే। ప్రవిశ్య తద్వద

పరః కావ్యార్థం స్థాపయేన్నట" యని రత్నాకరమునందుఁ జెప్పఁబడియె. నాట్యమారంభింపక పూర్వము విఘ్ననివారణమునకై రంగమునం దుపలవ్రులు (వేషభాషాదుల చేఁ గథా నాయకు ననుకరించుట యందు నేర్పుగలవారు) చేయు కార్యవిశేషము పూర్వరంగము. "యన్నాట్యవస్తునః పూర్వం రంగవిఘ్నోపశాంతయే। కుశీలవాః ప్రకుర్వంతి పూర్వరంగస్సకీర్తితః" యని యందె చెప్పఁబడియె. (దీనికిముఖ్యాంగము నాంది). మొదటి సూత్రధారుఁడు వెళ్ళినవెనుక సంగీతము నెఱిఁగిన విద్వాంసులు మొదలగు వారితో సభాపతి సభఁ బ్రవేశించియుండఁగా, రెండవ సూత్రధారుఁడు రంగముఁ బ్రవేశించి సంప్రదాయికులచే యవనికను (తెరను) దీయించి, యొక్కరో నొక పాత్రముచేఁ బూవుల దోయిలిం జల్లించి, దేనినేని ఋతువుం దలఁచి సంగీతాదులం బ్రయోగించుట రంగమంగళము, రంగప్రసాధనము నని యచటనే చెప్పఁబడియె. మఱియు దశరూపకమున నిట్లే "రంగం ప్రసాద్య మధురైః" ఇత్యాది శ్లోకముల చేతను, సంగీతరత్నాకరమున "సంగీతజ్ఞైర్బుధైస్సార్ధం న్యాయకే ప్రేక్షకేస్థితే" యనునదిమొదలగు శ్లోకములచేతను రంగమంగళము ప్రపంచింపఁబడెననియు నందె చెప్పఁబడె. కాఁబట్టి, మీఁదటిమతము ననుసరించి యిందుఁ బూర్వరంగముఁ బొందుపఱుప ననుచోట మొదటి సూత్రధారుఁడని యధ్యాహరించితిని. సంస్కృత నాటకములయందు నాంద్యంతే సూత్రధార యనుచోట మొదటి సూత్రధారుఁడు పూర్వరంగమున రంగమున నాందిచేసి పోయినతరువాత రెండవ సూత్రధారుఁడు ప్రవేశించి పల్కుచున్నాఁడనియే పెక్కండ్రు వ్యాఖ్యానము చేసిరి. కొందఱు సూత్రధారుఁ డొక్కఁడే యనియును, నవస్థాభేదమున నతఁడే ముందుఁ బూర్వరంగమును, దరువాత రంగప్రసాధనమును గావించి పిమ్మట కావ్యార్థము సూచించుననియుం జెప్పుదురు.

ఈ పక్షమునఁ బ్రద్యుమ్నుఁడు సంవిహిత రంగమంగళాచారుఁడగుచున్ బూర్వరంగముఁబొందుపఱుప నొనరెనని యన్వయింపవలసి యుండును. అట్లన్వయించిన రంగమంగళము ముందును, బూర్వరంగము తరువాతను జెప్పవలసివచ్చును. లక్షణగ్రంథములందును, లక్ష్యములందునుగూడఁ బూర్వరంగమే మొదటిదని స్పష్టముగనుండుటచేఁ బూర్వగ్రంథములకు విరోధము లేకుండ నట్లన్వయించితిని.

98. గాంధార...గాంధర్వంబు=గాంధారము మొదలగు స్వరములయొక్కయు, (వానికిం దగిన) శ్రుతులయొక్కయు నేర్పుచేతను గంభీరమగు భోగమువాండ్రయొక్క

సంగీత విశేషమును. (వినువారి మనసున కింపుఁగలిగించు స్వరములకూర్పు గీతమనియు, నది గాంధర్వంబు గానము నని రెండువిధములు గలదనియు, నందుఁ జిరకాలమునుండి వేదము వలె గురుశిష్యపరంపరచేఁ బ్రాప్తమై గంధర్వులచేతం బ్రయోగింపఁబడునది గాంధర్వ మనియు సంగీతరత్నాకరము).

“ రంజకస్వర సందర్భో గీత మిత్యభి దీయతే ! గాంధర్వంగానమిత్యస్య భేదద్వయ ముదీరితం. ” అ. 4 శ్లో. 1.

“అనాది సంప్రదాయం యద్గంధర్వైః స్సంప్రయుజ్యతే! నియతంశ్రేయ సోహేతు స్తద్గాంధర్వంజగుర్బుధాః ॥ ” అ. 4 శ్లో. 2.

ఘనస్వనంబు = తాళములధ్వనియును. తతనిక్వాణంబు = వీణమొదలగు వాని శబ్దంబును. వంశాదిసంబంధిస్వాన పరంపరామహిమయుఁ = పిల్లనగ్రోవులు మొదలగు వాని సంబంధముగల ధ్వనుల వరుసయొక్క గొప్పతనమును. ఆపూర్ణతఁ = నిండుఁదనముతోఁ. దీపింపఁ = ప్రకాశింపఁగా.

99. తన్నాట్యకర్మప్రవర్తనమునన్ = ఆ నాట్యమను కార్యముయొక్క నడపుట యందు. ఆ నాట్యమును జరుపునపు డని యర్థము. సరవిన్ = క్రమముతో. చంచత్పుటము చాపపుటము (ఇవి వరుసగాఁ చచ్చత్పుటము చాచపుటము నని సంగీత రత్నాకరమునఁ జెప్పంబడియె). నుద్ఘట్టము షట్పితాపుత్రకము నను పేళ్లు. అమరఁ = ఒప్పఁగాఁ. వెలయుసమవిషమతాళప్రవృత్తులు = ప్రకాశించుసమము (చతురస్రము, విషమము (త్ర్యస్రము)లు నగు తాళముల వ్యాపారములు నాల్గును. (చంచత్పుటము సమము (చతురస్రము) ననియుఁ దక్కినవి త్ర్యస్రములు విషమములు ననియు సంగీతరత్నాకరము. “ చతురస్ర స్తథాత్ర్యస్ర ఇతి తాలోద్విధామతః। చచ్చత్పుటశ్చాచపుట ఇతి నామ్నా తయోఃక్రమాత్ ॥” అ. 5-17 “ఉద్ఘట్టోపి త్ర్యస్రభేదః” అ. 5-23. “షట్పితాపుత్ర కస్త్ర్యస్రభేదః విశేషోత్రప్లుత మాద్యంత యోర్భవేత్ ” అ. 5-22. (షట్పితాపుత్రకతాళమును ద్వ్యస్రమేకాని దీనియందు మొదటియక్షరమును, జివరయక్షర మును బ్లుతములై యుండవలెను). మఱియును లఘువులు మొదలగు వానిచేతను సమ ముగాఁ జేయఁబడిన క్రియ (పని) చే నృత్తగీత వాద్యముల మితి నేర్పఱుచుకాలము

తాలమనయి నందె చెప్పంబడియె. "కాలోలఘ్వాది మితయాక్రియ యాసమ్మితో మితిం! గీతాదేర్విద ధత్తాలః" అ. 5-3.

ప్రస్తారకలనవలన = ఆ తాళములం బ్రస్తరించుటవలన. (తాలప్రస్తారక్రమము సంగీతరత్నాకరమునం జెప్పంబడియె. విస్తరభయమున నిట వ్రాయనైతి). గ్రంధ మందుం జెప్పంబడిన ప్రకారముచేతను. పరంగు నేలాది ప్రబంధ చయముల్ = కలుగు నానాతాళములును = పుట్టు వేర్వేఱు తాళములును. యథోక్తసూక్తి = ప్రకాశించు నేలమొదలగు ప్రబంధముల సముదాయమును. (ఆది పదముచే ఢేంకి, కరణము మొదలగు వానిని గ్రహింపవలెను). సూడమనంపలి ప్రబంధములలో నిది యగు (గీతసము దాయ మను నర్థమిచ్చు సూడశబ్దము దేశ్యము). నేల యను ప్రబంధమునం బదియునాఱు చరణము లుండవలయు ననియు, వానిని రెండుసారులు గానముచేసి పదమూడవ పదానిని నిలుపవలె ననియు, మంఠద్వితీయకంకాల ప్రతితాలములలో నొక్క తాళమునం బాడ వలయు ననియు, దానియందుం బ్యాగ (దానము) సౌభాగ్య (చక్కందనము) శౌర్య (పరా క్రమము)ధైర్యముల వర్ణన ముండవలె ననియు, నేలాసామాన్యలక్షణమును, నవిగణైలలు, మాత్రైలలు, వర్ణైలలు, దేశైలలు నని నాల్గువిధము లనియు, నివి వినువారికిం బాడువారికి ధర్మార్థకామముల సాధించుననియు, (అ+ఇ+లా=ఏలా) యనుదాని యందలి యకారమునకు విష్ణువు, నికారమునకు మన్మథుండు, లకారమునకు లక్ష్మియు నధి దైవతములనియు మగణాదులలోని గణములతో రచియింపంబడినవి గణైలలు, ఛగణ (ఆఱుమాత్రలుగల గణము) పగణా (ఐదుమాత్రలుగల గణము) దులతో రచియింపం బడినవి మాత్రైలలనియు, మీంది గణనియమము లేక యక్షరసంఖ్యచే రచియింపంబడినవి వర్ణైలలనియుం, గర్ణాటలాటద్రావిడాది భాషలయందు రచింపంబడినవి దేశైలలనియు, వీనియందింకను జెక్కు భేదములు గలవనియు సంగీతరత్నాకరమునం జెప్పంబడియె. "ఏలాకరణఢేంకీభిః వర్తన్యార్యఘోంబడే నచలంభరాసైకతాలీ భిరష్టాభి సూడ ఉచ్యతే" అ. 4-23. "పునర్గీత్వాద్రుమవేత్యాగః (గీతమాపుట) గ్రహాన్తు (గీతారంభము, విషమోభవేత్ । ఏలాసామాన్య లక్ష్మ తత్పూర్వా చూర్యె రుదాహృతం" అ. 4-38.

"మంఠ ద్వితీయకంకాల ప్రతితాలేషు కశ్చన। తాలోస్యాంత్యాగసౌభాగ్య శౌర్యధైర్యానువర్ణనం" అ. 4-39.

“ ఏలాశ్రోతుః ప్రయోక్తుశ్చ ధర్మకామార్థసిద్ధిదా। గణమాత్రావర్ణదేశ విశిష్టాస్తాశ్చతుర్విధాః ” అ. 4-52.

“ అకారేదైవతంవిష్ణు రికారే కుసుమాయుధః। లక్ష్మీర్లకారఏలాయా మితి వర్ణేషు దేవతాః ” అ. 4-41.

“ తత్రవర్ణగణైర్జాతా గణైలా పరికీర్తితా ” అ. 4-66.

“ మాత్రాగణైస్తుమాత్రైలాసాచ జ్ఞేయా చతుర్విధా ” అ. 4-94.

“ గణమాత్రాద్యనియతా వర్ణైలావర్ణసంఖ్యయా ” అ. 4-106.

“ కర్ణాట లాట గౌడాంధ్ర ద్రావిడానాంతుభాషయా। దేశాఖ్యైలా బుధైః పంచప్రోక్తా మంఠాదితాలతః ” అ. 4-114.

“ ఏలానాం బహవస్సంతి విశేషాస్తేషుకేచన ” అ. 4-40.

తత్తత్ = ఆయాయి యంగమునకు. అర్హ = తగిన. స్థాన = స్థలములందు. దత్త = నిలుపఁబడిన. పటాక్షర = మద్దెలమొదలగు తోలుమూసిన వాద్యములచేఁ బల్కించెడు “ దిందింధిమింధి ” మొదలగు శబ్దములను. (పటాక్షరమనుదానికి బదులు పాటాక్షరమని సంగీతరత్నాకరమునఁ జెప్పఁబడియె. ‘పాటోవాద్యాక్షరోత్కరః’యని సం. ర. అ. 4-18). బిరుదాదిక = ప్రబంధము రచియించినవానియొక్కయు, నందలి వర్ణ్యముయొక్కయు నామము మొదలగు. అంగ = ప్రబంధావయవములయొక్క. విస్ఫురణ = ప్రకాశము. తనరన్ = ఒప్పఁగా. ప్రబంధమను పురుషునకు స్వరము, బిరుదము మొదలగునవి యాఱంగములు గలవని సంగీతరత్నాకరము. “ప్రబంధోంగాని షట్తస్య స్వరశ్చ బిరుదంపదం। తేనకఃపాటతాళౌచ ప్రబంధపురుషస్యతే. ” అ. 4. 12. (ఇందు మొదటి ప్రబంధశబ్దము వెనుకదానితో నన్వయించును). క్షితిన్ = భూమియందు. చతుర్దశమద్రకగీతభేదములు = పదునాలుగుమద్రకము మొదలగు వేర్వేఱు గీతములు; మద్రకాదిగీతము లీ క్రింది విధమున సంగీతరత్నాకరమునఁ జెప్పంబడియె. “ ఏతైః ప్రకరణాఖ్యాని తాలైర్యాని జగుర్బుధాః। తానిగీతానివక్ష్యామ

స్తైసామాద్యంతు మద్రకం ” అ. 5-57. (మీఁదఁ జెప్పిన తాళములతోఁ బ్రకరణము లను పేరుగల యే గీతములను విద్వాంసులు పాడుదురో యా గీతములను జెప్పెదము, వానియందు మొదటిది మద్రకము. “ అపరాంతకముల్లోప్యం ప్రకర్యోవేణకం తథా। గోవిందకోత్తరే సప్త గీతకా నిత్యవాగ్విషు ” అ. 5-58. “ ఛందకాసారితే వర్ధమాన కంపాణికా తథా॥ ఋచోగాథాశ్చ సామానిగీతా నీతిచతుర్దశ ” అ. 5-59. “ శివ స్తుతౌ ప్రయోజ్యాని మోక్షాయ విధవి ధిః. ” అ. 5-60. (మద్రకము పరమునంత కము నుల్లోప్యము మొదలగునవి యేడును, ఛందకము నాసారితము మొదలగునవి యేడును గలిసి పదియునాల్గును గీతములని భరతాదులు చెప్పిరి. మఱియు మోక్షము కొఱకు శివస్తుతియం దుపయోగింపఁదగిన యీ గీతములను బ్రహ్మ రచియించె ననియు నంచె చెప్పంబడియె). మీఁదటి గీతములలో మద్రక మేకకలము, ద్వికలము, చతుష్కలము నని ముచ్విధములనియు సంగీతరత్నాకరమునను చెప్పంబడియె. “ పత్రిత్రేధాతు మద్రకం। విధ్యైక కలాద్యైన చతుష్కస్త్రివ స్త్వితి ” అ. 5-63. (వీని లక్షణములును, దక్షిణగీతముల లక్షణములును, వాని భేదములును సంగీతరత్నాకరమున విశదముగఁ జెప్పంబడియె. విస్తరభయంబున నిట నుదాహరింపనైతి). దురాపంబులు = పొంద శక్యముగానివి; మిగులశ్రమచేఁ బొడఁదగినవి. అండ్రు = (సంగీతము నేర్చినవారు) చెప్పుదురు. అవియును = ఆ గీతములునైతేము. నిఖిలకళలును = ఎల్లవిద్యలను. కలరాక్మి గేయ శిక్షవలన = నేర్చిన ప్రద్యుమ్నుని కఱపుటచేతను. వర్తిలెను. (వాగింద్రి యముచే నేర్వందగినక్రియ విద్యయనియు. మూఁగలు నైతేము నేర్వందగిన నర్తనము మొదలగు క్రియ కలయనియుఁ గొందఱు చెప్పిరి).

100. ఆ వనజాక్షనందనుఁడు = ఆ ప్రద్యుమ్నుఁడు. నాందిన్ = మంగళ శ్లోకమును. తగన్ = యుక్తముగా. పఠించి = చదివి. (నాంది క్రియారూపము వాగ్రూపము నని రెండు విధములు గలది. అందు మున్ను శివుఁడు నాట్యము సేయునపుడు రంగస్థల (నాట్యస్థాన) మైన నందీశ్వరు నుద్దేశించి చేయు పూజావిశేషము క్రియారూప మగు నాందియని భరతుఁడు చెప్పెను. నాటకాదుల మొదటం జెప్పఁబడునదియుఁ జంద్రుని పేరితోఁ గూడినదియు, మంగళవాచకములగు పదములుగలదియు నర్థముననేని, శబ్దముననేని కావ్యార్థము సూచించునదియు, దేవతానమస్కారాదుల దేనినేని తెలుపు నదియు నగు పద్యము వాగ్రూపమైన నాందియని కోహళాదులు చెప్పిరి. కవీశ్వరులును, సభ్యులును, నటులును దేన సంతసింతు రది నాంది యని నాట్యప్రదీపమున వ్యుత్పత్తి చెప్పంబడియె. దీనిని మొదటి సూత్రధారుఁడు మధ్యమస్వరముతోఁ బఠింపవలయునని

రూపక పరిభాషయందుఁ జెప్పంబడె). ఇంపు = ఆనందము. ఆవహిలన్ = కలుగు నట్లుగా. ప్రరోచనయున్. ఆముఖమున్. తనరారన్ = అతిశయింపఁగాన్. (కథాంశముయొక్కయు, నాయకునియొక్కయుఁ, గవియొక్కయు, దేశకాలముల యొక్కయు గుణములం బ్రశంసించి చూచువారి మనసున కింపు పుట్టించుట ప్రరోచన యని దశరూపకము. సూత్రధారుఁడు నటితోఁగాని, విదూషకునితోఁగాని, పారి పార్శ్వకునితోఁగాని ప్రస్తుతకార్యముం జిత్రోక్తిం జెప్పు టాముఖమని విద్యా నాథుఁడు). ఒప్పుప్రస్తావనతోన్ = తగిన ప్రస్తావనతోన్. (సూత్రధారుఁడు నటి మొదలగువారితో సంభాషించుచు వీథ్యంగములను నాముఖముతోఁ గూర్చినయెడల నదియె ప్రస్తావనయని రూపకసంభాషయందుఁ జెప్పంబడియె. (ఉద్ఘాత్యకము మొద లగు వీథ్యంగములు పదమూఁడును బ్రతాపరుద్రీయనాటక ప్రకరణమున వివరింపఁ బడియె. గ్రంథ విస్తరభయముచే నిట నుదాహరింపనైతి). ఆ ముఖమునకుఁ బ్రస్తా వనకు భేదమే లేదని దశరూపకము. ముఖాదులగు సంధులు = ముఖము, ప్రతిముఖము, గర్భము, విమర్శము, నిర్వహణము నను సంధులైదును. సాంగతన్ = వాని యఱువది నాలుగంగములతో. పెంపుమీఱ = అతిశయింపఁగా. (ఒక్క ప్రయోజనముతో సంబంధించిన కథాభాగములకు నవాంతరమగు మఱియొక ప్రయోజనముతో సంబంధము సంధియనంబడు. ముఖము మొదలగు వానిలక్షణములును, వానియంగముల లక్షణములును బ్రతాపరుద్రీయమునఁ జూడందగు). అనేకములు = పెక్కులగు. గంగావతరాది నాటకములు = (భగీరథుఁడు) గంగనుభూమికిఁ దీసికొనువచ్చు కథను దెల్పునది మొదలగు నాటకములను. అద్భుతంబుగన్ = వింతగాన్. ఆడెన్ = అభినయించెను. ఇందుఁ దొంబదియాఱవ పద్దెమున వ్రాయఁబడిన రెండవపక్షము నవలంబించి ప్రద్యుమ్నుఁ డొక్కఁడే నాందిం బఠియించి, ప్రరోచనాదులం గావించి కావ్యార్థం బభినయించె నని చెప్పంబడియె.

మున్ను కపిలుని కోపాగ్నిచేఁ గాలిపోయిన సగరపుత్త్రులకు స్వర్గమును సంపా దించుటకై భగీరథుఁడు బ్రహ్మ నుద్దేశించి తపంబుచేసి యాకాశగంగను భూమికిం దిగిచెనని భాగవతము.

101. రుక్మిణి సుతుండు. ఆ నాటకప్రయోగావసరములన్ = ఆ నాటకముల యొక్క ప్రయోగించుకాలములందు. ఆ నాటకముల నభినయించునపు డని యర్థము. మాయానిరూఢిన్ = మాయయొక్క సామర్థ్యమును. (లేనివాని నున్నట్లు తోఁపఁ

జేయు శక్తి మాయ). మెఱసి = ప్రకటించి. భగీరథాద్యాకారధారణమును = భగీరథుఁడు మొదలగు వారివేషము వేసికొనుటయును. గంగాదినిమ్నగాగతియు = గంగ మొదలగు నదులయొక్క నడకయును. కైలాసాదినగకల్పనమును = కైలాసము మొదలగు పర్వతములయొక్క సృజనమును. నానావనప్రపంచనంబును = పెక్కు విధములగు తోఁటలయొక్క కల్పనమును. మఱియుఁ. ఎచటికి = ఏకథాభాగమునకు. ఎయ్యది = ఏది. యోగ్యము = తగునో. అచటన్. తత్తద్వస్తుసృష్టి = ఆయాయి వస్తువులయొక్క కల్పనమును. నడపుచున్ = ప్రవర్తిల్లఁ జేయుచు. సామాజికులు = సభయందున్నవారు. పన్నిదము వేసియున్ = పందెము వేసియును. మిగులఁ బ్రయత్నించిరైన నని యర్థము. (అది) కృతకమగుటఁ = మనుష్యులచేఁ గల్పింపఁబడినదియగుటను. నిశ్చయింపఁగలేక. అబ్రపడుచుఁ = ఆశ్చర్యపడుచున్. తను సొమ్ముతెల్లన్ = తమ (శరీరమునందలి) నగలన్నిటిని. ఒసఁగులుగన్ = కానుకలుగా. నైవఁ = ఈయఁగా. ఒప్పుమీఱెను.

102. ఆత్మీయ = తనదియగు. దివ్య = దేవతాసంబంధమగు. మాయాప్రపంచ = మాయయొక్క బాహుళ్యముచేతను. సముదంచిత = ప్రకాశింపఁజేయఁబడిన. నాట్య = అభినయముచేతను. వంచితులన్ = మోసపెట్టఁబడినవారిని. నక్తంచరుల ధనసంచయంబున్ = రాక్షసుల ద్రవ్యసమూహమును. ఊఁచముట్టుగాన్ = మిగులకుండునట్లు. అంతయునని యర్థము. చూచుఖేచరులకుఁ = చూచెడు దేవతలకును. వేడ్కన్ = సంతోషమును.

103. మహానయమాయానిధి = గొప్ప నీతికిని, మాయకును వాసస్థానము. (అగు) రుక్మిణీసుతుఁడు. నానాభూమికాధారణుండై = పెక్కు వేసముల ధరించువాఁడై. పొల్చువేళఁ = (సభలోనున్నవారికిఁ) గాన్పించునపుడు. ప్రియకాంతామణి చూడ్కికిఁ = ప్రియురాలగు స్త్రీశ్రేష్ఠము (ప్రభావతి) యొక్క చూపునకు. నిజవపుశ్శ్రీ తోన = తనదియగు (ప్రద్యుమ్న సంబంధమగు) శరీరముయొక్క చక్కఁదనముతోడనే. తోఁచెఁ = కాన్పించెను. నహిమాయాయామసంభావ్యమస్తి. మాయాయాం = మాయయందు. అసంభావ్యం = సంభవింపఁదగనిది. (ఎద్దియును) నాస్తిహి = లేదు గదా! అటంచుఁ. బుధులు = విద్వాంసులు. ఆడుమాట. బొంకు = అసత్యము. ఏలగును!

104. ఆ భవ్యుండు = ఆ శుభముఁ బొందఁ గలవాఁడు. (ప్రద్యుమ్నుఁడు). ఆటమున్న = నాటక మాడునపుడు. ఒకొక్కనెపము = ఒకొక్కమిష. ఒప్పారఁగ = ప్రకాశింపఁగాఁగ. ఏదియో యొక మిష కల్పించి యని యర్థము. మరాళీ = శుచిముఖి చేతను. ప్రదిష్ట = కనుపఱుపఁబడిన. అభిజ్ఞాన = ఆనవాలుగల. గవాక్ష = కిటికీ నుండి. లక్ష్య = చూడఁదగిన. దనుజాధ్యక్షాత్మజా = రక్కసులఱేని (వజ్రనాభుని) యొక్క కూఁతు (ప్రభావతి) యొక్క. వక్త్రి = ముఖముయొక్క. వీక్షాభద్రంబును = చూచుటయను మేలును. సారెకుఁ = మాటి మాటికి. కల్గంజేసికొంచున్కిఁ = సంపాదించుకొనుచుండుటచేతను. ఆ భామామణికిఁ. ప్రభుస్తుతి విలీనార్థంబుగా = సభాపతి యొక్క స్తోత్రమునందు డాఁగిన వేఱర్థము గలుగునట్లు. ఇట్లనెను.

ఈ క్రింది మూఁడు పద్దెములచేతను ప్రభావతిస్తుతియు నామెకుఁ దనయందుగల ప్రేమకుఁ దనకుఁ గలిగిన సంతసమును ధ్వనించునట్లు ప్రస్తుతానుసారముగా వజ్రనాభుని స్తుతించి, యతనికిఁ దనయందుఁగల్గిన యనుగ్రహమునకు సంతసించినట్లు చెప్పుచున్నాఁడు.

105. సకలవిశేషశోధనకుఁ = ఎల్లవింతలను బరిశీలించుటకు. చాలిన యో నెరజాణ = తగిన యో నేర్పరి! కులవతంసరత్నమ = కులమునకు భూషణమగురత్నమా! వజ్రనాభ! ప్రభావతి రోహితకంటకంబు = ప్రతాపముచే డాఁగిన శత్రువులు గలది. ధనముచేతను, సేనచేతను గలిగిన తేజము, ప్రభావము ప్రతాపము ననంబడు. దానిచేఁ బగవారిఁ దల చూపనీయనిది యని యర్థము. తావకమగుచూపు = నీదుచూపు. అత్యకలుషవృత్తిఁ = నిర్మలమగు రీతితో. ప్రవర్థితరాగతఁ = పెంపఁబడిన ప్రేమచేతను. నాపై = నామీఁదను. పర్వెఁగానఁ = వ్యాపించెను గాఁబట్టి. నీవు నిష్కపటమైన ప్రేమచే నన్ననుగ్రహించితివి గావు నని యర్థము. నా సుకృతమంతయు = నా (పూర్వ) పుణ్యమంతయు. ఫలించుటల్. నేఁడుసుమీ.

## శ్లిష్టార్థము.

వజ్రనాభకులవతంస రత్నమ = వజ్రనాభుని వంశమున కలంకారమా! ఓ ప్రభావతి! రోహితకంటకంబు = లేళ్ళకు విరోధియైనది. లేడిచూపులం బోలినది యని యర్థము. తావకమగుచూపు = నీ కటాక్షము. (తక్కిన సమన్వయ మంతయును మీఁదటి యట్లే).

106. నీకు = వజ్రనాభునకు (రెండవపక్షమునఁ బ్రభావతికి). నెయ్యమును = ప్రేమమును. మహాదరము = ఎక్కువగౌరవమున్. నీవు పనిచినహంసి. చెప్పన్. అనవరత నాట్యప్రసంగమునన్ = ఎడతెగని నాట్యసంబంధముచేతను. నినుభజించు వేడుక = నిన్ను సేవింపవలయునను కోర్కె. ఆత్మలో = మనసునందు. ఘనము = అధికము. నీకు నాయందు మిక్కిలి ప్రేమయు, గౌరవమును గలదని శుచిముఖి నాతోఁ జెప్పుటచే నీయొద్ద నాటకములాడి సంతసపెట్టవలె నను కుతూహలము పుట్టెనని, వజ్రనాభునకును నాటకములాడు నెపముగా నిన్నుఁబొందవలెనని యిచ్ఛకల్గెనని ప్రభావతికి నిట్లు ప్రద్యుమ్నుఁడు పల్కెను.

107. (ఓ వజ్రనాభుఁడా)! ననున్. ఏలికొనుము = అనుగ్రహింపుము. నీ యాడిగము = నీకు (నాట్యరూపమగు) సేవను. చిత్తమున కెక్కఁగన్ = మనసునకు సంతసము గలుగునట్లు. అవశ్యంబును = నిశ్చయముగాన్. ఒనరింతున్ = చేయుదును. నేఁటి తమిన్ = నేఁటి వేడుకను. మనంబునన్. ఎంతయు = మిక్కిలిగా. ఇడికొని = నిల్పికొని. (నన్నున్) మన్నింపఁదగున్ = గౌరవింపవలెను.

రెండవపక్షమునన్, (ఓప్రభావతీ)! ననున్. ఏలికొనుము. నీ యాడిగము = నీ (కోర్కెకుం దగిన) యుపచారమును. నేఁటితమిన్ = ఈ రాత్రియందున్. మనసున కెక్కఁగ. అవశ్యంబును. ఒనరింతున్. (ఇప్పటి యనురాగమును) మనమునన్. ఎంతయున్. ఇడికొని. మన్నింపఁదగునని యన్వయింపవలెను.

108. అనన్ = ప్రద్యుమ్నుఁడు రాజుస్తుతినిమిడిన తన ప్రశంస గలుగునట్లు పల్కఁగాన్. ప్రభావతి. విని. కపోలయుగము = చెక్కిళ్ళజంట. ఘనపులకితము = ఎక్కువ గగుర్పాటుగలది. కన్. ఆత్మాననము = తనమోమును. ఆలోకన జాలకమునకు = చూచుట (కేర్పఱచిన) కిటికీకి. కడున్ = మిక్కిలిగా. ఎడగన్ = దూరముగా. లజ్జమెయిన్ = సిగ్గుచేతను.

109. తదీయపార్శ్వగత = ప్రభావతి ప్రక్కనొందినది (నిల్చినది) అయిన. మరాళవధూటి = హంసి. దానవాధిప తనయన్ = ప్రభావతిని. ఆత్మనాథు వాక్యపదవిన్ = (నీ) మనోవల్లభుని మాటలయొక్క మార్గమందున్. తోఁచునట్టి యితరార్థ

ముఁ = స్ఫురించునట్టి రెండవ యర్థమును. సర్వముఁ = అంతేనును. కనుఁగొంటె = తెలిసికొంటివా ? ఆననాబ్జముఁ = పద్మముంబోలిన ముఖమును. ఇటు త్రిప్పితి; కపోలము = చెక్కిలి. గరుదాల్చెఁ = గగుర్పొడిచెను.

110. విచ్చలవిడిఁ = స్వాతంత్ర్యముతో. ఇచ్చను గలది = మనసునం దున్నది. ఎల్లఁ = అంతయును. దీనఁ = ఇపుడు నా ప్రియుఁడు పల్కిన వాక్యమునందు.

111. కైకొనఁడు = లక్ష్యపెట్టఁడు. భ్రాంతి యెత్తెఁ ఒకో = వెఱ్ఱి పట్టినేమో. ఎవ్విధి = ఎట్టి యదృష్టము. ప్రాప్తమొకో = సంభవించునో. (ఎట్టి హాని సంభవించునో యని యర్థము). నివ్వెఱపడి = మ్రాన్పడి. చేష్ట లుడిగి యని యర్థము.

113. అన్నిట = అన్నికార్యములయందు. జాణ = నేర్పరి. ఆ చింత = ఆ విచారము. (అతఁడు చెప్పిన వాక్యములందలి రెండవ యర్థము నితరులు తెలియుటచే హానిగలుగు నను విచారము). యుక్తంబుగాదు = తగినదిగాదు. అర్థద్వితయోక్తిఁ = రెండర్థములుగల శబ్దముతోన్ (వాక్యముతోన్) నీకున్. ఉచితంబైనట్లు = తగినట్లు. నీకు. సభాపతికి = ప్రభువునకు. అర్హంబగు రీతిఁ = తగిన రీతిచేతను. ఆతనికి. తోఁపఁ = అర్థము స్ఫురించునట్లు. పల్కినాఁడు. ఏది = ఏ యర్థము. నీ మతిఁ = నీ బుద్ధియందు. తోఁచెఁ = స్ఫురించెనో. (అది) ప్రకృతంబు = ప్రస్తుతము. కామిఁ = కాకపోవుటచేతను. పరులు = ఇతరులు.

114. నానార్థోక్తులఁ = పెక్కర్థములు గల పదములయందు. ఒక నియమము = ఒక యేర్పాటును. తెలియుము. హరిశ్రీవిభుఁడను పల్కునఁబోలెన్ = (హరి = విష్ణువు. శ్రీవిభుఁడు = లక్ష్మికి మగఁడు). అను వాక్యము నందువలెనే ఈ వాక్యమునందు హరిశబ్దము చంద్రుఁడు, సూర్యుఁడు, యముఁడు మొదలగు పెక్కర్థములు గలదియైనను శ్రీవిభు శబ్దముతో సంబంధించియుండుటచే విష్ణువునే యెట్లు దెల్పుచున్నదో యట్లే. ఎచ్చోటికిన్. ఎద్ది యర్థ ముచితంబు = ఏ యర్థము తగినదియో. అచ్చోన్. అదియ = ఆ యర్థమే. ప్రకటంబు = బయల్పడునది. స్ఫురించునది యని యర్థము. (అగున్). అనేకార్థములగు పదములకు సందర్భానుసారముగా నెల్లవారు నర్థము గ్రహింతురుగాని యప్రస్తుతార్థము నెవ్వరు గ్రహింపరని యర్థము.

115. నాట్య = నాట్యముయొక్క. అవసానసమయ = ముగించుకాలమునకు. సముచిత = తగిన. స్తోత్ర = పొగడికయొక్క. ప్రకరణ = ప్రస్తావము యొక్క. బలంబునన్ = బలముచేతను. (నాట్యమును ముగించునట్టి కాలమునకుం దగునట్లు ప్రభుస్తుతి సేయు ప్రసంగము గలుగుటవలనన్). తోఁచుచున్న యర్థాంతరంబుచేత = స్ఫురించుచున్న రెండవ యర్థము చేతను. ఉపచరించి = (ప్రభువును) పొగడి. రౌక్మిణేయున్ = రుక్మిణి కొడుకును. తన తలంపు = తన యభిప్రాయము. యథార్థంబు = సత్యము. అగుటన్. తార్కాణించెన్ = దృష్టాంతపఱిచెను. విహగమహిళా = హంసియొక్క. రహస్యసంభాషణ = ఏకాంతపుమాటలయందలి. రసానుభవంబునన్ = కూరిమిం బొందుటచేతను. విభాసిల్లు ప్రభావతియున్ = సంతసిల్లు ప్రభావతియును. ప్రియసమాగమప్రోత్సాహమానస = మగని కలయికకు (చక్కనిదానికై) వేగిరించు మనసుగలది.

116. ఇనుఁడు = సూర్యుఁడు. ముప్పిరిగొన్నరాగము = దృఢపడిన ప్రేమము. సముత్కటమై = అతిశయించినదై. కనుదోయికిన్ = కన్నుల జంటకున్. ఉబ్బఁగా = పొంగఁగా. వధూమణి = ప్రభావతి. తొప్పఁదోఁగు చూడ్కిన్ = (రాగమునందు) మిక్కిలి మునిఁగిన చూపుతో. (రాగ మెఱ్ఱనిదని కవిసమయము). సారెకున్ = మాటిమాటికి. చూడఁగాఁజుమీ = చూచుటచేతనే సుమీ. హేళి = సూర్యుఁడు. ఇవ్వాలుపు = ఈ యందమును. ఒందెనన్. క్రమంబునన్. రక్తిమన్ = ఎఱ్ఱఁదనమును.

117. హంసుఁడు = సూర్యుఁడు. దినాంత మజ్జనార్థంబును బోలెన్ = సాయంకాల స్నానము (చేయుట) కొఱకో యనునట్లు. అంబుధిలోనికి = సముద్రము లోనికి. డిగ్గెన్. తత్తటిన్ = ఆ సముద్రము నొడ్డునందున్. రక్తాంబరమోయనన్ = ఎఱ్ఱవస్త్రమో యనునట్లు. కడసంజకెంపు = సాయంకాలమునందలి సంధ్యారాగము యొక్క వైభవము. తనరారెన్. తత్పతనోద్గతబిందువులోయనన్ = ఆ సూర్యునిపాటుచే బయలువెడలిన (నీటి) తుంపురులో యనునట్లు. తారకలు = చుక్కలు. పొడచూపెన్ = కాన్పించెను.

118. మారోత్సవకలనమునకున్ = మన్మథోత్సవము ప్రాప్తించుటకు. మదిన్ పొంగుచున్. దిఙ్నారీమణులు = దిక్కులనెడి స్త్రీలు. ఆడెడు కస్తూరి వసంతముల

యొప్పు = చల్లికొనెడు కస్తూరితోఁ గూడిన నీటియొక్క సొంపు. చొప్పడన్ = సంభవించునట్లు. తోరపుఁజీఁకటులు = అధికములగు చీఁకటులు. నెఱసెన్ = వ్యాపించెను (నిండెను).

120. ఐరావణకరి = ఐరావతమను పేరుగల యేనుఁగుయొక్క. కర = తుండముయొక్క. ధూత్కార = జాడించుటచేతను. (వ్యాపించిన) వమథు = నీటి తుంపురల. రేణుపటలి కైవడిన్ = చూర్ణసముదాయము విధముచేతను. (సముదాయమువలెను). కుత్కీలారిదిశన్ = తూర్పుదిక్కునందున్. (కుత్కీల = పర్వతములకు. అరి = శత్రువు. (వానిరెక్కలం గొట్టినవాఁడు) ఇంద్రుఁడు. అతనిదిశ = తూర్పు). తెలుపు. తోఁచెన్ = కాన్పించెను. ఏనుఁగులకుఁ దుండమును గదల్చుచుండుట స్వభావము కాఁబట్టి యాదిక్కుననుండు నైరావతగజమట్లు చేయఁగా నా తుండముచే నాదిక్కునం జిమ్మఁబడిన నీటితుంపురల సముదాయముచేఁ గల్గు తెల్లఁదనమో యనునట్లు చంద్రోదయము సమీపించుటచేఁ దెలుపు కాన్పించెనని భావము. తారలు = నక్షత్రములు. ప్రథమోత్థ = మొదట వెలువడలిన. బిందుతతిగతిన్ = నీటితుంపురల సముదాయము విధమునన్. పరఁగెన్ = ప్రకాశించెను.

122. పురోదిశాళి = తూర్పుదిక్కను చెలికత్తె. తివిరి = ప్రయత్నపడి. త్రియామకున్ = రాత్రియనునాయికకు. సొగసు = అందముగా. దిద్దుకొనన్ = అలంకరించు కొనుటకున్. గవిసెనన్ = కప్పునుండి. వెల్వరించుమణి కల్పితదర్పణమో యనన్ = బయలుపఱుచు మణులతోఁ జేయఁబడిన యద్దమో యనునట్లు. కైరవకుల బంధుమండలము = చంద్రబింబము. (కైరవకుల = కల్వలసముదాయమునకున్. బంధువు = చుట్టము = వికాసము గలిగించువాఁడు. అతనిమండలము). తమీప్రతిబింబము = రాత్రియొక్క ప్రతిబింబము. కళంకలక్ష్మ్యతన్ = కళంకాకారము చేతనని యర్థము. లీయమానమై = లోనడఁగినదియై. ఏర్పడన్ = స్ఫుటముకాఁగాన్. రాజిలెన్ = ప్రకాశించెను. దీనికిం గర్త చంద్రబింబము.

123. తామరసలక్ష్ములు = తామరపూవుల శోభలనెడి యందు వాసముచేయు లక్ష్ములు. ఆ చందమామ రాకకున్. కలఁగుచున్ = కలఁతఁజెందుచున్. కుముదాళికై = కలువలగుంపుకై. తొలఁగెన్. చంద్రోదయము కాఁగానే తామరలశోభ వానిని

విడిచి కలువలకై పోయెనని యర్థము. తామరలు ముకుళించెననియుఁ, గలువలు వికసించె ననియు భావము. అతఁడు = ఆ చంద్రుఁడు. మున్ను = పూర్వము. ఎట్టిఁడైనన్ = ఎట్టివాఁడైనను. (లక్ష్ములకు సోదరుఁడైన నని యర్థము). లచ్చియుం జందురుఁడు నొక్క-చోటనే జన్మించుటచే సోదరుఁడు. తమ్ములన్ = పద్మములను సోదరులనియు నర్థము. (ఇట రెండర్థములకు నభేదము). పద్మములుం జంద్రుఁడును జలమునందే పుట్టుటచే సోదరులు. వరించుసతులకున్ = వివాహమాడఁగోరు నింతులకున్. తొలఁగు బావయె = తొలఁగంజేయు బావయే. బావవచ్చినపుడు మఱదంద్రు భర్తృసమీపము నుండి తొలఁగుట లోకసిద్ధము. శత్రువే కదాయనియు యర్థము.

124. పసుపడన్=ఒప్పుగా. క్రిందన్. పద్మశోభనకై ఈ ప్రకారంపుముల=వ్యాపించెడు (చంద్రుని) చక్కని కాంతుల సమూహములు. వేణునాళములును కిస్రములుం బలెన్ = వెదురుగొట్టములును, వానింబిగించు త్రాళ్ళును వలెన్. భాసిలన్ = ప్రకాశింపఁగా. చందురుఁడు. (ఒప్పె ననుదానికిం గర్త). మనసిజుఁడు = మన్మథుఁడు. ఎల్ల ప్రాణులమనంబులు. చేలుగన్. రాగబీజములన్ = (స్త్రీలకుం బురుషులకు నొండొరుల యెడం గలుగు) కూరిమియను విత్తనములను. పెనుజతనంబుతో = అధికమగు యత్నముతో. వెదఁబెట్టెడు రౌప్యపుజడ్డిగంబనన్ = చల్లెడు వెండి(తోఁ జేయబడిన) యంత్రమువలెన్. ఒప్పెన్. చిన్నమట్టికుండకుఁ గాని, కొబ్బరిచిప్పవలె విరివియైన ముఖముల కట్టచిప్పకుఁ గాని మూఁడు రంధ్రములువేసి వానిక్రింద వెదురుగొట్టము లమర్చి జాఱకుండఁ త్రాళ్ళతో బిగించి వానినుండి విత్తనములు నాఁగటి చాలునం బడున ట్లేర్పఱిచెడి యంత్రము; జడ్డిగము.

125. నిశాఖ్యచకోరనేత్ర = రాత్రియను స్త్రీ. నెలయను వెండికుండన్ = చంద్రుఁడను వెండి బిందెను. కడున్. నించి = (పాలతోఁ) బూరించి. ఇంపలరఁగన్ = ఆనందము ప్రకాశింపఁగాన్. అంబరాహ్వాయ మహానటమూర్తి మహాభిషేకమున్ = ఆకాశమను పేరుగల శివునిశరీరముయొక్క గొప్పస్నానమును. చలుపఁగన్ = కావింపఁగాన్. (పంచభూతములును, సూర్యచంద్రులును సోమయాజియు నీశ్వరుని మూర్తులు). ఎల్లదిక్కులన్. వెసన్ = శీఘ్రముగాన్. ప్రవహించెడు, పాలవెల్లినాన్ = పాలయేఱోయను నట్లు. సాంద్రచంద్రికల్ = దట్టమగు వెన్నెలలు. అమందతన్ = ఆధిక్యముతోన్. సమస్తమున్. చలువఁబొందన్. పొలిచెన్ = కాన్పించెను.

126. పుష్పలావికల్ = పువ్వులనమ్ము స్త్రీలు. తొలఁకెడుహాసకాంతులన్ = ప్రకాశించు నవ్వుకాంతిచేతను. విధుద్యుతిన్ = చంద్రకాంతిని. ప్రోచి = రక్షించి. వృద్ధిచేసి యని యర్థము. చకోరమైత్రిజోకలు = చకోరపక్షియొక్క స్నేహవిధము లను. చకోరములతోడి సామ్యము నని యర్థము. మెఱయించు కన్గవలకల్కితనంబునన్ = ప్రకటించు కన్నుల చక్కఁదనముచేతను. తలఁపులు = మనసులను. కొల్లలాడి = అపహరించి. వశపఱుచుకొని యని యర్థము. భ్రమయించి = భ్రాంతి పుట్టించి. యువవ్రజంబుచేన్ = పడుచువాండ్ర సముదాయముచేతను. వెలలు = పూల వెలలను.

127. విరులు = పువ్వులను. అందు = ఆ పువ్వులలో. ఇంపునన్ = సంత సముతో. చరించుతేఁటిగమిలోన = తిరిగెడు తుమ్మెద సమూహములో. మాయా ఘనుండు = మాయ(లుగావించుట) యందు గొప్పవాఁడు.

128. పతిసమాగమోత్సవ సముత్సాహంబునంజేసి = మగనిపొందిక యందలి కోర్కచే నైన ప్రయత్నముచేతను. అపరాహ్ణంబుననుండియున్ = జాముప్రొద్దువేళ నుండియు. క్రీడాభవన = పడకయిల్లు. పర్యంకాది = మంచము మొదలైనవానికిన్. సముచిత = తగిన. నూతన = క్రొత్తవియగు. సత్క్రియా విశేషసంపాదనంబునకు = అలంకారముల సంపాదించుటకు. మనోరథంబు = కోర్కని.

129. సుగంధవాసితములు = పరిమళవస్తువులు గలపుటచేఁ బరిమళింపఁజేయఁ బడినవి. అగు. చూర్ణంబులన్ = నలుఁగుపిండిచేతను. గంధామలకంబు = మంచివాసన గల యుసిరికపప్పును. తిగిచెన్ = తీసివేసెను. మజ్జనమార్చెన్ = స్నానమాడించెను.

130. మెఱుంగుఁబావడలచే = ప్రకాశించు సన్నవస్త్రములతో. ధూపవాస నల్ = (సాంబ్రాణి మొదలగు వస్తువుల) పొగలయొక్క పరిమళములను. తల కొల్పెన్ = వహింపఁజేసెను. ప్రసూనసదలంకృతి = పువ్వులయొక్క యలంకారము. కీలుగంటు = దువ్వుముడి. చొళ్ళెము = జడచుట్టు.

132. నీ చకంబులన్ = నీ తలవెండ్రుకలయందు. విరిసినన్ = విడిపోయిన. ఒక్క యొప్పు = ఒక యందమును. అరవీడినన్ = సగము విడిపోయిన. వేణిభావ రచనన్ = జడగా నేర్పఱచుటచేతను.

133. నెఱిపెండ్రుకలు = అందముగల పెండ్రుకలు. ఆయతములు = పొడవులు. నీలములు = మిగుల నల్లనివి. జట్టిగొనఁ = వశపఱుచుకొను నని యర్థము.

134. కచబంధంబునఁ = కొప్పునందు. విరులు = పువ్వులను. చెరివెడుసఖిఁ = ముడిచెడు చెలికత్తెను. కన్నుఁగ్రేవలఁ = కనుగొనలయందు. తొలఁకఁ = అతిశయింపఁగా.

136. యక్షకర్దమంబు = కప్పురము నగురు మొదలగు వానితోఁ గూర్చిన మంచి గంధము. కలపముల భేదములు = వేర్వేఱు మైపూఁతలను. తనవలసినట్లు = తన యిచ్ఛవచ్చినట్లు. సంఘటింపించి = బాగుగఁ గూర్పించి. కుంకుమచందనాదులు = కుంకుమపూవు మంచిగంధము మొదలైనవానిని. అలఁది = పూసికొని.

137. మృగమదాదులఁ = కస్తూరి మొదలగువానిచేతను. పూర్ణచంద్రతిలకంబు = నిండుచందురుం బోలిన బొట్టును. నెలవంక విధమునామము = చందురువంకం బోలిన బొట్టును. తాల్చెను.

138. వీరమద్దియలు = ఆఁడువారికాలి పెద్దవేలం బెట్టెడు నెండెచుట్లు. మొల నూళ్ళు = ఒడ్డాణములు. అంగుళీయ = ఉంగరములు. కంకణ = కడియములు. అంగద = దండకడియములు. హార = ముత్యాలదండలు. తాటంక = చెవుల కమ్మలు. ముఖ = మొదలుగాఁగల. సమస్తభూషణములు = అన్నినగలను. తాల్చెను.

139. ఒక్కొకతోయము సొమ్ములె = ఒక్కొకవిధమైన నగలే. వెక్కు చెఱంగు లవి = వేఱు వేఱు విధముగలవి. (వేఱు వేఱు చక్కఁదనముగలవి). ఇవి = ఈ నగలు. తనప్రభఁ = ఆయాయి నగల కాంతిచేతను. ఒండొక్కటిమీఱుచుఁ = ఒకటి మఱి యొకదాని నతిశయించుచు. ఎక్కుడు = శ్రేష్ఠమైనవై. అగుటను.

140. అంచలపట్టు = తెల్ల పట్టుచీరను. (చుట్టు నంచలను వేసి నేసిన పట్టుచీర నని యేని యర్థము). అబ్రపుమంజిడి = వింతయగు నెఱ్ఱనిరంగుతోఁ గూడిన పసుపువన్నె గల కోకను. (ఇది మాంజిష్ఠశబ్దభవము). క్రొమ్మించుఁ జెరంగుదళ్ళు = వర్షాకాలపు మెఱపుంబోలిన యంచుగల వస్త్రవిశేషమును. కడుమేలిమి మాదళముల్ = మిక్కిలి

ప్రశ స్తమైన యాకుపచ్చ వర్ణముగల వస్త్రములను. బవంతులు = పలురంగులు గల చీరలను. ఒక్కించుకయించుకంతవడి = కొంచెము కొంచెము కాలము.

141. తరుణి = ప్రభావతి. చిఱుఁదమ్ములపుంబసతోడిమోవిన్ = స్వల్పమగు తాంబూల రాగము గల పెదవితోడను. మేగరగరికన్ = శరీరముయొక్క చక్కందనము తోడను. విరాజిలుచున్ = ప్రకాశించుచు, కమ్మలు = దుద్దులను. తీగెయున్ = మెడధరించు బంగారు నగను. పూని. వేణికాసురభితన్ = జడయందలి పరిమళముతో. పొల్చి = ప్రకాశించి. ఒక్క పరిశుద్ధపు సైకపుటొల్లెన్ = ఒక తెల్లని సన్నపు బట్టను. కట్టి. పెఱసొమ్ములకున్ = ఇతరములగు నగల (ధరించుట) కు. ఓపమియన్మిషంబునన్ = ఓపిక లేక పోవుటయను నెపముచేతను. భాసురతన్ = ప్రకాశమును. వెలార్చెన్ = ప్రకటించెను.

142. వల్లభ = మగనియొక్క. మనస్సమాకర్షణ = మనసుయొక్క లాగికొను టకున్. (మనసు వశపఱచికొనుటకున్). కౌశలాకౌశల సందేహంబునన్ = నేర్పు యొక్కయు, నేర్పులేమియొక్కయు సంశయముచేతను. నేర్పుకలదో లేదో, యను సంశ యముచేత నని యర్థము. ఎందును = ఎట్టివస్త్రాభరణాదులు ధరించుటయందును. మనస్థైర్యంబు = మనసుయొక్క నిలుకడ. చాలక = లేమిచేతను.

143. శ్రీ = శోభచేతను. లలిత = మనోహరమైన. అంగరాగములున్ = మైపూఁతలను. మేలుతరంబున్ = ప్రశస్తమైన వానిని. మెచ్చక. దిద్దినట్టిదియె = ఇదివఱ కొకసారి సవరించినదానినే. సద్మసంస్క్రియల్ = పడకయింటి చక్కఁజేయు టలను. పొరింబొరిన్ = మాటిమాటికిన్. పరికించున్.

144. అబల = ప్రభావతి. కేళిగృహంబు ముంగిటన్ = క్రీడాగృహము (పడకయింటి) ముందటను. గరగరికలు = నైర్మల్యములను. ముఱికి లేకుండుట నని యర్థము. ఆలోకించున్ = చూచును. గంధాంబుసేకము = (కస్తూరి మొదలగునవి గల్పుటచే) మంచి వాసనగల నీరు చల్లుటను. రంగవల్లికల తెఱంగు = ముగ్గులయొక్క విధములను. సకినల మంచంబుజాడన్ = ధ్వనిచేయునట్టి కల్పింపఁబడిన పత్తులచే నలంకరింపఁబడిన మంచముయొక్క విధమును. కుంకుమపఱపుభంగులు = ఎఱ్ఱని పట్టు గుడ్డగల పాన్పుయొక్క స్థితిని. హొంబట్టు = బంగారువన్నెగల పట్టు. అలరుటో

వస్తు = ప్రకాశించెడు లోపలిగదులను. మేల్కట్లు = పడకయిల్లు మొదలగు వానిలో మీఁదం గట్టెడు చిత్రములతో నిండిన దుప్పటీలు. అంగరాగపూర్ణపాత్రికలు = మైపూఁతలతో నిండిన గిన్నెలు. గంధవాడి జరణులు = కస్తూరి మొదలగువాని పొడుముతో నిండిన కరాటములును. జాలవల్లికలు = తమ్మలపాకుల పెట్టెలును. (పాందానులును). సముపభోగసాధనశ్రీలు = సుఖముం బొందుటకు సాధనములగు వస్తువుల సంపదను. పరికించుచు.

145. చెదరి పఱచు = చెదర పఱుగెత్తు. పదువుపాడి = సముదాయముయొక్క సంబంధమును. వదలి. ఒసిఁగి = తొలఁగి. సవరించు శ్రవణోత్పలంబులోనన్ = అలంకరించుకొను చెవియందలి నల్లగలువపూవునందున్. ముప్పిరిగొను = బలపడియెడు. రాగవేగంబునన్ = ప్రేమాతిశయముచేతను. ప్రియాగమనవిలంబంబు = మగనిరాక యాలస్యమగుటను. ఏకాంతంబునకు = రహస్యప్రదేశమునకు.

147. సుదుర్గ్రాహ్యంబుల్ = మిగుల నాయాసముచేఁ బ్రవేశింపందగినవి. మాహాత్మ్యంబునన్ = గొప్పతనముచేతను. మేటి = శ్రేష్ఠుఁడు. దౌవారికాత్యుగ్రసన్నాహంబు = గుమ్మమునొద్దఁ గావలియున్న వారియొక్క భయంకరమైన (లోపలికిరానీని) ప్రయత్నము.

148. చిత్తము తమి = మనసునందలి కోర్కిని. రేఁచి = అధికముచేసి. హత్తినన్ = కలిగినన్.

149. అదృష్టము = వెనుకటిపుట్టువునం జేసికొనిన కర్మమును. చంద్రికోగ్రదవాగ్నిన్ = భయంకరమగు నడవినిప్పుం బోలిన వెన్నెలచేతను.

151. ఓ శశధర = ఓ చంద్రుఁడా! హిమధాముఁడును = చల్లని కాంతిగలవాఁడును. సుధాంశుఁడు = అమృతరూపమైన కిరణములు గల వాఁడును. అనంగా. నీ శైత్యము = నీ చల్లఁదనమును. నమ్మితిన్. ఘృతకోశాతకివి = నేతిబీరకాయవు. ఏల, అయ్యెదు. నేతిబీరకాయ తనయందు నేయిలేమిచేఁ బేరు వ్యర్థము చేసికొనినది యైనట్లు విరహిణులకుఁ జల్లఁదనముం బ్రకటింపమిచే హిమాంశుఁడు మొదలగు నీ పేళ్ళను వ్యర్థమైనవానిం జేసికొనకు మని భావము.

152. వనజారాతీ ! = చంద్రా ! వనజ = నీటంబుట్టినవి (తమ్ములు ; వానికి. నరాతి = పగవాఁడు). ఉష్ణతన్ = వేఁడిని (గలిగించుటను) విడువుము. చలువ = చల్లందనమును. ఒనరించినంతయఫలము = కావించినంత పుణ్యమే. కలుగును. కడవలన్ = నీటికుండలను. పోమొత్తమియె = పగులఁగొట్టకుండుటయే. చలిపందిరి వెట్టుట = మంచినీ రిచ్చు చావడిని నిర్మించుట. (అగును).

153. ఓ చంద్ర ! నన్ను. ఏఁచుటకే = బాధించుటకే. శ్యామకంఠ = శివుని యొక్క. లలాట = నొసటి (కంటి) కిన్. సామీప్య = దగ్గఱను. పరితప్యమానంబులుగన్ = మిక్కిలి కాల్పఁ బడుచున్నవి (వేఁడెక్కినవి) యగునట్లు. కళల్ = నీ శరీర భాగములను. మార్చిమార్చి. (కళలకన్నింటికి వేఁడిగలుగుటకై శివుని చిచ్చుఱకంటికి సమీపమున నొకప్పుడొకటియు, మఱియొక్కపు డింకొకటియు నుండునట్లు మార్పుచేసి). సింధూదకాంతః = సముద్రపు నీటినడుమను. సమింధన = మిక్కిలి మండుచున్న. బడబానల = గుఱ్ఱమునాకారముగల నిప్పుయొక్క. ఉగ్ర = భయంకరమైన. కీలల = మంటలయొక్క. దగన్ = వేఁడిని. ఊనియూని = మిక్కిలిగా ధరించి. ప్రత్యమావాస్య = ఎల్ల యమాసలందున్. (సూర్యచంద్రు లొక్కచో నుండు తిథి యమావాస్య). సంభవత్ = కలుగుచున్న. అర్కసంయోగ = సూర్యుని సంబంధముచేతను. కలిత = పొందఁబడిన. అధికోష్మిమన్ = మిక్కిలి వెట్టచేతను. క్రాఁగిక్రాఁగి = మిక్కిలి తపించి. విప్రయోగ = (కాంతల) నెడఁబాయుటచేతను. ఉష్ణ = వెచ్చనైన. పాంథ = బాటసారులయొక్క. ప్రాణపరిపాన = ప్రాణవాయువులం ద్రావుటయొక్క. భూమజంబు = బాహుళ్యముచేఁ బుట్టినది. అగు. కాఁక = వేఁడిని. పొందిపొంది. (భార్యలను విడనాడిపోయెడు వారికిం దీవ్రవేదనఁగావించి యెడఁబాటుచే మిగులం దప్తమైనవారి ప్రాణములం గ్రహించుటచే సంక్రమించిన వేఁడి నధికముగాఁ బొంది). కాలకూటాహ్వాయ భ్రాతపాలు = కాలకూటమను పేరుగల సోదరుని తోడిభాగముగా. పట్టి = బలత్కారించి. పుచ్చుకొను దాహకత్వంబు = సంపాదించిన దాహకత్వమును (కాల్చుశక్తిని). ప్రోచిప్రోచి = మిగుల వృద్ధిఁబొందించి. ప్రయత్నంబుతోడ = (ఎదియే నొక్క కార్యముఁ జేయం దలంచి వేగముతోడం జేయు వ్యాపారము ప్రయత్నము). ఇంత వేఁడిమి. సాధించితేము = సంపాదించితివేమో.

154. శశాంక = ఓ చంద్రుఁడా! (ఇది కళంకీ యను నభిప్రాయమును బోధించును). నెలన్నెలన్. ప్రథమకళల్ = మొదటి కళను రెండవకళ నని యర్థము. (చంద్రునిలోని పదియాఱవభాగము కళ). ఉపాయనమిచ్చుచున్ = కానుక చేయుచున్. పృథుతరమైన మైత్రిన్ = అధికమైన స్నేహముచేతను. వహ్నిసూర్యులన్ = అగ్నిని, సూర్యునిని. కడుంబ్రీతులన్=మిగుల సంతసించినవారిని. చేయుట. చంద్రునికళలు దేవతలు త్రాగుదురనియు నందు మొదటిదానిని నగ్నియు, రెండదానిని సూర్యుఁడు గ్రహింతు రనియు వేదమునందుఁ గలదు. ఈదృశ = ఇటువంటి. ఉష్ణిమ = వేఁడికిన్. ప్రథమఫలీభవత్ = మొదటి ఫలమగుచున్న. విరహిబాధకె = విరహులకుం బీడఁ గల్గించుటకే. కావలయున్ = అయియుండును. (దీనివలన నేమి ఫలమనన్). ఈ పృథివిన్ = ఈ భూమియందు. ఎన్నన్ = ఆలోచింపఁగా. అధర్మికిన్. పరపీడయె = ఇతరుల బాధించుటయే. ఉత్తమలాభము.

155. నిశాకర = ఓ చంద్రుఁడా! చలువయె = నీయందుఁ జల్లఁదనముగల దనుటయే. భ్రాంతిమూలము = భ్రాంతికారణముగాఁ గలది. (ఉన్నది లేనట్లు, లేని దున్నట్లు దోఁచుట భ్రాంతి). ఇంకొకటి = మఱియొక విషయమును. ఎన్నిచూడన్ = పరీక్షించి చూడఁగా. కేవలమును = నిశ్చయముగా. వేంద్రపుంబ్రకృతివాఁడవ = వెచ్చని స్వభావముగల వాఁడవే. ఎట్లనినన్ చకోరముల్. కడంకన్ = ప్రయత్నముతో. నీ యుడుకువెన్నెలన్. జుఱ్ఱుచున్. దానఁజేసి = ఆ వెన్నెల భక్షించుట చేతను. కాఁక = వెచ్చని పదార్థము (లను దినుట). అలవడన్ = అలవాటుపడఁగాన్. (నిప్పులందినియు). వెలయున్ = ప్రకాశించును. (కానున్నన్). శైత్యముల్ = చల్లఁదనమును. చల్లనిపదార్థముల నని యర్థము. మఱఁగినట్టివి = అలవాటుపడినవి. నిప్పుల మేఁతకున్ = నిప్పులం దినుటకు. ఓర్చునే = సహించునా?

156. కాలదోషమునన్ = వేళయొక్క కీడుచేతను. (కాలము మంచిది గాక పోవుటచేతను). అన్నిటియందున్ = అన్నిపదార్థముల యందును. విపర్యాసము = ఉండవలసి నట్లుండక వేఱుగా నుండుట. ఔనేమో = సంభవించునేమో. మలయానిలుండు = మలయమను కొండనుండి వచ్చు గాలి. (పయ్యెర). ఉత్కటతాపంబు = అధికమైన వేఁడిని. ఇదియున్ = మలయానిలుఁడు తాపముకల్గించుటయును. త్వత్ = నీయొక్క. చంద్రికా = కాంతులయొక్క. జాల = సముదాయముతో. సంఘటనా = కూడుటచేతనైన. దౌష్ట్యమె = చెడ్డతనము. (అగునేమొ). (కాదేని), క్రౌర్యంబు=

బాధగలిగించుట. రాజధర్మము = ప్రభుధర్మము. చంద్ర ధర్మమనియు నర్థము. అనుచున్. పూనెనో = (క్రౌర్యమును) నవలంబించెనేమో! "రా జెట్టివాఁడో ప్రజలు నట్టివారే యగుదు" రను న్యాయము నవలంబించి నీవు విరహిజనులను బాధించుటం జూచి యతఁడును దాపము గల్గించి యుండవచ్చునని భావము.

158. జగత్ప్రాణుఁడవై = లోకమునందలి జంతువులకన్నిటికిం బ్రాణమైన వాఁడవై. వేఁచుట = వేఁగునట్లుచేయుట. తాపముగల్గించుట. తగునే = యుక్తమా? వెలుగు = కంచె. చేనికింజుట్టును బఱువులు మొదలగునవి రాకుండ నేర్పఱిచిన యావరణ చేనిని మేయనారంభించిన దానిం గాచుట యసాధ్యమైనట్లు ప్రాణమే బాధింపం దొడంగిన నెవరు వారింపంగల రని యాశయము.

159. దూఱియు = నిందించియు.

160. అంతకాశాసమాయాతత్వము = దక్షిణపుదిక్కు (ఎల్లప్రాణుల నశింపఁ జేయునట్టి యమునిదిక్కు) నుండి వచ్చుటను. రౌద్రమూర్తిత్వావార్తలు = శివుని (దుఃఖపెట్టువాని) యాకారముగుటయొక్క వృత్తాంతములను. దహనసారథ్యతత్పరత = అగ్ని (ఎల్లవానింగాల్చి భస్మము చేయునట్టివాని) కి సహాయము చేయుటయం దాసక్తిని. శ్రీఖండవిషధరోచ్ఛిష్టత = మలయ పర్వతమందున్న మంచిగందపుఁ జెట్లయందలి పాముల యెంగిలగుటను. (పాములనోటియందలి విషయముతో సంబంధము గలిగి యుండుటను). చండాలవాటిలోన = మాలపల్లెయందు.

161. దక్షిణగంధవాహ = ఓ దక్షిణవాయువా! తత్ = ఆ దక్షిణపు దిక్కునందలి. మలయద్రుమ = మంచి గందపుఁ జెట్లయందు. రూఢ = పుట్టిన. గూఢపాత్ = పాములయొక్క (పాములు). భక్షణన్ = తినుటచేతను. ఇంతవఱ్ = ఈ కాలమునకు. ఎంతయు = మిక్కిలిగా. అపాయము = హాని. క్షయించుట యని యర్థము. పొందదె = సంభవింపదా? పొందకుండఁగా = (చెఱుపు) కలుగకుండఁగా. ఇక్షు శరాసనుండు = చెఱకు విలుకాఁడు. (మన్మథుఁడు). విరహి = వియోగులయొక్క. శ్వసిత = నిట్టూర్పు లనెడు. ఉపయక్రియన్ = (నీ స్వరూపమునకు) వృద్ధిచేయు క్రియచేతను. తదుష్ణతన్ = ఎడఁబాసిన స్త్రీ

పురుషుల యూష్మలందలి వేఁడిచేతను. ఉష్ణమెక్కఁగన్ = (నీకు) వేఁడి గలుగు నట్లుగాన్. విముక్తకృశ్యున్ = విడువఁబడిన కార్శ్యము (చిక్కుట) గలవానిని. చేసెఁగావలయున్. కాక = కాకున్న. ఇంతకెంతయు సహాయము పొందదె యను దానితో నన్వయము.

162. ఉపాలంభించి = ఉల్లసమాడి.

163. పాథోరాశిగభీరున్ = సముద్రమువలె గంభీరుని. (కామక్రోధాదులచే వికారము నొందని మనస్సు గలవానిని). సద్వితరణ ప్రాగల్భ్యమందారున్ = మంచి యీవియొక్క యతిశయముచేతను మందారవృక్షముం బోలినవానిని. సముద్రమును మథించినపుడు పుట్టినదియు, నెవ్వరేమి కోరిన నిచ్చునదియు నగు స్వర్గమందలి యొకానొక వృక్షము మందారము. భూనాథాస్థానవిధేయ వర్తనున్ = రాజసభలయందు నడఁకువ గల వానిని. అపైనఃపద్ధతీవర్తనున్ = పాపశూన్యమైన మార్గమునందు సంచారము గలవానిని. (అప + ఏనః + పద్ధతీ + వర్తనున్). యాథాతథ్య = సత్యమైన (కపటములేని). విధా = ప్రకారముగల. ప్రయోగ = వాడుక (తోఁగూడిన). వివిధోపాయ = పెక్కులగు నుపాయములచేతను. ఉపార్జిత = సంపాదింపఁబడిన. ఇది యున్మాథమునకు విశేషణము. ద్విట్ = పగవారియొక్క. మద = గర్వము యొక్క. ఉన్మాథ = నాశముచేతను. ఖ్యాత = ప్రసిద్ధినొందిన. సునీతికౌశలున్ = మంచి నీతిశాస్త్రమందలి నేర్పుగలవానిని. ఎప్పు డే యుపాయ ముపయోగింప వలయునో యప్పుడు దానిఁ బ్రయోగించి పగవారి బాగరణఁచు నీతిశాస్త్ర కౌశలము గలవాని నని భావము. అసన్మార్గచ్ఛిదాపేశలున్ = దుర్మార్గమును నశింపఁ జేయుట యందు నేర్పుగలవానిని.

164. వ్యాచక్షాణ = (పురాణేతిహాసాదులను) వక్కాణించుచున్న. సుధీజన = విద్వాంసులయొక్క. వైచక్షణ్య = (వక్కాణించుటయందలి) నైపుణ్యము యొక్క. ఉదయ = ఉత్పత్తిని. అభివర్ధన = పెంపుఁజేసెడు. వైదగ్ధీ = (గ్రంథ రచనయందలి) నేర్పుచేతను. చుంచు = ప్రసిద్ధ మైనట్టియు. రవిజకృత = (దానము నందు) కర్ణునితోఁ జేయఁబడిన. మైత్రీ = స్నేహముచేతను. చుంచు = ప్రసిద్ధ మైనట్టియు. విశృంఖల = అడ్డులేకుండునట్లు. అష్టదిక్చర = ఎనిమిది దిక్కుల యందును సంచరించెడు. కీర్తిన్ = యశము గలవానిని. ఎల్లగ్రంథముల నెఱిఁగిన

విద్వాంసులకు నైపుణ్యము గలిగించునట్టి గ్రంథరచనచేతనును, గర్ణుని దానముంబోలిన దానముచేతనును నెల్లదిక్కుల వ్యాపించిన కీర్తిగలవాని నని యర్థము.

165. అమలమ ప్రియసూనున్ = అమలమ్మకుం బ్రియపుత్త్రునిని. యామినీ శోపమానున్ = (ప్రియ దర్శనమునం) జంద్రుని బోలినవానిని. కమలభవమనీషున్ = బ్రహ్మదేవుని బుద్ధిం బోలిన బుద్ధిగలవానిని. గణ్యవాక్ప్రౌఢిశేషున్ = స్తుతింపం దగిన వాక్సామర్థ్యముచేతను శేషునిం బోలినవానిని. శమదమగుణనిష్ఠున్ = శమము దమము నను గుణములయం దునికిగల వానిని. (కామక్రోధాదులం జెందకుండుట శమము. బాహ్యములగు నింద్రియముల జయించుట దమము). శాస్త్ర చింతాగరిష్ఠున్ = శాస్త్రములయొక్క (ను) విచారించు చుండుటచే మిగులం బూజ్యునిని. ప్రమథ పతిసుభక్తున్ = శివునకు మిక్కిలి భక్తుడగువానిని. (భగవంతుని కథలను వినుటయం దిచ్ఛ, భగవంతుని బూజించుట మొదలగు గుణములు గలవాఁడు భక్తుఁడు). బ్రహ్మ విద్యానురక్తున్ = బ్రహ్మజ్ఞానమునం దాసక్తిగలవానిని. ఇట్టి యమరనార్య నీశ్వరుఁడు నిత్యసుఖునిఁ జేయుఁగాక !

---

## పంచమాశ్వాసము

---

1. శ్రీఫల = మారేడు దళములు. తులసీ = తులసిదళములు. సక్తుఫలా = జమ్మియాకులు. ఫుల్లజ్జాతి = వికసించుచున్న జాజిపూవులు. విచికిల = మల్లెపూలు. ప్రముఖ = మొదలైన. ద్రవ్య = వస్తువులచేన్. అఫల్గు = బలముగా. కృత = చేయఁబడిన. ఈశ్వరపూజా = శివపూజకు. ఫల = ప్రయోజనమైన. చిత్ = జ్ఞానముచేతను. గణ్యున్ = స్తుతింపం దగినవానిని. అమరసచివ వరేణ్యున్ = అమరయ్య యను మంత్రిశ్రేష్ఠునిని. (ఈశ్వరుఁ డనుగ్రహించుఁగాక !)

3. పూర్వపు నీ యతనుత్వ ధర్మమున్ = మునుపటి నీ పుట్టువునందలి మన్మథ ధర్మమును. (నీవు మన్మథుఁడవుగా నున్నపుడు విరహిణుల బాధించు గుణమును) నీ

పిశాచ లక్షణము ననియుం గోఁచును. తడవఁగన్ = తలపెట్టుటకు. వెఱతున్. కరముల్ = హస్తములను. మొగిడ్చెదన్ = మూసెదను. నమస్కరించెద నని యర్థము.

4. పెల్లయిన = అధికమైన. ఆయల్లకభరంబునన్ = విరహతాపాతిశయము చేతను. పెల్లగిల్లు నుల్లంబుతాల్మి = తొలఁగిపోయెడు ధైర్యమును. నిల్పరింపఁగ = ఆఁపుటకున్. లలామంబు = చేర్చుక్క యను భూషణము. దానింబోలిని చాల శ్రేష్ఠురాలగు స్త్రీ యని యర్థము.

5. లేఖన్ = జాబుచేతను. భరపడి = శ్రమనొంది. ఆత్మవీక్షన్ = తనయొక్క చూచుటచేతను. (తన్నుఁ జూచుటచేతను). ఓర్వరాని నాతమికిన్ = ఆఁపరాని కోర్కెకి. ఒనరన్ పలికి = అనుకూల పడునట్లు చెప్పి.

6. విశుష్యత్కంఠయై = ఎండిపోవుచున్న గొంతుకలదియై. ఈడేర్పుమీ = సఫలముచేయుమా. ప్రాణార్తి = ప్రాణబాధ. దీపింపన్ = అతిశయింపఁగా. మీనాంకుండు = చేప టెక్కెమువాఁడు; మన్మథుఁడు.

7. సంభ్రమంబునన్ = వేగిరపాటుతో. కర్ణోత్పలంబున్ = చెవి (నలంకరించుకొన్న) కలువ పూవునుండి.

8. హా = అయ్యో! సంతాపార్థకమైన యవ్యయము. తాలిమి = ధైర్యమును. ఆతల్పమునందున్ = ఆ పాన్పునందున్. అక్కునఁ జేర్చెన్ = భుజమధ్యమునం జేర్చెను. (కౌఁగిలించుకొనెను).

9. తదీయాలింగన స్పర్శనామృతసేకంబునన్ = ఆ ప్రద్యుమ్ముని సంబంధమైన కౌఁగిలియను దాఁకుటయునను నమృత స్నానముచేతను. మూర్ఛఁదేలుచున్ = మూర్ఛ నుండి తెప్పిర్లుచు. ఉన్మీలత్ = వికసించుచున్న. మహానంద = గొప్ప సంతసము చేతను. మూర్ఛిత = మూర్ఛనొందినది. చేష్టల్ = ఇంద్రియవ్యాపారములు. (చూచుట వినుట మొదలగునవి). భయకంప స్వేదలజ్జాత్మ = భయము, కంపము, స్వేదము, లజ్జయుం గలది.

ఆకస్మికమైన నిమిత్తమునఁ బుట్టు మనంబునందలి కలఁతభయము. రాగరోషాదులవలన శరీరమునం గలిగిన వణఁకు కంపము. లజ్జాభయ క్రోధాదులవలనఁ శరీరమునఁ బుట్టిన జలము స్వేదము. మన్మథ నిమిత్తమైన రాగాదులచేఁ గలిగిన మనస్సంకోచము లజ్జ.

10. వనజాక్షి = ప్రభావతి. చిరకాంక్షిత = చాలఁగాలమునుండి కోరంబడిన. నిజ = తనదియగు. పరిరంభ = కౌఁగిలియందలి. రసస్థితిన్ = అనురాగముండుటచేతను. చొక్కియున్న పతిచేతులు = పరవశుఁడగు మగనిచేతులను. ఓవరిలోనికిన్ = లోపలి గదిలోనికి. మేడమీఁది యింటికని యేని యర్థము.

12. మత్పూర్వ సమస్త పుణ్యఫలభూమిక = నా మునుపటి యన్ని పుణ్యములయొక్క మాఱురూపము. (అగు) మీఁచెలి. నన్నున్. ఏలికొన్నన్ = అనుగ్రహించినను. సర్వయువాధికుండన్ = ఎల్లపడుచు వాండ్రకంటె నధికుఁడను. ఈ విలంబము = ఈ జాగును. గాంధర్వ వివాహలీలకున్ = గాంధర్వ వివాహమను క్రియకున్. వధూవరులు తమయిచ్ఛచేత నమంత్రకంబుగం జేసికొను పెండ్లి గాంధర్వము.

14. తన విరహా సహిష్ణుతవిధంబు = ఆమెయొక్క విరహము నోర్వలేమి విధమును. ఆమె నీయెడఁబాటును సహింపలేమి నని యర్థము. అఖిలంబును = అంతయున్. ఆడుకొంగన్ = (చెలులతోఁ) జెప్పుకొనుచుండఁగాన్. నీవు. వింటిగా. మనంబునన్. ఏత్తుసిగ్గునన్ = పుట్టిన సిగ్గునందును. మునుఁగుచున్. నీ తమకంబు = నీ వేగిరపాటును. చతురుండవు = నేర్పరివి.

16. నాయికావిశేష = వేలువేలుస్త్రీల.

17. తద్గతి = ఆ స్థితిని. లోఁగుచున్ = వెనుదీయుచున్. లోనుగన్ = వశపడుటకు. పట్టఁబట్టఁగాన్ = మిక్కిలి పట్టుకొనుచుండఁగా. ఈప్సితసిద్ధిగన్ = కోర్కి సఫలమైనది యగుటకు. వీఁపుకానరాన్ డాఁగుట = వీఁపు కనపడునట్లు డాఁగుట (అగును). డాఁగుటం బోలు నని భావము. ఇదియెల్లన్ = ఇట్లుకోరుట. నిబిడంబు = దృఢము.

18. అనురాగవిలసన విశేషంబకాఁ = ప్రేమయొక్క ప్రకాశింపఁజేయుట లోని భేదమే (ప్రేమ నొకతీరున ప్రకటించుటయే) యగునట్లు. ఎత్తుకొని వచ్చెదము = ప్రయత్నించి తీసికొనివచ్చెదము. ఆలకించి = ఆదరించి. అల్పస్వరంబునన్ = మెల్లనిగొంతుతో. ఇట్లనియెన్.

19. తలిరుబోఁడి = ప్రభావతీ! (చిగురుఁబోలిన మేనుగలదానా!) విరసము = విరక్తింజెందినది. తెరవు = ఉపాయము.

21. దండన్ = సమీపమునందు. ఉనికిన్ = ఉండుటచేతను. అట్లుపు డెంచుట = మగనిచేతినుండి విడిపించుకొనివచ్చుట. అంత తప్పు = గొప్ప తప్పి దము. అనరాదు.

23. ఓ వరవర్ణిని = ప్రభావతీ! మంచి మెయిచాయగలదానా! వసుఁడు. సమాగమకాంక్షన్ = పొందుటయందలి కోర్కెచేతను. తడయుట = జాగుసేయుట. తమి = వేడుక. ఒక సరవిన్ = ఒక రీతిచేతను. ఒక రీతిగా నని యర్థము.

24. కేలు = చేతిని. తివియఁబోయి = లాగుటకు యత్నించి.

25. నీదుగుట్టు = నీలోఁతును. (నీ రహస్యమైన కోర్కెని). ఎవ్వారెఱుఁగరు = అందఱు నెఱుఁగుదు రని యర్థము. ఓోళ్ళా రోఁకండ్లం బాడిన కూరుములు = ఓలు త్రోయునపుడును, రోఁకటితోఁ బోటువేయునపుడును బాడుకొన్న వలపులు. మే మెల్ల వార మెఱిఁగిన వని యర్థము.

27. గబ్బివి = లోఁతు మనసుగలదానవు. గర్వముగల దాన వని యేని యర్థము. సరకు సేయమిగన్ = నీవు లక్ష్యము చేయనట్లు. రసిక శేఖరుఁడు = శృంగారరస మెఱింగినవారికి శిరోభూషణము. సర్వజ్ఞుఁడు = ఎల్ల నాయికలభావము లెఱింగినవాఁడు. నీకోలఁదిన = నీ శక్తికిం దగినట్లే యని యర్థము. ఈ శుభావాప్తి = ఈ మేలు చేకూఱుట. అతిగోప్యము = మిక్కిలి దాఁపందగినది. బిసబిసి మాటలు = బింకపుమాటలు. ప్రియముచెప్పియు = ఇచ్చకము లాడియు. అదరవైచి = బెద రించి. హితానువృత్తిన్ = హితమైన కార్యము ననుసరించుటను. (అప్పటికి బాగుగ

నుండవన్నను వీఁదటికి మేలుగావించునది హితము). కేల్వట్టి = చేతినిబట్టికొని. తిగిచెన్ = లాగెను.

28. ఇందు బింబాస్య = ప్రభావతి (చంద్ర మండలముంబోని మోముగలది). లజ్జా లసత్వమునన్ = సిగ్గుచేతఁ గలిగిన మాంద్యముచేతను. మల్లాడియాడి = మిక్కిలి పెనఁగులాడి. గ్రుక్కి గ్రుక్కి = మిగుల సంకోచించి. అత్యంతనిర్బంధము = మిగుల బలవంతము. తెరువునన్ = మార్గమునందున్. అర్గళాదికము = తలుపుగడియ మొదలగునది. విసివి = విరాగమునొంది. పోదుగదా. యను వెఱపు = అనుభయము సైతము. (తనకున్) ఒదవన్ = కలుగఁగాన్. చెలిన్ = రాగవల్లరిని. అలయించెన్ = శ్రమపెట్టెను. పడంతులవర్తనములు = స్త్రీల నడవడులు. విభుని నూతన సంగమవేళన్ = ప్రియుని క్రొత్తకూటమియపుడు. కరము వక్రములు = మిగులం గుటిలములు.

29. ప్రకృతిజ్ఞయున్ = స్వభావము నెఱిఁగినదియు. హిత నిర్వాహికయున్ = మేలైన పని నెఱవేర్చునదియున్. అగుటన్. అల్లనల్లనన్ = మెల్లఁగా మెల్లఁగా. కంబానకున్ తిగిచినట్లు = గట్టు రాటియొద్దకు లాగికొని వచ్చినట్లు. యత్నాధికతన్ = మిక్కిలి జతనముచేన్.

31. అనయమున్ = మిక్కిలి. చేరికయగు తఱిన్ = (మగని) సమీపించు సమయమునందున్. అనివార్య = నివారింపరాని. వ్రీడ = సిగ్గుయొక్కయు. భయ = వెఱపుయొక్కయు. భర = అతిశయముచేతను. ఆకులగతి = తొట్రుపడు నడకగలది. ఒదుఁగ నొదుఁగన్ = మిక్కిలి తొలఁగఁగా. డాఁగఁగా నని యర్థము.

32. అజ్జలజాక్షి = ఆ రాగవల్లరి. అత్యూర్జిత = మిక్కిలి దృఢమైన. సముజ్జిహాస = విడువవలె ననెడు కోర్కిచేతను. దుర్జయ = గెలువరాని, (విడువరాని). లజ్జా = సిగ్గును. సముద్వేగ = వెఱపును. వేగయున్ = త్వరయును గలదియును. ఉద్దామ = అధికమైన. రోమహర్షణ = గగుర్పాటు యొక్కయు. స్వేద = చెమటయొక్కయు. ఉద్భేద = పుట్టుటచేతను. సాదిత = నశింపఁ జేయఁబడిన. ప్రకృతి = స్వరూపముగల. మకరికాపత్ర = మకరికలును. అంగరాయుగన్ = మైపూఁతయుం గలదియును. (స్త్రీల చెక్కిళ్ళు మొదలగు తావులయందు మొసలియాకార మేర్పడునట్లు గంధము మొదలగువానితో వ్రాయు రేఖలు మకరికా పత్రము

లనంబడు). ప్రస్థితి = ఎదుట నుండుటయొక్క. పరిత్యాగ = విడుచుటయందలి. (ఎదుటినుండి యవతలికిఁ బోవుటయందలి). యత్న = పూనికచేతను. (గలిగిన) సంక్షోభ = కలఁతచేతను. సంచలీభవత్ = కదలియాడుచున్న. ఉత్తరీయ = పైఁట కొంగుయొక్క. పార్శ్వ = ప్రక్కనుండి. పునఃపునః = మాటిమాటికి. అలక్ష్యమాణ = కనఁబడుచున్న. వక్షోజకుంభ = కడవలంబోలిన స్తనములయొక్క. తట = ప్రదేశ సంబంధమైన. విజృంభణ = వికాసముయొక్క. ఆభోగయున్ = పూర్ణతకలదియును. అగ్రదృష్టిప్రసార = ముందటికిఁ జూపుల వ్యాపింపఁ జేయుటయొక్క. పరిహారనియమ = విడుచుటయందలి యేర్పాటుచేతను. నియత = ఆఁపివేయఁబడిన. కటాక్షసంచార = క్రేఁగంటిచూపుల సంచారముగల. (ఇది లోచన విశేషణము). చారు = సుందరమైన. కర్ణగోళ = గుండ్రని చెవుల యొక్క. కూలంకష = ఒడ్డునొరసెడు. చెవులవఱకు వ్యాపించిన యని యర్థము. లోలలోచన = చలించు కన్నులయొక్క. ద్రాఘిమ = పొడవుచేతను. శ్లాఘనీయ = స్తుతింపందగిన. ముఖ పరావృత్తి = మోము త్రిప్పుటయొక్క. పౌనఃపున్య = పునః పునర్భావము (మఱల మఱలఁ గావించుట) చేతను. ధన్యాయిత = పుణ్యము కలవి యగునట్లు చేయఁబడిన. ఉభయోపాంతభాగయుఙ్ = రెండు ప్రక్కల చోట్లుగలదియును. ముందటికిఁ జూచుటను విడువవలయు నను తలంపుచే నిలిపివేయఁబడిన కటాక్షము గలవియుఁ జెవులవఱకు వ్యాపించినవియుఁ జలించు చున్నవియు నగు సోగకన్నులచేతను బ్రశంసింపందగిన మోమును మాటిమాటికిఁ ద్రిప్పుటచేఁ గృతార్థములుగఁ జేయఁబడిన రెండుప్రక్కల ప్రదేశములు గలది యని యర్థము. అయిన యెలనాఁగన్ = ఇంతిని. (ప్రభావతిని).

33. గుట్టు = గాంభీర్యము. ఎడలఁగఙ్ = పోవునట్లు. కదియించెఙ్ = కూర్చెను.

34. కెలనఙ్ = ప్రక్కను. అయం ముహూర్తః = ప్రద్యుమ్నుఁడు ప్రభావతిచేతిని బరిగ్రహించినవేళ. సుముహూర్తః = మంచికాలము. అస్తు = అగుంగాక! ప్రమదంబునన్ = సంతసముతోఙ్.

35. అన్యోన్య = ఒండొరులయొక్క. పాణి = చేతులయొక్క. సంస్పర్శ = తాఁకుటచేతను. సంభృత = ధరింపఁబడిన, (ప్రాప్తమైన). ఆనంద = సంతసముచేఁ

(గల్గిన). స్తంభ = ప్రమాన్పాటుతో. పరీతాత్మతన్ = వ్యాప్తమైన శరీరము గలవా రగుటచే. అనురాగమున నేని, విస్మయాదుల నేని పుట్టునదియును, గదలకుండుట మొదలగు చిన్నెలు కలదియును నగు చేష్టావిఘాతము (చేష్టలుడుగుట) స్తంభము.

37. తనరెడు లజ్జాభయవాసనలు = అతిశయించెడు లజ్జయొక్కయు, భయముయొక్కయు సంస్కారములు. (మున్ననుభవించిన దానిని జ్ఞప్తికిఁదెచ్చు మనోధర్మము వాసన యనంబడు). ఉద్బోధమునన్ = వికాసముతో. (పైకుబుకుటచే). తనరన్ = ఒప్పఁగా. మొదటం బ్రద్యుమ్నుని జూచినపుడు సిగ్గును వెఱపును గల్గి సఖులబోధచే నణఁగి సంస్కారరూపమున నుండి యిపుడతని సమీపించుటచే మఱల స్ఫురింపఁగా నని భావము.

39. అలికుంతల = తుమ్మెదలఁ బోలు కురులు కలదానా! ఆనపొడిచెదు = ఒట్టుపెట్టెదవు. పైదలి = స్త్రీ (ప్రభావతి) యొక్క చెవిలో. తార్కొనన్ = సమీపించునట్లు.

41. తదుక్తికిన్ = ఆ ప్రద్యుమ్నుని మాటకున్. విభుండు = ప్రద్యుమ్నుఁడు. కేల్ = తనయొక్క చేతిని. తవిలిచి = రెండవచేతితోఁగూర్చి. ఇంచుకయెడన్ = కొంచెము దూరమునందున్. భుజముల్ = చేతులను. చుట్టు = అన్నివైపులను. వలగొల్పి = వలయాకారముగా నిల్చి. పొమ్మనన్. సువదన = ప్రభావతి. (మంచి మోముగలది). వెల్వడన్ = తప్పించుకొనిపోవుటకున్. తిరుగన్ = (ఇటునటు) భ్రమింపఁగాన్. శ్రోణిభుజస్తన వేణికాభర శ్రవణ కపోలముల్ = పిఱుఁదులును, భుజములును, గుచములును, గొప్పదియగు జడయును, జెవులును, జెక్కిళ్ళును. పతిన్. సారెకున్ = మాటిమాటికిన్. సోఁకుచున్ = తాఁకుచు.

43. అలయన్ పెనంగితి = శ్రమ కలుగునట్లు పెనఁగులాడితివి. ఘర్మకణావళుల్ = చెమట బిందువులయొక్క వరుసలను. మే = శరీరమును. నిమిరెన్ = తడవెను. ప్రేమమున స్పృశించె నని యర్థము.

44. కపోల = చెక్కిలియొక్క. చుంబన = ముద్దుపెట్టుకొనుటయొక్క. సమాగతి = ప్రాప్తియొక్క. ఆసన్ = కోర్కిచేతను. చెక్కిలిముద్దాడుట సంభ

చించుటను కోర్కెచేత నని యర్థము. ఉక్తమంతనము = చెప్పవలసిన యంశములేని యేకాంతమును. అభివీక్షణేచ్ఛన్ = చూచుటయందలి కోర్కెచేతను. నమ్రాననంబు = వంగినమోమును. గరయుంబు = సిగ్గు. పోఁడిమ్రుడిని. వ్రీడజాడ్యంబు = సిగ్గుచేఁ గలిగిన మాంద్యమును.

46. తార్చి = ఆకర్షించి. అపేక్షయత్నం = ఎక్కువ యత్నములేని. వద్వారణ = ఆమెయొక్క నివారించుటచేతను. సంప్రబుద్ధ = తెలియఁబడిన. రసవేన్ = అనురాగముగల వాఁడగుటచేతను. (ఆమె యాలింగనాదులను గొంచెముగా వారించుట చే వానియం దామె కనురాగము గలదని యెఱుఁగుటచేతను). వరతిప్రగన్ = (ఆమెకుం) బ్రీతిపుట్టునట్లుగాన్. బాహ్యనానావిధభోగకేళుల = వెలుపలివి (కౌఁగిలింత మొదలగునవి) యగు పెక్కుతెఱఁగుల సంభోగములచేతను. చొక్కుచున్ = పరవశం బగుచు.

47. బహిరంగరాగము = వెలుపలికిఁగాన్పించెడు మైపూఁత. వెలుపలి భాగమందలి యనురాగ మనియు నర్థము. ఇట రెండర్థములకు నభేదము. రాయిడికిఁ గాక = సమ్మర్దమునకు సహింపలేక యని యర్థము. సౌరభమె = పరిమళమే. చిక్కఁగన్ = మిగులునట్లుగా. అంతరంతరాగము = లోపలి సంభోగములయందలి ప్రేమము. ఇనుమడించుచున్ = రెట్టించుచు. అలరన్ = ప్రకాశింపఁగా. లోపలి రాగము బహిరంగరాగము సైతము లోపలికిఁబోవుటచే బలపడఁగా నని యర్థము. దంపతులు. అతులరతులన్ = సాటిలేని యాంతర సంభోగములచేతను. పెనఁగిరి. ఇందొండొరులం గౌఁగిలించుట మొదలగు వానిచేఁ గంధము మొదలగు వానిపూఁత జాఱిపోఁగా దానికి బాహ్యసంభోగమందలి యనురాగముతో నభేదము కల్పించి, యాలింగనాదుల సమ్మర్దము నోర్వలేక లోపలికిం బోయెనేమో యని యుత్ప్రేక్షించి, బాహ్యసంభోగమునకుం దరువాత స్వభావముననే హెచ్చిన యాంతరసంభోగానురాగమునకు నిది హేతువుగా నుత్ప్రేక్షించెను.

49. స్వకుతుకపూర్తి = తమకోర్కెయొక్కనిండు. కాఁగన్ = అగునట్లుగా. తమకోర్కెనిండునట్లుగా నని యర్థము. విమిశ్రభావకలనన్ = ఒండొంటితోఁగలిసి యుండుటచేతను. చిక్కుజీరుపడన్ = (ఒకదానితో నొక్కటి) యల్లికొనిపారలునట్లు. పైచిన చంపకనీలకంజమాలికల తెఱంగునన్ = పడవేసిన సంపెంగపూలయు, నల్లగలు

వలయు దండల వితముచేతను. (ప్రభావతిదేహము సంపెంగపూలదండవలెను, ప్రద్యుమ్నుని యంగము నల్లగలువపూలదండవలెనును). పరఁగన్ = ప్రకాశింపఁగాన్. నునుగాలిన్ = సన్నపుగాలిచేతను. సుషుప్తిన్ వహించిరి = నిద్రం జెందిరి.

51. అరుణాంశుపటలి = అనూరుని కాంతి సముదాయము. ప్రాతఃకాలమునం దూర్పునఁ గాన్పించు నెఱుపు. వాసరరాజ = సూర్యునియొక్క. పురః = ముందటి భాగమునన్. ధృత = ధరింపఁబడిన. ధ్వజంబుకొనన్ = జెండాచివరను. విస్ఫురిత మగు రత్నమో = ప్రకాశించు మణియో. అనన్. వేగుఁజుక్క = తెల్లవాఱుజామునఁ గాన్పించు చుక్క (శుక్రుఁడు). సురపతిదిశన్ = తూర్పుదిక్కునందున్. వెలింగెన్ = ప్రకాశించెను; ఉదయించె నని యర్థము.

52. యదుకుల చూళికాభరణము = యదువంశ శిరోభూషణము. (ప్రద్యుమ్నుఁడు). నిద్రచొక్కునన్ = నిద్రయొక్క పరవశత్వమునన్. నిద్రవలనంగలిగిన మైమఱపు చేత నని యర్థము. మెలపునన్ = మెలఁకువతోన్. ఎప్పటిమూసెన్ = తిరిగి మూసికొనెను.

53. సురతసంక్షుభితవేషము = సంభోగముచేఁ గలపంబడిన వస్త్రాద్యలంకారమును. అది = చెక్కిలి. దానన్ = మగనిమోమునకు (సమీపమున) నడ్డముగ నిల్పుటచే. పొరింబొరిన్ = మిక్కిలిగా. పులకితము = గగుర్పాటుగలది. కన్. కెంగేలన్ = ఎఱ్ఱనిచేతితోన్. చేతితో ననియె యర్థము. ఆఁగి = ఆఁపి; నివారించి యని యర్థము. ఎడఁగొంచున్ = సందుచేసికొంచున్. పెఱచేతన్ = రెండవ చేతితోన్. చేలాంచలము = వస్త్రముకొంగును. చొనుపుచున్ = కూర్చుచున్. నితంబావృతి = మొనకప్పులేమిని. అరసి = తెలిసికొని. కటితటంబు = మొలను. పొక్కిలి = నాభిని. కదించి = మూసి. అరవిరివదలుతుఱుము = సగమువిడి జాఱు కొప్పును. మూఁపునన్ = బుజమునందు.

54. ఈచాడ్పునన్ = ఈ విధముచేతను. ఇంపు = సంతసమును. కులుకు = వెదచల్లెడు. లేమ = ప్రభావతియొక్క. విలాసశ్రీచేన్ = విలాససంపదచేతను. ప్రియునిం జూచునపు డింతికిం గలుగు చూపులు మొదలగువాని మార్పు విలాసము. అక్కునన్ = ఱొమ్మునందున్. చేర్చెను = కూర్చెను. కౌఁగిలించె నని యర్థము.

55. కార్యాంతరచింత = వేఱొక్కపనియందలి తలఁపు. ముదితచెవిన్ = ప్రభావతి చెవియందు. కదియించి = కూర్చి. రేపులు = పగళ్ళయందున్. విడిదిన = బసయందే. మనోరథంబు = కోర్కి. విఘ్నాకులంబు = విఘ్నముచేఁ గలఁతనొందినది. (చెడినది). భూ వివరంబు = భూమిలోని బొఱియను. సంవరణంబు = మూఁతను. నిజనికేతనంబునకున్ = తనయింటికిన్. సంవృతంబు = మూయంబడినదానిని. కావించెన్.

56. కుక్కుటంబు = కోడి. సమయాభిజ్ఞతన్ = కాలము నెఱుంగుటచేతను. (మంత్రశాస్త్ర) సిద్ధాంతము నెఱుఁగుటచేత ననియు నర్థము. (రెండర్థములకు సాధనము). మన్త్రః = (కోపించిన యింతుల వశపఱచికొను మంత్రమును) జపింపఁదలఁచువానికిన్. వివిధచ్ఛందస్క్రియా = (ఆ మంత్రమునకు) పెక్కు తెఱంగుల బతిమాలుకొనుటయును ఛందోవ్యాపారము. ఛందస్సని యర్థము. అంతిమయామః = (రాత్రి) చివరిజాము. భగవానృషిః = భగవంతుఁడయిన ఋషి. (జ్ఞానవైరాగ్యాదులుగలవాఁడు భగవంతుఁడును, దేవు ననుగ్రహమున మంత్రములఁ గనుగొన్నవాఁడు ఋషియు ననంబడు). కుసుమధన్వీ = పువ్విలుకాఁడు. (మన్మథుఁడు) దేవతా = ఉపాసింపఁదగిన దేవుఁడు. మానినీరమణాయాం = కోపించిన. యింతులప్రీతియందున్ — వినియోగః = ఉపయోగము. అంచున్. ఇది = ఈ కూఁతను. ఆరంభించెఁగాబోలునాన్ = మొదలు పెట్టెనో యనునట్లు. తద్ధ్వని = ఆ కూఁత. మానినుల్ = కోపముగలయింతులు. (నాయికానాయకులకుఁ బరస్పరాపరాధమునఁ గల్గు కోపము మానము. అదిగల స్త్రీ మానిని). రతికిన్. తామై. నాయకులప్రేరణమునొందకయె యని యర్థము. నాథులన్ = భర్తలను. పైకొనన్ = కవియఁగా. అమరెన్ = ఒప్పెను. (ధ్వనికర్త). కుక్కుటము కోపించిన యింతులవశపర్చికొను మంత్రము నాలోచించువారిం జూచి సమయ మెఱిఁగినది గావున దాని నుపదేశింపదలఁచి దానియంగములగు ఋషిదేవతాచ్ఛందో వినియోగములఁదెల్పి యుపదేశించెనో యనునట్లు కూసెననియు, సిద్ధమంత్ర ముపదేశించినతోడనే ఫలించుఁగాన వారికి ఫలము వెంటనే కలిగెననియు భావము. కోపించి మార్మొమిడిన యింతులు కోడికూఁత విని కోపమును విడిచి పతుల కభిముఖులయిరని ఫలితము.

57. వాసర = పగటియొక్క. ప్రత్యాసత్తి = సమీపించుటయను. నిమిత్త = కారణముచేతను. విరహాశంకా = ఎడఁబాటు (గల్గునవెడి) సందియమున. సమం

కురిత = పుట్టిన. సంతాపంబునన్ = కాఁకచేతను. లోపలిపట్టు = లోపలి చోటిని. వదలి. వెలికిన్. నిర్గమించు = బయలువెడలెడు. నిఖిల = ఎల్ల. కాముక = సంభోగమం దిచ్ఛగల నాయికా నాయకులయొక్క. ద్వంద్వ = జంటల. సముదయ = సమూహముయొక్క. హృదయంబులచలువలన్ = మనసునందలి చల్లందనములను. గడ్డుతికి = మిక్కిలిగా (మీఁదికి) దుమికి. ఆక్రమించెనో యనన్ = వశపఱచికొనెనో యనునట్లు. హారమౌక్తికంబులు = (స్త్రీలమెడలోని) దండలయందున్న ముత్తెములు. అత్యంతశైత్యంబునఁ = మిగులం జల్లఁదనముతోఁ. ప్రవర్తిల్లెన్. అచిరభావి = త్వరలోఁగాఁ గలది. (ఇది విశ్లేషముతో నన్వయించును). భావజంవశంవద = మన్మథునకు లోఁబడిన. (భోగాసక్తులైన). స్త్రీపురుష = నాయికానాయకులయొక్క. పరస్పరపరిరంభ = ఒండొరుల కౌఁగిలియొక్క. విశ్లేష = విడువడుటవలన. ఖేదవేదనా = ఆయాసముచేతనైన బాధయొక్క. ప్రాచుర్యంబు = ఆధిక్యమును. సూచించుభంగిన్ = తెలియఁజేయు రీతిచేతను. (తెలియఁజేయునట్లు). ఒండొంటియంటుఁ = ఒండొకదానితోఁగల సంబంధమును. విడిచి. బిరుసెడలిన దళంబులతోఁ = గట్టితనము వదలిన రేకులతోన్. అతివిరళంబు = మిగులం బలుచనివి. మేల్కట్టుపువ్వుదండలున్ = వితానములయందలి పువ్వుదండలు. పడకయిల్లు మొదలగువానియందు మీఁదఁగట్టెడు రంగుదుప్పటి మేల్కట్టు వితానము సనంబడు. తమయంతర్గుణంబులకొలఁది = తమలోనున్న దారముల పరిమాణమును. విశదంబుగాన్ = స్పష్టముగాన్. తెలిపెన్. అన్యోన్యసన్నిధిన్ = ఒండొరుల దగ్గఱను. దంపతులు భార్యాభర్తలు. చెన్నుమీఱన్ = అందముచేఁ బ్రకాశింపఁగా. ఇంపుసొంపునన్ = సంతోషాతిశయముచేతను. ఆదరింపన్ = ప్రేమింపఁగాన్. పెంపొందు సౌభాగ్యవైభవంబు = గౌరవమునొందు చక్కఁదనపు సంపద. హృదయౌత్సుక్యవిలసన విశేషనంబునంబోలెన్ = మనసునందలి వేగిరపాటుయొక్క విలాసాతిశయముచేతను వలెనే. తాంబూలంబులు. అచలితంబుగాఁ = కదలకుండునట్లుగా. రుచులప్రచురతఁ = రుచిబాహుళ్యమును. పచరించెఁ = కూర్చెను. ప్రచురసురతంబులఁ = అధికమగు సంభోగములచేతను. చరించు = సంచరించెడు. ఉద్దామ = అధికమైన. యౌవనమద = పడుచుఁదనమువలని గర్వముచేతను. మదన = మన్మథునిచేతను. (కామముచేతను). మత్త = మదించిన. మత్తకాశినీమణుల = స్త్రీశ్రేష్ఠములయొక్క. మణిత రణితంబుల జోకలు = మణితములను ధ్వనులవిధములను. చక్కఁదనముల ననియేని యర్థము. (రతికాలమున స్త్రీల కంఠమునంబుట్టు ధ్వని విశేషము మణితము). ఏకసంతన =

ఒకసారి వినుటచేతనే. గ్రహించి = తెలిసికొని. అంచితప్రేక్షాదక్షతన్ = పూజింపఁబడిన బుద్ధిసామర్థ్యముచేతను. మంచి తెలివిగలుగుటచేత నని యర్థము. పరీక్షయిచ్చు భావము. ఆవహిల్లన్ = కలుగఁగాన్. గృహశారికాకీరపారావతకులంబులును = ఇంటియందలి గోరువంకలయుఁ జిలుకలయుఁ బావురాలయు సమూహములును. కలకలిత = కలకలముగల. ఇది దీనిదని తెలియకుండ సమూహమునుండి పుట్టిన ధ్వని కలకలము. లయలలిత = లయచే మనోహరమైన. (నృత్తగీత వాద్యముల సామ్యము లయ). కలకాకుభావంబు = మధురమైన మార్పును. తులకించుకులుకుటెలుంగున్ = ప్రకటించు సుందరమైన ధ్వనిని. కలకలికిపలుకులు = పొందిన ముద్దుపలుకులను. అవికలంబులుగాన్ = ఎడతెగనివి యగునట్లు. కులుకరింపన్ = వెదచల్లఁగా. దొరఁకొనియెన్ = ఆరంభించెను. మనోహరముగాఁ గూయసాఁగె నని భావము. ప్రతికల = ప్రతిక్షణమునందును. నవనవాయిత = మిగులం గ్రొత్తది యగుచున్న. ప్రౌఢి = నేర్పుగల. యువమిథున = జవ్వనముగల నాయికానాయకులయొక్క. రతిపరిమళంబులన్. కలపడంబయి = కలిసికొనినదియై. పొలుపెసఁగుచున్ = ఒప్పుచున్. (దీనికిని వెదచల్లుచునను దానికిఁ గరువలిబలంగములు కర్తలు). వికసన = వికసించుటకున్. ఆరంభ = మొదలుపెట్టుటచేతను. శుంభత్ = ప్రకాశించుచున్న. అంభోజముకుళ = తామరమొగ్గలయొక్క. సుకుమార సౌరభంబున్ = మృదువగు పరిమళమును. సారెకున్ = మాటిమాటికిన్. వెదచల్లుచున్ = వ్యాపింపఁజేయుచు. చల్లకరువలిబలంగంబులు = మందమారుతసముదాయములు. తెరువరుల తనువులన్ = విరహుల దేహములందు. పులకాంకురంబులు = గగుర్పాటు మొలకలను. అవిరళంబుగన్ = దట్టముగ. తలకొనన్ = పొటమరించునట్లు. మొలపించెన్. గత దివసావసానసమయంబున = కడచిన సాయంకాలమునందు. జిగీషితదేశాంతరుండు = పోవం గోరంబడిన మఱియొక దేశముకలవాఁడు. మఱియొక దేశమునకుఁ బోవంగోరిన వాఁడని యర్థము. అయిన. భాస్వంతుచేతన్ = సూర్యునిచేతను. ఆత్మ = తన (సూర్యుని) యొక్క. తేజః = కాంతియొక్క. సమర్పణా = ఒసఁగుటయును. అనల్పలాలనా = ఎక్కువ బుజ్జవము. పురస్సరంబుగాన్ = ముందుగలుగునట్లుగాన్. (తనకాంతిని వానియందునిల్పి బుజ్జవముచేసిన తరువాతను). సూర్యకాంతి రాత్రియందగ్నిం బ్రవేశించుట శాస్త్రప్రసిద్ధము. నియోగింపంబడియున్ = (చీఁకట్ల వారించుటకు) నాజ్ఞాపింపఁబడియును. నానాతమోనీకంబులన్ = ఎల్ల చీఁకట్ల సముదయములను. పోకార్పలేని తప్పు = పోఁగొట్టలేమి యను తప్పని యర్థము. ఆసన్నంబు = సమీ

పించినది. అయిన. యామాసరాధీశురాక = ఆ సూర్యునిరాకను. కార్యవైకల్యంబునన్ = (ఆయన చెప్పిన) పని నెఱవేర్పలేమిచేతను. ఆకులత్వంబున్ = కలఁతను. ఏపుదఱేఁగి = వికాసమును దఱేఁగి. విడిచి యని యర్థము. దీపకళికలు = దీపపు మొగ్గలు. వెలవెలంబాఱెన్ = తెల్లఁబడియెను. విక్రమవిరహంబు = పరాక్రమక్రీడను. (పరాక్రమముఁ జూపుటను). ముగియించి = చాలించి. గవుసెనన్ = ఒఱచేత. పొదివిన = మూసిన. కుసుమకోదండు = మన్మథునియొక్క. వెండిజలపోఁత = వెండినీటి మొలామచేతను. తళుకుటరిగ తెఱంగునన్ = ప్రకాశముగల డాలువలెన్. మెఱుంగడంగి = కాంతిచేతను దగ్గి. (కాంతిహీనమై). ఉడురాజమండలంబు = చంద్రమండలము. మాఁగుడువాఱి = మలినమై. కానిపించెన్. తొల్లి = పూర్వము. సురభి = కామధేనువు. నిజసంతతి హితార్థిని = తన సంతానముకొఱకు మేలుగోరినది. అయి. ప్రార్థింపన్. నిలింపవిభుండు = ఇంద్రుఁడు. అమృతంబిడుట = అమృతంబిచ్చుట. ప్రత్యక్షంబు = కన్నులకుఁ గానుపించునది. శాద్వల ప్రదేశంబులన్ = పచ్చనిగడ్డిగల చోట్లను. ప్రకాశించు ముక్తాఫలస్థూల ప్రాలేయబిందుబృందంబు = (ముత్తియములువలె దృఢములగు ముత్తియములంత కొలఁదిగల) మంచుబిందువుల సముదాయము. పశ్చిమరాత్ర = రాత్రికడపటిభాగమునందున్. వేకువ నని యర్థము. గోచర = బీళ్ళయందున్. ప్రచార్యమాణ = మేపఁబడుచున్న. పశువిసరంబులచేతన్ = పశువులమందల చేతను. కసవుతోఁగూడన్ = గడ్డితోఁగూడన్. గ్రసింపఁబడుచునుండన్ = (మంచుబిందువులు) మ్రింగఁబడుచునుండఁగా. గగనముకుర = ఆకాశమను నద్దమునందు. పరిదృశ్యమాన = చూడంబడుచున్న. తదీయ = ఆ మంచుతుంపురల. ప్రతిబింబవిభ్రమ = ప్రతిబింబముల విలాసముయొక్క (విలాసమును). దృఢీకార = స్థిరపఱుచుటయందు. పారీణంబులై = తుదముట్టినవియై. తగినవియై యని యర్థము. తారకంబులు = నక్షత్రంబులు. క్రమంబునన్. పలుచగాఁదొడంగెన్ = తక్కువగాఁదొడఁగెను. ప్రాబోధికంబులు = మేలుకొలుపునవి. (ప్రభువులను వైతాళికులు మేలుకొలుపునపుడు పాడునవి). భూపాళ, దేవగాంధారి. ప్రముఖ = మొదలైన. రాగ = రాగములయొక్క. ఆభోగ = పరిపూర్ణతయనెడు. సౌగంధ్య = పరిమళముతో. బంధుర = ప్రకాశించునది. (అందమైనది) యగు. గాంధర్వనాద = సంగీతధ్వనిచేతను. మేదుర = దట్టమైన. (అధికమైన). మృదువాద్య విశేష = శ్రావ్యమైన మద్దెలమొదలైన వేఱువేఱు వాద్యములచేత. పోషిత = పోషింపఁబడిన. సూతమాగధాది = సూతులు, మాగధులు మొదలగువారిచే. (రాజుల పరాక్రమముఁ

బొగడువారు సూతులు. రాజుల తండ్రి తాత మొదలగువారి శౌర్యధైర్యాదులం బొగడువారు మాగధులు). క్రియమాణ = చేయంబడుచున్న. స్తుతిపాఠరవంబులు = స్తోత్రములు చేయుటయొక్క ధ్వనులు. స్తుతులం దెలుపువాక్యములం జదువుటవలని ధ్వనులని యర్థము. ప్రభుద్వారంబులన్ = రాజుల గుమ్మములయొద్దన్. తోరంబులై = అధికములై. సొంపుమీఱెన్ = చక్కదనముతో నతిశయించెను. శ్రావ్యముగా నుండె నని యర్థము. అపరరాత్ర = తెల్లవారుజామున. స్వాధ్యాయాధ్యయన = వేదములు చదువుటవలన (గలిగిన). శబ్దస్థానంబులన్ = ధ్వనియుండు చోట్లను. తెల్లవాఱుజామునం జదువు వేదధ్వనికి నని యర్థము. అయిన యాదేశంబులుంబోలెన్ = వచ్చిన యా దేశములువలెనే. (ఒకదానింబోఁగొట్టి యాచోట వచ్చిన మఱియొకటి యాదేశమనంబడును). నిర్భర = అధికమైన. క్షీరభార = పాలబరువుచేతను. భిద్యమాన=బీఁటలువాఱుచున్న. పీన = బలిసిన. ఆపీన = పొదుఁగులచేతను. స్మార్యమాణ = తలపింపఁబడుచున్న. తర్ణకోపసరణ = దూడలయొక్క (దూడలు) చేరుట యందలి. రణరణక = ప్రేమచేతనైన. సంభ్రమ = వేగిరిపాటుచేతను. సముదిత = పుట్టిన. సముత్థాన = లేచుటగల. లేచినిలుచున్న యని యర్థము. ధైనుక = లేఁగంటి యావుల సముదాయముయొక్క. గంభీరహంభారవంబులు = పెద్దవియగు నంబా యను నఱపులు. విజృంభించెన్ = అతిశయించెను. చంద్రాస్తమయ = చంద్రునియస్తమయము (క్రుంకుట) చేతను. సంభవ = ఉత్పత్తిగల. (పుట్టిన). క్లేశ = దుఃఖము చేతను. పరిఘూర్ణ = మిగులం దిరుగుడువడుచున్న. (కలఁగుచున్న). అర్ణవ = సముద్రముయొక్క. ధ్వానంబుపెక్కువన్ = ధ్వనియొక్క యతిశయమును. వెక్కిరించినట్లు = పరిహసించినట్లు. అక్కజపు బాహుళ్యంబు = వింత యతిశయమును. నెరపు = వ్యాపింపఁజేసెడు. మాహాసందోహ = గోసముదాయముయొక్క. దోహనిస్వాన = (పాలు) పితుకుటయొక్క చప్పుడుయొక్క. సాహచర్య = కూడనుండుట చేతను. (చప్పుడులతోఁ గలిసియుండుటచేత నని యర్థము). సమధిక = మిగుల నెక్కువైన. దధిమథనవిధివిహిత = పెరుఁగుత్రచ్చుటచే నేర్పఱుపఁబడిన. ఘుమఘుమఘోషంబులు = కమ్మని పరిమళముగల ధ్వనులు. ఘోషంబులందున్ = గొల్లపల్లెల యందు. గంధూషితదిక్కంబులు = పుక్కిలించిన దిక్కులు గలవి. (ఎల్లదిశలం గ్రమ్ముకొనినవి). అగుచున్. పిక్కటిల్లెన్ = వ్యాపించెను.

58. అరుణోదయపుదీప్తి = సూర్యోదయకాలమందలి (యెఱ్ఱని) కాంతి. విలూనంబు = నఱకఁబడినది. దినపాదపముమొదల్ = పగలను చెట్టుయొక్క

మొదలు. గతనిద్ర = పోయిన నిద్రగల. (నిద్రనుండిలేచిన). శక్రేభ = ఇంద్రు నేనుఁగు (ఐరావతము)యొక్క. కర్ణ = చెవులయొక్క. తాళ = చలించుటచేత నైన. (ఏనుఁగు చెవుల నాడించుటచేతను). అనిల = గాలిచేతను. ఈరిత = ఎగురఁ గొట్టఁబడిన. కుంభ = కుంభస్థలమునందలి. సిందూరరేణువు = (అలంకారార్థము పూసిన) సిందూరపుధూళి. ధ్వాంతజాలముమీఁదన్ = చీఁకట్ల సముదాయముపైని. దండెత్తుభానుమంతుని వెలిగొల్లెనతోఁపు = దండువిడిసిన సూర్యుని వెలుపటి ప్రదేశ మందలి గుడారముయొక్క యెఱుపు. మార్తండ = సూర్యునియొక్క. పథరోధి = త్రోవ నడ్డగించెడు. మందేహబల = మందేహులను రక్కసుల సేనయొక్క. పద = పాదములచేతను. ఉద్ధృత = మీఁదికెగురఁగొట్టఁబడిన. పూర్వనగ = ఉదయ పర్వతసంబంధమైన. ధాతుధూళి = జేగుఱుతాయి మొదలగు వానిదుమ్ము. మందే హులను బలశాలు లగు రక్కసులు ప్రతిదినము నుదయకాలమునను, సాయంసమయము నను సూర్యు నడ్డగింతురనియు, నపుడు బ్రాహ్మణులిచ్చు నర్ఘ్యజలములు వజ్రాయుధ ములై వారిని మఱియొకదీవికి నెగురఁగొట్టుననియు వేదమునఁ గలదు. వనజరంగస్థలిన్ = తామరలను నాట్యస్థానమునందు. కెంబట్టుతెర = ఎఱ్ఱపట్టుతెర. ప్రాగ్దిశా లిప్తఘుసృణాంగరాగము = తూర్పుదిక్కు (అనునింతి) చేఁ బూయంబడిన కుంకుమ పూవుతోఁ గూడిన గందపుఁబూఁత.

59. అనుదితసూర్యహోములు = సూర్యుఁ డుదయింపని కాలముననే వేలిమికల వారు. (సూర్యోదయము కాకమునుపే యగ్నిహోత్రముచేయువారు). అగు, యజ్వల = శాస్త్రమునం జెప్పఁబడినప్రకారమున యాగముచేసినవారియొక్క. ప్రజ్వలదగ్ని దీప్తులు = మండుచున్న యగ్నికాంతులు. ఒద్దన్ = సమీపమునన్. అమరు = ఒప్పెడు. సోమిదమ్మల = సోమయాజుల భార్యలయొక్క. మిథఃకషణ = (ముణిఁగి కూర్చుండుటచేతన్). ఒండొకదానితో రాచికొనుటచేతను. ఉల్లసిత = ప్రకాశించిన. స్తనంబులన్ = స్తనములయందు. తనరుచున్ = వ్యాపించుచు. తత్సమయ = ఆ కాలమునందున్. ఆత్త = ప్రాప్తమైన. పరస్పరోపగూహన = ఒండొకదానిం గౌఁగిలించుకొనుటయందలి. రస = అనురాగముచేతను. రంగత్ = ప్రకాశించు చున్న. అంగక = శరీరములుగల. రథాంగపతంగ = జక్కవపిట్టలయొక్క. తత = అధికమగు. అరుణద్యుతిన్ = ఎఱ్ఱనికాంతిని. (చక్రవాకములకు రాత్రివియోగమును బగలు సంయోగము నగు నని కవులు చెప్పుదురు). కడున్. గేలిచేసెన్ = పరిహ సించెను.

60. విభుండవు = భర్తవు. ప్రాగ్దిశ = తూర్పుదిక్కనునింతి. గౌతమదార జారునిన్ = ఇంద్రునిని. మద్దుచందము = ఉక్కుగుండుయొక్క విధము. ఇనుండు = సూర్యుఁడు. ఉష్ణతన్ = వేఁడిచేతను. కనుపట్టెన్.

62. బాహుపురులు = భుజకీర్తులు. ఒత్తి = గ్రుచ్చుకొనుటచే. కుమ్మెలు వోయిన = గాయములుపడిన. వరుమేనన్ = ప్రియుని శరీరముతో. ఒఱసిపోవఁగన్ = రాచికొనఁగాన్. చిట్లినట్టి గంధపుబేంట్లతోన్ = బీఁటలువిసిన చందనపుబెత్తులతో. ఒప్పు నఖపదములు = ప్రకాశించు నఖక్షతములను. (గోరిగీఁతలును). రమణుకుండలపీడనముల రేఖలు = ప్రియుని తమ్మంట్లరాపెడి (వలని) గీఱలు. అలరుచున్న కపోలఫలకములు = ప్రకాశించు పలకలంబోని చెక్కిళ్ళను. ప్రాణేశ = ప్రియునియొక్క. దశన కోరక = మొగ్గలంబోలిన దంతముల. శిఖా = అగ్రములయొక్క. సంసర్గమునన్ = సంబంధముచేతను. దంతక్షతములచేత నని యర్థము. కందినట్టి కెమ్మోవిసిరులు = నల్లంబడిన పెదవియొక్క శోభలను. ఆబాగు = ఆ చక్కఁదనమును. సడలఁజేయన్ జాలక = వదలలేక. ప్రాతః = ప్రాతఃకాలమునకు. ఉచిత = తగిన. (ప్రాతఃకాలమునఁ జేయందగిన). అంగసంస్క్రియా = శరీరశుద్ధిచేయుటయందలి. పరత = ఆసక్తిని. లేక = పొందక.

64. ఏగుదెంచుటన్ = వచ్చుటచేతను. అభీష్టరతిన్ = కోరంబడిన సంభోగముచేతను. వసివాళ్ళువాడు నీ చక్కనిరూపమున్ = మిగులవాడిన నీ సుందరమగు దేహమును.

67. పలుగఱ = దంతధావనము నని యర్థము. మొగంబు = ముఖమునందున్. (సప్తమ్యర్థమునం బ్రథమ). పసపును నలిపించుకొనక = పసపును బూయించుకొనక యని యర్థము. మజ్జనము = స్నానమును. మొగంబు మజ్జనమని సమస్తపదముచేసి ముఖ ప్రక్షాళనము (మొగము కడిగికొనుటను). లేక = చేయ కనియేని చెప్పనగు. అప్పుడు శరీరమందుఁ బసపునలిపించుకొనక యని చెప్పవలెను. కచంబులు = వెండ్రుకలను. ప్రత్యగ్రతిలకధారణము = క్రొత్తబొట్టుఁబెట్టికొనుటను. దినముఖనియపుణ్యంబులు = ప్రాతఃకాలమున నేర్పాటుతోఁ జేయఁదగిన పుణ్యకార్యములను. ఎవ్వియున్ = వేనిని. రతులచిన్నెలు = సంభోగమునందలి గుఱుతులను. దంతక్షతాదుల నని యర్థము.

67. పరిహాసగర్భంబుగాన్ = ఎగతాళిలోపలఁ గలుగునట్లుగాన్. ఎగతాళితోఁ గూడునట్లుగా నని యర్థము. లజ్జారోషభూషితములు = సిగ్గుచేతఁ (గలిగిన) కోపముచేత నలంకరింపఁబడినవి. యోషారత్నంబుచేతి యదరుఁ బ్రేఁతలు = స్త్రీశ్రేష్ఠము (ప్రభావతి) యొక్క చేతితోఁ గావించిన బెదరింపుదెబ్బలు. నూతనోత్సవంబులు = క్రొత్తపండువులు. నిజవల్లభసమాగమంబునకున్ = తమప్రియుల పొందికకుఁ. నిలయంబునకున్ = ఇంటికిన్. ఎలయించికొనిపోవన్ = తీసికొనిపోవుటకున్.

68. లలిత = సుందరుఁడగు. ప్రియ = మగనియొక్క. సంభోగ = సంభోగముచేతను. నాయికానాయకులకుఁ బరస్పరము నానందముఁగలిగించు నాలింగనము మొదలగు కార్యము సంభోగము. ఆకుల = చెదరిన. వేషము = వస్త్రము మొదలగు నలంకారమును. దిద్దుకొనఁ = సవరించుకొనుటకుఁ. ఎడలేమిన్ = అవకాశము లేకుండుటచేతను. కళవళపడుచున్ = కలఁతపడుచున్. అలుకఁ = భయపడఁగాన్. అతర్క్యగతిఁ = ఊహింపరాని రీతిచేతను. (అకస్మాత్తుగాన్).

69. కందళింపఁగఁ = పుట్టఁగాఁ. తదాకారచేష్టితములకతమునఁ = ఆ ప్రభావతియొక్క దేహవికారములయు వ్యాపారములయుఁ గారణముచేతను. వికారమువలనను వ్యాపారముల వలనని యర్థము. పురుషసంగతి కల్మిఁ = మగవానిచేరిక కలుగుటను. భావసంసూచన = తలఁపుం దెలుపుటయందలి. పాండిత్య = తెల్వియొక్క. (తెల్విని). గంధి = తెలిపెడు. విలోల = చలించెడు. కటాక్షావలోకనములు = క్రేఁగంటి చూపులు. పొలయఁ = వ్యాపింపఁగాఁ. జలజముఖులు = చంద్రవతీ గుణవతులు.

70. వింతపసలు = అచ్చెరువగు నేర్పులు. మున్నెన్నఁడు లేని కాంతులని యేని యర్థము. ఎవ్వలనఁ = ఏ యుపాయముచేతను.

71. మర్మంబుదాఁకఁ = ఆయమును దాఁకునట్లు మనసు నొచ్చునట్లని యర్థము. వ్రీడావతి = సిగ్గుగలది.

72. ముద్దరాల = క్రొత్తయౌవనముగలదానా! ఏగతిన్ = ఏయుపాయము చేతను. మహిమ = గొప్పతనమును. ఇది = ఎవరు రా వలనులేని యంతిపురములో

నుండియుఁ గోరినవానిని రావించి కోర్కె నెఱవేర్చుకొనుట. కడుఁ దెఱఁగు = మిక్కిలి యాశ్చర్యము (ను గల్గించునది).

73. ఉల్లసము = మనసు నొచ్చునట్టి పరిహాసము. తోఁపఁ = కాన్పించునట్లు. రహస్యభంగభయంబుచేతన్ = రహస్యముయొక్క చెడుటవలని (రహస్యము బయల్పడుటవలని) వెఱపుచేతను. గ్రుక్కుచున్నట్టిలాగు = సంకోచపడునట్టి విధమును. వెడఁగుఁబాటు = నిశ్చేష్టత. అభిమతార్థసిద్ధిహేతువు = కోరంబడిన కార్యముయొక్క నెఱవేఱుటకుం గారణము. గుట్టు = లోపలిభావమును. వెడఁగుఁబాటు = ప్రమాదపాటు.

74. ఇది = దీనినిగూర్చి. పేర్చెదరు = అతిశయించి పరిహసించెదరని యర్థము. మా సుదతియున్ = మా (చెలియగు) ప్రభావతియును. మీచదివిన యాకన నె = మీరు చదివిన పాత్రమునందే. చదివినది. మీవలెనే యీమెయును దూరదేశమందున్న పురుషు నొకని వలచినదని భావము. తదభీష్టము = ఆమెకోర్కె.

76. వీరలగుట్టును = వీరలరహస్యము సైతము. నీపోఁగునకున్ = నీత్రాటికిన్. వేఁటాడుచోటికిఁ జుట్టునుంగట్టు త్రాడుపోఁగు. తగుల్పడినదియే. వీరరహస్యపు భావమున్ సైతము నీవు తెలిసితివా యని యర్థము. మరాళకామిని = హంసి.

77. అధికభయలజ్జాసమాకులచిత్తలు = మిక్కిలియైన వెఱపుచేతను, సిగ్గుచేతను జెదరిన మనసుగలవారు. కనుసన్నలన్ = కంటి సంజ్ఞలచేతను. కొంచించుటయున్ = సందేహింపఁగాన్. నక్తంచరరాజనందన = రక్కసులఱేని కూఁతురు (ప్రభావతి). తదనుజలన్ = ఆమె చెల్లెండ్రను.

78. ఈరు = పేనిగ్రుడ్డును. తివ్వఁగన్ = తీయుటకు యత్నింపఁగాన్. కొంచెము తలపెట్టుటచే నధికముగాఁ జెప్పవలసివచ్చును. మీ రీమెను గొంచెము పరిహసించుటచే మీ రహస్యపు నడుపడులను బూర్ణముగాఁ జెప్పవలసివచ్చెనని భావము.

79. ప్రద్యుమ్న లేఖాహరణంబు = ప్రద్యుమ్ను జాబుఁ గొని వచ్చుటను. సుద్దులు = వృత్తాంతములను. వ్రీడావనతవదనలు = సిగ్గుచే వంచిన మోములు గలవారు.

80. మునిముచ్చులార = చూచుచుండఁగనే దొంగతనముచేయు శక్తిగల వనితలారా? (ఏమియు నెఱుఁగనట్లున్న దొంగలారా యని యేని యర్థము). కట్టిపెట్టి = కప్పిపుచ్చి. తటిమితిరి = తొందరపెట్టితిరి.

83. వికచోత్పలలోచన = పూచినకల్వలంబోలిన కన్నులుగలదానా! ఎల్లియు = రేపును. కోల్పదేని = ఇష్టపడకుండిన. భవదీయ నియోగమహత్త్వశక్తిచేఁ = నీయాజ్ఞాబలముచేత నని యర్థము. సంధిల్లెడునట్లు గాఁగ = లభించెడునట్లుగాఁ.

84. తన్నయనచేష్టావిశేషంబునఁ = ఆ ప్రభావతియొక్క కన్నులవ్యాపారభేదముచేతను. కనుసంజ్ఞచేత నని యర్థము. అతిలోకమహిమ మహనీయుండు = లోకము నతిక్రమించిన (లోకమున నెవ్వరికి లేని) గొప్పతనముచేఁ బూజింపదగినవాఁడు. దివ్యపురుషుండు = దేవతలంబోలిన పురుషుఁడు.

85. మది తహతహ = మనసునందలి త్వరను. కొంగు ముడివేసికొనుండు = నిశ్చయముగా నమ్ముఁ డని యర్థము. వాలాయముగన్ = అవశ్యముగాన్.

86. మృదు = మెత్తని. (లేఁత). స్మిత = నగవుచేన్. శోభన = మనోహరమైనట్టియు. లజ్జా = సిగ్గుచేతను. అవనత = వంపఁబడినట్టియు. వదన పద్మంబులతోన్ = తామరపూవులం బోలిన మోములతోన్. నిశాచరేశ్వరాత్మజ చేతన్ = రక్కసులయేనికూఁతుచేతను. (నిశాచరులు = రాత్రులయందుఁ దిరుగువారు = రక్కసులు. వారికి నీశ్వరుఁడు = ప్రభువు; వజ్రనాభుఁడు. అతనికినాత్మజ = కూఁతురు; ప్రభావతి).

88. సాకల్యంబునన్ = సంపూర్తితోన్. నాకౌకస్స్వామికిన్ = ఇంద్రునకున్. (నాక + ఓకస్ + స్వామి. నాక = స్వర్గము. ఓకస్ = స్థానము గలవారు = దేవతలు. వారికి. స్వామి = ప్రభువు).

89. స్వార్థము = తమకార్యము. సంక్రందనకార్యవర్తనము = ఇంద్రుయొక్క ప్రయోజనముకల్మి. తలపోఁత = ఆలోచనను.

93. అత్యావిలధృతిన్ = మిగులం జెదరిన ధైర్యముతోన్. ఇష్టావాప్తికిన్ = కోరిక నెఱవేర్చుకొనుటకున్.

94. భవదధీనంబ = నీకు వశపడినదియే. పరస్పర = ఒండొరులయొక్క. రహస్యకార్య = ఏకాంతపుంబనియొక్క. ప్రకటనంబునకున్ = బయలుపడుటకున్. సుహృద్భావ = స్నేహముచేతను. సుభగంభావుక = మనోహరమైన. నర్మ = పరిహాసముచే. సంవర్మిత = కవచముగలవిగాఁ జేయఁబడిన. (కప్పఁబడిన). వచనంబులతోన్ = మాటలతోన్. నెయ్యమునఁగావించు పరిహాసముతోఁగూడిన మాటలతో నని యర్థము.

95. వాసవకార్యపరత = ఇంద్రుని కార్యమునం దాసక్తి.

96. ఆత్మకల్పితభూవివరద్వారంబునన్ = తనచేఁ ద్రవ్వఁబడిన సొరంగంబు త్రోవచేతను.

97. అబల=ప్రభావతి. తన సిగ్గుపెక్కువ = తన లజ్జాతిశయము. ఆననాంభోజ = మోముఁదామరయొక్క. వ్యావర్తనా = మరలించుట. (త్రిప్పుట) చేతను. ముహుః = మాటిమాటికి. విఘ్నిత = విఘ్నముగలదిగాఁ జేయఁబడిన. (అడ్డగింపఁబడిన). అధరపానవిలసనంబు = పెదవి (యందలి యమృతము) త్రావుటయను విలాసముకలదియును. కర = చేతులతోన్. కృత = చేయఁబడిన. అంతర్ధి = దాఁపరికముగల. కపోల = చెక్కిళ్ళయొక్క. చుంబన = ముద్దాడుటయందలి. రణరణక = ప్రేమచేతనైన. సంభ్రమభరంబు = త్వరాతిశయముగలదియును. ప్రసభ = బలాత్కారముగాన్. అపహృత = తీసివేయఁబడిన. కుచప్రావరణాంశుక = స్తనముల మీఁదికప్పు వస్త్రముయొక్క. (పైఁటయొక్క). స్థాన = చోటను. అభిషిక్త = నిల్పఁబడిన. దోస్స్వస్తికంబు = బాహుబంధ విశేషముగలదియును. కుడిబుజము మీఁద నెడమచేతిని, నెడమబుజముమీఁద గుడిచేతిని నడ్డముగావైచి నిల్పుట దోస్స్వస్తికము. సమపోఢ = తీసివేయఁబడిన. జఘనవస్త్ర = కటియందలి వస్త్రముయొక్క. ప్రయోజన = కార్యమునకై. సమాదిష్ట = ఏర్పఱుపఁబడిన. (జఘనముం గప్పుటకై వేయఁబడిన). ఊరుయుగమిథోవేష్టనంబు = రెండుతొడలయు నొండొంటితోడి మెలికి గలదియును. అగుచున్. అవిరతంబున్ = ఎడతెగకుండునట్లు. కరకరి = విరోధమును.

ఒనర్పన్ = కావింపఁగా. రాయిడిన్ = సమ్మర్దముచేతను. కరమున్ = మిక్కిలిగాన్. కెరలునతనురాగవేగంబునన్ = ఉద్రేకించెడు మన్మథునివలని ప్రేమాతిశయము చేతను. అతిశయిల్లురమణురతిన్. ఒప్పెన్. (అబల కర్త్రి).

99. సిబ్బితి = సిగ్గును. దంతశిఖన్ = పంటిమొనతోన్. మోవియున్ = పెదవినిని. గుబ్బెత = యువతి. రేపుతెల్లన్ = పగళ్ళన్నిటియందును. తఱిన్ = సమయమునందున్. నిరంకుశ లజ్జపెంపునన్ = అడ్డములేని సిగ్గుయొక్క యతిశయము చేతను. కొంకన్ = సంకోచపడుచున్.

100. యాదవుఁడు = ప్రద్యుమ్నుఁడు. రతులవిభేదములు = సంభోగ విశేషములు. క్రమక్రమాభ్యుపేతములుగన్ = నానాఁటి కంగీకరింపఁబడినవికాఁగా. ఆపైదలికిన్ = ఆ యింతికి. చిత్రాపాదిసురతరాజ్యమునకున్ = ఆశ్చర్యమును గలిగించు సంభోగమను రాజ్యమునకున్.

102. పుంభావాదిని = పురుషాయితముయొక్క మొదటి కాలమునందున్. యౌవనపుం జిందఱన్ = పడుచుఁదనమువలని యుద్రేకమును. కొని = పొంది. భావజుసివము = మన్మథావేశము. ప్రౌఢిమన్ = నైపుణ్యమును.

103. వ్రేఁగు = బరువు. జఘనాతిభరంబు = పిఱుందుల యెక్కువ బరువును. విరోధి = (ఆమెకావించు కార్యమునకు) నాటంకము గావించునది. ఇంపొసఁగెన్ = సంతసము గల్గించెను. సముద్గమవేగసున్నము = ఎగురుటయందలి వడిచేఁ బ్రేరింపఁబడినది. అయి. ఇది ముందటి రెంటికి విశేషణము. ఒక్కటి = చనువ్రేఁగు. ఖేచరచక్రసామ్యధృతికిన్ = ఆకాశమునం దిరుగు చక్రములయొక్క (జక్కవపిట్టల యొక్క) సాటిని వహించుటకున్. తివన్ = లాగఁగాన్. తదన్యము = దానికంటె రెండవదియగు జఘనాతిభరంబు. భూచరచక్రసామ్యమున్ = భూమియందుఁదిరుగు చక్రములయొక్క (బండికన్నులయొక్క) సాటిని.

105. గాఢపరిరంభకౌతుకంబు = అధికమైన (బిగువైన) కౌఁగిలింతయందలి యాశ. లోలుపము = ఆసక్తిగలది. చాపలము = చాంచల్యము. వాతెఱచవులాను వలపు పెంపు = పెదవియందలి రసముం ద్రావవలెనను కోరిక. విఘటితా

న్యోన్యముగన్ = విడఁదీయఁబడిన పరస్పరము గలుగునట్లు. మీఁదటి తలంపులలో నొకదానిచే నొకటి నిరసింపఁబడునట్లుగా నని యర్థము. తత్తఱిలుచున్ = వేగి రించుచున్.

106. ఆ మత్తకాశిని = ఆ యింతి. (మద్యపానముఁ జేయకున్నఁ జేసినదానివలె విలసిల్లు నింతి). అతుల = సాటిలేని. అనురాగ = ప్రేమ. పూర్వక = ముందు గలుగునట్లుగాన్. ప్రేమకారణముగా నని యర్థము. నివర్తిత = కావింపఁబడిన. గాంధర్వ వివాహాలు = గాంధర్వ వివాహము గలవారు. నాయికానాయకులకుఁ బరస్పరాను రాగంబున నగునదియు నమంత్రకంబును మిగుల రహస్యంబును నగు పెండ్లి గాంధర్వం బని స్మృతులం జెప్పంబడియె. క్రమ ప్రవర్థమాన = నానాఁటి కభివృద్ధిఁబొందుచున్న. నానా రతి = పెక్కువిధములగు రతులయందలి. ప్రాగల్భ్య = నైపుణ్యముతో. నిర్భ రంబులు = నిండినవి.

107. అతియత్న = మిగులం బూనికతో. రుద్ధ = (నాయికచేత) నివారింపఁ బడి నవియు. లబ్ధ = (నాయకుచే నధికమగు కడంకచేతనే) పొందఁబడినవియునగు. ఆశ్లేష = కౌఁగిలి. చుంబన = ముద్దు. కుచపీడనాద్యమై = కుచపీడనము మొదలగు నవి కలదియై. మందమంద = మెల్లమెల్లఁగాన్. క్రియమాణ = చేయఁబడుచున్న. నానా = పెక్కుతెఱఁగుల. ప్రాతికూల్య = అడ్డగింతలచేతను. అభిరామమై = మనో హరమై. కృతక = కృత్రిమమైన. ప్రమాద = పొరపాటుచేతను. అనుమత = అంగీకరింపఁబడిన. సముల్లసత్ = ప్రకాశించుచున్న. అసంకుచితక్రియాకమై = సంకో చమునందలి యెల్లకార్యములు గలదియై. లేని పొరపాటు నభినయించి యంగీకరింపఁబడిన యెల్లకార్యములు గలదియై యని యర్థము. విరళ = పలుచని. త్రపా = లజ్జయనెడి. తిరస్కరణీ = తెరచేతను. లజ్జ తగ్గుటచేత నని యర్థము. పరిస్ఫురత్ = ప్రకాశించు చున్న. కుతుకసంరంభమై = వేడుకవలని వేగిరపాటుగలదియై. ప్రకట = స్ఫుటము గాను. ముఖరిత = ధ్వనించునదిగాఁ జేయఁబడిన. మేఖలా = గంటల యొడ్డాణము యొక్క. రణిత = ధ్వనిచేతను. గుణిత = ఎక్కువ చేయఁబడిన. మణిత = మణిత మనెడు. (సంభోగకాలమున నింతులకంఠమునం బుట్టు ధ్వనివిశేషము). ఘంటారవ = ఘంటాధ్వనిచేతను. ఆఘోష్యమాణ = చాటింపఁబడుచున్న. మసృణ = అధిక (దట్ట) మైన. కుసుమసాయకోద్ధత్యమై = మన్మథోద్రేకము గలదియై. (ఇవియన్నియు రతికి విశేషణములు).

109. ప్రభావతీ = ప్రభావతియొక్క. రతివిహార = సంభోగమనెడు క్రీడ యందలి. ప్రౌఢి = నైపుణ్యముయొక్క. సారస్య = రసజ్ఞానమనెడు. సంపద్వ్యక్తిన్ = భాగ్యము కలిమిచేతను. చొక్కి = ఒడలు మఱచి. రతీ! = (ఇది సంభోగమునకును, మన్మథుని మొదటి భార్యకును సంబోధనము). ఉద్యత్ప్రేమ సమృద్ధిన్ = ఉదయించుచున్న ప్రేమాతిశయముచేతను. (ప్రద్యుమ్నుఁడు ప్రభావతితోఁ గూడియున్నపుడొడ తెలియఁగక చిరకాలము రతితోఁగూడుట కలవాటు పడినవాఁడు గావున నీమె యామెయే యని భ్రమియించి). మొదటి పక్షమున సంభోగము నుద్దేశించియె యిట్లు పలికెనని చెప్పవలెను. అది = ఆ మాట. యోషాలలామన్ = స్త్రీశ్రేష్ఠమును. (ప్రభావతిని). శ్రవః = చెవులయందున్. సద్యఃపాత = అప్పుడు ప్రవేశముగల (ప్రవేశించిన). నిశాత = పదునుపెట్టఁబడిన (తీక్ష్ణమైన). శూలసమము = ఇనుపగసికం బోలినది. నొంచెన్ = బాధించెను.

110. చిరార్జిత = చాలంగాలమునకు సంపాదింపఁబడిన. తాదృక్చిత్ర = అట్టి యపూర్వమైన. మిథఃప్రేమన్ = అన్యోన్యస్నేహముచేతను. ఉల్లసిలుచోన్ = సంతసించుచున్నపుడు. బెరుకు = భేదము. ఎనసిన = పొందిన. ప్రియగోత్రస్ఖాలిత్యము = మగని నామవ్యత్యయమును. (మగఁడు గావించిన నామవ్యత్యయము). భ్రమమున నేని, ప్రమాదమున నేని యొకపేరికిం బదు లింకొక పేరుచ్చరించుట గోత్రస్ఖాలిత్యము.

111. రతోత్సవ = సంభోగమునందలి యానందముచేతను. అనుపమ = సాటిలేని. తత్ప్రథమక్షణ = దానికంటె (ప్రద్యుమ్నుఁడు రతీ యని పిలిచిన క్షణముకంటెఁ) బూర్వక్షణమునందు. సంభవత్ = సంభవించుచున్న. సుఖశ్రీమయమూర్ఛ = సుఖాతిశయ వికారమైన సొమ్మ (ఆనందాతిశయముచేఁగల పారవశ్యము). దుఃఖపుమూర్ఛయై = పీడావికారమైన సొమ్మయై (మనఃపీడవలనఁ గలిగిన మూర్ఛయై యని యర్థము). సకలాంగసంపదుద్దామన్ = ఎల్ల యవయవముల గుణాతిశయముచేతను (చక్కందనముచేత నని యర్థము). గర్వించుదానిని. అసురేంద్రసుతన్ = ప్రభావతిని. చేడ్పడఁగన్ = ఒడలు మఱచునట్లు. (బాధపడు నట్లనియేని యర్థము). మారణమంత్రము = చంపునట్టి మంత్రము. (మిక్కిలి తాపము గలిగించునది యని యర్థము).

112. మానదుఃఖనిశ్చేష్టిత = కోపమునఁ గలిగిన దుఃఖముచేఁ జేష్ట లుడిగినది. నాయికానాయకులకు నొండొరుల యపరాధమువలనఁ గలుగు కోపము మానము.

వగలన్ = మిగులం దాపముచేతను. బహువచన మతిశయముం దెలుపును. పొగలుచున్ = లోపలనే దుఃఖించుచు. మాల్మొగముగాఁగన్ = పెడమొగము గలుగునట్లు.

113. శయ్యాంతరమునకున్ = వేరుపాన్పునకున్. తోన = వెంబడినే. కడఁగు విభుని = యత్నించు మగనిని.

114. చనునుద్యోగము = వెళ్ళుప్రయత్నమును. హృద్యతరాంగివియోగము = మిగుల మనోహరములగు నవయవములుగల యింతి (ప్రభావతి) యొక్క యెడఁబాటు. సద్యఃపరితాపము = వెంటనే బాధను.

115. పర్యంకంబునన్ = మంచమునందున్. కర్ణగోచరంబు = చెవులకుం దెలియునది. అయ్యెడుపాటి పరిమితస్వరంబునన్ = అగునంత కొలఁదిగల కంఠ ధ్వనితోన్.

117. ప్రచలితంబగు మదితో = మిగులంగలంతఁ జెందిన మనసుతో.

118. దుఃఖాయత్తత్వము = దుఃఖమున కగ్గమగుటను. ఇది = నాయం దెద్దియే నొక్కతప్పు కాన్పించుట. మదలవెట్టంగాన్ = సెలవిచ్చుట.

120. నీవలయునోదె = నీకావశ్యకమగు ప్రశ్నను. కొనుము = వేయుము. నేను దప్పుచేసితినో లేదో ప్రశ్నించి పరీక్షింపు మని యర్థము. చోటు = అవకాశము. పెనఁగన్ = ఎదురు చెప్పుటకు. పెట్టుపోగడదండన్ = ఉంచెడు దారయంత్ర విశేషమును. (తప్పుచేసిన వారి మెడను వేయు నొకతీరు బొండకొయ్యను). పూనుదున్ = ధరింతును. నావలనం దప్పున్న నీ వల్పమైన మొలత్రాటిబిళ్ళల గ్రుచ్చుదారమునం గట్టి నను నీతి నవలంబించి నిలిచియుందునని భావము.

121. కంఠగద్గదికావిక్రుతి = కంఠమునందలి గద్గద (వణఁకుతోఁగూడిన) స్వరము యొక్క వికారమును. వర్ణావళి = అక్కరముల సముదాయము. ఏర్పడన్ = స్పష్టముగాఁ దెలియునట్లు.

122. పదింబదిగాఁగన్ = బాగుగాన్. సాయకున్నవారిన్ = విడువనివారిని. అనుసరించుట. అది = నీవు పల్కిన మాటను. తొలంగని = వదలని. నాయదియకాక = నాదేకాని.

నీయందు మిగుల ననురాగముగల నాయందు నీ కనురాగము లేనట్లు తెలిసినను నేను దేహమువిడువమి నాయపరాధమేకాని నీ కనురాగ మెవరియందుఁగలదో వారిం దలపెట్టుట తప్పుకాదని యాశయము.

123. మదీయము = నాది. వపురాశ్రయ = శరీరముయొక్క యవలంబించుట (శరీరము నవలంబించుట = బ్రదుకుట) యందలి. లోభమహాపరాధమే = కోర్కి యను గొప్ప తప్పిదమే. కట్టెడు నీ మృషాచటు వికారమున్ = కల్పించెడు నీ యసత్య మైన ప్రీతిం దెలుపు మాటలయొక్క మార్పును. చూడఁగఁజేసి = చూచుటచేతను, (చూచి సైఁచుట చేతను). రట్టును = నిందయును.

124. కుటిల = ఓ మోసగాఁడా ! ఒకటికిన్ = ఒకపనికిన్. తొల్లింటియట్ల = మునుపువలెనే. (నీకు నాకంటె వేరొక్కతే ప్రియురాలు కలదని నే నెఱుఁగని కాలమందువలెనే). కల్లకూరిమిన్ = లేని ప్రేమను. నెఱపు వాక్యములన్ = ప్రక టించు మాటలచేతను. బయలు = ఆకసమునందున్. ఊఁదించెదు = వ్రేలాడఁజేయు దువు. నాయందుఁ బ్రేమలేకున్నను మిగులం బ్రేమ యున్నట్లు చెప్పుచు నాకు మహో న్నతస్థితిఁ గలిగించెదనని యాసపెట్టుచున్నావని భావము. తడిపాఁతఁ గుత్తుక గోయు టనఁగన్ ; ఇదియకాదె ? = ఇట్లు చెప్పుటయే కాదా ? ప్రియమును జెప్పుచు నపకా రముచేయుట కీ లోకోక్తిని దఱుచుగా నుపయోగింతురు.

125. మిముబోంట్లరసజ్ఞకున్ = మీవంటివారి నాల్కకున్. తగవా ? = న్యాయమా ? (కాదు). ఇవి = నీవు పల్కినవి. (నీవు నా ప్రాణమవు నీ కపరాధము సేయుదునా యను వాక్యములు). అట్టివయైనను = మనసున నున్నవియే యైనన్. మోహపుం బట్టపుదేవి = వలపు (పుట్టించు) ప్రధానకళత్రము. రతిభ్రాంతిన = రతియను నింతియొక్క భ్రమముచేతనే. (అది కానిదానియం దదియను తలఁపు భ్రాంతి). పల్కెద వేమో = చెప్పితివి కాఁబోలును. మీవంటివారు నిజము పల్కవలయుంగాని యసత్య ములు పల్కందగదు. మీ రిప్పుడు చెప్పినవి నిజములేయైన నేను రతినని భ్రమియించి

పల్కుయుందురని భావము. ప్రత్యక్షముగా రతికాదని తెలియుచుండఁగా నేను రతిని గానని చెప్పుటచే నీకు రతియందే ప్రేమగలదుగాని, నాయందు లేదను నర్థము వ్యంగ్యము. వాక్యము చక్కఁగ నన్వయించిన తరువాతఁ జమత్కారము కొలుపఁ దోఁచు నర్థాంతరము వ్యంగ్యము.

126. మానదుఃఖము = కోపముచేఁ గలిగిన దుఃఖము. (నాయికకు నాయకుని యపరాధము (పరకాంతాసక్తి మొదలగువాని) చేఁ గల్గుకోపము మానమని కొందఱు).

127. తద్వచన రీతిచేన్ = ఆమెమాటల ధోరణిచేతను. మును = (ప్రభావతి యింకొకపొన్నునఁ బవళింప పూర్వము. తద్రతుల సంగతిన = ఆమె (ప్రభావతి) యొక్క సంభోగ సంబంధము చేతనే "రతీ" యని పల్కిన పల్కు.

128. అదియే? = (నేనుబల్కిన) "రతీ నీకుఁ దక్కితి" నను వాక్యమా?

129. అంటెన్ = నాటెను. ప్రద్యుమ్నుఁడు పలికిన మాటలలో "భవదుత్తమరతి" యనుమాట నొక్కటినే వినిపించుకొనెనుగాని, తక్కినవానిని వినలేదని యాశయము. రతియీర్ష్యన్ = రతివిషయమై (కలిగిన) యీర్ష్యచేతను. (ఇతరుల గొప్పతనము నోర్వలేమి యీర్ష్య). దృఢవాసితము = బలముగ వాసింపంబడినది గనుకనే. ఈర్ష్య మనమున బలముగఁగలదు గనుకనే యని యర్థము. ఇతరమున్ = తక్కిన వాక్యమును. చొరనీదు = ప్రవేశింపనీయదు.

130. పతిపలుకు = మగని ("భవ దుత్తమ రతి" యను) మాటను. ఈర్ష్యా వివశతన్ = కోప (మునంగలిగిన) పారవశ్యముచేతన్. తడవుచున్ = ఉచ్చరించుచున్. అవివేకంబునన్ = (ఆమాట "నీ యుత్తమమగు సంభోగముచేత" నను నర్థమున మగఁడు ప్రయోగించెనని తెలిసికొను) తెలివి లేమిచేతను. తదర్థము = ఆ శబ్దమున కర్థమును. అరయుచున్ = ఆలోచించుచున్.

131. (ప్రభావతికడకా సమస్తపదమును "భవ దుత్తమ + రతి" యని రెండు పదములుగా విభజించి రతి నీకంటె నుత్తమురాలను నర్థము దానం గలదని తెలిసికొని). నీదగు ప్రేమోత్సేకము = నీసంబంధమగు (నీ కామెయందుఁగల) ప్రేమాతి

శయమే. చాటంగన్ = (ఆమె నాకంటె రూపగుణాదులచే నుత్తమురాలని) ప్రకటింపఁగా.

133. ఉలుకవు = భయపడవు. అవగణనమునన్ = తిరస్కారముతోన్. దైన్యపుఁ బలుకు = గర్వములేని మాటను.

135. లతాంగి = ఓ ప్రభావతీ! ప్రథమాన సమస్తోరు గుణసమంచితవు = పెరుఁగుచున్న యెల్ల యుత్తమ గుణములచేత నొప్పుచున్నదానవు. దానవునకున్ = రాక్షసునకున్. (దనువను నింతియందుఁ గశ్యపునవలనఁ బుట్టినవాఁడు). ఉదయించిన దానవు = (ఉదయించిన + అది + వు). పుట్టినదానవు.

136. ఇంతపేరలుకన్ = ఇంతగొప్ప పరిమాణముగల కోపమును. నెట్టుకొనన్ = నిలుకడగాన్. ధరియించి. ఉన్కిన్ = ఉండుటచేతను. నిజాత్మ = నా స్వరూపము. (అయిన). అనంగుఁడు = మన్మథుఁడు. (నే నెవని యవతారమో యట్టి మన్మథుఁడే). నొంచుచున్నవాఁడు = బాధించుచున్నవాఁడు. మందపవనౌషధినాయక ముఖ్యులు = చల్లగాలియుఁ, జంద్రుఁడు మొదలగువారు. ఉగ్రతాపావహులు= భయంకరమైన వేఁడిని బుట్టించువారు. కినియించినవానికిన్ = కోపించునట్లు చేసినవానికిన్.

137. మధురంపుమోవితేనియలు = తియ్యని పెదవియందలి తేనెను. ఆనన్ = త్రాగుటకున్. విడువుము = సెలవిమ్ము.

138. పెరిఁగెడు = అధికమయ్యెడు. పరిరంభ = కౌఁగిలియందలి. తత్పరతా = అసక్తిన్. వశంబునన్ = లోఁబడుటచేతను. (అసక్తి కలుగుటచేత నని యర్థము).

139. సుధాంశుముఖి = చందురుంబోలిన మోముగలదానా! కలకంఠభాషిణీ = కోయిలపలుకులం బోలు పలుకులు గలదానా! కళావిదుషి = సంగీతాది విద్యలం బండితురాలా!

140. లతాంతకోదండుని పూములికీ = మన్మథుని పువ్వుబాణమా. (లతాంత = పుష్పము. కోదండ = ధనువుగాఁగలవాఁడు. లతాంతకోదండుఁడు = మన్మ

ఘుఁడు). అలికీరార్భటులన్ = తుమ్మెదలయుఁ, జిలుకలయు ధ్వనులచేతను. అలఁచెదు = బాధింతువు.

141. తనవిడిదివాకిటన్ = తన (ప్రద్యుమ్నుని) బసముంగిటను. ప్రాబోధికంబులు = నిద్రనుండి మేలుకొలుపునవి. వాద్యస్వనంబులు = వీణ మొదలగువాని ధ్వనులు. తతము, అనద్ధము, సుషిరము, ఘనము నని వాద్యములు నలు విధములు. వీణ, తంబుఱ మొదలగునది తతము. మద్దెల మొదలగునది యానద్ధము. పిల్లనగ్రోవిలోనగునది సుషిరము. తాళము లోనగు కంచువాద్యము ఘనము. పడవాళ్ళు = సేనానాయకులు. ఆత్మకల్పిత భూవివరద్వారంబునకై = తనచేతఁ ద్రవ్వఁబడిన నేల సొరంగపు మార్గమునకై.

142. తెఱవ = స్త్రీ. (ప్రభావతి). అల్క = కోపమును. కీడ్పఱిచి = తగ్గించుకొని. విడిచియని యర్థము. విజృంభించు విరహపరితాపముచేన్ = అతిశయించెడు నెడఁబాటువలని వేఁడిచేతను. కూడికొన్న నాయికానాయకులకు నెద్దియేని కారణమునఁ గల్గు నెడఁబాటు విరహము.

143. రమణి = ప్రియురాలు. ప్రయోజనవశతన్ = కార్యమున కధీనుండగుట చేతను. భూవివరమునన్ = నేల సొరంగముచేతను.

144. బిలావధిగాన్ = సొరంగముహద్దుగాన్. అరిగె = (సొరంగము వఱకుం) బోయి.

146. తద్విలిప్త చందన లవముల్ = అతనిచేతఁ బూసికొనఁబడిన మంచి గంధపు నలుసులను. తత్పరిభుక్తముక్తమాల్యనికరము = ఆతనిచేత ననుభవింపంబడి విడువంబడిన పూలదండల సముదాయమును. అక్షియుగ్మమునన్ = కన్నులజంట యందున్.

147. ఇంద్ర విరోధి తనూజ = ప్రభావతి. రాగిలుచున్ = (ప్రియుని యందున్) అభిలాషకలదియగుచున్. తత్ = ఆ చక్కందనము మొదలగువానియొక్క. అనుభవ = ఎఱుక (సాక్షాత్కారము) చేతను. ఉదిత = పుట్టిన. స్మృతికతఁ

బునన్ = తలఁపను కారణముచేతను. (అనుభవమునం బుట్టిన జ్ఞానము స్మృతి). అవ్విభు = ఆ ప్రియుని (ప్రద్యుమ్నుని). రామణీయక = చక్కఁదనముయొక్క. అభ్యుదయము = అతిశయమును. చర్చసేయుచున్ = చింతించును. సురతోత్సవచాతురి = సంభోగోత్సవమునందలి నేర్పును. ఎంచున్ = తలంచును. ప్రేమసంపద = (తన యందు నాతనికిఁగల) స్నేహసమృద్ధిని. గణియించున్ = ప్రశంసించును. లాలనల భంగులు = (అతఁడుచేయు) బుజ్జవముల రీతులను. భావనన్ = తలఁపునందున్.

148. ఇట్టి వల్లభునియందును = మీఁదఁ జెప్పిన లక్షణములు గల ప్రియుని యందును. ఏలతోఁచెన్=ఎందునకు స్ఫురించెను ? (వ్యర్థముగాఁ దోఁచెనని యర్థము). అదియున్ = " రతీమత్ప్రాణివమా " యని పల్కుటయును. మద్రతిని గూర్చి = నా సంభోగము నుద్దేశించి. అంటఁగాన్ = పల్కుటగాన్. తక్కక = మోసముచేయక. దైవవంచనన్ = పూర్వకర్మము (చేసిన) మోసముచేతను. దానికిన్ = నా ప్రియుఁడు పల్కిన వాక్యమునకున్. వేఱొక్కటిగాన్ = నా సవతి యగు రతియను దాని నుద్దేశించి పల్కుటగాన్.

149. ఆ యనఘుఁడు = నిరపరాధియగు నాప్రియుఁడు. తొలుతన్ = మొదటను. (నన్నుఁగవయక పూర్వము) ; యత్యాయతరాగ భంగులు = మిగులనధికమగు (నాయందుఁగల) వలపుయొక్క విధములను. అనన్యసమాన భాగ్యన్ = వేరుసాటిలేని పుణ్యముగల దానను. కానా ? = అగుదు నని యర్థము. అది = వెనుకటి ప్రేమను. చూడన్ = ఆలోచింపఁగాన్. అల్క యె = కోపమే. మూలము = (విరహవేదనకున్) కారణము.

150. సరి = సమానములు. తుమ్మెద క్రొత్తగ వికసించిన పూలం బ్రవేశింప నిచ్చగించునట్లు పురుషులు క్రొత్తజవ్వనుల యందుఁ దగులువడుదురని భావము. నాఁటి చాటూక్తుల ప్రేమగురుత్వమున్ = వజ్రనాభుని సభలో నాటకమాడిన దినమునందలి ప్రియవాక్యములలోని ప్రేమాతిశయమును. అలపత్రికయున్ = నానిమిత్తము హంసి పేర వ్రాసిన జాబులోని వాక్యములును.

151. అనన్యవిదిత గుప్తంబు = ఇతరులకుం దెలియకుండ డాఁపంబడినది. బహువారపఠితంబు = పెక్కుసారులు చదువంబడినది. నవోత్కంఠన్ = క్రొత్తవేగిర

పాటును. ఇష్టవస్తువులంబొంద జాగుసేయ నోపమి యుత్కంఠ. అల్పస్వరంబునన్ = మందమైన ధ్వనితోన్.

152. విద్యున్నిభాంగిరో = ఓ ప్రభావతీ! (విద్యుత్ = మెఱుపుతో. నిభ = సమానమైన. అంగి = శరీరముకలది). నీ కృపన్ = నీ దయను. కన్నన్ = (నేను) బొందితినేని. ప్రద్యుమ్నుఁడను పేరు = మిగులధనముగల వాఁడు. (భాగ్యవంతుఁడు) అను పేరు. ఫలితము = ఫలముగలది. సార్థకమైన దని యర్థము. త్రైలోక్య నిత్య సామ్రాజ్య వైభవమైనన్ = ముల్లోకములయొక్క శాశ్వతమైన ప్రభుత్వ సంపద సైతము. నీకృపలోనన్ = నీదయయందున్. లేశమున్=స్వల్పభాగమును. పోలదు=సరిపడదు. ఈ కారణముననే నీ దయగలిగిన నా పేరు సార్థకమగు నని వెనుక వాక్యమునఁ జెప్పఁబడియె. హరిమధ్య = సింగమునడుమును బోలిన నడుముగల యింతీ! ఇత్తున్ = ఒసంగుదును. ఏణాక్షి = లేడికన్నులంబోలిన కన్నులుగలదానా? నీ యుపేక్ష = (నేఁజెప్పిన మాటలయందు) నీ యనాదరమని యర్థము. విరులు = పుష్పములు. హరించున్ = తీసికొనును. (ఇవి యుద్దీపనవిభావ మగుటచే నిట్లు చెప్పఁబడెను. నాయికా నాయకుల కొండొరుల యెడంగలిగిన యభిలాషము నధికము సేయునది యుద్దీపన విభావము). ఆసన్ = కోర్కెచేతను. (ముందుగూడ నిట్లే). కపోల సన్నిధిన్ = చెక్కిళ్ళ దగ్గఱన్. నిమురన్ = స్పృసించుటకు. శృంగార కళ నెలవులు = మన్మథకళలుండు తావులను. మణితామృతము = మణితమను నమృతమును. (సంభోగమునందు నింతుల గొంతునుండిపుట్టు పావురపుఁ గూతంబోలిన ధ్వని మణితము). తనువు = (నా) శరీరమును. పంచి = వేరుచేసి. లోఁగొనవె = తమలో నైక్యము చేసికొనవా? శరీరమైదు భూతముల పాళ్ళతోఁ జేయఁబడినది. ఇందలి భూతముల భాగము లాయాయి భూతములతోఁ గలియుటయే మరణము. కాఁబట్టి, భూతవికారములగు పూఁదోఁట మొదలగునవి యుద్దీపనములు గావున మీఁదటి యాశలు లేనియెడల నన్నిదివఱకే హింసించి నా దేహమునందలి తమ భాగములను దమలోఁ గల్పికొనియుండునని భావము. విరహికిన్ =ప్రేమించిన నాయిక నెడఁబాసిన వానికి. సుహృత్తు = చెలికాఁడు. (కాఁబట్టి నిన్ను బాధింపక నన్ను బాధించును). ఫణితి = పల్కులు. కలభాషలకున్ = మధురమైన సంభాషణమునకున్. తొత్తు = దాసి. (కనుక నీవు హానిచేయక నాకు హానిఁజేయునని భావము). కఱకుఁబాయపుఁ దేంట్లు = పరుషములగు చిన్నవయసు నందలి తుమ్మెదలు. కచభర శ్రీబంట్లు = పెద్దకొప్పుయొక్క చక్కందనము సేవఁచేయునవి. కంజవైభవము = పద్మశోభ. అంతేవాసి = శిష్యుఁడు.

ఇంపులు = సంతసము గలిగించునవి; (అగును). ఎడపెట్టన్ = అట్లు చేయుటకు జాగు చేసినన్. నీయుల్లము = నీ మనసు. అహేతుకారుణ్యము = కారణములేని దయ గలది. చదువుకొనన్, దీనికిం గర్త్రి ప్రభావతి. తదీయవిభుఁడు = ఆమెభర్త.

154. ఇవి = ఈ జాబునందలివి. ఆదిన్ = నన్నుఁ (గలియుటకుం) బూర్వ కాలమందున్. కల ప్రేమభంగులు = ఉన్న కూరిమియొక్క యవస్థలు. నిరూఢిన్ = చనవుతోన్. రతోత్సవసౌహార్దరతుల్ = సంభోగమునందలి వేడుకయు నెయ్యము ననురాగమును. శతోత్తరతన్ = (ఒకనాఁటికంటె మఱియొకనాఁడు) నూఱుపాళ్ళధిక మగుటతోన్. (అధికముగాన్) మించన్ = అతిశయింపఁగా. ఆభవ్యు = ఆ యదృష్ట వంతుని (ప్రద్యుమ్నుని) యొక్క. ప్రాభవ = దొరతనము. రూప = చక్కఁదనము. ఆది = మొదలగు. గుణవ్రజంబు = గుణసముదాయమును.

155. అకారణపుంబేరలుకన్ = కారణములేని గొప్ప కోపముచేతను. తదాత్మకున్ = అతనికిన్. ఎడసి = దూరపడి. అతని నెడఁబాసి యని యర్థము. పిరువీఁకగుచొప్పు = బాధపడువిధమును.

157. అచలవృత్తిన్ = కదలనియునికితోన్; (కదలకుండన్). అక్షిసంజ్ఞచేన్. కనుసన్నచేతను.

159. పైదలి = ఓ యింతీ! ముఖపాండిమ = మోమునందుం దెల్లందనము (ఇది ప్రియు నెడఁబాయుట మొదలగువానిచేఁ గల్గును). పరాకు = ఎద్దియో యొక్కదాని యందలి యాసక్తి. ప్రత్యూషఃక్రియలన్ = ప్రాతఃకాలమునం జేయవలయు కార్యములను. కృష్ణచతుర్దశినాఁటి చంద్రరేఖయుబలెన్ = అమావాస్యకుం బూర్వదినమునందలి చందురు కళవలెన్. పికరాజిమ్రోఁతన్ = కోయిలల సమూహముయొక్క కూఁత (వినుట) చేతను. కయివ్రాలెదు = (భూమిమీఁదం) బడియెదవు. సోలెదు = మూర్ఛిల్లెదవు. ఇది ఏమి ? = ఇట్లగుట నే కారణముచేతను ?

160. ఆ లిఖితార్థము = ఆ జాబునందు వ్రాయంబడినదాని యర్థము. గెంటినన్ = తప్పిపోవఁగాన్. (నీ ప్రియుఁ డిందువ్రాసినదానికి విరుద్ధముగా నడిచినన్). చూచెదేమొ = (ఆ జాబును) పరిశీలించెదేమో. పోలిక = సామ్యమును. (ప్రియుఁడు చెప్పి

నట్లు చేయక వేఱువిధముగా నున్నప్పుడు పరితపించు నాయికల సామ్యము సని యర్థము). అట్లజో౯ = నే నన్న ప్రకారమే యగాను. అధిపుల్ = ప్రభువులం. సత్యసంధులే = నిజమైన ప్రతిజ్ఞకలవారా? చెప్పినట్లు చేయువారు కారని యర్థము.

161. తల్లోచనసంజ్ఞాప్రేరణమున౯ = ఆ ప్రద్యుమ్నుని కనుసన్నయొక్క ప్రోత్సాహముచేతను. ప్రద్యుమ్నుఁడు కనుసన్నచేఁ బ్రోత్సాహ పెట్టఁగా నని యర్థము.

162. కారించినవాఁడు = బాధ పెట్టినవాఁడు.

163. ఓ వనితా! నీవు అలిగెడుదాఁకన్, లేదు = నీవు కోపగించుట కవ కాశము లేదు. (జూదమాడువాఁడు తాను వేఱొకపని తప్పక చేయవలసివచ్చుటచే). ఆట = తానాడుటను. మాని. ఒడ్డించుకొనంగా౯ = (వేఱొక్కనిచే౯) బందెము వేయించుట. వలసె౯ = ఆవశ్యకమయ్యెను. విరహాకులితవు = ఎడఁబాటుచేఁ గలఁత నొందింపఁబడినదానవు. ఐ. కృశించితివి. ఒకానొక జూదగానికి నాడుట కవకాశము లేక యితరునిచేఁ బందెముపెట్టించుటకే కాలమంతయుం జెల్లునట్లు నీకును గోపించుట కవకాసము లేకుండ నీప్రియునికోపము తీర్చుటకే కాలము మిగులం గావలసియుండునని భావము.

164. నీదైన వియోగతాపవ్యథితాకృతి = నీ సంబంధమైన యెడఁబాటువలని వేఁడిచే వాడిన యాకారమును (ఎడఁబాటువలని వేఁడిచే వాడిన నీ యాకారము నని యర్థము). ఓ మానిని = ఓ కోపముగల యింతీ! అతిమాత్రవియుక్తికి౯ = అధిక మగు నెడఁబాటునకు౯. తానును = ఆ నీ ప్రియుఁడును. ఆ నెఱజాణ = ఆ గొప్ప నేరుపుకాఁడు. కరుణామృతవృష్టి౯ = దయయను నమృతవర్షముచే౯. అయోగ ఖేదము౯ = ఎడఁబాటువలని యాయాసమును. (ఇదివఱ కెన్నఁడుఁ గూడనివారి యెడఁబా టయోగమనియుఁ, గొంతకాలము కూడినవారికి మానాదులచేఁ గలిగిన యెడఁ బాటు విరహమనియు నాలంకారికులు చెప్పుదురు. కాని, యిట విరహమను నర్థమందే యయోగశబ్ద ముపయోగింపఁ బడెను.

166. కాంతలయారూపు = ప్రియురాండ్ర యా కోపముగల యాకారమును. కనుఁగొనువేడ్కలు = చూడవలెననెడు కోర్కులు. జాగుండెతోడి నిర్దయుల

యందుఁ = ఊఁతింబోలిన హృదయముగల దయలేనివారియందును. ఏను తేఁజిన = కోపమును పీడినదాననుగాను. ధవుని మనము = ప్రియుని మనసు. ఎంత రొయిడ్సెనో = ఎంత మఱలెనో.

167. సమంకురితస్మిత కోమలావలోకనములఁ = బాగుగ మొలకెత్తిన చిఱునగవుచే మృదువులగు (సౌమ్యములైన) చూపులతోఁ. తదీశ్వరుఁ = ఆమెభర్తను సైతము. గోపపుత్త్రి = (ఇది సాభిప్రాయవిశేషణము). పశువులకాపరికిం బుత్త్రుఁడా! రసికుండవు = రసము నెఱింగినవాఁడవు. (విపరీతలక్షణచే రసికుఁడవు గావని యర్థము). ఇంతిపైఁ = ప్రభావతివిషయమై. ధార్త్ర్యము = మోసగానితనము. ఘనము = అధికము. ప్రభావతిని మిగుల మోసము చేసితివని భావము. నవీనసుధఁ = క్రొత్త (యింతుల యధరమందలి) యమృతమును. చవుల్గొనుకోర్కిఁ = రుచిచూచెడు నభిలాషము. కోర్కియే = మంచియభిలాష మగునా? కాదని యర్థము.

168. ఓసి తుటారి = ఓసి దిట్టతనముగల యింతీ! పరుషవచనములు గలదానా యని యేని యర్థము. ఇంతకుఁ = ఈ యెడఁబాటువలని దుఃఖమున కంతకును. వెఱ్ఱికినుక = వివేకములేమినిఁ (గలిగిన) కోపము. తావలము = ఆధారము; కారణ మని యర్థము.

169. సఖీమాత్రంబవు = కేవలముం జెలికత్తెవు. బహిఃప్రాణంబవు = వెలుపల నున్న ప్రాణమవు. శయ్యాంతరంబునకుఁ = వేరుపాన్పునకుఁ. ప్రియనిర్గమపర్యంతంబుగాఁ = మగఁడు వెడలిపోవునందాఁక నని యర్థము.

170. విఱిగిరో = విరసత్వముఁ (వెగటుఁ) జెందిరో. పెలుచఁ = వేగిరపాటుతోన్.

171. తఱిఁ = సమయమునందుఁ. ఎఱుఁగని నా నిష్ఠురతకుఁ = ఆయన ప్రార్థన నంగీకరింపని నా కాఠిన్యమునకున్.

172. ఇది = నే నాయనను వెంబడించుట. వ్రీడకుఁ = సిగ్గునకును. మానసంపదకుఁ = మనసు గొప్పతనమునకును. వెత్తి = లోపము. గొబ్బునఁ = వేగముతోఁ. చేడియ = ఓ సఖీ!

173. నెచ్చెలీ! ఆ పరిపాటికిన్ = ఆ పద్ధతికిన్. తథావిధ = అట్టి రీతిగల. నీతోఁజెప్పిన ప్రకారముగల. ఆలాప = మాటలయొక్క. విచిత్రతన్ = వైవిధ్యము చేతను. (నేను నీతోఁజెప్పిన వేఱువేఱు విధములగు మాటలచేతను). వియోగదవాసహత్వమున్ = అడవినిప్పుం బోలిన విరహము న్నోర్వమిని. వేఁడువివశున్ = ప్రార్థించెడు నాడ లెఱుఁగనివానిని. అట్టి విభున్ = నాచేతఁ జిరకాలమునుండి కోరఁబడిన ప్రియునిని. కఠోరవృత్తిన్ = గట్టిదియగు మనోవ్యాపారముచేతను. (మనసున దయ గల్గమిచే). కైకోక = అనుగ్రహింపక.

174. నెత్తలిరేఁటెలు = చివురులను బల్లెములు. (ఇవి మన్మథునివి). నెఱపక = ప్రకటింపక. పరభృతశ్రేణులు = కోకిల సముదాయములు. శ్రుతులలోన్ = చెవులందున్. పఱపక = ప్రయోగింపక (గ్రుచ్చక). గందంపు మలకోడె గాడ్పుగములు = మలయపర్వతము సంబంధమైన పిల్లగాలుల సముదయములు. నఱపక = చూర్ణము చేయక. పరాగ ముర్ముర ములు = పరాగమను కుమ్మునిప్పులు. అంటఁబోదివి = (శరీరమునం) దవుల్కొని. వపుర్మహాశన్ = శరీరమునందలి గొప్ప యపేక్షను. బ్రతుకవలెనను కోర్కిని. విఱుపక = ఖండింపక; ముక్కలుసేయక. (మీఁదఁ జెప్పిన యీఁటెలు మొదలగునవి). ఓలిన్ = వరుసగాన్. ఏఁచుచున్నయవియొ = బాధించు చున్నవియొ.

175. తన్వి = ప్రభావతి. అని = ఇట్లుపలికి. విరహంపుఁ బేరలఁతన్ = వియోగమువలని గొప్ప యాయాసముచేతను. ఆశ్రిత చంద్రశిలా తలంబుమీఁదన్ = ఆశ్రయింపంబడిన చంద్రకాంతపు ఱాతిమీఁదను. (అందాఁకం దాను గూర్చున్న పటికపు ఱాతిమీఁదను). ఒరగుచున్ = పండుకొనుచున్. తదంకమున్ = చెలితొడను. శిరోదిశకై = (తన) తలయున్నవైపునకున్. తిగిచెన్ = లాగెను. బోటియున్ = చెలియును. తద్జ్ఞతన్ = ఆ సమయమునకుం దగిన కార్యము నెఱుఁగుటచేతను. తత్క్రియా ప్రవర్తనకున్ = ఆ పని నెఱవేర్చుటకున్. తదీశున్ = ఆమె భర్తను. దాకొలిపి = నిలిపి.

176. అంకోపధానము = తొడయను తలగడను. అనువుపఱిచి = అమర్చి. ఆ లతాంగియ = ఆ రాగవల్లరియే.

177. కళ్యాణి = ఓ యదృష్ట వంతురాలా! తదాస్యము = తల దిక్కునను న్న మానిసి మోమును. సుశ్రోణి = ప్రభావతి. నిజేశుమోము (ఆవంచినది) తనప్రియునిమోము. త్రపాద్భుత మోదమగ్నతన్ = లజ్జయందు, నాశ్చర్యము నందు, సంతసమునందు మునుఁగుట చేతను.

178. సతి = ప్రభావతి. చేష్టలు = ఇంద్రియ వ్యాపారములను. తక్కి = వదలి. (మాన్పడి). ఊరు స్తంభ సంగతత్వముకతనన్ = కంబముంబోలిన తొడం దగిలి యుండుట యను కారణముచేతను. కమనీయతన్ = చక్కందనముతోన్. (ఊరు శబ్దము, నురుశబ్దము నొక ధాతువునుండియే పుట్టునుగాని తొడయను నర్థమున నూరు వనియు, గొప్పది యను నర్థమున నురువనియు నుపయోగించునది యని వైయాకరణు లనుశాసించిరి. నిఘంటువులందు నిట్లే కాన్పించును. అయిన, నిచట నురుశబ్దమునకు గొప్పది యని యర్థము చెప్పిన సమంజసముగా నుండదుగానఁ దొడయని యర్థము వ్రాసితిని. మఱియు నిది లేఖకప్రమాదము గాదనియుఁ, గవి బహు గ్రంథ ద్రష్ట యనియుఁ దలఁచి దిద్దనైతిని. విద్వాంసులు మన్నింతురు గాక).

180. అలివేణి = ప్రభావతీ! [తుమ్మెదల (చాలుం) బోలిన జడగలది.] వేఁగుచున్ = బాధ నొందుచున్. ప్రయోజనాంతర మతిన్ = వేఱుకార్యము నందలి తలంపుచేతను. దానిప్రసంగము = నేను వెళ్ళినపనియొక్క ప్రస్తావము.

181. అంకకృతోపవేశన్ = తొడయందుఁ జేయంబడిన కూర్చుండుట గల దానిని. (తొడమీఁదఁ గూర్చుండఁ బెట్టఁబడిన దాని నని యర్థము).

182. కుచాధరమును = స్తనములను నధరము నని యర్థము. వరిష్ఠ = మిగులం గొప్పవియును. నిష్ఠుర = కఠినములునగు. కుచ = స్తనములచేన్. క్లిష్టాంగున్ = శ్రమనొందిన (నలిగిపోయిన) శరీరము గలవానిని.

183. మహత్తరసేతువురీతిన్ = మిగుల గొప్పదియగు గట్టువిధము చేతను. (గట్టువలెను.) ఆఁగి = (క్రీడయందలి యనురాగ ప్రవాహమును) ఆఁపి. ఇది యంత ర్భావితణ్యంతము. భేదిలి తొలఁగన్ = చీలి పోవఁగాన్. వారల = ఆ దంపతుల యొక్క. అసమాన = సాటిలేని. మానిత = పూజింపఁ బడియెడు. పరస్పర =

ఒండొరులయొక్క. కేలిరస = క్రీడయందలి యను రాగమనెడు. సహస్రముఖతీవ్రత = వేయిముఖముల చేతనైన గొప్పతనమును. (వేయి రెట్లధిక మయ్యెను). అగ్గలికన్ = ఉత్సాహము చేతను. తదుత్తరంగ = ఆ ప్రవాహ మధికమగుటచే బయలు వెడలిన తరంగములు గల. (అనురాగ మధికమగుటచేఁ గలిగిన). రతికర్మ విచిత్రతన్ = సంభోగ వైచిత్ర్యమును. ఎద్దియే నొక్క నదియందు వేయంబడిన గట్టుచేఁ బ్రవాహ మాఁగినట్లు పాలయల్కచే వారి సంభోగానురాగము కొంతసే పాఁగెననియు, గట్టు తెగినపుడు ప్రవాహము మునుపటికంటె నధికమై నట్లా యలుక తీరినతరువాత వారికిఁ గ్రీడాను రాగ మధిక మయ్యెననియు, నా ప్రవాహమునందలి తరంగములువలె నప్పటివారి సంభోగ విశేషములు వర్ణింప నలవిగాని వయ్యెననియు భావము.

184. యథేష్టభోగంబులు = ఇష్టాను సారములగు సుఖములను. అపూర్వ నర్తన ప్రవర్తనంబులన్ = మున్నెన్నఁడు నతఁడు చూడని నాట్యములఁ గావించుట చేత నని యర్థము.

185. చిట్టుములు = (చిటు + ఉములు) అరుచిచే నోటినుండివచ్చు నీళ్లు. (ఇది గర్భిణీ చిహ్నము). వేవిళులు = వేలువేలు వస్తువులఁ దినవలయు ననుకోర్కులు. కపోలసీమన్ = చెక్కిళ్ల యందున్. పాండిమ = తెలుపు. నీలిమ = నలుపు. వలగ్నము = నడుము. గురుత్వము = గొప్పతనమును. పొరసెన్ = పొందెను. (లావయ్యెను). వళుల్ = కడుపుమీఁది ముడుతలు. విరిసెన్ = వదలిపోయెను.

187. ప్రణుతగుణ = స్తుతింపంబడిన గుణములుగలది. దినమణి నిభున్ = సూర్యుం బోలినవానిని.

188. సకల...గులును = అన్ని వేదములయు, వేదాంగములయు నవతలి యొడ్డుం జేరినవారును. (ఋగ్యజుస్సా మాథర్వణములు నాల్గును వేదములు; శిక్షావ్యాకరణంబులును నిరుక్తంబు ఛందంబు కల్పంబు జ్యోతిషంబునను నాఱు నంగములు). ధనుర్విద్యా సంపన్నులును = ధనుర్విద్యతోఁ గూడినవారును. (అస్త్రశస్త్రంబుల నెఱిఁగినవా రని యర్థము). ప్రవర్తిల్లుచున్నంతన్ = ఉండఁగాన్. తద్రక్షణాధికారులవలనన్ = అంతిపురముయొక్క (అంతిపురమును) కాపాడుటయం దేర్పఱుపఁ బడినవారివలన. ఆగ్రహోదగ్రుండు = కోపముచే భయంకరుఁడు.

189. కాలవక్రతప్రకారముఁ = కాలముయొక్క క్రౌర్యమురీతిని. నూల్కొంట = సమ్మతించుట. ముక్కంటి వెలుంగు కంటఁ = శివుని యగ్నిమయమైన నొసటి కంటియందుఁ. చణకంబులు = సెనగలను. వేఁచుకొనంగఁ = వెచ్చ చేసికొను టకుఁ. పూనరే = యత్నింపరా ? నాయింటికిం జెఱుపుఁదలంచి సుఖ మనుభవింపం దలఁచినవారు శేషునోర వ్రేలిడినవారికిని, శివుని ఫాలనేత్రమున సెనగలు వేఁప యత్నించువారికిని సమానులని యాశయము. వారువలె నాశనముఁ జెందుదు రని ఫలితార్థము.

190. సురవంశభవులు = దేవతల కులమునం బుట్టినవారు. తద్భువనమునకుఁ = వారి లోకమునకుఁ. (పాతాళ లోకమునకుఁ).

191. భీమబలునిఁ = భయంకరమైన బలముగలవానిని. పెద్దతలవరిఁ = తన పట్టనపుం దలారులలో గొప్పవానిని. (రాత్రియందు గ్రామమున దొంగతనము మొదలగునవి జరుగకుండఁ గాపాడువాఁడు తలారి; తలవరి).

192. తిరుగకయున్నఁ = మఱల రాకుండినఁ. చావఁగా నని యర్థము. దండ నాయకోత్తములఁ = చిన్నచిన్న సేనల యధికారులలో బలవంతులను. దళ నాయిఁ = (ముఖ్య) సేనా నాయకుని. తదవస్థ = వారిస్థితిని. వారి మరణము నని యర్థము. కోటకొమ్మలఁ = కోట బురుజులందుఁ.

193. కోపాటోపదీపితముఖుండు = కోపముచేఁ (గల్గిన) వేగిరపాటుచే జేవు ఱించిన మోముగలవాఁడు. రథ = అరదములయు. తురంగ = గుఱ్ఱములయు. మాతంగ = ఏనుఁగులయు. పదాతి = కాలిబంట్లయు. వ్రాత = సముదాయము యొక్క. పాదఘాతంబులచేతఁ = కాలితాఁకుడులచేతను. అద్భుతోత్సాహం బునఁ = అబ్బురమైన యుద్ధప్రయత్నముతోఁ. కన్యకాభవనప్రాకారంబు = కన్నెల యంతిపురపుఁ జుట్టుగోడను. బెడిదంపురక్కసుని యక్కజంపు విక్రమంబు = భయం కరుఁ డగు వజ్రనాభుని వింత పరాక్రమము. ఓర్వశక్యంబు = సహింపఁదగినది. పూర్వవిహితమహీవివరద్వారంబునఁ = మునుపుచేయంబడిన (త్రవ్వఁబడిన) నేల సొరంగపు మార్గముచేతను. కళత్రంబులయుత్తలపాటు = భార్యల పరితాపమును. తత్పూర్వకృత్తదైత్య గాత్రంబుల నెత్తుటఁ. (వారిచే) నంతకుం బూర్వము నఱుకఁ

బడిన రక్కసుల రక్తముచేతను. జొత్తిల్లిన యాయుధంబులు = ఎఱ్ఱవాఱినకత్తులు. సంభ్రమంబునన్ = వేగిరపాటుతోన్. సంశ్లాఘావచనంబులన్ = స్తుతి (తోఁగూడిన) వాక్యములచేతను. అలరించిరి = సంతసపెట్టిరి.

194. తెగి = సాహసించి. దర్పము = గర్వము. (బలముచేతనేని, చక్కఁదనము చేతనేని, యైశ్వర్యాదులచేతనేని యితరులు నాసాటివారు గారను తలంపు దర్పము).

195. ఉడురాజానన = చందురుంబోలిన మోముగలదానా! (ప్రభావతీ)! రణములు = యుద్ధములు. కుడుములప్రేట్లాటలు = లడ్డులతోఁ గొట్టుకొనుదెబ్బలు. వెంబడిరావు = వెంటరావు. (వశపడియుండవు). తొడిఁబడన్ = (పగవారిసేనలు) చెదరునట్లు. తొడరినన్ = ఏను ఎదిరించినన్. బిట్టు = త్వరితముగన్. త్రుంగునో = వచ్చునో.

196. చేడియ = ఓయింతీ! నీజనకుచొప్పు = నీతండ్రివిధమును. కీడు = కీడుచేయవలయునను తలంపు నని యర్థము. చలంబు = ఇతరుల మేలుచూచి యోర్వలేమిని. అనికిన్ = యుద్ధమునకున్.

197. దానవకులాగ్రణిపైన్ = రాక్షసముఖ్యుని (వజ్రనాభుని) మీఁదను. తెగలేనిచింత = (యుద్ధము చేయుటకు) సాహసింపలేని విచారమును. కోటలగ్గలకున్ = కోటను ముట్టడించి లోపలఁ బ్రవేశించుటకై మీఁది కెక్కుటకున్. దగ్గఱుభూరిసైన్యున్ = సమీపించెడు గొప్ప సైన్యము గలవానిని. పితృవత్సలభావమున్ = తండ్రియందలి ప్రేమను. పాఱనూకుచున్ = త్రోసివేయుచున్.

198. మానవతి = గొప్ప మనసుగలది. (ప్రభావతి). అనూనతదీయాసిన్ = పెద్దదియగు నతని (ప్రద్యుమ్నుని) కత్తిని.

199. హరిపట్టి = ప్రద్యుమ్నుఁడు. వధూనిలయములోని కావలికిన్ = భార్యలయొక్క యింటి కాపునకున్. ఖడ్గవిహార = కత్తితోడ విహరించుట (కత్తి చేతంబూని తిరుగుట) యందున్. పటుత్వ = సామర్థ్యముచే. దీప్తుఁడై = ప్రకా

శించువాఁడై. ఉగ్రబలవేష్టనము = భయంకరమగు సేనయొక్క (సేనగావించు) ముట్టడిని. నిరర్గళగతిన్ = అడ్డులేని సంచారముచేతను తిరిగెన్.

200. నగళ్ళకోట = రాజగృహముయొక్క (చుట్టునుండు) కోట. కాంచన దీప్తిచేన్ = బంగారు కాంతిచేతను. పసిఁడిగట్టుతెఱంగు = బంగారుకొండ (మేరు పర్వతము) వితమును. డించిన దైత్యసైన్యము = విడియించిన (నిల్పిన) రాక్షసులసేన. తమమున్ వలెన్ = చీఁకటివలెన్. శౌరి తనూజుఁడు = ప్రద్యుమ్నుఁడు. దానిన్ = ఆ కోటను. సంచరణం బొనర్చుచున్ = తిరుగుచున్. భాస్కరునిచెన్ను = సూర్య నందమును వహించెను.

సూర్యుఁడు చీఁకటులం బాఱఁదోలుచు మేరువు చుట్టుం దిరుగునట్లు ప్రద్యు మ్నుఁడు చుట్టును ముట్టడించిన రాక్షససేనలం బాఱఁదోలుచు బంగారు కోటచుట్టుం దిరుగుచుండెనని యాశయము. సూర్యుఁడు, గ్రహములు, నక్షత్రములు మేరువు చుట్టుం దిరుగునని పురాణములం బ్రసిద్ధము.

201. లగ్గలకున్ = ఆక్రమించు కొనుటకున్. దగ్గఱు తనమొనలన్నిన్ = సమీపించు తన (వజ్రనాభుని) సేనలన్నిటిని. పేరగ్గలిక = గొప్పశౌర్యమును. చూపు మరుపోటు = కనుపటిచెడు ప్రద్యుమ్నుని యుద్ధమును. అగ్గించుచున్ = స్తుతిం చుచున్.

203. నాముదల = నాయాజ్ఞ. (నాసెలవు). వీడు = పట్టణమును. చొరంగన్ = ప్రవేశించుటకు. రాదు = సాధ్యముకాదు. బ్రహ్మవరము = బ్రహ్మయొక్క వరము; బ్రహ్మయిచ్చిన వరమని యర్థము. ఇట్టిది దేవతాదు లెవ్వారికైన ననుగ్ర హించి యిచ్చిన కోరంబడిన యర్థము వరము. మున్ను నాతపంబునకు మెచ్చి బ్రహ్మ యీపురమునే వారు నాసెలవు లేకుండఁ బ్రవేశింపలేరని వరమిచ్చెనని భావము.

206. (నేను) భద్రనటవేషమునన్ = భద్రుఁడను నటుని వేషముతో. నీ ముద లన = నీ యాజ్ఞచేతనే. హరిసుతుఁడన్ = కృష్ణుని కుమారుఁడను. యదుకులఁజుడన్ = యదువను రాజువంశమునం బుట్టినవాఁడను.

207. తావకానుజుని కూఁతులకున్ = నీ తమ్ముని కూఁతులకున్. అవార్య బలుల్ = వారింపరాని శక్తిగలవారు. సహజాత యౌవనోదారులు = కూడంబుట్టిన పడుచుఁదనముచే గొప్పవారలు. ఆత్మజులు = కుమారులు. దొరలన్ = సేనానాయకులను. తిన్నమృత్యువుల్ = భక్షించిన మృత్యువులు; చంపినవా రని యర్థము.

209. బెడిదంపు టంపవానలు = నొప్పించు బాణవర్షములను.

210. తచ్ఛరములు = ఆ బాణములను. తునుముచున్ = ఖండించుచున్. అతనిన్ = వజ్రనాభుని. తునుముకడంకన్ = నఱుకుయత్నముతోన్. తాఁకిరి = ఎదిరించిరి.

211. కోటగవఁకులు = కోటవాకిళ్ళను. దురాధర్ష = తిరస్కరింపరాని. (నివారింపరాని). ఆటోపతన్ = వేగముతోన్. ఇంద్రాహితులన్ = ఇంద్ర శత్రులను. సునాభముఖులన్ = సునాభుఁడు మొదలగువారిని.

212. కేశవుఁడు = కృష్ణమూర్తి. (బ్రహ్మాదులకు జనకుఁ డగు దేవుఁడు). అంచవేగరులచేన్ = శుచిముఖియొక్క చారులచేతను. (ఒకఁడు చెప్పమను వృత్తాంతము గొనిపోయి యింకొకనికిం జెప్పువాఁడు వేగరి). చక్రాది = చుట్టువాలు మొదలగు. ఆయుధ = యుద్ధసాధనములయొక్క. ప్రోల్లసత్ = మిగులం బ్రకాశించుచున్న. కాంతి = తేజముచేతను. క్రాంత = ఆక్రమింపఁబడిన. దిగంతరుండు = దిక్కుల యొక్క మధ్య భాగములు గలవాఁడును. (ఎల్లదిక్కుల వ్యాపించిన యాయుధముల కాంతిగలవాఁడును). వజ్రి = ఇంద్రుఁడు. సత్వరగతిన్ = వడినడకతోన్. సంధించి = కలిసికొని.

213. ధనురాది = విల్లుమొదలైన. సకల = అన్నివిధములగు. హేతి = ఆయుధములతో. సహితంబును = కూడినదియును. మాతలి సారథికంబును = మాతలి యనువాఁడు సారథిగాఁ గలదియు. తన దివ్యరథంబు = ఇంద్రుని, స్వర్గమునందలి యరదమును. సుందరమైన యరదమునని యేని యర్థము. అనన్య దుర్జయంబులు = ఇతరులకు జయింప (గెలువ) రానివి. దివ్య స్యందనంబులన్ = చక్కని యరదములను. పొదలియున్ = విజృంభించియు. ప్రతిభటులన్ = శత్రువులను.

214. ఆహతి = కొట్టుటయందును. ప్రత్యాహతి = (శత్రువులు ప్రయోగించిన దానిని) దిరుగఁగొట్టుట యందును. నైపుణము = కలనేర్పు. ఒక్క ధాంతిగన్ = ఒక్క పరిమాణము గలది యగునట్లు. సమముగా నని యర్థము. ఆహవము = యుద్ధమును. ఒనరించు మహోత్సాహనిధిన్ = కావించు గొప్ప ప్రయత్నమునకు నునికి పట్టగువానిని. (గొప్ప యత్నము చేయువానిని).

215. ఇట్లు = ఈ ప్రకారముగాన్. అయినన్ = సమముగా యుద్ధముచేసినన్. తత్ప్రయోగమునన్ = ఆ చక్రము యొక్క నడపుట చేతను. (ఆ చక్రము నతనిమీఁద విడుచుటచేత).

216. తద్విజయాభ్యుదయమున్ = ఆ ప్రద్యుమ్నుని గెలుపను శుభమును. పొంగి = సంతసపడి. గర్వించి యని యేని యర్థము. బహు విధోగ్రాస్త్రములన్. = పెక్కు తెఱఁగులుగల యాయుధములచేతను. (మంత్ర సహాయమునఁ బ్రయోగించు నాయుధ మస్త్రమని చెప్పుదురు). కదిసి = సమీపించి. సునాభాది దనుజగణ దేహంబుల్ = సునాభుఁడు మొదలగు రాక్షస సముదాయముల శరీరములను. చిదురుపలుగన్ = చిన్న చిన్న ముక్కలుగన్.

218. మందార = మందారమను. ద్రుమ = దేవవృక్షము యొక్క. పుష్ప = పువ్వులయొక్క. వృష్టితతులున్ = వానలును. (ఎవ్వరేమి కోరిన నిచ్చునదియు, సముద్రమునం బుట్టినదియు నగు స్వర్గమునందలి యొక వృక్షము మందారము). మంద్ర = గంభీరమైన. స్ఫురత్ = విలసిల్లుచున్న. దేవతాదుందుభి = దేవతల భేరులయొక్క. ఆరవ సంప్రవర్తనలున్ = ధ్వనులయొక్క సంచారములును. అస్తోక = అధికమగు. అప్సరస్ = అచ్చరలయొక్క. (క్షీర సముద్రమునం బుట్టిన మేనకాదు లప్సరసలు). నర్తన = నాట్యముల యొక్క. అమంద = అధికమగు. ఉల్లాసము = ప్రకాశమును. దివ్య = స్వర్గమునందలి. గాయకుల = పాటగాండ్ర. (గంధర్వుల). సన్మాధుర్య = మిక్కిలి మాధుర్యముతోఁ గూడిన. (ఇంపైన). గానంబున్ = సంగీతమును.

219. అనాథత్వదైన్యదశాపన్నులు = దిక్కులేమిచే (గల్గిన) దీనభావముతో గూడిన యవస్థ నొందినవారు. (రక్షించువారు లేమిచే దీనమైన స్థితి నొందినవారు). అనేక = పెక్కు విధములగు. లాలనా = బుజ్జవముతోడను. చాతుర్య = నేర్పు

తోడను. (గూడిన). శీతల వచనామృతంబునన్ = చల్లనిమాటలను నమృతముచేతను. (దేవతలును - రక్కసులును సముద్రమును మథించినప్పు డందుఁ బుట్టిన నవనీత మమృతము. దీనిం ద్రావువారికి జరామరణములు లేవు). అపగత = పోయిన. అశేష = సమస్తమైన. శోకపరితాపులన్ = దుఃఖమువలని సంతాపముగలవారిని. అపూర్వ సంభృతానంద విశేషులన్ = మున్నెన్నఁడు లేనిదియు, నపుడు సంపాదింపఁ బడినదియు నగు సంతోషాతిశయము గలవారినిని. (ఇవి రెండుం బౌరజన విశేషణంబులు). తదాధిపత్యంబునకున్ = దాని పాలనమునకున్. తదీయ స్థానంబునకున్ = అతని నెలవునకు. (స్వర్గమునకు).

220. వావిరిన్ = క్రమముగా నని యర్థము. ఇష్టకేళి పరిపూర్ణతన్ = ప్రియమైన క్రీడలతో నిండియుండుటచేతన్.

221. లక్ష్మీశ్వరుండు = కృష్ణుఁడు. అఘహరణ = పాపమును వారించునట్టి. హరివంశకథాశ్రయంబు = హరివంశమను పాత్రమునందలి కథయాశ్రయముగాఁ గలదియును. (కృష్ణుని వంశోత్పత్తిని నతని చరితముం జెప్పు హరివంశ మను గ్రంథము నందలి కథ ననుసరించి చేయంబడినదియును). ఆత్మ = తన. (లక్ష్మీశ్వరుని) యొక్క. పుత్త్రి = కుమారుని. గుణ = రూపలావణ్య శౌర్యధైర్యాదులయొక్క. స్తవన = స్తుతిచేతను. అంకితంబున్ = అలంకరింపఁ బడినదియును.

222. శ్రీ = శ్రీమంతుఁడగు. రాజేంద్రగురు = రాజేంద్ర గురువను వాని యొక్క. ఉత్తమ = ప్రశస్తమగు. అన్వయ = వంశమునందు. జనుః = పుట్టుట చేతను. విఖ్యాత = ప్రసిద్ధమైన. సౌభాగ్య = కీర్తిగల. సోమారాధ్యప్రభు = సోమారాధ్యుఁడను ప్రభువుయొక్క. సత్కృపాచతుర = ప్రశస్తమైన దయచే నిపుణమగు (మంచిదయగల). మతి = బుద్ధిచేతను. ఆనీత = పొందింపఁబడిన. ఫాలాక్షభక్తి = శివభక్తిచేతను. ఆరబ్ధ = కావింపంబడిన. వృషపగూహనా = ఆలింగనముచేతను. అతిసుఖిత = మిక్కిలి సుఖముగల. ఆత్మ = తనచేతను. ఆప్త = పొందఁబడిన. క్షమా = ఓర్పు. శాంతి = ఇంద్రియ నిగ్రహము. సద్వైరాగ్యోదయ = మంచి వైరాగ్యోత్పత్తి. బోధ = జ్ఞానము. ముఖ్య = మొదలగు. బహు సంతాన = పెక్కు సంతానముచేతను.




శరీరమునకు బాధ గావింపని పరాపకారముల నన్నింటిని సహించుట క్షమ. మనస్సును వశపఱచుకొనుట శాంతి. ఈ లోకమునందుఁ, బరలోకమునందుఁ గల సుఖములఁ సేవరించుట సౌభాగ్యము.

రాజేంద్ర గురువువంశమున జన్మించిన సోమారాధ్యుని యనుగ్రహమునం బ్రాప్తమైన శివభక్తిచే క్షమాశాంత్యాదులం గన్నవాఁడని ఫలితార్థము.

223. వర = శ్రేష్ఠములగు. చామర = వింజామరము లనెడు. మిష = నెపముచేతను. వృత = ఆవరింపఁబడిన. దిక్కరటి = దిగ్గజములయొక్క. శ్రుతి = చెవులుగల. సామ్యకామ్యత్ = సామ్యముం గోరుచున్న. కృతి = ప్రబంధములచే. గోచరిత = విషయముగాఁ జేయఁబడిన. అఖిల విద్వత్కుంజరకర్ణుఁడు = ఎల్లవిద్వ (ద్గజముల) చ్ఛ్రేష్ఠుల చెవులుగలవాఁడు. ఈఁగి చాతుర్యమునన్ = దాన నైపుణ్యము నందున్.

(కీర్తి చామర మిషచే దిగ్గజముల కర్ణము లాశ్రయించెం గావున దానితో సామ్యమునకై విద్వాంసులను గజముల చెవుల నాశ్రయించిన ప్రబంధములు గలవాఁడు). ఎల్ల దిక్కుల వ్యాపించిన కీర్తి గలవాఁడనియు, నెల్ల విద్వాంసులు విన్న ప్రబంధములు గలవాఁడనియు నాశయము.

224. భృత్యజనపోషణుఁడు = సేవక జనులయొక్క (సేవక జనులను) బోషించువాఁడు. పింగళి పురాంకామాత్య కుల భూషణుఁడు = పింగళిపురము చిహ్నగాఁగల (పింగళివారను నింటిపేరుగల) మంత్రివంశమున కలంకారమైనవాఁడును. మార్దవమహీయ స్సత్యశుచిభాషణుఁడు = మృదుత్వముచే మిగులం బూజ్యములును. నిజములు, పరిశుద్ధములునగు మాటలు గలవాఁడును. భవ్యకృపపేర్మిన్ = చక్కని దయాతిశయముచేతను. సాధుజనతా సంపత్త్యుదయపోషణుఁడు = మంచివారి సమూహముయొక్క సంపద సంబంధమగు వృద్ధిని గాపాడు వాఁడును. (అగు నమర నార్యుఁడు స్థిరసుఖము నందుఁగాక).

---